ందా సం॥ రు 3. Regd No. M-1480



# శ్రుతిధర్మసంజీవని.



వర్ణాశ్రమధర్మశాస్త్రపక్షమున—వాదించు పక్షపత్రిక.

ధర్మ ఏవ హతో హంతి; ధర్మో రక్షతి రక్షితః

| సంపు. | క్రోధన సంవత్సర | సంచికలు. |
| --- | --- | --- |
| 6. | చైత్రశుక్ల బహుళపక్షములు. | 1-2 |

శివపురపు వీరభద్రపాకయాజి:- పత్రికాధిపతి.

-విషయసూచిక-

సమాచారములు
అసతీపతిజన్మకి కాలకూటమాత్ర — పత్రికాధిపతి
పుష్పగిరి పితృపృథను — ..
కోపూరు గోష్పదక్షేత్రము — అనిపెద్ది జగన్నాథశాస్త్రి



శ్రుతిధర్మ సంజీవనీ ముద్రాక్షరశాలయందు
ముద్రింపఁబడి ప్రచురింపఁబడియె
బెజవాడ.
1925.

## శ్రీ సహస్రాయుత శతచండీ యాగము.

కావించవలెనను తలంపుతో సికింద్రాబాదు వాస్తవ్యులు సనాతన ధర్మ కార్యనిర్వాహకులును పునర్వసువ్రతాచరణ దీక్షితులును దేవభక్తులు నగు బ్ర॥ కాశీభొట్ల యజ్ఞయ్యగారను బ్రాహ్మణప్రవరులు ఇందుమూలముగ నేడు మాసములనాడు మావిజయవాడకు విజయము చేసి శ్రీకనకదుర్గామహాదేవిసన్నిధిని చండీపురశ్చరణము గావించి పైచండీయాగమును జేయ సంకల్పించియుండిరి పురశ్చరణము పూర్తియైనది. యాగము కావలసియున్నది ఇందులకు ధార్మికుల సహాయ మావశ్యకమని ధర్మమునకు దాపలులగు మావిజయవాడ వాస్తవ్యులకు వేరుగ చెప్పవలసిన పనిలేదనితలంచెదము శ్రీదుర్గామహాదేవి ధార్మికులకు దగుప్రోత్సాహ మొసంగి శ్రీ యజ్ఞయ్యగారి చండీయాగమును నిర్విఘ్నముగ కొనసాగించు గావుతమని కోరియింతటి విరమించుచున్నవారము —పత్రికాధిపతి

### విజయవాడ
### కొండమీద యతిదుండగము.

ఈకలికాలమున సత్కార్యములను జేయువారు నూటికొక్కరైనను గనుపడరు ఒకానొకరుచేయదలంచినయెడ పలువ్రతులువడి వానిని జెడగొట్టుటకు పాటుపడు వారు నూటికితొంబదితొమ్మిదిమంది బయలుదేరుదురు. అందులో నగ్రగణ్యులనిచెప్ప దగినవారు మావిజయవాడకొండమీదనున్న జ్ఞానానందయతులు వీరికిష్టమైన వస్తువులు తెచ్చిపెట్టెడివారిపై మితిమీరినదయగలిగి యుందురు వీరుమాకొండమీదనున్న మఠములను సత్రములను వారికై వారేస్వాధీనముచేసికొని మహాంతులైయున్నవారు. వీరికనుగ్రహము వచ్చినయెడనెట్టివంటివారినైనను సత్రములలో దింపి యెంతకాలమున్నను నుపేక్షింతురు. లేకవారు తాముకోరిన పదార్థములు తెచ్చిపెట్టనిచో వెంటనే సత్రములోనుండి వెంటివేయుటకు యత్నింతురు ఇట్టిదశకు పైచండీయాగము చేయనున్న యజ్ఞయ్యగారు వచ్చియున్నారు మావిజయవాడపౌరులు ధర్మరతులు అధర్మవిరోధులు కావున పైచండీయాగమునురక్షించి నిర్విఘ్నముగ పరిసమాప్తినొందించి విజయవాడను కీర్తికి దావలము గావింతురో లేకయుపేక్షించి యపకీర్తిఘటింతురో వలసియున్నది.

---

మహారాజపోషకులు

జగద్గురు పుష్పగిరి సంస్థానాధీశులు.

రాజపోషకులు.

శ్రీ శ్రీ శ్రీ మహారాణీ సాహెబా వారు, తుని సంస్థానము.

శ్రీ రాజా మాణిక్యారావు వెంకటహయగ్రీవరావు,

బహద్దరు జమీందారుగారు

రామారు సంస్థానము






శ్రీ బాలాత్రిపురసుందర్యైనమః

యతోధర్మ స్తతోజయః సత్యమేవజయతే నానృతమ్

# శ్రుతిధర్మసంజీవని.

వర్ణాశ్రమధర్మపక్షమున వాదించుపక్షపత్రిక.

శ్లో॥ ధర్మఏవ హతోహంతి ధర్మోరక్షతి రక్షితః

| సంపుటము | క్రోధన వత్సర | సంచికలు |
| --- | --- | --- |
| 6 | చైత్రశుక్ల బహుళపక్షములు. | 1-2 |


శ్రీమద్యజనయాజనఅధ్యయనఅధ్యాపకదానప్రతిగ్రహ
షట్కర్మనిరతులైన వేదమూర్తులైన వేదశాస్త్రసంపన్నులైన
బ్ర॥ శ్రీ॥ పాకయాజిగారి చరణసముఖమునకు

శిరసాష్టాంగ దండప్రణామములాచరించి చేయువిజ్ఞాపనము యేమనగా:-

హఠాత్తుగ ఎన్నడును చూడని యాశేయను పేరు వినని దియును యైన నొ
ప్ప "శ్రుతిధర్మసంజీవని" తానై నాయింటికేవచ్చి కనపడినందున పేదను వె
ధియను న్యాయముననుమించిన "కేవలానుభవానందస్వరూపమే" స్వయమనుభవమువ
చ్చినస్థితిగలిగినది. భూసురార్యా! నాకోరిక యెన్నటికైనను సఫలముకాకమానద
దృఢనమ్మకమును గలిగినది అదియుంతయును విశదపరచుటకు విద్యావంతుడను కా
నువుటయేగాక తెనుగుభాషయును చక్కగవచ్చినవాడను కాను. దేశము మోటు,
మాట మోటు. నడవడి మోటుయనుస్థితి. మీదుమిక్కిలి వెనుకబడిపోయి తెభావి, ముం
దరకుపోయి తేచెనువనుదుస్థితి. ఎన్నిదుస్థితులయినను వేదవేత్తలగు యథార్థభూసు
రోత్తముల వరదహస్తప్రసాదము లభ్యమాయునేని బ్రాహ్మణోయుచుదేవత యనున
మ్మకముగలవాడను గావున సుస్థితికి మార్పకమానదు. ఇదిమాత్రము యథార్థము. "మూ
కంకరోతి వాచాలం" అసత్యము కానేరదు. సత్యమేవజయతి న్యాయము తప్పబోదు. య
త్ర యోగీశ్వరః కృష్ణో యత్రపార్థో ధనుర్ధరః యనుభగవద్గీతయందలి వాక్యమందు దృఢ
మైనవిశ్వాసముగల మనస్సుమాత్రమున్నదగనుక యెట్టిదుస్థితిదుర్గతియైనను వెరపుమా
టమెన్నడును లేదనుఆధారముననే ఇందుమూలముగా దమ పరిచితిసంపాదించుకొను
టకు వీలుకలిగినది. ఎప్పుడేని ఈప్రాంతమునకు దయచేసినపుడు మద్గృహమును పా
వనము చేయుటకై వేడుకొనుచున్నాడను.

కొన్నిదినములకుపూర్వము ఈగ్రామమునకు విజయముచేసియుంటిరని విన్నా
ను. సరే, ఇంతకెక్కువ నాదుర్దశనుగూర్చి మరి వేరేమనవిచేయుటకు ఇకఒక్కరే
ఇట్టి అనామధేయస్థితి! ఇక్కడిబ్రాహ్మణోత్తములకందరకును తెలిసినవారలైన
యొకరు వారి తమదగ్గనలాభము కలిగించకోరరైరి, వెంటనే నేను బెజవాడకు
తలంచితిని కాని వీలేది. తమరొసగబూనిన "సంజీవని"ని గ్రహించుటకు కొందరికి
చెప్పితిని. యొప్పుకొనియును తెప్పించరైరి. కారణమేమి? తమయుద్దేశ్యము వర్ణా
శ్రమధర్మోద్ధారణము, అదియు ఇక్కడిమావారలకు తమవారలకు మాత్రమే యిష్ట
ల? యొకవైశ్యరత్నములకుతప్ప అన్నిజాతులవారలకును మరణావస్థకన్నను కష్ట
ము. వృష్టికరమని తోచుచున్నది. సన్నిపాతరోగులు చక్కెరనుచేదనుట అగ్రగ్ర
కామిలరోగగ్రస్తతతో బాధపడుచున్నపుడు పరిశుభ్రమైనసూర్యరశ్మిపచ్చగనే యగు
చున్నది. శ్రుతిధర్మమనుసూర్యుడు లేనేలేడని నిశాచరపక్షులనుచున్నను ఆపక్షులకు
గరడమెంతవరకు? యొక నాలుగుఝాములేకదా. పూరా నాలుగుఝాములనుటకున్న
లులేదు, "తెల్లవారెనుతూర్పున" యనుచుండగనే చెల్లు. ఇకనైనను మేలుకొని
దగ్గరలేక మరింతనిదురించుటయే మేలని యిప్పటికిని నిదురించుటకే యత్నిస్తు
రో? ఇంతపారపాటా? సంజీవనినిగ్రహించుడు. పునర్జీవమొసగి ఆహారత్వముస
కూర్పవనిచాటుచు నిలుపుచున్నాడను. ఇట్లు,

శ్రీలక్ష్మీనరసింహావిలాసమును కాళోజిభువనము. } లక్ష్మరాజు.

మదికొండగ్రామము, కాజీపేటస్టేషన్.

## శ్రీమదాంధ్ర కార్తీక మాహాత్మ్యము.

ఇత్యాది స్కాందపురాణములోని సనత్కుమారసంహితనుగల కార్తీకమా
హాత్మ్యమునకు నాంధ్రీకరణము. ఇద్దానిని రచించినసుధీమణులు బ్రః అని పేరి జగ
న్నాథశాస్త్రిగారు. వీరు కొవ్వూర్యుభోశ్మసోమయాజులు తెలుగుపండితులు. వీరి క
విత్వముమధురమై తనరారుచున్నది. తిక్కనకవీంద్రుని యుద్ధపంచకము చదువుచు
న్నపుడు విద్వత్పండితులు పాఠకులు నెట్లు సారస్యరసాస్వాదనముగావించి తన్మయు
లై తచ్చేష్టలననుకరించుచుందురో యీమాహాత్మ్యము చదువునపుడును విను
తన్మయులై తచ్చేష్టననుకరించక మానరని చాటిచెప్పవచ్చును ఇందులకు గా
ము. గ్రంథశైలి బాలబోధకమైయుండి తామోదమును బడయదగినదై ఉల
చుండుటయే ఇందలివిషయము కార్తీకమాహాత్మ్యము ఆదియుక్తిదాయకమనువాని
వాదాంశము. ఇదివరకు పండితులు మాత్రమే దానినిసంస్కృతమున జదివిమోక్ష
జూరగొనుచుండిరి ఇపుడు జగన్నాథశాస్త్రిగారు పామరులకును నా
క్షఫలమును జూరగొననగోరి యాంధ్రీకరించియున్నారు వారికి తోడయి ధనసహాయ
చేసి పోలాపురపు నవపేటవాస్తవ్యులగు మః చిత్రపు గోపాలరావుగారు ము
పించి యామోక్షఫలమును దాము జూరకొనుటయెగాక యంగడినిడి యొక్క
రూప్యమునకు విక్రయించుచున్నవారు వలయువారు వ్రాసితెప్పించుకొని య

ంచవచ్చును ఇంక నేమేమి జెప్పవలసియున్నను నవి చెప్పుటకుచేత గాక యింతట
తమించుచున్నారము ఇది చాలదా? —పత్రికాధిపతి,

# శాస్త్రీయోపన్యాసము.

ఇత్యాది తెనాలివాస్తవ్యులగు బ్రహ్మశ్రీ బంట్లమూడి గురుమూర్తిశాస్త్రిగారిచే రచింపం
బడి తెనాలిపండితబృందముచే బరిష్కరింపంబడి తెనాలి బ్రాహ్మణసభవారిచే ము
ద్రింపంబడిన యొకవివాదపరిష్కారగ్రంథము ఇందు నిందుసూరుపేట జగద్గురుసంస్థా
నాధీశ్వరులనునెడి జి బి యన్ సరస్వతులనెడి రంగస్వామి స్వాములవారి శిష్యులగు
దుగ్గిరాల రాఘవచంద్రయ్యచౌదరిగారు త్రిపురనేని రామస్వామిచౌదరిగారు సూ
ర్యదేవర రాఘవయ్యచౌదరిగారు మున్నగు కమ్మపండితులకును బుష్పగిరి జగద్గురుపీ
ఠసంస్థానాధీశ్వరులనునెడి గింజుపల్లి చక్రయ్యగారనెడి పతితయతీశ్వరుల శిష్యులను
...రామకృష్ణశాస్త్రిలౌకిక మహాగ్నిచిత్తు గారికిని గొల్లూరు కల్లోలసభను గమ్మ
వారి క్షత్రియత్వమునుగూర్చి జరిగినవాదప్రతివాదములనుజోడించి పుష్పగిరిసంస్థాన
దివాంజిగారమనెడి బోయలపుంట్ల సుబ్బనరసయ్యగారను శుక్రాచార్యులుగారు
పండితపరిష్కారమును బడయుగోరి పంపుకొనిన ముద్రితవిజ్ఞాపనమునకు బ్రత్యుత్తర
రూపమయిన పరిష్కారము కలదు

శ్రీగురుమూర్తిశాస్త్రిగారు మధ్యదేశమున బ్రసిద్ధికెక్కినపండితులు సుజన
రేణ్యులు శాంతులు శ్రుతిధర్మ నిరతులు బ్రహ్మణ్యులునైయున్నారు తెనాలిబ్రా
హ్మణసభవారును ధర్మరతులగు సుజనులైయున్నారు కావున నే వారు పతితాక్రాం
తమైయున్న పుష్పగిరిక్షేత్రమును దమపురమున కాహ్వానించిపూజించినవారుకారు అం
తటి పండితులచే రచింపబడి ఆపండితులచేతనే పరిష్కరింపంబడి బ్రాహ్మణసభవారి
చే ప్రకటింపబడిన యుపన్యాసమునుగూర్చి మావంటి యల్పజ్ఞు లెంతవర్ణించినను కొ
...యమేయగునంట తెల్లము ఇందు కమ్మవారిప్రశ్నలు క్రమముగా గ్రహింపబడి వాని
కి శాస్త్రవిహితములకు ప్రత్యుత్తరము లీయబడినవని పైగ్రంథ వాక్యమె చెప్పుచున్నది
...శూద్రకులావతంసులయిన రెడ్డి వెలమ కమ్మ బలిజె శాఖీయులనుగూర్చి శూద్ర
స్త్రీకిని క్షత్రియునకును జనించిన యనులోమసంకరజాతీయులని లౌకికవయనులు
గారు వ్రాసినతప్పుడువ్రాత మానవకులకు పైనాలుగుశాఖలవారికిని మహాపమానజన
కమైయున్నదనుటకు సుజనులు సంశయింపజాలరని చాటిచెప్పుచున్నవారము అతి
ప్పుడువ్రాతకు లౌకికవయనులవారిచే బ్రమాణముగా గ్రహింపబడిన మార్కండే
యోత్తరపురాణమును పుస్తకము మహాపురాణోపపురాణములలో జేరినదికాదని చ
క్కగా తెలిపి దానినెట్లు ప్రమాణముగ నంగీకరించి వాదిప్రతివాదులు స్వపక్షమునుసా
ధించుకొనుచున్నచిరో తోచకున్నదని శాస్త్రిగారు చేసినపరిహాసము లోకకళ్యా
ణసూచకమై యున్నదని వ్రాయుట తేటపడించినందులకు బ్రహ్మానందమందువారము

—పత్రికాధిపతి

# ఘోర వార్త.

మా విజయవాడవాస్తవ్యులును తాలూకాశిరస్తాదా రుద్యోగముగావించి ... కోధనములనుగడించి నందిగామ తాలూకాయందు రామిరెడ్డిపల్లెయనునగ్రహారమును గ్రహారీకులైన వారును లింగధారిబ్రాహ్మణులును నగు మ. రా రా పుప్పలూరి నర... హరావుగారు వారి యగ్రహారవాస్తవ్యులగుటచే జావమొంద... మూడుదినములవరకు నందిగామయందలి ఆసుపత్రిని జీవించియుండి పిదప శివైక్య... పరమపదము]ను బొందిరని తెలుపుకొనుట తటస్థించినందులకు మిగులఖేదముచున్నా... రము నరసింహరావుగారు మాకు జిగమిత్రులగుటయేగాక బంధుప్రేమతో వర్తి... యున్నకతన వారిని దలచినపుడెల్ల సంతాపమును గలిగించుచున్నారు వీరికి బుద్ధి... తుడగు నొకపుత్రుడుగలడు ఆయనగారును గౌరవమైనపదవియందున్న వారనియు ... ద్ధిమంతులును స్వమతాభిమానులు నై యున్నారనియు వినియున్నారము కాని... దుచేతనో యింతవరకు వారు స్వమతధర్మమగు లింగధారణమాత్రము కావిం... కొనలేదని తెలియవచ్చెడిని

అందుచేతనో మరెందుచేతనో కాని వారు తమజనకులను దహనముచేసినట్లు తెలియవచ్చినది శైవులు తమ పితృతాదులను దహనముచేయుదురేని వారి లింగముల దీసి శవములనుదహించి యాలింగముల నింటికిదెచ్చి దనకదివరకు లింగములేకున్న నిని యథావిధిగ ధరించిగాని లేదా పీఠముపైబెట్టికాని పూజించవలసినదని శైవ... చకము చెప్పియున్నది ఇపు డీదహనసంస్కారము శైవశాస్త్రవిహితముగ జరిగినదో ... యన్యవిధమున జరిగినదో తెలియవచ్చియుండలేదు అది యెట్లుజరిగినను నాగ్రా... మునవసించు శైవపురుషులలో నంతగా స్వమతాభిమానులున్నట్లు కనుపడరు కాని... పులు దహనసాపిండ్యములు చేసినయెడ మతము నశించునని ఖేదించు బసవబంధువ... గువితంతువులుమాత్రము కొందరుకలరు వారిందుల కెంతఘోషించుచున్నారో చె... జాలము ఇట్లు స్వమతము చెడుచుండుటను గన్నులారగాంచియు జెవులారవిని... వేమూలపల్లె కోనాయపాలెము సోమవరము జగ్గయ్యపేటవాస్తవ్యులగు శైవులు పరి... హమును బొందరా?

—పత్రికాధిపతి

## ఈ స్వప్న ఫల మేమి?

కడచిన వారమున నొక రాత్రి మేము సుఖనిద్రజెందియున్నతరి నొకవిచిత్ర... ప్నమువచ్చినది అదేమన? మేమాస్వప్నమున నొకబండెపురమునకు బోతిమంట! ఆ... నొకదొరవారియింట నొకపల్లెటూరుబ్రాహ్మణబాలుడు 20సంవత్సరములవాడు ... జించుచు నాయూరిపాఠశాలలో జదువుకొనుచున్నాడంట ఆపిల్లవాడానాడు ... అకు సెలవగుటచే బజారునకు బోవుచుండగా నాదొరవారియింటి కెదురుగనున్న ... రియొకదొరవారియింటిలోనుండి యెవ్వడోవచ్చి మిమ్ము మాదొరపిలుస్తున్నాడని ... మ్మన్నాడట ఎందుకోయని యాపిల్లవాడు వెళ్ళినాడట నీవు మాయింటిలోనుండి నీ... తెచ్చి వంటచేయుటకుపంటావాయని యాదొర యడిగినాడంట నేను వంటలు చేయు... టకును నీళ్లుమోయుటకును నీగ్రామము రాలేదు చదువుకొనుటకు వచ్చినాను నా... మహారాజు దొరవారన్నము పెట్టుచున్నారు నేను చదువుకొనుచున్నాను కావున నే...

ఉ. దాయనికాయమంత నొకతట్టున నెట్టుచు మంచి నేర్పునన్
శ్రీయుత కృష్ణరాయలను జిష్ణుని నీనిఖిలప్రపంచక
ప్రాయుతసింహపీఠిని విరాజిలచేసి యశంబు బొంది శ్రీ
భాయుతుఁడైన తిమ్మరుసు బాసటఁ గాఁడొకో మాడ్జూడఁగాన్
ఉ. కావున బ్రాహ్మణేతరవికస్వార్థీ గుణులార! మీరు భూ
దేవులు వంద్యులేయని మతిన్ దలపోయుఁడీ, వేదపారమౌ
యావిధిదూషితంబయి యనర్థము సల్పెడిదం చెఱుంగుఁడీ
భావములం దనూయవిడి భాగ్యముబొందుడి రౌగ్యపద్ధతిన్.

చిప్రుకుల అప్పయ్య శాస్త్రి.

# నిజము నిలకడమీద దెలియును.

అను వాక్యోక్తి వ్యర్థము కాదు. శ్రీమతి పులుగుర్తి లక్ష్మీనరసమా
రిని బూర్వాచారపరాయణురాలిని గొందరు పూర్వాచారపరాయణు
ముఖములజాటి యందుపై వచ్చినప్రతివాదములను బ్రతిఘటించుచువచ్చిరి. క
యమ్మగారి యథార్థచరిత్ర యిప్పుడు బయటబడినది. నరసమాంబగారి పు
త్ర పూతనచారిత్రను ఖరిడించుచున్నది. పూతన చిన్నతనమునందు శ్రీకృష్ణ
త్మకు విషపయోధరములఁ గుడువబెట్టినటుల నరసమాంబగారు రజస్వలావివా
లు వానియంతట నవిరోసాగుచున్నవనియు, నస్పృశ్యతనుమాత్రము తీసివే
నందరు పాటుపడవలెననియు జెప్పి మొన్న చెన్నపురిలో నాంధ్రరాష్ట్రీయసభ
టు జరిగిన మహిళాసభయందు భారతీయులకు విషబోధామృతమునొసఁగినట్
దినపత్రిక నుడివియున్నది. కాన శ్రీకృష్ణపరమాత్మ పూతనజూచినట్లు భార
లు పులుగుర్తి లక్ష్మీనరసమాంబగారినిజూచి జాగరూకులై వర్తింతురు గాత.

లక్ష్మీనరసమాంబగారు రజస్వలావివాహములు వానియంతట నవిసాగు
చున్నవని సెలవిచ్చినారు. ఇదేమివింత? రజస్వలావివాహములుమాత్రమే వా
తట నవిసాగుటలేదు. ఇంక ననేకములు సాగుచున్నవి. చౌర్యము జారత్వ
త్య మూనమును మున్నగునవి వానియంతట నవి సాగుటలేదా? అంతకంటె రజ
వివాహము లెక్కువసాగిన దేశమున్నది? సంఘమున దుష్కార్యములు ప్ర
న్నపుడు సత్పురుషులుకాని సాధ్వీమణులుకాని దుఃఖించి వానినిఁ జేతనైనం
బ్రతిఘటించవలెగాని వాని నభినందించదగునా? పైపెచ్చు మాలమాదిగెలను
త దీసివేయవలెనని నరసమాంబగారుపదేశించినారు. దీని యర్థమేమి? బ్రా
స్త్రీలు శూద్రులతో వ్యభిచరించి సంతానముగాంచినను వారికి దోషము
ప్పటకాదా? ఇది సాధ్వీమణులు చేయతగినబోధయా? ఈయమ్మగారు కలి
జుగారి కనుఁగుసోదరీమణిగారలని యీమె గారియుపన్యాసము చెప్పకచెప్ప
దిఁ ఈయుపన్యాసమును విని. సాధ్వీమతల్లులుగాని సత్పురుషులుగాని దాని
షించవలెగాని భూషింపజాలరని చాటిచెప్పఁగలము. —పత్రికాధి

# అ॥ స॥ తీ॥ పతి జన్నికి

## కాలకూటమాత్ర.

అసతీపతి యన "నభినవసరస్వతీపతి" యనియర్థము. ఆత
పస్మార జ్వరగ్రస్తునివలె విధినిషేధములను విడిచి, మము దూ
ంచుచుండుటచే నా దూషణములను విమర్శించు నీ వ్యాసమున
కు గాలకూటమను సన్వర్థ నామకరణము గావించుచున్నారము.
తిం డిటో యటో తెలుపరకు నొకమాత్రవేట నొకమాత్రను
ాడదలంచియుండుటచే నిది ప్రథమమాత్రయని చెప్పితిమి. వ్యా
యనార్థ్యస్థితియందుండుటచే నిది కొంచెము పెద్దమాత్రగ ప
ు చున్నారము. ఇక నుపోద్ఘాతమును వినుడు.

### ఉపోద్ఘాతము.

శ్రీ పుష్పగిరి పీఠాధిపతులు మూడువత్సరములనాడు తర్లు
ాటియందు స్వభటునిచే ఘోరహత్యగావింపబడిరి. పీఠ మన్యా
కాంతే మగుననుభయముచే దివాంజి ప్రభృతులు గింజుపల్లి చక్ర
య్యయను పీఠశిష్యుని కొగగంటలో మంగలిసన్యాసమిప్పించి, కా
ిగుడ్డలు చుట్టి "సరసమ్మభారతి" యని పేరుపెట్టి పీఠముమీద గూ
్చుండ బెట్టిరి. ఆయన యమాయకలోకమునకు దన పతితపాదతీర్థా
ములనిచ్చి యపవిత్రులను జేయుచు వారిధనముదు గొల్లగొట్టుకొని
యనుభవించుచుండుటచే మాకు దెలిసినవెంటనే మేము లోకక్షే
మమునుగోరి యాపతితచరిత్ర నంతను సవిమర్శకముగ నూసంజీవ
పత్రికాముఖమున లోకమునకు దెలిపియుంటిమి. అందుపై నసతీ
పతిప్రభృతులు చక్రయ్యగారివలన నెలజీతములు కొట్టుకొనితిను
చున్న వారుగాన మావిమర్శనములపై గొన్ని సమాధానాభాసము
లను నెల్లడించిరి వానిని మరల సుపత్రికలలో విమర్శించి లోకము
నకుంగల సంశయములను నివారించియుంటిమి. అవి కసినతో డసతీ
యసతీపతికి జన్నిపుట్టి దూషణకు దిగియున్న వాడు.

ఆదూషణములకుండగు ప్రతిదూషణములతో విమర్శించిన మాపాఠకులు విసువు చెందుదు రేమోయను సంశయముతో గర్తవ్యము నాలోచించుచుండ బ్ర॥ ముండా చినవెంకయ్యగా రనుమాపాఠకులు పనిగొని మాయింటి కేతెంచి యభినవసరస్వతీపత్రి రాబోవు సంచికలో మిముగూర్చి నీచాతినీచమగు దూషణములతో గూడినలేఖను ప్రకటింపఁబోవుచు నాకది వినిపించియున్నారు. అది ప్రకటింపవలదని యనేకవిధములఁ జెప్పితిని. వినినవాఁడు కాఁడు. కానదానికి మీరు వ్రాయుప్రత్యుత్తరము దూషణవిరహితముగ వ్రాయవలసినదని మాబాలునితో జెప్పి వెళ్ళిరి. ఆసత్పురుషుఁడయాజ్ఞను మీరుటకుగాని యనుసరించుటకుగాని మామానసము సమ్మతించమిని కర్తవ్యమును గూర్చి డోలాయమానమానసులమై యుండుతఱి కింకవీంద్రఘంటాకంచానాది బిరుదాంకితులగు బ్ర॥ శతావధాని చళ్ళపిళ్ళ వెంకటశాస్త్రిగారు హైదరాబాదునకు వెళ్ళుచు మాయింటి కరుదెంచి యభినవసరస్వతిలోని మముగూర్చిన దూషణలేఖావిషయము ప్రస్తావనలోనికిదెచ్చి యది యతినీచముగానున్నది కాన దానిని బ్రతిదూషణముచేయక విమర్శించవలసినదని యానతిచ్చిరి. ఆయానతిని వారితో నేతెంచినపండితు లనువదించిరి. ఆయనువాదమును బండితులగు మామిత్రు లభినందించిరి. ఇందఱిన్నివిధములగర్తవ్యము నుపదేశించునపుడు మనమన్యమార్గ మవలంబింపరాదని నిశ్చయించుకొని దూషణవిరహితమగు విమర్శనమున కుపక్రమించుచున్నవారము.

## ఉపక్రమము.

### ఆ. స. తీ. పతియగు పట్టాభిరామశాస్త్రి

పాకయాజిగారు వారిగురువులగు గింజుపల్లి చక్రయ్యగారిని బతితులని దూషించినారుగదా. కాన వారిగురువులగు చినమాంతాచార్యులవారిని బతితులని మనము ప్రతిదూషణము గావింపవలెను. చక్రయ్యగారిని బతితులనుటకు పాకయాజిగారు మంగలిసన్యా

సమును కారణముగ జెప్పుచున్నారు. ఇట్లు పతితత్వమును స్థాపించు కారణము చినమాంతాచార్యుల యాశ్రమమునుంగా గానరాదు. ఇకేమిచేయవలెను? వేరేమియులేదు. ఆయన వ్యభిచారము చేసిరాగ నిద్రా మువలెను. అది యిక్కడ జరిగినదందుమా? రుజాపుభారము మీాదబడును. చేయవలసినదేమని చక్రయ్యగారి శిష్యచక్రముతో యోజించి కాశీనుండివచ్చినదని యొక బూతులలేఖను సృజించి యక్కడికింపి యచటనుండి తెప్పించి దానిని అభినవసరస్వతి సంపుటసంచికగంగలో ప్రకటించియున్నారు అందలివాక్యములను మీాయెదుటనిడి క్రమముగవిమర్శించుచున్నారము. కానమా పాఠకులు సావధానమానసముల జదివి యిందలి సత్యసారమును జవిగాంతురుగాత.

ఉపక్రమము.

"అవృత్తి రసకృదుపదేశాత్" "శాస్త్రయోనిత్వాత్" అను న్యాయమునను సరించి యోనికూడ లేనిది శాంతిపాఠము నడవదనే వుద్దేశ్యములో పెనుగొల్లుకాపురస్తురాలు జోగమ్మయను వెధవముండ ఆమెకుమూర్తి 12వత్సరములు కలదానితో యదేచ్చగా శాస్త్రప్రవృత్తి దేయుచున్నదని కాశీక్షేత్రమునకువచ్చి వక 20 రోజులుపూరి... ...ఊర్ధ్వమునుకూడా వెంటబెట్టుకొని దేశమునకుపోవ రెండోతడవ శాంతిపాత్రక్రమము" అని యొకవాక్యముకలదు.

ఆలించితిరా పాఠకల విశ్వనాథబ్రహ్మచారి విలాపములను? ఈ వాక్యమును బట్టిచూడ చినమాంతాచార్యులవారు వ్యభిచారము చేయుట కీయాంధ్రదేశమునందు వీలగుస్థలము లభించకనో! లేక యీఘనకార్యము కాశీక్షేత్రమునచేసిన విశేషపుణ్యము లభించుననియో యదియుగాక తమ వ్యభిచారమునుజూచి పాకల విశ్వనాథమునూ నాతని యీవ్యభిచారవ్యాసమును ప్రకటించిన పీకుల పట్టాభిరాముడును ముక్తినొందుదురనియో యేదోయోజించి కాశీకి వెళ్ళి యట వ్యభిచారము చేసియుందురని కొంచెముకాలము నాద మునిమిత్త మంగీకరించి విమర్శించుచున్నారము. వినుడు.

చినమాంతాచార్యులవారు కాశీక్షేత్రమున జేసిన వ్యభిచా

రము పాకల విశ్వనాథమున కెట్లు తెలిసినది? ఆయన వ్యభిచారము చేయుచుండగా నీతడు చూచినాడా? లేక చూచినయన్యులు చెప్పగావిని వ్రాసినాడా? అదిగాక యేదేని గవర్నమెంటురికార్డును నాధారముగా బెట్టుకొని వ్రాసినాడా? ఇందు రికార్డునుజూచి వ్రాసితిననికాని, యన్యులుచెప్పిన విని వ్రాసితిననికాని ఈతని లేఖయందు లేదు. కాన నతడే చూచివ్రాసినాడని మనము నిర్ణయించవలయునుగదా? ఇదిమాత్ర మెట్లుపొసగును అదేమన వివాహముచేసుకొన్నదంపతులే యన్యులు చూచుచుండగా గలియుదురుగదా? ఇక యతీశ్వరులగు చినమాంతాచార్యులవారు 12 యేండ్ల బాలికతో వ్యభిచరించబోవుచు చాకల విశ్వనాథమును నెదుట సాక్ష్యముగా గూర్చుండబెట్టుకుని వ్యభిచరించియున్నారని చెప్పుటకు వీలగునా? కాదు. అటులేని నితడు వారికి దెలియకుండగా మునుగాబోయి మంచముక్రిందబరుండికాని, లేదా తలుపుసందులలోనుండికాని చాకల బ్రహ్మచారి చూచియుండునందుమా? ఇట్లు క్రొత్తగర్భాదానదంపతుల గర్భాదానమును జూచుటకు స్త్రీలు యత్నింతురని వినియున్నాము. అది ముక్తిదాయకమనికూడ జెప్పకొందురు. అప్పుడు చినమాంతాచార్యులవారి వ్యభిచారము పాకల విశ్వనాథునికి ముక్తిదాయకమేకదా? అట్టాని నిందింపనేల? ఇదిగాకున్న మంచముక్రిందకురుండి చూచియుండునను కొనక తప్పదు. అప్పుడు పౌండరీకములో బ్రహ్మచారి విధవలు మంచెప్పగలియు హోమకుండములో బడి హుతిమగునట్లు మన చాకల విశ్వనాథము యొక్క వడనకుండములో బడి జఠరాగ్నిలో హుతమగుటచే దెలిసికొని యీవ్రాతవ్రాసియుండునని చెప్పవలసివచ్చునుగదా?

ఈ పాకల విశ్వనాథుని లేఖనుబట్టిచూడ నితడు చాకల విశ్వనాథుడై యుండునని తోచుచున్నది అదేమన? పూర్వము శ్రీరామచంద్రుని యిల్లాలు పాతివ్రత్యతల్లి సీతామహాదేవిపై నిట్టినింద మోపినవాడు చాకలవాడేగదా? ఆచాకలివాడే ఈ పాకలవిశ్వనాథుడైజనించి జోగమ్మకుమారిక 12 ఏండ్ల బాలికకు: జినమాంతా

చార్యులవారితో సంబంధముకలిపి ఈ లేఖవ్రాసియున్నాడు. ఇట్టి నీచ వాక్యమును బిత్రుబీజసంజాతుడైనవా డెన్నటికైన వ్రాయునా? వ్రాయడు. అన్యబీజసంజాతు డొకవేళవ్రాసినను దానిని మానవబీజసంజాతుడగు పత్రికాధిపతి ప్రకటించునా? ప్రకటింపడు. అని తలంచువారమగుటచే ప్రకృతము పుష్పగిరిపీఠము నాక్రమించుకొనియున్న చక్రయ్యగారికి పీఠాధిపత్యము రాకముందు బ్రహ్మచారులుగానున్నప్పుడే యొకతురకముండతో సంబంధము కలిగియుండెననియు నతనికి పీఠాధిపత్యము దానియదృష్టము చేతనే వచ్చినదనియిప్పటికిని దానిని విడనాడక చక్రయ్యగారు పెట్టుకొనివచ్చుచుండగా మంప్పాళ్ళ చాతుర్మాస్యలలో గొంతయుల్లరి యైనదనియు జెప్పి యాచరిత్రనంతయును వ్రాసి యొకబుద్ధిమంతుడు మాపత్రికలో ప్రకటింతురాయని మముసడిగిరి. ఇందుల కాధారమగు పబ్లికురికార్డు నేమేని సంపాదించితిరా యనియడిగితిమి. లేదనిరి. అదిలేకున్న ననుమాన ప్రమాణ ప్రమితమగు నీవిషయమును మేము ప్రకటింపజాలమని చెప్పియంపితిమిసుడీ!

యతులబవ్యభిచరింతురేని వారుపతితులగుదురను శాస్త్రముమేమెరుంగుదుము. ఈవిషయమున మాకొకరు చెప్పవలసినదేమియు లేదు. ఇట్టి చెడుగు లేఖలనుగని గురుపరిత్యాగము చేయజాలముకాని మేమువిశ్వసింపదగినస్థితి తటస్థించిననాడు మాకొకరుచెప్పవలసినపనిలేకయే మామావిషయమును పత్రికాముఖమున లోకమునకుదెలిపి గురుపరిత్యాగము చేయుట నిశ్చయము. ఇదియిట్లుండచినమాంతాచార్యులవారికడ మేమొక్కరమేచదివియుండలేదు అనేకులువైదికులు నియోగులు శైవులు వైష్ణవులు చదివియున్నారు. ఇందరికిని శిరోమణియనదగిన బ్ర గంటిమహాశాస్త్రుని విశ్వేశ్వరిచయనులవారు చినమాంతాచార్యులవారికి శిష్యులై విద్యారణ్యము చదివియున్నారు. పతితులును విద్యావిహీనులునునగు చక్రయ్యగారిని డబ్బుకొరకై మల్లాది రామకృష్ణలౌకికచయనులవారస్మద్గురువరులని ప్రకటించినారు. కాని విశ్వేశ్వరచయనులుగారట్లు చినమాంతాచార్యులవారిని ధనముకొరకై గురులనుగా బరిగ్రహించ

నవారు కాపసుడీ:

ఈ యిరువురికి నెంతయంతరము కలదో చూడుడు. విశ్వే
శ్వర చయనులవారు ఋగ్యజుర్వేదములు రెండును సాంగాధ్యయనము
గావించినారు. రామకృష్ణలౌకిక చయనులవారికి సస్వరముగ సంధ్యా
వందనముకూడరాదు. వి. వై. చయనులవారికి గాండ్రయము శ్రౌతము
వచ్చును. రా॥ లౌ॥ చయనులవారి కిప్పటికిని రాజమాన్యము చ
క్కగరాదు. వి. వై. చయనులవారు చయనాంతక్రతువులం దాధ్వ
ర్యము గావించియున్నవారు. రా. లౌ. చయనులవారు గణాధిపతి
పూజకూడ చక్కగ చేయించలేరు. వి. వై. చయనులవారు కౌముది
వరకు వ్యాకరణము చదివిరి రా. లౌ. చయనులవారు తర్కము
లో ప్రకరణములు చదివి మరచిరి. వి. వై. చయనులవారు వైదిక
చయనముచేసి ఋణగ్రస్తులైయున్నారు రా. లౌ. చయనులుగారు
లౌకిక చయనముచేసి కొన్నివేలరూపాయలు నిలవచేసిరని విస్తృతకీ
ర్తిని గడించియున్నారు. ఈ చెప్పినదానింబట్టి రా. లౌ. చయనులవా
రు ధనవంతులనియు విశ్వేశ్వర చయనులవారు ధర్మరతులనియు బా
లునికికూడ బోధపడగలదు. అట్టి ధర్మరతులగు విశ్వేశ్వర చయను
లవారును, న్యాయవాదులును, న్యాయాధిపతులును జనమాంతా
చార్యులవారికిశిష్యులై భాష్యపాఠములు చదువుచుండ బాకరాజి
మాత్రమే చి. మాం. వారికి చదువుచున్నాననుట వాకల ధర్మము
కాదు. చాకలధర్మమే! ఈవిమర్శవలన బీకులపట్టాభిరామయ్యచే ప
త్రికలో ప్రకటింపబడిన చాకలి విశ్వనాథునిలేఖ బాకరాజి కుకి
స్సంబంధమయిన యొకయాకనైనను బీకతేకపోయిన దని చెప్పినస్వ
భావోక్తియగును కాని యతిశయోక్తి కానేరదుకదా!

ఇది యిట్లుండనిండు. అసతీపతి చాకల విశ్వనాథముగాని బూ
తులలేఖను ప్రకటించుటయేగాక పతితుడగు పుష్పగిరిపీఠాధిపతి
తో పోరాటమునకు దిగినవెనుక చినమాంతాచార్యులవారి కిప్పుడి
ప్పుడే చెల్లడికివచ్చుచున్నారని యొకపిచ్చివ్రాత వ్రాసియున్నారు.
ఇది వింతమాట. పుష్పగిరిపీఠాధిపతికడ డబ్బుండుటచే నధికుడని
ఈయసతీపతి తలంచి యీవ్రాతవ్రాసియుండును. చంద్రయ్యగా ర

పండితులు. చినమూంతాచార్యులుగారు. పండితులై శిష్యులకు భా
ష్యపాఠమును జెప్పి లోకమునకు మహోపకారము చేయుచున్నార
ని యీ యసతీపతియే వ్రాసియున్నాడుకదా? విద్యాధనవంతుని కం
టె ధనవంతుని నధికునిగా వివేకవంతుడు చెప్పజాలడు. కాన చిన
మూంతాచార్యులవారికిన్ చక్రయ్యగా రెన్నటికిని సమానులు కా
జాలరు కావున నీ యసమానునితో వివాదమువలదని యెందరుశి
ష్యులు ప్రార్థించినను వినక వివాదపెట్టుకొనుటచేతనే చినమూంతా
చార్యులవారి యశస్సు క్షీణించినది: అది వృద్ధియైనదని వ్రాయుట
యసతీపతి యవివేకమునకు సూచించుచున్నది.

ఇది యట్లుండనిండు. ఈయసతీపతి ప్రకటించిన లేఖలో బాక
ల బ్రహ్మచారి చినమూంతాచార్యులపై వ్యభిచారము నారోపించి
యందుచే పతితుడైనాడని చెప్పి వారిశిష్యత్వము వదలుకొనవలసిన
దని మాకుపదేశించినాడు. ఆలేఖను బ్రకటించిన యసతీపతి కీ యు
పదేశము సమ్మతమై ప్రకటించినదే కదా? సంతసము. లోకము విశ్వ
సింపదగినదోషము చినమూంతాచార్యులవారియం దగుపడినయెడ
రామకృష్ణ లౌకికచయనులును, నీతడును పతితుడగు చక్రయ్యను స
న్మద్గురువరులని వ్రాయుట యేగాక యాపతితపాదతీర్థములను స్వీక
రించినట్లు మేము స్వీకరింపము. వెంటనే పత్రికాముఖమున వెల్లడించి
ప్రాయశ్చిత్తపూర్వకముగ బుచ్చుకొనగలవారము. ఇంత నిశ్చయ
ము. మాకు ధర్మపన్నాలు చెప్పవచ్చిన యీ సతీపతిగారును, లౌకిక
చయనులవారును, బుష్పగిరిపీఠ మాక్రమించుకొనిన చక్రయ్యగారు
పుచ్చుకొన్నది మంగలిసన్యాసమని తెలిసియుండియు నతడు పతితు
డని రుజువుచేసినను వదలలేదేమి? అతడే కాదు. ఆతని గురుపరంపర
గూడ పతితపరంపరయని యీ క్రింది విమర్శ వలన స్పష్టపడును. అ
దేమనగా వినుడు.

మంగలిసన్యాసులగు చక్రయ్యగారికి సతీర్థులు, బాపట్లవాస్త
వ్యులగు మల్లాదిహనుమచ్ఛాస్త్రియతిగారు. వీరిపుడు తెల్లగుడ్డక
ట్టుకొని భార్యను తిరిగి కాపురముచేయుటకు రమ్మనిపిలువ నామెని
రాకరించినట్లు వదంతి బయలుదేరినది. ఇంతియె కాదు. గుంటూరు

వైశ్యులయిండ్ల భిక్షలు సాగించుచున్నట్లు తెలియవచ్చినది. ఆ చక్ర య్యగారికిని, సీహానుమచ్ఛాస్త్రిగారికిని గురువులు బెజవాడకొండ మీదనుండు ఎడిపూడిస్వాములవారు. వీరి గురువులు జ్ఞానానందస్వాములు, వీరిచరిత్ర యత్యద్భుతముగానున్నది. అదేమంటురా వినుడు.

క్రోధన సంవత్సర ప్రతిపత్తు మొదలుకొని మా విజయవాడకొండపై వేంచేసియుండిన శ్రీదుర్గామహాదేవికి వసంతనవరాత్రములు జరిపిరి. స్కీముదావాలో బూజారు లోడుటచే నదివరకే ధర్మకర్తలుగానున్న మ॥ మా॥ జేటి అంకయ్య శ్రేష్ఠిగారు గాక సర్కారువారికను మతి హైకోర్టువారియుత్తరువు ప్రకారము బ్ర॥ చోడవరపు దేవరాజు పంతులుగారిని, బ్ర॥ పైడిమర్రి బుచ్చివెంకటరామశాస్త్రిగారినికూడ అడిషనలు ట్రస్టీలనుగా సబుజడ్జిగారు నియమించిరి. ఆధర్మకర్తలలో శాస్త్రిగారు దేవిసన్నిధియందున్న శ్రీచక్రమును స్వస్థానమునుండి తప్పించి మరియొకచోటికి జరిపిరి. అందుపై పెద్దవివాదలు బయలుదేరినవి. ఆవిషయమై విచారించుటకు వైదధర్మకర్తలలో శాస్త్రిగారును, పంతులవారును, మరికొందరు పెద్దలును మేమును నిశ్చయించితిమి. అది కొంతవిచారణజరిపి కాదువ మరునాడు పునర్విమర్శచేయనిశ్చయించుకొని పయనమైతిమి. ఇంతలో శికింద్రాబాదువాస్తవ్యులగు బ్ర॥ కాశీభొట్ల యజ్ఞయ్యగారచటనారుమాసములనుండి వసించుచున్నవారట. వీరచటికివచ్చుటకు కారణము దేవీసన్నిధిని చండీపురశ్చరణచేసుకొని యనంతరము చండీయాగముగావించి వెళ్ళదమని వచ్చియున్నవారట! మంత్రానుష్ఠానములకు వచ్చినామని చెప్పంగనే పైజ్ఞానానందస్వాములవారు తమజట్టులో గలియుదు గనువారికి వారికిదా మున్న మఠమును గాలీచేసి యందు యజ్ఞయ్యగారిని ప్రవేశపెట్టిరట! ఆరుమాసములు గడచినవట!

ఈలోపల నొకవింతబుట్టినదట! అదేమన? స్వాములవారు శాక్తేయులని ఈకథ మనకు గొంతబోధించుచున్నది. అందునువారు వామాచారరతులట. వామాచారమున బంచమకారములు ముఖ్యములుకదా! వానిని యధావిధిగ ననుష్ఠానములో నుంచుకొన్నవారు స్వాములవారు. ఈప్రతీతి విస్తారముగ గలదు. కావున నే వీరిని

లోకులు కోపిష్టిస్వాములవారు, కోడిగుడ్లస్వాములవారు, సారాబుడ్ల స్వాములవారు, మాంసాహారస్వాములవారు, త్రాగుబోతుస్వామి, బయటికిపోర్చున్నవారిమీద బండలువేసెడిస్వామి మున్నగుబిరుదములతో వాడుకొనుచుందురు. ఈవిషయము లన్నియు గ్రిందసమాచారము ఋజువు చేసెడిని. ఇంతటి గుణగణసంపన్నులని తెలియక స్వాములవారిని యజ్ఞయ్యగారొకనాడు భిక్షకుపిలువగామాంసము వండించిపెట్టిన వచ్చెదమని చెప్పిరంట! ఆమాటవిని భీతిలి యజ్ఞయ్యగారాపని నావలన గాదని చెప్పిరంట! ఆకథనంతను నందరియెదుట యజ్ఞయ్యగారు దేవశిరాజ పంతులుగారితోను, శాస్త్రిగారితోను జెప్పి యీకోపముచే నన్ను స్వాములు మఠములోనుండి వెళ్ళగొట్టినారని చెప్పిరి. ఈకథ యిదివరకు వినివా రిదేమని వింతపడిరి. అందొక రీవిషయము ప్రసిద్ధమైనదనిరి. మరియొకరు వీరికిమాంసము సురభిసుబ్రహ్మణ్యము వండిపెట్టెడివాడని చెప్పిరి. వాడు వండిపెట్టునాడు కొండక్రిందనున్న శూద్రులయింటినుండి తెప్పించుకొనెడియాచారముకలదని వేరొకరనిరి. ఇదేకాదు చేపలుకూడ దినుటకలదని యింకొకరు చెప్పిరి. సారాసీసాలను స్వాములవారు చాలా కప్పిపెట్టుచుందురని మరియొకరు పలికిరి. ఇవియేకాదు. గంజాయిలేనిదినము స్వాములవారికి దుర్దినమేయని యింకొకరనిరి. ఇట్లు పలువురు పలువిధముల స్వాములవారి గుణగణములను వర్ణించుటవిని ధర్మకర్తలసన్నిధిని జరిగిన శ్రీస్వాములవారి శుద్ధచరిత్రను మాపత్రికలో ప్రకటింతుమని విన్నవించుకొంటిమి అయ్యో! ఆయ్యో! స్వాములవారి కొంపగూల్చెదరాయని యందరును నొక్కసారి గొల్లుమనిరి.

మాదుర్గామల్లేశ్వరుల ధర్మకర్తలేమి, సబ్జడ్జిగారేమి కేవలధర్మాత్ములై తటస్థించియున్నారు. ఇటువంటివారి కాలములో దప్పకి యిట్టిదుష్పవిత్రులను దొలగించి దేవాలయమును మహోన్నతస్థితికి దేగలరని ప్రజ లాసించియున్నారు. ఇక మనము ప్రకృతమునకు వచ్చెదము. ఈచెప్పినదానింబట్టి జ్ఞానానందస్వాములవారు పతితులనుటకు సంశయములేదుకదా! వీరిశిష్యులే నడిపూడిస్వాములవారు.

వీరు పూర్వాశ్రమమున పెద్దభూస్వాములు. ధనవంతులు. సంతాన వంతులు. ఇంతియగాక సాంగాధ్యయనము చేసినవారు. కేవల వైరాగ్యముచే సన్యాసము తీసుకొన్నవారు. సదాచారరతులు. కాని వారి పూర్వజన్మార్జిత దుష్కృతవిశేషమువలన బైరాగిబోతు స్వాములకు శిష్యులును, ఎతితులగు చక్రయ్యహనుమచ్ఛాస్త్రిస్వాములకు గురువులును నగుట తటస్థించినది. దాని కెవరేమిచేయగలరు? కాని వీరియం దొక్కయసద్గుణము కనుపడెను. అదేమన? గింజుపల్లి చక్రయ్యగారి యాశ్రమము తప్పనియెడ జాలపరితాపబడెదరు. కాని కల్యాణానందభారతీస్వాములవారి నెవ్వరేనిదిట్టిన సంతసింతురు. ఒకనాడు వారికడ వేదోప్రస్తావములో చక్రయ్యగారియాశ్రమము తప్పనిచెప్పితిమి

అదివిని ఋండిపడి యతులేని పన్నోము ప్రపంచములో బవిత్రులైనసన్యాసులే లేరనిరి. మీరొక్కరున్నారని మేమెఱిలించుచున్నారమంటిమి మేముకూడ నపవిత్రులమేయని వారనిరి. అటులేని నిపుడు పవిత్రులగుయతులు లేరని వ్రాసియిచ్చెదరాయని యడిగితిమి. వ్రాసియిచ్చెదమనిరి. వ్రాసియుండని కాగితము పెన్సలు చేతికందిచ్చితిమి. వ్రాసియిచ్చిన నేమిచేయుదువని యడిగిరి పత్రికలోవేసి మాయభిప్రాయము వ్రాయుదుమని చెప్పితిమి. ఏమి వ్రాయుదువని యడిగిరి. ఇపుడున్న యతులందరు నపవిత్రులని స్వాములవారే చెప్పినారు కాన నిదిమొదలుకొని యీయపవిత్రులకు మంచినీళ్ళనుగూడ నీయవలదని వ్రాసెదమంటిమి. అటులేని నేను వ్రాయనని కాగితము పెన్సలు పారవేసిరి.

ఈయుభయులచే వెల్లి పుష్పగిరిపీఠ మాక్రమించుకొనిన గింజుపల్లి చక్రయ్యగారను మంగలిస్వాములవారికి బీఠాధిపతులైన మురాడవసాదు సన్యాసమిచ్చినారు. ఈచక్రయ్యగారి సతీర్థులగు హనుమచ్ఛాస్త్రిస్వామివారు తెల్లబట్టలుకట్టుకొని భార్యను మరల సంసారాసకిపిలుచుచున్నారు. వీరుతప్ప మరియొకరు మాకు గురువులుగా బనికిరారని యసతీపతియొకాక మద్రిపూడి, చెరుకూరు, నెల్లూరు, పెదపులివర్రు, బాపట్ల, మంగళగిరి, గుంటూరు, నరసారా

పేట, గోరంట్లమున్నగు గ్రామములనుండి వైదికబ్రాహ్మణసభల వారు ప్రకటించినపత్రికలు పత్రికారెజిష్ట్రీకివచ్చుటాగున వీధుల వెంబడి పొర్లాడినవి. వైళ్ళకి కాశీయాత్రచేయుచున్నవి. కలిమహారాజా! నీయేలుబడి, నీరాజనీతి నీచతురత, నీదూరదృష్టి, నీప్రజ్ఞ వర్ణనాతీతములుగనున్నవి.

ఒకప్రక్కనను శారదాపీఠవేసుపీఠాధిపతులకు బూటీగానస్పృశ్యత తీసివేసి మాలమాదిగెల నంటుకొమ్మని చెప్పితివి. గాంధిగారు నీకు మంత్రియై వర్ణసంకరముచేయ జీవితమును ధారవోయుచున్నారు. శైవసాంఘికులను వర్ణసంకరులను జేయుటకు దండికొండ ముదిగొండ నాగలింగశాస్త్రిని ప్రవేశపెట్టితివి. ఇక జెప్పెడిదేమి? జి. బి. యస్. సరస్వతి నీ కాష్ఠవర్గములోనివాడే కదా! కావ్యకంఠగణపతిశాస్త్రిగారిని, బొమ్మకంటి నరసింహశాస్త్రిగారిని, మల్లాది రామకృష్ణశాకిక చయనులవారిని వెట్టోలాగి యాస్థానవిద్వాంసులనుగా జేసికొంటివి. ఇంక నీప్రభుత్వమునకు లోపములేదు. కాంగ్రెసు పాపకాండవర్గమునకు దగిన ధనసహాయముచేసితివా వారు నీ రాజ్యమున మూడుపూల కారుకాయలు కాయించెదరు. కాలమునీది. నీకు లోపమేమియులేదు. కానిమ్ము. కానున్నది కాకమానదు గదా!

వ్యభిచారము రహస్యముగ జరుగునది. ఏయింటిలో జరిగెడి వ్యభిచార మాయింటియజమానునికే తెలియుటకష్టము. ఇక బక్కయింటివానికి దెలియదనిన దోషము రాదుకదా! తరువాత గ్రామములోనిది తెలియదనిన దగావచ్చునా? అయ్యో! పెక్కువందలమైళ్ళ దూరములోనున్న కాశీపట్టణములో జనమంత చార్యులుగారు చేసిన వ్యభిచారము మాకెట్లు దెలియును? మేము వారితో నప్పుడు కాశీకి వెళ్ళనైతిమికదా! వారైనను పదియేండ్లకు బూర్వమునగదా కాశీకి వెళ్ళినది. అప్పుడు చూడనవ్యభిచారము నిప్పుడుకదా పాకల బ్రహ్మచారిగాడు ప్రకటించినది. ఆప్రకటనములోనే వానిచేతనే నుయ్యి దిట్టించితివే, కలిరాజా! నిన్ను నాపమర్శనాగ్ని కాహుతిగావింపక విడుతుమనుకొంటివా? వెట్టివాడా! నీ పీకల పట్టయ్య కేమాత్ర

పు విమర్శజ్ఞానమున్నను నిట్టికల్పితవ్యభిచార లేఖను బ్రకటించునా? ఇందుచేత నే కాబోలు! ఈపికల పట్టయ్య చెంపదెబ్బలుచాలవు. చెప్పుదెబ్బలు కావలెనని యొకసంచికలో వ్రాసికొన్నాను. త్వరగ నాతనికోర్కె తీర్పబడదా? జాగేల చేసెదవు?

ఇది ధర్మవిప్లవకాలము. ఇపుడు గృహాంతఃకల్లోలములకు దరుణము కాదు. లోలోపల లోపములను సంస్కరించుకొని వ్యాజ్యములకు బోకుండ వ్యవహారములను జక్కపెట్టుకొందురను పుట్టెడాశతో బమ్మగిరివారికడకు రాయబారులను బంప వారలు గొల్లదిడిన ములలో వచ్చి వ్యవహారములను బరిష్కరించుకొందమని చెప్పియుంపి యావరునాడే స్వార్థపరులగు మల్లాది రామకృష్ణలాకేచయనులవారిబోధకులోనై కళ్యాణానందభారతీస్వాములవారిని దూషించుచు పెదచెరుకూరు రౌడీలచే దూషణపత్రిక వేయించిరి. అందుపై నభిమానస్వలక్ష్మణకుమారులవలె విరూపాక్ష పుష్పగిరి పీఠములు యుద్ధములు గావించినవి. ఫల మేమి తేలినది? స్మార్త బ్రాహ్మణుల గురుపీఠాధిపతులు దొంగలు, గడ్డెలు. పతితులు, వ్యభిచారులు ననవారిశిష్యులే ధృవపరచినారు. ధృవపరచిరి కాని యాగాపతితులను బూజించ మానినారా? అదెక్కడిమాట! ఇందులో నెల్లాను శాఖాభిమానములు ముందుకువచ్చినది. పత్రికచందాలిచ్చుటకు జేయిరానివారుకూడ సంచులువిప్పి ధాన్యమమ్మి నోట్లువ్రాసి భార్యలసొమ్ము కుదువబెట్టి వేలకువేలు గోతిలోవేసిరి. తుదకు ప్రాణములుకూడ సమర్పించి యెట్టులైననేమి పతితుని పాదతీర్థము పుచ్చుకొని కోడిపుంజులకై బొబ్బిలివారు యుద్ధముచేసి పతితమైనట్లు పతితులైరి. ఎవ్వరిని జయించిరి? వారివారే. ఇంతేకాదు. "మనతోకూడంగ గంసెమదరానుడ్డోడ్డా" అనునట్లు పరులనుగూడ వదింపి పతితులనుగావించిరి. ఇదియే కలహాఫలము, దీనం గులనాశకు లనుకీర్తి నార్జించినారు.

— పత్రికాధిపతి.



లును బత్రికాధిపతులును జెలరేగి సద్బోధకులను దుర్బోధకులనియు, దుర్బోధకుల
ను సద్బోధకులనియు, ధర్మములను నధర్మములనియు, నధర్మములను ధర్మములని
యు, పతితులను బరమపవిత్రులనియు, పరమపవిత్రులను పతితులనియు జెప్పి పత్రిక
లు ప్రకటించి వేలకువేలు ధనమును, బొలములను, నెలజీతములను సంపాదించుకొ
ని కొంపలు నింపుకొనుచున్న బ్రాహ్మణులనే బాధింపజూచుచున్నారు. అట్టిదుష్ప
థమున నేను పుష్పగిరిపీఠమును, దదాస్థాన పండితంమన్యులును బ్రవర్తించుచున్నా
రని తెలుపవలసివచ్చినందులకు జింతిల్లుచున్నారము. అదేమన?

ఆంధ్రదేశమునంగల శూద్రకులావతంసులగు జనులు రెడ్డి వెలమ కమ్మ బలిజె
లను నాలుగుశాఖలవారుగ విడివిడి యన్యోన్యవైవాహిక సంబంధము లేకపోయినను
భోజనాదిసంబంధము కలిగి మైత్రితో నునుచున్నవారు. ఈ నాలుగుశాఖలయందు
ను సంస్థానాధీశులు భూస్వాములు లక్షాధిపతులు కలరు. వీరు వీరును మానధనులు
ను నైయున్నవారు. ఇట్లుండ వీరిలో నత్యల్పసంఖ్యాకులు కలిసేరితులై తమ శూ
ద్రజాతిని నికృష్టముగను క్షత్రియబ్రాహ్మణజాతులను నుత్కృష్టములుగను దలంచి
నికృష్టమగు తమ శూద్రజాతిని విడచి యుత్కృష్టములగు క్షత్రియబ్రాహ్మణజాతీ
యులు కావలెననియుత్సహించి యందులకై జన్మనుబట్టి జాతివిభాగము కావలసినది
కాదు. గుణకర్మలనుబట్టి కావలసినదను దుర్వాదమునకు దిగి క్షత్రియుల మైత్రిని కా
వ వైశ్యులకంటె ముందు మాకు గౌరవములను గావింపవలసినదని వాదింప మొదలిడి
రి. ఆవాదమును బ్రాహ్మణులంగీకరింపరైరి. అందులకై పుష్పగిరిపీఠము నెదుర్కొని
సాధింపదలంచి తమకోర్కెను కొల్లూరున సభగావించిరి. ఆకమ్మవారలను ప్రతిఘ
టింప పీఠాధిపంమన్యులు మ. రామకృష్ణశాస్త్రి లౌకికమహోన్నచిన గారిని ముందిడిరి
వారు కమ్మవారుకల్పరచిన శాస్త్రములకు, యుక్తులకు శాసనములకు సమాధానము
లు చెప్పలేక యూరు నెలలగడువుకోరి తమ తలపైనిభారమును లోకములోనియమా
యిక పండితుల తలలపై బడవైచి తాము కడిగినముత్యమువలె నెలజీతములు పుచ్చు
కొనుచు సుఖపడవచ్చునని తలంచి నాగరలిపిని యొకవిజ్ఞప్తిని వ్రాసి ముందిడి పీఠప్ర
దివాంజి పేరుపెట్టి యొకవిజ్ఞప్తిని వ్రాసి చివరపెట్టి నడుమ కమ్మవారవాదమని కొం
తయు కమ్మవారివాదము కాదనువారివాద మనికొంతయు జేర్చి యిరువదిపుటల
యొక యనామధేయపత్రికను ముద్రింపించి యభిప్రాయార్థము పండితులకు లౌ
కికులకు రిజిస్టరులుచేయుచు పందు ప్రత్యుత్తరముల రిజిస్టరులకొరకు మూడణాల
పోస్టుబిళ్ళలనుగూడబెట్టి యంపుచున్నారు. సాధారణముగ బండితులు పురోహితు
లు కమ్మవారు క్షత్రియులనుటకంగీకరించనివారుగ నుందురు. ఇందుకుదోడు న
వవెల్నాటిపీఠాధిపతుల కోరిక తీర్చవలదనుని కొందరును మన వల్లాది రామకృష్ణ
శాస్త్రిచయనులవారి సంస్థానపండితగౌరవమును గాపాడవలదానుని కొందరును ద
మకనుకూలములయిన యభిప్రాయములను నొత్తురని యూ వానినన్నిటిని చేర్చి యొకగ్రం
థమును గావించి ప్రకటించినయెడల కమ్మవారిని బోడించి గెలిచినవారమ మగుదుము
యని దలంచి సంతోషములో మునిగి మూడబుట్టినదన్న సంతోషములో బడి నుఖ

ము. ఈచెప్పిన దానింబట్టి యుపనయనము మానుకొన్నవారికి కర్మచండాలత్వమును వారిసంతతికి జాతిచండాలత్వమును ప్రాపించునని స్పష్టమైనది. ఇంతియెకాదు. ఆవెంటనే మనువు మరియొకశ్లోకమునందుగూడ నీవిషయము నే చెప్పియున్నాడు. అదేమన

శ్లో॥ వ్యభిచారేణవర్ణానా మవేద్యావేదనేనచ

స్వకర్మణాంచ త్యాగేన జాయంతేవర్ణసంకరాః।

ఈశ్లోకమునకు కుల్లూక భట్టాచార్యుడిట్లు వ్యాఖ్యానము గావించియున్నాడు

“బ్రాహ్మణాదివర్ణానా మన్యోన్యస్త్రీగమనేన సగోత్రాది వివాహేన ఉపనయనాదిరూప స్వకర్మత్యాగేన వర్ణసంకరో నానుజాయతే। అతోయుక్తం అస్మిన్ ప్రకరణే వ్రాత్యానామభిధానమ్”

«బ్రాహ్మణాదివర్ణస్థులు వ్యభిచరించుటచేతను సగోత్రకన్యాపరిణయము గావించుకొనుటచేతను ఉపనయనకర్మను మానుకొనుటచేతను వర్ణసంకరులు జనించెదరు అందువలన నీసంకీర్ణప్రకరణమున వ్రాత్యులనుగూర్చి చెప్పుటయుక్తమని యర్థము. ఈచెప్పుటచే నుపనయనత్యాగియైన వర్ణసంకరులు జనింతురని విశదమైనదికదా? ఇట్టిస్థితిని నున్నతజాతీయులగు మీ రెన్నటికైన గోరదగినదగునా? మీ కీవాదమేల

గుణకర్మలనుబట్టి జాతివచ్చునని మరియొక వింతవాదమును గావించియున్నారు. గుణకర్మలనుబట్టి వచ్చెడిక్షత్రియత్వము మీకు మాత్రమే వచ్చునననేల? ఇతరుల కేలరాదు? అందరికిని గుణకర్మలనుబట్టి జాతివచ్చునని యొకదా యూరోప్యసామాజికులు తురకలను, మా దేశులను క్రైస్తవులను జన్నిదములను దగిలించి బ్రాహ్మణులను క్షత్రియులను వైశ్యులను జేసితిమని మురియుచున్నారు. యూరోపియనులవలె హాటుబాటు నాటులు తగిలించిన వారందరు యూరోపియను లయిరా? మరచితిమి. వారందరు నిపుడు రాజ్యముచేయుట లేదా వారు క్షత్రియులు కదురా ప్రభుత్వమును జేసినంతనే మీరందరు క్షత్రియులగుట న్యాయమెట్లగును మీరు జన్నిదములు వేసుకొని క్షత్రియులమయితిమందురేని మీవలె జన్నిదములు వేసిన తురకలను: క్రైస్తవులను క్షత్రియులనుగా నంగీకరించవలసివచ్చునుగదా! ఆనాడు గుణకర్మలచేనైన నూతన క్షత్రియులందరు నొకజాతివారై యన్యోన్యసంబంధములను సాగింపవలయునుగదా అందుకును సిద్ధమేయగుదురా మీరు వారిపోషణమునకై సంస్కారపక్షమవలంబించి యొకవేళ నంగీకరించినను మీవా రందుల కంగీకరింపరని చాటిచెప్పవచ్చును. ఒకవేళవారును గుణకర్మలచే జాతివచ్చునని యామోదించినను కొడ్డె వెలమ కమ్మ బలిజె శాఖీయులందరు క్షత్రియులే యగుదురనుట కాధారమేమి అందు కొందరు బ్రాహ్మణులు కావచ్చును మరి కొందరు వైశ్యులును నిక కొందరు చాకలులు మంగలులు మాలలు మాదిగలు కావచ్చునుగదా. ఒక కుటుంబములో నొకడు బ్రాహ్మణుడు వేరొకడు క్షత్రియుడు ఇంకొకడు వైశ్యుడు మరియొకడు శూద్రుడు మాలవాడొకడు మాదిగవాడొకడు నై యేజాతికిచేరినవా డాజాతిలోనికి బోవలసివచ్చునపుడు నతడేకాకి గాడా అతని కున్నతజాతి వచ్చినను నది సంతోషదాయకము కాలదా

బాగుగ యోజింపుడయ్యా! మీరెట్లు సహించితిరో చెప్పజాలముకాని చిలుకూరి వీరభద్రరావుగారు ఆంధ్రులచరిత్ర మధ్యయుగమునందు మిమ్ముగూర్చి గొల్లలకు బల్లెలకు బుట్టినమిశ్రజాతీయులని యతిహీనప్రసంగమును గావించిరి దానింజూడకయే వారే యెుదో యొకమూల క్షత్రియులని వ్రాసినందులకై సంతసించి యాపాడు గ్రంథమును మీరు బొగడుచు దానిని ప్రమాణముగ గ్రహించిరి. ఇపుడు శాకికచయనులవారు మిమ్ము ననులోమసంకరజాతీయులని వ్రాసియున్నారు. ఒక్కసారి యొకరిపై దగినచర్య తీసికొనినయెడ మాఁదధములగు మిమ్ముగూర్చి యిట్టినీచచరిత్రలు బయలువెడలునా? అదిమాని నిరపరాధులను జావమోదుటకు దలపడినారు. ఇది ధర్మమా? ఎన్నడును మిముగూర్చి యొక్క యవమానపుమాటయైనను మాట్లాడి వ్రాసియుండని మావంటివారిపై గక్కసపడియెదరు, ఇది న్యాయమా? శూద్రులమనితలంచిన మీపూర్వులకు వచ్చిన యవమానమేమున్నది? క్షత్రియుల మనుకొనగనే మీకు వచ్చినయాధిక్యమేమి? గొప్పతనముకై జాతిమార్చుకొనుట మర్యాదయా? పెద్దలు జాతికి నాతినిబోల్చియున్నారు. బుద్ధిమంతులకింతకంటె విశేషించి చెప్పవలసినదియుండదు. అయినను నీవిషయమై యొక ప్రస్తాంతరమును వినిపించి యింతట నీవిషయమును గట్టిపెట్టెదము. అదేమన?

అన్నలారా! మీలో నొకరికి నలుగురుకొడుకులు జనించిరనుకొందము. వారందరును జాతియందు భేదములేనివారేకదా. వారిలో నొకడు మొదటజన్మించి యగ్రజుడగును, రెండవవాడతని కనుజన్ముడు కాకతప్పదుకదా. మూడవవాడాయిరువురికిని నాలవవాడామూవురకును ననుజన్ములు కాకతప్పునా ఇట జన్మమునజాతి. పైపుత్రులలో పెద్దవాడు జాతిచేతనేకదా యగ్రజన్ముడైనది. వాడెన్నటికైన గుణకర్మలనుబట్టి యనుజన్ముడగునా. అటనని బుద్ధిమంతుడనగలడా అనవచ్చునా అనరాదు. ఇక ననుజన్ముడు గుణకర్మలనుబట్టి యగ్రజుడెట్లగును దూరమాలోచించి చెప్పుడు. ఎలాగ! ఎన్నటికిని గాడు. ఇక నీవర్ణప్రయత్న మెందుకు? గుణకర్మలనుబట్టి యన్నలను దమ్ములనుగాను, దమ్ములను నన్నలనుగాను మార్చుటకు యత్నించుట యెంతయనుచితకార్యమో బ్రాహ్మణక్షత్రియవైశ్యశూద్రులలో పైజాతివారిని గ్రిందిజాతివారినిగాను, గ్రిందిజాతివారిని పైజాతివారినిగాను మార్చుటకు యత్నించుటయు నంతయనుచితకార్యముకాదా కాదని బుద్ధిమంతు లనగలరా. పరమేశ్వరునికి భారతమాతృగర్భమున బ్రాహ్మణక్షత్రియవైశ్యశూద్రులనెడి నలువురుపుత్రులు పుట్టినారని సకలశాస్త్రములు చెప్పియున్నవికదా ఆవిషయమునే లోకవర్తనముకూడ చాటుచున్నది, ఇట్లుండ నీవిరుద్ధవాదము లెందులకు మీవాదములు నిలువకపోగనే ద్వేషింపనేల. ద్వేషమువలన గలహముపుట్టదా, ఇరువురు కలహించిన మూడవవానికి లాభముకలుగు ననులోకోక్తి మీకు దెలియనిది కాదుకదా?

అగ్రజన్ములగు బ్రాహ్మణు లగ్రజన్ముల మనుకొనుట దోషమా. అన్న లన్నలమనుకొనరాదా. పెద్దవాడు వైత్యముచేసిన చిన్నవాడు వానిని ద్వేషింపవలయునా గుణకర్మలలో పెద్దవాడగు చిన్నవాడు గుణకర్మలచే నన్నయగునెడ వాని

కంటె ముందు నన్ను గౌరవించవలసినదని యడుగవచ్చునా. తగదని బుద్ధిమంతులనక తీరదుగదా. అటులేని జాతిచే పెద్దవారగు వైశ్యులకంటె ముందు మమ్ము గౌరవించవలెనని మీరడుగుట ధర్మమెట్లగును. ధర్మముకాదు. కాన ధర్మవిరుద్ధమగు నీ వాదమును విడిచుడు మీపూర్వులవలెనిహపరసౌఖ్యముల సంపాదించుకొని యనుభవించి మనుటమంచిదని హితోపదేశము గావించి యంతట నీవిషయమును విరమించుచున్నవారము.

—పత్రికాధిపతి.

---

# కొవ్వూరు - గోష్పదక్షేత్రము.

[శంకరమఠము]

ఈ గ్రామము రాజమహేంద్రవరమునకు సరాసరి పశ్చిమభాగమున నఖండగోదావరీనదీతీరమున విరాజిల్లుచున్నది. ఇచ్చట నిరంతరము తీర్థయాత్రాపరులచే సేవింపబడుచుండు గోష్పదక్షేత్రమొకటి కలదు. పూర్వము గౌతమమహామునీంద్రుడీ క్షేత్రమున దపమొనర్చుకాలమున దేశమున ద్వాదశవర్షక్షామముచే గలిగిన దుర్భిక్షముచే బీడింపబడు జనులుకొందరీగౌతమునాశ్రయించినట్టును, తన తపశ్శక్తిచే గౌతముడు దినదినము నీక్షేత్రమున ధాన్యముబండించి వారియాకలిని తీర్చుచుండెనట్టు నా మునిని బరీక్షింపదలచి ఈశ్వరునిచే బంపబడిన వినాయకుడొకగోవునైవచ్చి యా పైరును మేయుచుండగా గౌతముడు విసివి దానిని దర్భలతో గొట్టినట్టును ఆ దెబ్బలచే మరణించిన గోవు సంజీవింపజేయుటకు గౌతముడు త్ర్యంబకమునకు బోయి మహాశివునిగూర్చి తపమొనర్చి యాతనిజటాజూటముననున్న సురవాహిని నీమార్గమున గొనివచ్చి యా గౌతమీపుణ్యనదీజీవనములతో నీ గోవు సంజీవింపజేసినట్టును చెప్పబడు నొక పుణ్యపురాణకథ కీక్షేత్రమే జన్మస్థానమైయున్నది. ఈ క్షేత్రమున నేటివరకు యాత్రికులెల్లరకు దృగ్గోచరములై విస్మయమును గొల్పుచున్న గోపాదములును, వత్సపాదములున్న ఈకథయొక్క యాథార్థ్యమును వెల్లడిచేయుచున్నవి. ఈ గ్రామములో గౌతమమహాముని గౌతమీనదిలో నుండివచ్చిన శ్రీవరదగోపాలస్వామిని ప్రతిష్ఠించిరి.

ఈపుణ్యగ్రామమున చిరకాలముక్రిందట శ్రీఘనేంద్రస్వాములవారొక శంకరమఠమును నిర్మించిరి. అయ్యది యేబదిసంవత్సరములక్రిందటనే జీర్ణదశను బొందుటచే నిటీవల గ్రామములోని యాస్తికులు కొందరిచ్చట నొకసత్రశాలను నిర్మించి శంకరాచార్యులయొక్కయు దచ్చిష్యులయొక్కయు చిత్రపటములనందుంచి శక్తికొలదివందనాలు చేసుకొని ప్రతివత్సరమును వైశాఖ శు౫ నాడు శంకరజయంత్యుత్సవములును, ఏకాదశీభజనలును, మతోపన్యాసములును జరుపుచు [illegible] సన్యాసులనివాసమున కాధారముగల్పించి భిక్షావందనములు చేయుచు వారికటాక్షపూర్వకనారాయణస్మరణములకు పాత్రులగుచుండిరి.

ఇట్లుండగా చిన్ననాటనే బ్రహ్మచర్యమున సన్యసించి సంగవిముఖులై అష్టాంగయోగసిద్ధులనుబడసి శృంగగిరిమఠమున భాష్యత్రయపాఠంబుచేసి శ్రవణమాత్ర

ముని శిష్యహృత్తాపమునుహరించు నిరర్గళశబ్దధోరణిని ప్రస్థానత్రయభాష్యపాఠముల
ను జెప్పసమర్థులగు శ్రీమత్పరమహంసపరివ్రాజకాచార్యవర్య శ్రీ సత్యానందసరస్వ
తీస్వాములవారు విచ్చేసి గడచిన దుర్మతిసం॥ శు॥ 3 రోజున నీమఠమునుద్ధరింప సంక
ల్పించి యీగ్రామస్థులయొక్కయు సర్వగ్రామస్థులయొక్కయు సహాయమున
రు 4,000 ల ద్రవ్యవరమగు నొకమఠమునుగట్టించి జీర్ణోద్ధారణమును నొనరించిరి,

ఈమఠమందు ప్రతిష్ఠ జేయుటకై శ్రీ బ్రహ్మానందసరస్వతీస్వాములవారు
కాశీనుండి రు 300 లు విలువగల పాలరాతితో జేయబడిన శంకరాచార్యవిగ్రహమును బం
పియున్నారు శ్రీ స్వామివారిప్రతిష్ఠయేనది మొదలుకొని ధూపదీపనైవేద్యాద్యుపచార
ములు తనగోత్రి ... ములతో జరిగించు మాధ్యాహ్నికపూజకుగాను సాలు1కి
రు 150 లు ఆదాయమువచ్చు స్థిరాస్తినిచ్చుటకు కృష్ణాజిల్లా నిడదవోలు వాస్తవ్యులు
ను ప్యారీకంపెనీమ్యానేజరుగారును అయిన సుందరేశంఅయ్యరుగారు వాగ్దానముజే
సియున్నారు తణుకుతాలూకా పరిమెళ్ళగ్రామవాస్తవ్యులగు బ్ర॥ శ్రీ కోలచిర వేం
కటసుబ్బయ్యగారు శ్రీశంకరజయంతికి రు 400 లు విలువగల సెం 40 మామూలుపల
వు ఈనాంభూమిని దానపత్రవ్రాసియున్నారు ప్రతిసంవత్సరమున్ను మార్గశిర
శు 15 రోజునజరుగు దత్తాత్రేయజయంత్యుత్సవమునకు కృష్ణాజిల్లా కేతవకొండవా
స్తవ్యులు బ్ర॥ శ్రీ కోటమసులపూడి కృష్ణయ్యగారు సాలు1కి 10 రూపాయలు విరాళ
ము నొసంగుటకును స్వగ్రామస్థులగు బ్ర॥ శ్రీ కాళ్ళ సాంబమూర్తిగారు వేదపాఠ
శాలకై సాలు1కి రు 100లు ఇచ్చుటకున్ను అమోఘవాగ్దానములు చేసియున్నారు
బ్ర॥ శ్రీ జొన్నవిత్తుల పిచ్చయ్యగారి ధర్మపత్ని సౌ వెంకటరత్నమ్మగారీ మఠము
నం దాచార్యపీఠమును గట్టించిరి బ్ర॥ శ్రీ అయిలావఝ్ఝుల రామబ్రహ్మంగారు మఠ
మునకు సంబంధించిన 50గజముల స్థలమును దత్తముచేసియున్నారు

ఇకముందు జరుగవలసినధర్మకార్యములలో ముఖ్యమైనవి నాల్గుఅయియున్న
వి ఒకటి క్రోధనసం, జ్యేష్ఠమాసములో 1 శంకరాచార్యప్రతిమ, 2 నందాదీపము,
3 నిత్యసాయంకాలపూజలు 4 చాతుర్మాస్యములయందు విశేషపూజలు|

ఈ శేషించినధర్మకార్యములు ధర్మాత్ముల అభ్యుదయమునకు మూలములైనవని
ప్రాజ్ఞులగు దాతలకు వేరె చెప్పనక్కరలేదు "ధర్మస్యత్వరితాగతిః" అను వాక్యోక్తిననుస
రించి ధర్మాభిమానవంతులగల పుణ్యపురుషులీవిషయమున గొంతభారమును వహింతు
రుగాక ఇంకను మనస్సేచేసుకొను చున్నవారెవరు విశేషాంశములు తెలిసికొనగోరువారు
కృష్ణాజిల్లా కొవ్వూరు శంకరమఠములోనుండు శ్రీ సత్యానందసరస్వతీస్వాములవా
రికి వ్రాసి తెలుసుకొనవచ్చును.

ఇట్లు విన్నవించువిధేయుడు,

అనిపర్తి జగన్నాధశాస్త్రి.

# వీనులవిందు - నయనపర్వము.

మేము నేడు (క్రోధనసం॥ చైత్రబహుళప్రతిపత్తు వెళ్లినద్వితీయయందు) దయమున 8 గంటలవేళ కొండమీదనుండు శ్రీ దుర్గామల్లేశ్వరుల దర్శింపవలెనని బయలుదేరి సోపానముల నెక్కుతరి "వీనులవిందై యమృతపుసోనలపొంపై" యను మనుచరిత్రలోని పద్యపాదమును జ్ఞప్తికిదెచ్చుచు పవిత్రాగ్ని పునస్సంధానమంత్రనిస్వనములు వీనులవిందుగావించెను. ఇవి యెచ్చటనుండి వచ్చుచున్నవో యని యోజించుచు పైకిబోవ నవి శ్రీదుర్గా ఋషికుల గీర్వాణాంధ్రపాఠశాలామందిరమునుండి వచ్చుచుండెను. అంత నా పాఠశాలాంతరమున కేగ నట నయనపర్వముగావించు విద్యార్థుల యగ్నులపంక్తి యగుపడెను. అపుడా పాఠశాలోపాధ్యాయులగు బ్ర॥ అవ్వారి రామమూర్తిశాస్త్రిగా రాచార్యులుగా గూర్చుండి శిష్యులచే సమిధాధానముగావింపించుచుండిరి. ఉపనయనమునాడు మూడునాళ్ళు ముచ్చటగా జరుగుచున్న సమిధాధానమును నేను విద్యార్థు లయినను నొక్కసారి చేయుట కని యమందానందమందితిమి. కడువృద్ధులయ్యు గేవలశ్రుతిశ్రద్ధాసక్తచిత్తలగుటచే సోమిదేవమ్మగారు పడుచునాడు సిగ్గుపడులాగున దిరిగి సంపాదించుకొనివచ్చి వండిపెట్టుచున్న పుష్టము పూపుటతిని వానరములక్రియ నల్లరులుచేసి చెడక విద్యార్థులు విద్యార్జనమందే తమ తనుమనముల వినియోగించి విద్వాంసులగు గురులోకమునకు లోకమునకు గన్నులపండువుగ వర్తింతురని నమ్మి యింతట విరమించుచున్న వారము.

—పత్రికాధిపతి.



# తాడికొండ ముదిగొండ నాగన్న తంత్రము

---

ఒకదానిని రచించినుద్దానిని దన శైవరహస్యబోధినిలో ప్రకటించుకొనుచున్నాడు. దానికి కారణోత్తరమని పేరిడెను. కారణోత్తరమనంగనే కామికాగమము యొక్క యుత్తరభాగము కొందరు భ్రాంతిపడుచున్నారు. ఇది నాగన్నచే రచింపబడిన పాషండశాస్త్రము కాని కారణోత్తరతంత్రమెంతమాత్రమును గాదు. ఇతడింకమించు నిరువదియైదేండ్లకు ముందు శికిందరాబాదున కేగి యప్పుడచట వసించియున్న ప్రబల ముల్కి రామలింగయ్యగారితో మన యతిధర్మములను దెలుపు ధర్మశాస్త్రములు కానరావు, కావునజేసి పరమతిపండితులు మన మతాచారముల నధిక్షేపించినపుడు సప్రమాణ ప్రత్యుత్తరముల నిచ్చుటకు వెరవు కనుపడుటలేదు. కాను లకయి మహర్షి పేరుపెట్టి యొకధర్మశాస్త్రము రచించి దాని నుత్తరదేశమునకు దీసికొనిపోయి యేదో యొకపురమున నచ్చువేయించి యచటనే కొన్నిరోండ్లవర కాప్రతులను నుండనిచ్చి పిదప గ్రంథపరిశోధనలో నది దొరకినదని చెప్పి తెప్పించి మనమతస్థుల కందరికిని ఖండజేయవలయును. ఇంతకంటె మతాచారములను సాధించుటకు మఱియొక వెరవు దొరకనేరదని చెప్పియున్నవాడు. రామలింగయ్యగారతని సాహసమునకు కచ్చెరువంది యట్టి వెల్లడించినయెడ నతడు తల్లడిల్లునని శాంతించిరి. ఇపుడా ధర్మశాస్త్ర ప్రకటన ప్రయత్నము మాని దానిని గారణోత్తరతంత్ర ప్రకటనముగమార్చి ప్రారంభించియున్నవాడు. ఇద్దానివలన శైవులకుం గొత్తగౌరవము రాకపోగా నున్న గౌరవము మాయుననుటకు సంశయము లేదు. కాన శైవులు వెనువెంటనే కారణోత్తరమునకు ప్రతిక్రియలు ప్రారంభించవలసినదని నాగన్నకు హితోపదేశము గావించవలెను. వినినయెడ సరే. లేకున్న నాతనితంత్రముతో శైవుల కేవిధమయిన సంబంధము లేదని ప్రకటింపవలసియున్నది.

—పత్రికాధిపతి

మీకు సంతానము గావలయునేని

## ఆంధ్రగర్గభాగవతమును

జదువుడు

ఇందు శ్రీమద్భాగవతములోని ప్రధానవిషయములు క్లుప్తముగాను నందులేని విషయములు విస్తరించియునున్నవి. తులసీమాహాత్మ్యము నేకాదశీవ్రతమహిమము మొదలగునవికలవు. ప్రతిమనుజుడును జదువదగినగ్రంథము అచ్చులోనున్నది రాయల్ సైజున 500 పేజీలకు పైగానుండును.

## బాలనీతి

ఇయ్యది బాలుర కుపయోగకరములగు విషయములు ధైర్యము, సాహసము, భక్తి సాహసము, వినయము మొదలగు వానిని గూర్చి తేటతెలుగున భారతము, రామాయణము మొదలగు ఇతిహాసములనుండి యుదాహరణములతో గూడ వ్రాయబడినది. బాలురచేతనేగాక ప్రతివారిచేతను జదివితీరవలసిన గ్రంథము. మద్రాసు టెక్స్టుబుక్కు కమిటీవారిచే బాలురకు బహుమతీయగ్రంథముగ నంగీకరింపబడినది. ప్రథమభాగము వెల రు 0-8-0

వలయువారు— చిన్నకూల అప్పయ్యశాస్త్రిగారు,

[ద్వితీయభాగము అచ్చులోనున్నది] ఉప్పి, కరవదిపోస్టు,

గుంటూరుజిల్లా

అని వ్రాయవలెను

---

హాల్దీఘట్ యుద్ధము— ఇది ఏడంకముల చరిత్రాత్మకమగు నాటకము రసపుత్రవీరుల శౌర్యపరాక్రమములిందు జక్కగా వర్ణింపబడినవి. శైలి మనోహరమై ప్రదర్శనమున కత్యంతానుకూలముగ నుండును. వెల 0—12—0

చిరునామా— ముదిగొండ బసవయ్యశాస్త్రి

ముక్త్యాల, కృష్ణాజిల్లా.

---

శైవధర్మప్రకాశిక:- ఇది యొక మాసపత్రిక. ఇందు శైవధర్మములు తెల్లడింపబడును. అవి బాలబోధకములగు విమర్శకవ్యాసములుగ నుండును. చందాసంవత్సరమునకు రు 1-0-0

పత్రికాధిపతి— శివపురపు వీరభద్రపాకయాజి.

Regd. No. M. చందా సం॥ రు. 2.

శ్రీ

శ్రీబాలాత్రిపురసుందర్యైనమః

"యతో ధర్మస్తతో జయః। సత్యమేవజయతే నానృతమ్"

# శ్రుతిధర్మసంజీవని

వర్ణాశ్రమ ధర్మపక్షమున వాదించు మాసపత్రిక.

"ధర్మఏవహతో హంతి ధర్మోరక్షతిరక్షితః"

శివపురపువీరభద్రపాకయాజి పత్రికాధిపతి



| సంపుటము. | ప్రభవ మాఘశు ౭ ఆదివారము. | సంచిక. |
| --- | --- | --- |
| ౧ | జనవరి 1928. | ౧ |



విషయసూచిక



| | | |
| --- | --- | --- |
| 1 | శ్రుతిధర్మసంజీవనీ కార్యనిర్వాహకసభ | పత్రికాధిపతి |
| 2 | ప్రతిపక్షమతప్రబోధము | " |
| 3 | చతుర్వర్ణచరిత్ర | " |
| 4 | కలిచక్రవర్తిపట్టాభిషేకము | " |
| 5 | గాంధిమతఖండనము | " |
| 6 | గాంధిమహాత్ముఁడు | మండచిన వెంకయ్యగారు |
| 7 | వర్ణాశ్రమధర్మసభ | పత్రికాధిపతి |
| 8 | కావ్యకంఠగణపతిశాస్త్రిపలాయనము | " |
| 9 | మదనమోహనమాళవ్యపలాయనము | " |




బెజవాడ.

శ్రుతిధర్మసంజీవనీ ముద్రాక్షరశాలయందు

ముద్రింపఁబడి ప్రకటింపఁబడియె.

1928

శ్రీ

బాలాత్రిపురసుందర్యైనమః

యతోధర్మస్తతోజయః। సత్యమేవజయతే నానృతమ్।

# శ్రుతిధర్మసంజీవని.



వర్ణాశ్రమ ధర్మపక్షమున వాదించు మాసపత్రిక.



| సంపుటము. | ప్రభవ మాఘశు ౭ ఆదివారము. | సంచిక. |
| --- | --- | --- |
| ౧ | జనవరి 1928. | ౧ |



## కార్యనిర్వాహకసభ.



పుత్రవియోగ సాగరమున మేమును భ్రాతృవియోగ సాగరమును మా శ్రుతిధర్మ సంజీవనీ ముద్రాక్షరశాలా పత్రికాం పుత్రికలును ఈది దరి జేరితిమి. దరి జేరఁగనే మా మిత్రవరేణ్యులు కొందరు మమ్ముఁ గానవచ్చి మీరు యథాపూర్వముగ శ్రుతిధర్మ రక్షణయందు దీక్షితులరై పనిచేయుడు. మీ కార్య నిర్వహణమునం దప్రమత్తులమై ప్రవర్తించెదమని యభయప్రదానంబు గావించి కార్యనిర్వాహక సభ్యతను స్వీకరించిరి.

ఇట్లు కార్యనిర్వాహక సభను స్థాపించి శ్రుతిధర్మ సంజీవనీ ముద్రాక్షరశాలా పత్రికలఁ బునరుద్ధరించు మార్గము నన్వేషించుచుండ దండమూడి వాస్తవ్యులగు బ్ర।। మండఁచిన వెంకయ్యగారు మా సదనమునకు విచ్చేసి పత్రికా ప్రారంభోత్సవ వ్యయమునకు నిరువది రూప్యముల విరాళము నిచ్చెదమని వాగ్దానముగావించి పంపించిరి. అటుపై మా విజయవాడయందలి శ్రీకన్యకా పరమేశ్వరీ ధర్మకార్యనిర్వాహక సభవారు దయతో మా శ్రుతిధర్మ సంజీవనికి నూరు రూప్యములు విరాళమొసంగి యున్నవారు. వారితోఁ బత్రికా కార్య నిర్వహణమునకు వలయు పరికరములను సమకూర్చుకొనఁగలిగితిమి.

ఈశ్వరానుగ్రహమున నీమాఖమాసమున మాపత్రికా పుత్రిక బయలు వెడలి మునుతినమృదుపదవిన్యాసములను మృదుమధురోపన్యాసములను గనివిని పరమానంద భరితులై తనను గారవించియున్న పాఠకులగు నన్నలకడకు వెళ్లుచున్నది. వారు మాపత్రికా పుత్రికకుఁ జిరపరిచయులై యున్నవారగుటచే మరలఁ బరిచయము గలిగింప మానితిమి. పక్షపత్రికగానున్న మాశ్రుతిధర్మ సంజీవని వారపత్రిక యెట్లగునాయని నిరంతరము మేముకుందుచుండ నది కావింపకపోగాఁ బైపెచ్చు పక్షపత్రికగా నున్న మాశ్రుతిధర్మ సంజీవనిని బ్రకృత పరిస్థితుల ననుసరించి మా కార్యనిర్వాహక సభవారు మాసపత్రికగా మార్చి నడుపనిశ్చయించి మూడురూప్యములనుండి రెండు రూప్యములకుఁ జందాతగ్గించియున్నారు. ఇంతియెకాదు తీవ్రపద్ధతినిమాని శాంతపద్ధతిని విమర్శనములనుగావించవలెనను నొకశాసనమును గూడగావించియున్నవారు. ఈశాసనమునకు లోఁబడియే మేమునుమాపత్రికొపవి లేఖకులును వ్యాసములను వ్రాసి యీయవలసిన వారమై యున్నారము

## ప్రతిపక్షమతప్రబోధము.

ప్రతిపక్షమతములన బ్రతివాదమతములని యర్థము. వానిని బ్రబోధించు (మేలుకొలుపు) వ్యాసము కానదీనికిఁ బ్రతిపక్ష మత ప్రబోధమను నన్వర్థ నామకరణముగావించి ప్రకృతమునకువచ్చుచున్నారము.

మాకుఁబ్రతి పక్షమతము లనేకములుకలవు. అవేవనిన శ్రుతుల నిరసించువారు, నిందించువారు, వానికపార్థములను గల్పించువారు, శ్రుతిధర్మ రతులవలెను, శ్రుతిధర్మరక్షకులవలెను, బైకినటించుచు లోలోపల, శ్రుతిధర్మ నిర్మూలన కర్మలనుగావించువారు, పండితులను సత్కరించు నెపముతో వారిని జండాలురలోఁ జేర్చుటకు యత్నించుచున్న ధనికులు, పండితులను, ధర్మవిసులము, ధర్మరతు

లమునని లోకమును వంచించి ధనముగడించుకొని యపండితులును నధర్మరతులునునగు విద్యావిహీనులుకూడఁ గావించుటకు సాహసించరాని యకార్యకార్యములను గావించుచున్న పండితబ్రువులు, సాంగాధ్యయన విహీనులను సత్కర్మరములను దీక్షితులను సోమయాజులను చయనులను గాన నియోగివంటపనికి రాదని తెలిపి చండాలురతో గలిసి తినువారికడ సంభావనలను గొనువారు వారియిండ్లవండుకొని తిను శ్రోత్రియులు నియోగులకు వైదికులు క్షత్రియులకు నియోగులు రెడ్డివెలమ కమ్మబలిజెలకు క్షత్రియులు గొల్లలకుఁ బల్లెలకు రెడ్డివెలమ కమ్మ బలిజెలు మాల మాదిగెలకు గొల్లలు పల్లెలు కోతులకు మాల మాదిగెలు జనించినారనెడి చరిత్రలు రచించువారు. రజస్వలావివాహములు వితంతూద్వాహములు విజాతికన్యాపరిణయములు చండాలాస్పృశ్యతా నివారణము లోనగువర్ణసంకరకార్యములను ననుష్ఠానములోనికి దెచ్చుటకు యతించువారు వానికి దోడ్పడి వర్ణసాంకర్యమును వృద్ధిచేయు శాసనములను సృజించుటకు బిల్లులు మూజేయుశాసన నిర్మాణసభా సభ్యులు మున్నగువారున్న మతములును బ్రహ్మసామాజికులు ఆర్యసామాజికులు దివ్యజ్ఞాన సామాజికులులోనగు వారందరును మాకుఁ బ్రతిపక్షమతములవారే. వారిని మేల్కొలుపుటయే యీవ్యాసకార్యమైయున్నది.

పైనఁ దెలుపఁబడిన ప్రతిపక్షమతముల వారందరును నేకోయొక విధమున శ్రుతిస్మృతి సూత్రపురాణేతిహాసాది సర్వప్రమాణసిద్ధములై శిష్టజనాచరితములై లోకోపకారకములైవచ్చుచున్న వర్ణాశ్రమ ధర్మములను నిర్మూలించుటకు యత్నించుచున్నవారు. భారతమహారణమున సవ్యసాచివలె, బై ప్రతిపక్షమతములవారి నెదిరించి శ్రుతిధర్మపక్షమున విమర్శన మహారణముగావించుటకు రణదీక్షఁగైకొని దాడివెడలుచున్నవారము. కాన మాప్రతిపక్షులును నిద్రమేల్కొని కన్నులు తుడుచుకొని రానున్న రణమునుదలంచి యుద్ధమునకు సన్నద్ధులైయుండుట యవసరమని గ్రహించుట మంచిది. అతిభీ

ష్ణమగు గ్రీష్మకాలమున శుష్కారణ్యమును నొక్కపరిన బదికుక్కల
ను నంటుకొని నడుమ జిక్కిన క్రూరమృగములను గాల్చి వేయుకార్చి
చ్చుకరణి నత్యంత మలినమగు కలికాలమున దుర్మతారణ్యమును
నొక్కపరినలు గడల నంటుకొని నడుమ జిక్కియున్న యధర్మ
ములను గాల్చివేయుటకు మదీయవిమర్శన దావానలుడు దరికొనుచు
న్నవాడు కానప్రతిపక్షమతములవారు, జాగరూకులై దూరదృష్టి
తో వర్తింతురని తలంచెదము ఈప్రబోధము బోధించునదేమన మా
ప్రతిపక్షమతముల వారందరును దమదుర్వాదములను దురాచారప
రతను దుశ్శాసన నిర్మాణమును వదలుకొని సద్వాదముల జేయుచు
సదాచారపరత గల్గి వేదానుశాసనానుసరణమును గావించుటయే
కాని యన్యముకాదని తలంతురుగాత ఇట్లనినమా కార్యనిర్వాహక
సభవారు శాంతరసోపేతములగు విమర్శనములను గావింపవలసినదే
కాని తీవ్రవిమర్శలనుగావింపరాదను శాసనమును గావించినవిషయ
మును మరచిప్రవర్తింతుమని తలంతురేమో? వలదు ప్రతిపక్షులు
దూషించినను బ్రతిదూషింపక భూషించుచు విమర్శించుటకు దీక్షగై
కొని యున్నవారమని విన్నవించియింతట విరమించుచున్నారము.

—పత్రికాధిపతి.

## శైవ పండిత పరిషత్తు.

రానున్న మాఘమాసమున తెనాలి శ్రీశైవ సమాజమువారి
మాధ్యస్థ్యముక్రింద బ్ర॥ కాశీనాథుని రాజలింగశాస్త్రిగారును,
ముదిగొండ నాగలింగశాస్త్రిగారును శైవులు దహనసాపిండ్యములను
జేయవలయునా? వలదా? అనువిషయమునుగూర్చి పైపరిషత్తునందు
వాద ప్రతివాదములు గావించినవెనుక సమాజమువారు తీర్మానించె
దరని తెలియవచ్చెడిని.

—పత్రికాధిపతి.

శ్రీ శాలాత్రి పురకుండర్యైనమః

# వైశ్యవేదోక్త క్రియావిచార వ్యవస్థా పీఠికావిమర్శనాత్మక

# చతుర్వర్ణచరిత్ర.

---

( పీ ఠి క )

మంగళాచరణము

గీ॥ శిష్టజనులను గావంగ దుష్టనరుల।
సంహరింపంగ ధర్మసంస్థాపనార్థ।
మిలను జనియింతు యుగయుగంబులనటంచు।
బ్రీతినఁదెలిపిన భగవంతు బ్రస్తుతింతు।

గ్రంధనామ వివరణము.

చతుర్వర్ణములన బ్రహ్మక్షత్రియ వైశ్యశూద్రవర్ణములని యర్థము. అవియెట్లు జనించినవో? ఎట్లభివృద్ధిఁగాంచినవో? ఇపుడెట్లు ప్రవర్తించుచున్నవో? వానిపై నెవ్వరెవ్వరేయే విధముల విమర్శనములను గావించియున్నవారో వానినెల్ల సవిమర్శకముగఁజర్చించి ప్రత్యేక శీర్షికలుకల బ్రహ్మచరిత్ర, క్షత్రచరిత్ర, వైశ్యచరిత్ర, శూద్రచరిత్రలనెడి గ్రంధములను వేరువేరుగ రచించుటకు నిశ్చయించి. ప్రకృతము వానికి, బీఠికగానుండు, వైశ్యవేదోక్త క్రియావిచార వ్యవస్థా నామకవిమర్శనగ్రంధ పీఠికా విమర్శనమును వినిపించఁదలంచిన వారమై యందులకుముందు దానిపేరు ఫలములు సరిపడియున్నవా? లేవా? అనువిషయము నించుక విమర్శించఁబోవుచున్నవారము. కానదీనిని సావధానమానసముల మాపాఠకులు బఠించి సత్యసారమును జవిగాంతురుగాత.

(వైశ్యవేదోక్త క్రియావిచారవ్యవస్థ)

ఇది యనేకదోషదూషితమైయున్న నామకరణము. పండితులగు గ్రంధకర్తలు తామురచించఁదలంచిన గ్రంధముల కాగ్రంధములం

దు వర్ణించఁ నెంచిన ప్రధానవిషయములను. బోధించు నామకరణము లను గావించుట, సంప్రదాయ సిద్ధమైన యాచారమైయున్నది. కాని యపండితులగు గ్రంధకర్తలట్లుగాక యాయాచారమునకు బద్ధవిరుద్ధ ముగఁ దమగ్రంధములకు నామకరణములను గావించుచుందురు. ఇట్లు నామకరణములుగావింపఁబడిన గ్రంధములలో నగ్రగణ్యామైయున్నదే, యీవైశ్య వేదోక్త క్రియావిచార వ్యవస్థయను విమర్శన గ్రంధమని మనము నిశ్శంకముగఁ జెప్పుకొనవచ్చును. ఏలయన? పైగ్రంధమందు న్న విషయము కలియుగమునందు క్షత్రియ వైశ్యంమన్యులు కలరు కాని పరిశుద్ధయోని బీజములకు జనించిన క్షత్రియ వైశ్యులు లేనేలే రనునది. క్షత్రియ వైశ్యులు లేనేలేరనియు, నుండినవారు క్షత్రియ వైశ్యమ్మన్యులైయున్నారనియు, వారికి వేదోక్త కర్మాధికారము లేదనియుఁ, లేకున్నను వారిలో గొందరిపుడు సాహసించి తమకు వే దోక్త కర్మాధికారము కలదని చెప్పి వైదికకర్మల నాచరించుచున్నా రనియుఁ గానియది శాస్త్రాచారదూరమైన యాచారమైయుండుటచే వారుసంఘదూరులు కాక తప్పదనియు జెప్పెడి విమర్శన గ్రంధమున కుఁ బండితులు "క్షత్రియ వైశ్యంమన్యవేదోక్త క్రియావ్యవస్థా ఖండ నమ" నునామకరణము గావింపదగునుగాని "వైశ్యవేదోక్త క్రియా విచారవ్యవస్థ" యనునామకరణము నెన్నటికేని గావింపఁదగునా తగదు. కానసీ విమర్శనమును బట్టి చూడబై గ్రంధకర్త లపండితుల స్పష్టమగుచుండలేదా?

ఇంతియె కాదు. కలియుగమున క్షత్రియ వైశ్యంమ్మన్యులే కల కాని క్షత్రియ వైశ్యులు లేనేలేరని చెప్పెడి గ్రంధమునకు నామక ముగావించునపుడు క్షత్రియ శబ్దమునువదలి వైశ్యవేదోక్త క్రియ విచార వ్యవస్థయను పేరుపెట్టి యున్నారు. ఈపేరు దోషదూషితకై గ్రంధకర్తలను నపండితులని జాటుటలేదా? చాటుచున్నది. ఇదియ కాదు. పైగ్రంధకర్తల యపాండిత్యమును జాటించుట కందువిచా శబ్దమొకటి ప్రయోగింపఁబడియున్నది. అది యానామములోని ఇత శబ్దములతో నెట్లన్వయించునో ఇఁకనించుక విమర్శించిచూచుకొందమ

"వైశ్యవేదోక్త క్రియావిచారవ్యవస్థ" ఇదిగ్రంధకర్తలు తమ గ్రంధముఖమునందిడికొన్న నామము. ఇందుఁజివరనున్న వ్యవస్థయనుశబ్దమును గైకొని దానికి లోపలనున్న పదములతో గ్రమముగ నన్వయించుటకు యత్నించుదము. యత్నించినయెడ గ్రంధకర్తల పసబయటబడియెడిని. వ్యవస్థయన శాస్త్రని రూపిత నియమమని యర్థము. ఈవ్యవస్థా శబ్దమునకు వెనుకనున్నది విచారశబ్దము. అపుడు శాస్త్ర నిరూపిత నియమమైన దేదియన? విచారమని ప్రత్యుత్తరము చెప్పక తప్పదుకదా? విచారమన? ఆలోచనము. లేకసంతాపము ననిరెండర్థములు చెప్పనగును. అపుడిందేయర్థము ప్రకృతము గ్రహింపదగినదను ప్రశ్నకలుగకమానదుకదా? వానియర్థములను విచారించినంగా నియాప్రశ్నకు సమాధానము, చెప్పుట కవకాశముకలుగనేరదు.

ఆలోచనమన విమర్శనమనియు, సంతాపమన దుఃఖమనియు వానియర్థములు. అపుడు విచారవ్యవస్థయన? గ్రంధకర్తలు విమర్శనమునో? లేక తమదుఃఖమునో శాస్త్రనిరూపితనియమ మగుచున్నదని యర్థము చెప్పవలసివచ్చునుగదా? అటులేనివిమర్శన మిట్లుండవలెనని గ్రంథకర్తలు వైశ్యవేదోక్త క్రియావిచారవ్యవస్థయను గ్రంథమునందుఁ జర్చించి యుండవలెను. అదిలేదు. కావ విచారశబ్దమును బ్రకృతము విమర్శనార్థమందు గ్రహింపరాదని మనము గ్రహింపగలిగితిమి. ఇకవిచారశబ్దమునకు దుఃఖమను రెండవయర్థమును జెప్పక తప్పదని తేలినది. అపుడు గ్రంధకర్తలదుఃఖము శాస్త్రనిరూపిత నియమమైనదని చెప్పవలసి వచ్చినదికదా? ఇట్లడిగిన దేనినిజూచి నపుడీగ్రంధకర్తలకు దుఃఖము సంభవించినదను ప్రశ్నజనింపకపోదు. ఆప్రశ్నకు వైశ్యులొనర్చెడి వేదోక్తక్రియలను జూచినపుడు గ్రంధకర్తలకుఁ గలిగిన దుఃఖమును వారే శాస్త్రములచే నిరూపించుకొని యున్నారను సమాధానమును, వారుపెట్టుకొన్న వైశ్యవేదోక్త క్రియావిచారవ్యవస్థయను గ్రంధనామమే మనకు జెప్పక చెప్పుచున్నది.

ఇట్లనిన నాగ్రంథనామములోనుండి విచారశబ్దమును దూరీకరించరాదా యందురా? అదిదూరీకరింతుమేని వైశ్యవేదోక్త క్రియావ్యవస్థయను పేరుమాత్రమే మిగులునుగదా? మిగులును ఇదిమాకు బరమసమ్మతమగు కార్యమే. సంశయములేదు. కానియీ నామమునకు గ్రంథస్థవిషయము బద్ధవిరోధియైయున్నది. అదేమన? పైనామకరణ మంగీకరించిన తోడనే గ్రంథకర్తలు పరిక్రుతము కలియుగము నక్షత్రియయవైశ్యులుకలరనియు వారికి వేదోక్త కర్మాధికారము కలదనియు నంగీకరించి యట్లు గ్రంథముమార్చి వ్రాయవలసినవారు కాక తప్పదుకదా? తప్పదు. అపుడు గ్రంథారంభములోని "ఇహాఖలు" మొదలుకొని గ్రంథాంతమునందుఁగల "శ్రీరస్తు" అను పదమువరకునున్న ముప్పదిరెండు పుటల గ్రంథమునకును నగ్నిసంస్కారముగావించి నూతనగ్రంథమును రచించక తప్పదని గ్రంథకర్తలామోదించక తప్పదు. ఈచెప్పినదానింబట్టి చూడగ్రంథస్థవిషయమునకు గ్రంథనామమును, గ్రంథనామమునకు గ్రంథస్థవిషయమును బద్ధవిరుద్ధములుగా నున్నవని యిదివరకు మేము చెప్పినవిషయము రీదతుల్యమైనదని తేలినదికదా?

ఇట్లడిగిన గ్రంథనామమున కనుకూలముగ గ్రంథస్థ విషయమును మార్చవలయునా? లేకగ్రంథస్థవిషయమున కనుకూలముగ మార్చవలయునా? అనిబుద్ధిమంతులు ప్రశ్నింపక మానరు. సమాధానమువినుడు. మనము దిద్దిన "వైశ్యవేదోక్త క్రియావ్యవస్థ" యను నామమున కనుకూలముగ గ్రంథస్థ విషయమును మార్చుటకు లోకక్షేమము గోరు ప్రతిబ్రాహ్మణపండితులును ప్రయత్నింపవలెఁగాని గ్రంథస్థవిషయమున కనుకూలముగ "క్షత్రియ వైశ్యంమన్య వేదోక్త క్రియాఖండన మను పేరు పెట్టుటకుయత్నింపరాదు. యత్నించినయెడ నదిశాస్త్రలోక దూరమును విమర్శజ్ఞాన విహీనమును నగు దుష్కార్యమగు ననివివేకవంతులు వెల్లడింపకదీరదు. ఇట్లనిన మీరుచెప్పినదానింబట్టి చూడవైశ్యవేదోక్త క్రియావిచారవ్యవస్థను రచించినవారు శాస్త్రలోక విమర్శజ్ఞాన విహీనులగు నపండితులని స్పష్టమగుచున్నదికదా? అట్టియు

పండితులు రచించినగ్రంథమునకు మీరొకవిలువ నిచ్చిదానిని విమర్శిం
పఁగడంగుటకుఁ గారణమేమని మమ్ముఁ బ్రశ్నింతురేమో? సమాధాన
ము వినుఁడు.

వైశ్యవేదోక్త క్రియావిచారవ్యవస్థను రచించినవారు శాస్త్ర
లోక విమర్శజ్ఞాన విహీనులగు నపండితులగుటయేకాదు. తమపేరుపె
ట్టుకొని ప్రకటింపఁజాలని యనామధేయవిద్వాంసులుకూడ నైయున్నా
రు. కానవారిని బ్రతివాదులనుగా నిడుకొని మేమీవిమర్శన కార్యము
నందు బ్రవర్తించుటపనిలేనివాని పని యని జెప్పవచ్చును. కాన మేము
గ్రంథకర్తలను జూచి యీవిమర్శన కార్యమునందుఁ బ్రవర్తించుటకు
గడంగియుండలేదు. ఇఁకేమన నాగ్రంథముజనించిన జన్మస్థానమును బట్టి
ప్రవర్తించుచున్నారము. ఇట్లనిన నాస్థానమేదియని మాపాఠకులు ప్ర
శ్నింపకపోరు. ఈప్రశ్నకు సమాధానమును మేముచెప్పుటకన్న గ్రంథ
ముఖపత్రముచేఁ బ్రత్యుత్తరము జెప్పించుటయే యుత్తమమని యావా
క్యమును మీయెదుట నిడుచున్నవారము. ఇటుకనుఁడు.

"శ్రీమత్పరమహంస పరివ్రాజ కాచార్యవర్యేతి సమస్త
బిరుదాంకిత జగద్గురు శ్రీశృంగేరి మహాసంస్థానె శ్రుతిస్మృతి పురాణ
కల్పసూత్ర సదాచారాది పరిశీలనా పురస్సరం ప్రకటీకృతా వైశ్య
వేదోక్త క్రియావిచారవ్యవస్థా"

అనువాక్యముఖమున దాను శ్రీశృంగేరీజగద్గురు సంస్థానము
నందు జన్మించియున్నదానని యాగ్రంథమే చెప్పియున్నది. కాన
దానిజన్మస్థానగౌరవమును బట్టియే మేమీవిమర్శన కార్యమునందుఁ
బ్రవర్తించియున్నారమని మాపాఠకులు తలంతురుగాత. ఇట్లని వైశ్య
వేదోక్త క్రియావిచార గ్రంథకర్తలు శృంగేరీ పీఠసంస్థానాధిపతులై
యుండరా? లేకసంయాస్థానమునఁగల యాస్థానపండితులై యుందు
రా? అను సంశయము లోకమును బాధింపకమానదు. కాని దానిని బో
కార్చునుపాయ మేమందురా? వినుఁడు వినిపించెదము. ఈగ్రంథము
జన్మించి యిప్పటికి ముప్పదియేండ్లు కావచ్చినది. అప్పుడు పీఠసంస్థాన
మునందాస్థాన పండితులుగానున్నవారిలో స్వార్థపరులగు పండితమ

న్యు లెవ్వరో యీడు రవస్థాత్మకమగు తమవిచార వ్యవస్థను గ్రంథ
స్థము చేసుకొన్నారని పండితులు నిశ్చయింపవలెఁగాని సంస్థానాధీ
శ్వరులగు జగద్గురులు వ్యవస్థచేసియున్నారని మాత్రము నిశ్చయింప
రాదు. అదేమన?

భారతలోక దురవస్థను బెంపొందించు నీవిచారవ్యవస్థగ్రంథస్థ
మైనకాలమునందు శ్రీశృంగేరీ పీఠసంస్థానమును బరిపాలించుచున్న
శ్రీపీఠాధీశ్వరులు పండితులును నిష్కళంక చరిత్రులును నైయున్న
ట్లు వినియున్నారము. అట్టివిద్వత్పర మహంస పరివ్రాజ కాచార్య
వర్యులీమహాదోషదూషిత గ్రంథమును రచించిపవిత్రములగు క్షత్రి
యవైశ్యసంఘముల కపవిత్రతను ఘటించుటకు యత్నింతురని వివేక
ముకలవారు తలంతురా? తలంతురని తలంపజాలము. కానినిష్కళం
కమగు పీఠసంస్థానమును సకళంక సంస్థానమునుగా జేయుటకు జేసిన
స్వార్థపరపండిత ప్రకాండులు రచించిన గ్రంథమని మాత్రము చెప్పు
టకు సందేహించవలసిన యవసరములేదు, కానివారు తమపేరుపెట్టు
కొనిరచించినని కారణమున నకర్తృకమగుటచే తొలుత దానిని విమర్శిం
పనెంచియు బిదప విసర్జించియుంటిమి.

ఇట్లుండ విధిప్రేరితులై మల్లాది రామకృష్ణసోమయాజులు
గారు పుష్పగిరి పీఠసంస్థాన విద్వాంసులమనుచు గుంటూరుశివాల
యమునఁజేరి మూడుదినము లుపన్యాసములుచేసి యీది వైశ్యవేదో
క్తక్రియావిచార వ్యవస్థయను పుస్తకముసత్యమును ధర్మమును జెప్పి
యున్నదని చెప్పియున్నారు. అపుడు మాకు విమర్శన కృతికిఁదగిన కప్పి
నాయకులులభించిరిగదా, యని సంతసించి విమర్శనమున కుపక్రమిం
పఁబోయి వాయువులోఁగలిసిపోయిన వారియుపన్యాస విషయములను
విమర్శింపఁగనే కనివెరగంది సోమయాజిగారు తామావిషయములను
జెప్పలేదని చెప్పితప్పించుకొన యత్నింతురేమో యనుసంశయమున
నీవిషయమైన వారి వ్రాతమునచేత నెప్పుడుచిక్కునాయని నిరీక్షించుచుం
డమాయదృష్టవశమున సోమయాజిగారే స్వంతపావన హస్తములతో
డనే వారిదాసాను దాసులగు జేనపాటి పట్టాభి రామశాస్త్రిగారికు

భినవ సరస్వతీ పత్రికయందే "యథార్థకథనము"ను శీర్షికక్రిందనే గుం
టూరులోఁ దాము వైశ్యవేదోక్త క్రియావిచారవ్యవస్థను సద్గ్రంథము
ని సమర్థించినవిధమును సంగ్రహించి వ్రాసిన సోమయాజిగారి వ్రా
తయాచేతఁజిక్కుట తటస్థించినది. కానఁబ్రధానమల్లని బర్హణన్యాయ
ము ననుసరించి సోమయాజిగారి వ్యవస్థా సమర్థన ముఖమర్దనమున
కుపక్రమించుచున్నవారము కనుఁడు.

(వ్యవస్థాగ్రంథ సమర్థన ముఖమర్దనము)

వ్యవస్థాగ్రంథకర్తలు తమగ్రంథముఖపత్రమునందె "శ్రీమ
త్పరమ హంసపరి వ్రాజకాచార్యవర్యేతి సమస్తబిరుదాంకిత జగద్గు
రు" అనువాక్యము నొకదానిని వ్రాసియున్నారు. ఇదిదోషదూషిత
మైయున్నది. మా॥ రామకృష్ణ సోమయాజిగారు దానినెట్లుసమర్థింతురో
చూతము పండితులు "ఆచార్యవర్యేత్యాద్యనేక బిరుదాంకితు" లని
వ్రాయవలెఁగాని, ఆచార్యవర్యేతి సమస్తబిరుదాంకితులని వ్రాయ
రాదు. సమస్తమనసర్వమనియర్థము ఇపుడుసర్వబిరుదాంకితుఁడనునర్థ
మునరిపడినదా? ఆచార్యవర్యేతియన నాచార్యవర్యుఁ డనెడియనియర్థ
ము. ఆచార్యవర్యుఁడనే సమస్త (అన్ని) బిరుదములు కలవాఁడని బాలు
డుకూడ వాడఁజాలఁడని చాటిచెప్పనగును ఇఁకఁబండితులగు గ్రంథక
ర్తలెట్లువాడిరో! దానిని సమర్థించుటకు మామల్లాది విద్వత్సోమ
యాజిగారే యెత్తువేయుదురో! చూడఁదలఁచియున్నది. దానికేమి తెగి
నంతధనమిచ్చువారుండిన యెడ మా॥సోమయాజిగారు దోషములను
గుణములనుగాను గుణములను దోషములనుగాను సమర్థించుటకు
సర్వసమర్థులైయున్నారు. కావుననే కదా పుష్పగిరిపీఠముకడ నెలకు
నూరురూప్యములు వేతనమేర్పరుచుకొని యింతవరకు సన్న్యాసాశ్ర
మమును దీసికొని యెరుంగని గింజుపల్లిచక్రయ్యగారిని పీఠాధిపతుల
గు పరమహంస పరివ్రాజకాచార్య వర్యులని పేరుపెట్టితీసికొని పో
యి గుంటూరులో వైశ్యులక్షనమును గొల్లకొట్టుటకు యత్నించి
యాపలకడ్డుగ కుశాగ్రబుద్ధులగు గుంటూరు వైశ్యులు ముందిడిన

వైశ్యవేదోక్తక్రియావిచారవ్యవస్థను సమర్థించుటకై మూడుదినములు మూడేసిగంటల కాలము నాట్యముగావించి చిత్రవిచిత్రము లగుపయ భినయములను బట్టియున్నారు.

కానివానికి మీాహాపడి వైశ్యులుమాత్రము ధనమును బోగొట్టుకొన్నవారు కారని వ్రాయుటకొకరిద్దరు వైశ్యులుకావించిన బిచ్చ లక్షపడుపడుచున్నవి. వానితో మనకేమి? మనసోమయాజిగారు కావించిన వైశ్యవేదోక్తక్రియావిచార వ్యవస్థామండనమును ఖండించుట మనపని. మనపనిమనము తీర్చుకొందమురండు.

---

# కలిచక్రవర్తి పట్టాభిషేకము.

---

(ప్రథమ ప్రకరణము)

కలిచక్రవర్తులకుఁ బట్టాభిషేకముగావించుటకై సమావేశము గావించిన మంత్రిసామంత గురుపురోహిత పండిత ప్రముఖప్రజామండలి నిండుపేరోలగమునఁ గూర్చుండియున్న తమకలిచక్రవర్తులకుఁ బ్రధానమంత్రిముఖము నదిగువఁ గన్పరచిన స్వాగతపత్రమును సమర్పించి యున్నవారు.

(స్వాగత పత్రసమర్పణము)

కలిచక్రవర్తి! అవధరింపుము. దేవరపట్టాభిషేకమును గన్నుల కరవు తీరగాంచు మహాభాగ్యమునేగాక దేవరవారికిఁ జిన్నస్వాగత పత్రమును సమర్పించుకొను పరమపదమును గూడ బ్రసాదించిన పరమకరుణాళుఁడగు పరమేశ్వరునకును బ్రభుచక్రమునకును బ్రజలకును ననేక నతులొనర్చి ప్రకృతమునకు వచ్చుచున్నవాఁడను.

పరమేశ్వరుఁడు నరులకు నయన గోచరుఁడు కానేరఁడనియుఁ గాకున్నను నామసామమహిని నవ్యాజాను రాగముతో సేవించిన యెడ సేవించిన వారికై హికాముష్మిక సుఖములను బ్రసాదించుననీ

యు వచించిన శాస్త్రములే "నావిష్ణుః పృథివీపతిః" అనువచనముఖ
మున విష్ణువుకాని వాడు పృథివీ పతికానేరడని తెలిపియున్నవి. కాన
దీనదేవరవారు దేవదేవులైయున్నవారని ప్రభుచక్రమును బ్రజాప్రీతి
నిధులును బ్రజలును గ్రహించి చక్రవర్తుల చరణ సరసిజములను
నచంచల భక్తితోఁ సేవించి కృతకృత్యులగుటకుఁ గృతనిశ్చయులై కర్త
వ్యమును దెలుపు నేలినవారి శాసనములను వీనుల విందుగ వినుట కవ
హితులైయున్నవారని విన్నవించి యింతట విరమించుచున్నవాడను.

(కలిచక్రవర్తి శాసన శ్రవణము)

మంత్రులు సామంతులు గురులు పురోహితులు పండితులు
లోనగు మాప్రజల త్యంత రాజభక్తి పూరితస్వాంతములతో సమ
ర్పించుడనిన స్వాగతపత్రమును బ్రధానమంత్రి పుంగవులు వినిపింప
విని మారాజ్యము నెడలను మాయెడలను మీకున్న యవ్యాజాను
రాగముతోఁగూడిన రాజభక్తి కత్యంతసంతోషాక్రాంతస్వాంతులమై
మీరభిలషించిన శాసనములను వినుపింప నిశ్చయించి యందులకు
ముందుమారాజ్య మెట్టిదో యదియెట్లువచ్చినదో మారాచకార్యము
లెవ్వియో యవి నిర్వహించు విధము లెట్టివో మాకుఁ బరిపంథిరాజ్య
ములెవ్వియో వానిని వశీకృతము గావించుకొనుపథములెవ్వియోయిం
చుక వివరించుచున్నవారము వినుడు.

మారాజ్యముమాకుఁబరంపరా ప్రాప్తమయిన పైతృకముకాని
మేము నూతనముగ సంపాదించినదికాదు. పరమేశ్వరుడు పరమేష్ఠిని
సృజించి యతనికిఁ దనహృదయమునందు సిద్ధములైయున్న ఋగ్యజు
స్సామముల నెడి వేదములను బ్రసాదించియవినుడివిన వడువునఁ బ్రపం
చమును సృజించవలసినదని విధించెను. ఆవిధిననుసరించి విరించి ప్ర
పంచమును సృజించియున్నవాడు. ఆసృజించఁ బడిన ప్రపంచములో
నిదేమనము వసించు భూమండలమైయున్నది. ఆభూమండలమును మన
పూర్వపండితులు నవఖండములుగను నిపుడు విదేశీయ పండితులయి
దుఖండములుగను విభజించియున్నవారు ఆవిభజనముతో మనకేమికా
ర్యము? మనరాజ్యము భూమండలమునగల సకలఖండములందును

తెంపి తెరపిలేకుండ భూలోకమును నాకసముపలె వ్యాపించియున్నది.

ఇట్లుభూమండలములోని సకలఖండములందును వ్యాప్తమై యున్న మారాజ్యమును దొలుత పితామహుడు మాముత్తాతలగు కృతయుగాధిపులకు నొసంగెను. వారు వేదాను శాసనమునను సరించి 17 లక్షల 28 వేల వత్సరములు నిష్కంటకముగ రాజ్యము గావించిపిదప మాతాతగారగు త్రేతాయుగాధిపులకు నొసంగివారు వైదొలగిరి. అనంతరము మాతాతగారగు త్రేతగారు 12 లక్షల 96 వేల సంవత్సరములు నిరాటంకముగ రాజ్యము పరిపాలించియటుపై నారాజ్యమును మాతండ్రులగు ద్వాపర యుగాధిపుల కొసంగియున్నవారు. వారు నవక్రివిక్రమముతో భూచక్రమును సక్రమమున 8 లక్షల 64 వేల సంవత్సరములు నిరాఘాటముగః బరిపాలించి తరువాత మాకొసంగియున్నవారు. మేమును 4 లక్షల 32 వేల సంవత్సరములు మధ్యమలోకమును బరిపాలించవలసియున్న వారము అందిపుడు 5 వేల 28 సంవత్సరములు మాత్రమే గడచని యున్నవి. ఇట్లుపితృపితామహప్రపితా మహాపరి పాలితమై శాస్త్రోక్త మార్గమున మాకు సంక్రమించి యున్నరాజ్యమునకే మమ్మ భరతఖండవాసులరగు మీరుచక్రవర్తులను గావించి పట్టాభిషేకము చేసియున్నవారు ఈభరత ఖండమే మాకు ముఖ్యస్థానమైయున్నది.

ఈవర్తమానమును వినఁగనే బ్రిటీషుచక్రవర్తులు లికిపడి యిదేమి భరతఖండమునకు మేముచక్రవర్తులమైయుండ నీకలిదుండగి బయలు వెడలి భయములేక తనకిటరాజ్యమున్న దనుచు దానికి దాను చక్రవర్తినియుఁ దనకుఁ భారతప్రజలు పట్టాభిషేకముగావించిరని యు వదరుచున్నవాడు. అసహాయోద్యమమడుగంటి దేశము శాంతస్థితికివచ్చినదికదాయని తలంపమరల నితడొకడు తంపితెచ్చిపెట్టదలంచిన టులున్నది. కాన "అలస్యమమృతం విషమ్మ"ను నార్యోక్తి మీరువినియున్నదేకదా? వేవేగ యుద్ధమునకు సన్నద్ధులు కండనితమ సేనానాయకులను పురికొలుపుచు రేమో! అంతపని జరుగకముందే మనప్రభుత్వముయొక్క యధార్థస్థితిని దెలిపివారికి సందేహము జనించకుండః

జేయుదను అదెట్లన మారాజ్యము మర్త్యలోకమునంగల మానవుల
జాతిమతములను బరిపాలించుటయెకాని భూపరిపాలనము గావించుట
కాదు. అదియెవ్వరు పరిపాలించినను మాకుసమ్మతమే కానియ సమ్మ
తిలేదు. కాన మాయెడ బ్రిటీషు చక్రవర్తులు శత్రుభావమును జెంద
వలసిన యవసరములేదు.

ఇంతియె కాదు. వారుమాతో మైత్రిపాటించి ప్రవర్తించవలసి
నవారై యున్నవారు. ఇట్లనుటకుఁ బ్రబల కారణములు కొన్నికలవు.
అవేవన? భారతీయులు వేదోక్త ధర్మముల ననుష్ఠించుచున్నంత కాల
ము వారిరాజ్యమును బరరాజులు నార్జించుట దైవమునకె యెరుక
యదియట్లుంచి భారతరాజ్యమును జేరిపారజూచుటకుఁగూడ వారుజా
లకుండిరి. ఇట్లుండ భరతఖండము మాకుస్వాధీనమయ్యెను.

అది మొదలుకొని దినదినము ధర్మము క్షీణింప సాగియుండెను
అందుచే వారిరాజ్యము పరహస్తగతమై క్రమక్రమముగా బ్రిటీషు
చక్రవర్తుల హస్తగతమయియున్నది. వారిమిషనులును నీవిషయము
ననే విశేషశ్రమచేయుచున్నవి. కాని విదేశీయులగు మిషనువారు
మాప్రజలు కావించినంత తేలికగ భారతధర్మనాశనము గావించ జాల
రు కాన మాచక్రవర్తిత్వము బ్రిటీషుచక్రవర్తుల ప్రభుత్వమునకుఁ
దోడ్పడి యది భరతఖండమున నాటుకొని స్థిరపడునటుల జేయునదే
కాని యన్యము కానేరదని బ్రిటీషు ప్రభుత్వము గ్రహించునుగాత.

శ్రుతిధర్మ క్షీణత రాజ్యక్షీణతకుఁ గారణమగునని మేముచె
ప్పిన వినిన మాపాఠకులు కొందరిది సత్యమాయనిసంశయము చెందక
పోరు. కానవారిసంశయమును నివారించుటకు మాచరిత్రనే యుదా
హరణముగ జూపించుచున్నవారము. ఇటుకనుడు మాముత్తాత గారగు
కృతయుగాధిపుల పరిపాలన కాలమున "యథారాజాతథాప్రజాః"
అనునార్యోక్తి ననుసరించిరా జధర్మవర్తనుడయినఁబ్రజ లధర్మవర్త
నులగుదురు. రాజుధర్మవర్తనుడయినఁ బ్రజలును ధర్మవర్తనులయ్యెద
రు. కాన ధర్మాధర్మవర్తనమునకు రాజుకారణమని యెరింగియాయనఁ
దానుయథావిధిగధర్మముల ననుష్ఠించి తనప్రజలను ధర్మముతో బ్రవ

ర్తింపఁ జేసెను దానంజేసి వారుధర్మ వృషభమును నాలుగుపాదముల నడిపించిరను యశస్సును గడించుటయేగాక 17 లక్షల 28 వేల సంవత్సరములు తనివిదీరరాజ్యము చేసియజాతశత్రులైసుఖించియున్నవారు.

వారిచ్చిన రాజ్యమునే గైకొని యప్పటి ప్రజలను వారిపుత్రులనే పరిపాలించినను మాతాతగారగు త్రేతగారొక పాదముధర్మమునువదలుటచే వారిప్రజలును ననుష్ఠించవలసిన ధర్మములలో నాలవవంతు ధర్మములను వదలి వర్తింప సాగిరి అందుచే వారికాలమున నాలుగు పాదములతో నడువవలసిన ధర్మవృషము మూఁడుపాదములతోడనే నడువవలసిన దయ్యెను. దానంజేసి మాతాతగారి రాజ్యకాల పరిమితిలో నాలవవంతు తగ్గిమూఁడువంతులు (12 లక్షల 96 వేల సంవత్సరములు మాత్రమే) రాజ్యము గావించవలసిన వారైరి.

ఆ త్రేతగారి పుత్రులగు మాతండ్రిగారు (ద్వాపర యుగాధిపులు) రెండుపాదముల ధర్మమునుపసర్జించిరి వారినిజూచి వారిప్రజలును రెండుపాదముల ధర్మమునకుఁ దిలోదకములనిచ్చి యున్నవారు అందుచే ధర్మవృష పాదములు రెండగ బీకికొని పోవ నదిరెండుపాదములతో గుప్పిగంతులువేయ సాగెను. అందుచే మాతండ్రిగారి రాజ్యకాల పరిమితిసగము క్షీణించవలసినదయ్యెను. అనఁగ 8 లక్షల 64 వేల వత్సరములకే రాజ్యపదచ్యుతులు కావలసినవారైరి.

ఇఁకమాసంగతి యడుగవలసినదేమున్నది? "నానాటికిఁ దీసికట్టు నాగంభట్లూ" అనినట్లు మేముమూఁడుపాదముల ధర్మమును ముక్కలుచేసితిమి. మేమువేలుబెట్టినచోట మాప్రజలు నాలుకబెట్టుటకు వెనుదీయకున్నవారు. వారు సర్వధర్మపరిత్యాగముచేసి స్వేచ్ఛస్వేచ్ఛ స్వాతంత్ర్యము, అని కేకలు వేయుచు నేదిలభించిన దానిననుభవించుటను ముందుకడుగిడుచున్నవారు వారికి విధినిషేధములు తృణప్రాయములై యున్నవి. అందుచేనారాజ్యకాలపరిమితి చిక్కిచిక్కి 4 లక్షుల 32 వేల వత్సరములకు క్షీణించినదయ్యెను ఇందుచే ధర్మవృషముదుర్దశ నేమని వర్ణింపను దరముగాకున్నది. మూడుపాదములు బిగఁబట్టుకొని పోవనొక్క పాదముతో నడువలేక యడితన్నుకొనుచున్న

పుడు చూచిన నాగుండెలే నీరగుచున్నవి. ఇఁక నితరులస్థితి యెట్లుం డునో యడుగ వలెనా?

ఇట్లుండుటచేతనే మాషగవారిలోని పండితులు మాముత్తాత గారి రాజ్యలక్షణము మారాజ్యలక్షణముకు గ్రిందిరీతి వర్ణించియు న్నవారు. అదేమన?

శ్లో॥ ధర్మోఽతిగ్రసతేధర్మం। తతఃకృతమభూద్యుగం।
అధర్మోఽగ్రసతేధర్మం। తతస్తిష్యః ప్రజాయతే।

ధర్మ మధర్మమునెపుడుమ్రింగునో యది కృతయుగమగును అధర్మము ధర్మముకు మ్రింగినపుడు కలిపుట్టుచున్నాడని పైశ్లోకార్థ ము. ఈశ్లోకార్థమును బట్టిచూడ మాకువేదోక్త ధర్మములునువాని ననుష్ఠించు ధర్మరతులుకు, పరమశత్రువులగుదురని తేటపడు చున్నదికదా?

ఇఁక మాశత్రువులనుగూర్చి యించుక వినిపించవలసియున్నది. భరతఖండమునఁ దక్కతక్కిన ఖండములందెక్కడను మాకుఁబగవా రులేరు. వారందరును వేదధర్మముల కాగర్భద్వేషులై జనించియున్న వారే. కానవారు మాధర్మములకు యథావిధిగ ననుష్ఠించుచున్నవారు. వర్ణాశ్రమ ధర్మములను మతధర్మములను బట్టుకొని వ్రేలాడువారొ క్క భరత ఖండమున మాత్రమేగలరు కాని యితరఖండములందు లేరు. అందుచేనచటి మారాజ్యము నిష్కంటకముగ సాగుచున్నది. ఇటనట్లుకాదు. మాషగవారికిది జన్మభూమి. ఈభూమికిఁ గర్మభూమి యను విశేషకీర్తికలదు. కర్మలన వేదోక్త ధర్మములేకాని వేరుకావు. "అచటఁ బుట్టిన చిగురు కొమ్మయినఁ జేవ" యనినట్లు భరతఖండమున జనించిన బ్రాహ్మణాది చండాలాంత జాతీయులలో మాబాధలకు బా ధలకు లోఁబడిన వారెవ్వరో కొందరు దక్కతక్కినవారందరును స్వ జాతి మతధర్మముల యెడ నధికభక్తికలవారై వర్తించుచుందురు. స్వధ ర్మరక్షణమునకై ప్రాణములను గూడ దృణప్రాయముగఁ విడు వజూతురు.

అందుముఖ్యులు బ్రాహ్మణ క్షత్రియ వైశ్యశూద్రులని తెలియవలెను. వారినిదలచుకొన్న మాగుండెలు బ్రద్దలగుచుండును. వారు మా రాజ్యమును దలక్రిందు జేయుటకై చేసినసాహసకార్యముల కుమేరయున్నదా? ఈవిషయమై మాకున్నంత యనుభవము మీకుండ నేరదు. ఏలయన? యుగాధిపులమగు మేమునలుపురమును గల్పాదియందే సృజింపఁబడితిమి కల్పాంతమువరకును జీవించియుందుము. మీవలె నూరేండ్లకు జచ్చువారముకాము. దానంజేసి మా రాజ్యము తిరుగుచుండును. అనఁగ మారాజ్యకాలము పూర్తియగుడువరలఁ గృతయుగాధిపులేరాజ్యమునకు వత్తురు కానిమరియొకరురారు వారితరువాత త్రేతయు త్రేత తర్వాత ద్వాపరయుగాధిపులును దరువాత మేమును రాజ్యము చేయుచుందుము ఈశ్వేతవరాహకల్పమువచ్చిన తరువాత నాకిపుడు 4 వందల 54 వ పర్యాయము రాజ్యము వచ్చియున్నది. ఇట్లైమాతండ్రితాత ముత్తాతలుకూడ రాజ్యముచేసి యున్నారు.

ఈ 4 వందల 54 వ మాపట్టాభిషేక కాలమునకు రాజభక్తులగు నెనమండుగురు మంత్రులును నిప్పటికి ముగ్గురు జగద్గురువులును నలువురు పండితులును బదుగురు పురోహితులును మాసభ నలంకరించియున్నవారు. సామంతరాజుల సంఖ్య దినదినాభివృద్ధి నందుచుండుటచే లెక్కకు జిక్కకున్నది. కానవారినామములను గ్రమముగ సంవాదకాలమునఁ బేర్కొనఁగలము. ప్రకృతముమంత్రులయు గురువులయు బండితులయు నామధేయములను మాత్రము వినిపించెదము వినుడు. ధర్మనిర్మూలన దక్షములగు మతములనే మాకుమంత్రులనుగా నియమించుకొని యున్నారము.

(కలిమతమంత్రులు)

1 బ్రహ్మసమాజము, (2) ఆర్యసమాజము, (3) దివ్యజ్ఞానసమాజము, (4) హిందూమతము, (5) బ్రాహ్మణేతరమతము, (6) గాంధిమతము, (7) కాంగ్రెసుమతము, (8) కౌన్సిలుమతము. ఈమెనమండ్రుగురు మంత్రులను మైత్రితో మారాచకార్యములను జక్క

పెట్టుచుండవలయును. మామంత్రులతో మంతనములు చేయుచు జగద్గురువులు వర్తించవలసియున్నది. వారిపేర్లు వినిపింతుము వినుడు.

(కలిగురువులు)

(1) "పుష్పగిరిపీఠము నాక్రమించుకొనియున్న గింజుపల్లి చక్రియ్యగారు. (2) హంపిపీఠము నధిష్ఠించియున్న బాలయతులు (3) దివ్యజ్ఞాన సమాజపీఠమాక్రమించుకొనియున్న జిడ్డుకృష్ణమూర్తి గారు. ఇప్పటికి మాయెడలను మారాజ్యము నెడలను సానుభూతితో సంచరించుచున్నవారు పై మూవురు గురువులు మాత్రమే యని తెలియవలెను. ఇంక పండితులను వినిపించెదము వినుడు.

(కలిసంస్థాన పండితులు)

1. బ్రి॥ మల్లాది రామకృష్ణ విద్వచ్ఛయనులవారు 2. బ్రి॥ కావ్యకంఠ గణపతిశాస్త్రి మహామునిగారు. 3. బ్రి॥ బొమ్మకంటి నరసింహశాస్త్రిగారు. 4. గొల్లపూడి లక్ష్మణశాస్త్రి సోమయాజి గారు. అష్టదిగ్గజములకును నాలుగు దిగ్గజములుమాత్రమే మాకు లభించియున్నవారు. మరినలువురు పండితులను సంపాదించుడని పై పండితులను వేడుకొనియున్నవారము. ఇంక కర్తవ్యమును వినిపింతుము వినుడు.

(కలి కర్తవ్యము)

కలిచక్రవర్తులమగు మాకేయది కర్తవ్యమయియుండునో యయ్యదియే మీకును కర్తవ్యమైయుండును. మాకు కర్తవ్యము లు శ్రుతిధర్మనాశనమును శ్రుతివిరుద్ధ ధర్మాచరణమునునైయున్నవి. ఇవియే మీకును కర్తవ్యములయియున్నవి. విశేషములను ముందు దెలుపుచుందుము.



చండాలాస్పృశ్యతా నివారణాత్మక

# గాంధిమత ఖండనము

(ప్రథమప్రకరణము)

గీ॥ శిష్టజనులను గావంగ దుష్టనరుల।
సంహరింపంగ ధర్మసంస్థాపనార్థ।
మిలను జనియింతు యుగయుగంబులనటంచు।
బ్రీతినఁ దెలిపిన భగవంతుఁబ్రస్తుతింతు॥

అస్పృశ్యతను దీసివేసి చండాలుర (మాలమాదిగెలను) దేవాలయములు సత్రములు రేవులు బావులు పై జాతుల గృహములులోనగు వానిలోనికి రానీయవలసినది. రానీయనిచో మీకుస్వరాజ్యము రానేరదను గాంధిమతమును ఖండించునదికాన దీనికి "జండాలాస్పృశ్యతానివారణాత్మక గాంధిమతఖండనమ" నునన్వర్థనామ కరణముగా పించి యున్నారము. మనము గాంధిమతమును ఖండించుటకు ముందు మతమననేమో యనిమనభరతఖండమున నెన్ని తెగలుగ నున్నదో వానిలో మనగాంధిగారి మతముచేరునో చేరదో యించుకవిచారించ వలసియున్నది.

## మ త ము .

మతమన నిష్టమనియర్థము. అభ్యుదయని శ్శ్రేయసాధనమైన యిష్టము మతమనఁబడును. అభ్యుదయమన వేదోక్త కర్మానుష్ఠానము వలనఁ గలిగెడు నైహికసుఖాభివృద్ధియనియు నిశ్శ్రేయస్సన వేదాంతజ్ఞానము వలన లభించెడి యాముష్మిక (మోక్ష) సుఖాతిశయమనియు దత్త్వవిదులు తలంచుచున్నవారు. కాన నైహికాముష్మిక సుఖముల నపేక్షించు మానవులు శ్రుతిమతము నవలంబింపక తప్పదని యీదానివలన ధృవపడుచున్నది. శ్రుతివిభాగమననుసరించి శ్రుతిమతము రెండువిధములైయుండెను. పూర్వభాగమనియు నుత్తర భాగమనియు శ్రుతి రెండుభాగములుగ విభాగింపఁబడియున్నది. పూర్వభాగమునకుఁ బూర్వమీమాంసయనియుఁ గర్మమతమనియు నుత్తరభాగ

మునకు నుత్తర మీమాంసయనియు బ్రహ్మమతమనియు నామాంతరములు కలవు. వీనినే శ్రుతిమతములని పండితులు వ్యవహరించుచున్నవారు.

పై శ్రుతిమతములలో గర్మమతమును బూర్వమీమాంస యను పేరుతో జైమిని మహర్షియు బ్రహ్మమతమును నుత్తరమీమాంసయను పేరుతో వ్యాసమహర్షియు సూత్రరూపమున స్మరించియున్నవారు. అందుచే గర్మమతమునకు జైమినిమతమనియు బ్రహ్మమతమునకు వ్యాసమతమనియు మరియొక వ్యవహారముగను పడుచున్నది. కాని యీస్మృతిమతములు రెండును శ్రుతిమూలకములగుటచే శ్రుతితో దుల్యప్రమాణములైయున్నవి. కాని యీకర్మబ్రహ్మమతములలో బ్రహ్మమతమునందు మాత్రమే "అద్వైత ద్వైత విశిష్టాద్వైతము మున్నగు భిన్నమతము లుత్పన్నములైయున్నవి. కాన వానిని గ్రమముగా శంకరమతము పండితమతము రామానుజమతము మధ్వమతము మున్నగు నానూంతరములచేలోకమువ్యవహరించుచున్నది. అట్లు కర్మమతమునందు భిన్నమతములు దయించి యుండలేదు. అందుచేమీదిభిన్నమతముల వారందరును గర్మమతమునందు విడివడకయొక్క విధముగనేకర్మలననుష్ఠించుచున్నవారు కావుననే మనపూర్వులెల్లరుజైమినివ్యాసమతముల నవలంబించియభ్యుదయ నిశ్రేయస్సుల నార్జించుకొని యనుభవించియున్నవారు. ఇవిగాక (మీదిశ్రుతిస్మృతిమతములనుమీరి) యిచ్ఛానుసారము రచించుకొనిన స్మృతిమతములుకూడ మరికొన్ని మనభరతఖండమున వ్యాపించియున్నవి. అవి యేజైన బౌద్ధచార్వాకాదిమతములని తెలియవలెను. ఇవిగాక మహమ్మదీయ క్రైస్తు మతములువిదేశములనుండి వచ్చియున్నవి. ఇందిపుడస్పృశ్యత తీసివేసి మాలమాదిగెలను దేవాలయములు సత్రములు రేవులు బావులు పైజాతుల గృహములు లోనగు వానిలోనికి రానీయవలసినది. రానీయనిచో స్వరాజ్యము రాదను గాంధిమతము చేరియున్నదా? లేదా? యని యిక విచారించుకొందము.

(గాంధిమతము శ్రుతిహితమతమగునా?)

కాదు. శ్రుతివిరుద్ధమతమని యీక్రిందిశ్రుతి పరామర్శవలన మనము సులభముగ గ్రహింపనగును. ఇటువినుడు బృహదారణ్యకో ప నిషత్తులోని తృతీయబ్రాహ్మణమున ౧౦వ మంత్రము.

" సావాఏషాదేవతైతాసాం దేవతానాం పాప్మానం మృత్యుమపహత్య యత్రాసాందిశామంతస్తద్గమయాంచకార తదాసాం పాప్మనోవిన్యదధాత్తస్మాన్నజనమియాన్నాంతమియాన్నేత్పాప్మానం మృత్యుమన్వవాయానీతి"

ఈమంత్రమునకు శ్రీశంకర భగవత్పూజ్య పాదులవారు భాష్యము రచించియున్నవారు. గ్రంథవిస్తరభీతిచే దానంతను నిటనుదాహరింపవీలని ప్రకృతోప యోగమగుభాగమును మాత్రమిందు క్రిందఁబొందుపరచి దానియభిప్రాయమును విశదపరచుచున్నవారము సంశయము గలవారట సమగ్రముగ జూడనగును.

" తస్మాత్తమాత్యాంజనం నేయాన్నగచ్ఛేత్సం భాషణదర్శనాదిభిర్నసంసృజేత్. తత్సంసర్గేపాప్మనాసం సర్గః కృతః స్యాత్ పాప్మశ్రిమోహిసః. తజ్జననివాసం చాంతందిగంత శబ్దవాచ్యం నేయాజ్జనశూన్యమపిజనమపితద్దేశ వియుక్తమిత్యభిప్రాయః

ఇద్ధంజనసం సర్గే పాప్మానం మృత్యుమన్వవాయానీతి అను అవఆయానీత్యనుగచ్ఛేయమిత్యేవంభీతో నజనమ తంచేయాదితి పూర్వేణసంబంధః"

ప్రాణోపాసనము గావించు మానవు లంత్యజులున్న దేశమును విసర్జించవలెను. ఇంతియెకాదు వారితోడ సంభాషణము గావింపరాదు. వారిని జూచుట మొదలగునవికూడ గూడదని పైమంత్రమునిషేధించుచున్నది. కానవానితోడిసంసర్గమున పాపము సంభవించును. దానినాశమునుగాంతురు కాన మానవాధముల దర్శన సంభాషణ స్పర్శాదులు త్యజించ వలసినదని వేదములుపై మంత్రముఖమునమానవోత్తములను శాసించియున్నవి. ఇట్లుండనిఁకనంత్యజుల యస్పృశ్యత తీసివేసి వారినంటుకొనవలసినదను గాంధిమతము శ్రుతిహితమగునని

మతిమంతులు తలంతురా? తలంపరు. ఇట్లనినఁ బ్రాణోపాసనము గావించువారుకదా యంత్యజులదేశమును వదలి వారితోడి సంభాషణదర్శన స్పర్శాది సకలసంబంధములను విసర్జించ వలసిన దనివేదము బోధించినది? వారట్లు విసర్జింతురుగాక ప్రజలెల్లరును బ్రాణోపాసనము గావించుటలేదు అదికావించని వారేల యంత్యజులతోడి దర్శన స్పర్శాది సంబంధములు త్యజించవలెనని కొందరు ప్రశ్నింపవచ్చును? ఈప్రశ్న వేసికొని యానందగిరిటీక యిట్లు ప్రత్యుత్తరము చెప్పియున్నది. ఇటువినుఁడు.

“ ప్రాణోపాస్తి ప్రకరణె నిషేధశ్రుతేస్తదుపాసకేనైవాయం నిషేధోనుష్ఠేయోనసర్వైరితి త్యాశంక్యాహ నేదిత్యాదినా ఇద్ధంశ్రుత్యుక్తంనిషేధం నచేదహంకుర్యాంతతః పాప్మానమను గచ్ఛేయం నిషేధక్రమాదితి సర్వస్యభయం జాయతే నప్రాణోపాసకస్యైవ అతః సర్వోపి పాపాద్భీతో నోభయంగచ్ఛేత్”

ప్రాణోపాస్తి ప్రకరణమునఁ జండాలదర్శన సంభాషణాదులు నిషేధింపఁబడియున్నవి కానఁ బ్రాణోపాసకులకు మాత్రమే యానిషేధము వర్తించునుగాని యన్యుల కందరకుఁ గాదందురేమో! యని శంకించుకొని శ్రుత్యుక్తమగు నిషేధమును మేముగావింపనిచో దాని వలనఁ బాపమును బొందుదుమను భయమందరికిఁ గల్గునుగాని యొక ప్రాణోపాసకులకు మాత్రమేకలుగదు. కాన బాపమునకు భయపడు వారందరును జండాలురుండుదేశమును దర్శన సంభాషణాదికమును బరిత్యజించ వలసినదని పైవ్యాఖ్యానార్థము. ఈచెప్పిన దానింబట్టి యప్రత్యుత్త విషయమును బోధించు శ్రుతిమతమునకు గాంధిగారిమతము బద్ధవిరుద్ధమని ధృవపడినది. కానపై మనశ్రుతిమతమును బట్టి చూడనాశనోన్ముఖులగు వారుమాత్రమే గాంధిమతము ననుసరించి చండాలుర యస్పృశ్యతతీసివేసి వారిని దేవాలయములు సత్రములు రేవులు బావులు పైజాతుల గృహములు లోనగువానిలోనికి రానీయవలసినదే కాని బాగుపడదలంచినవారు మాత్రము రానీయరాదని యాదానివలన బాలురుకూడ గ్రహింపగలరని నిశ్చయించుకొని

యింతటనీ ప్రకరణమును ముగించుచున్నవారము. ముందుగాంధిమ
ముస్మృతిహితమతమగునా కాదా యనువిషయమును ద్వితీయప్రక
ణమునవిచారించనున్నవారము.

---

సంకీర్ణ సంకర యుగపరివర్తకుడగు

## గాంధిమహాత్ముడు.



కలగూర గంపోపన్యాసము.

(మండ చిన వెంకయ్యచేవ్రాయబడినది)

ఆహ్యలారా! మనపూర్వులు కల్పమన్వంతరాది భేదములచే
గాలమును విభాగించి పరమేశ్వరునిచే బ్రతికల్పమునను నిందాద్రిదే
తలు వశిష్ఠాది మహర్షులు చక్రవర్తులు లోనగు వారు సృజి పబ
చుందురనియు బ్రతియుగమునందును సాధుపులను రక్షించుకొరకును
దుష్కృతులను సంహారించుకొరకును భగవంతుడవతరించుననిఉ
బురాణేతి హాస ముఖముల నుపదేశించియున్నారు. ఇంతియెకా
అట్టికల్పములలో నొకటియగు నీశ్వేతవరాహకల్పమున వైవస్వతమ
న్వంతరమునందు నిరువది యెనిమిదవ మహాయుగములో నిదగు నీక
యుగమున నైదువేల సంవత్సరములు గడిచిన మీద వర్ణసంకరము జ
గునని "కలౌపంచ సహస్రాణి జాయతే వర్ణసంకరః" అనుశ్లోకము
మున జెప్పియున్నారు. పైమనపెద్దలవాక్యములు వ్యర్థములు
కుండ వానిని సార్థకముచేయుటకై రాజారామ మోహనరాయిగా
బ్రహ్మసమాజమును స్థాపించియన్ని కులములనొకటి కావించి సం
రమొనరించుటకు జీవితమును దారవోసి చాలవరకు సఫల మనో
ధులై కడచనిరి.

అనంతరము వర్ణసంకరానందులన దగినదయానంద సరస్వ
లను గుజరాతి దేశపు యతులు బయలువెడలి యార్యసమాజము

స్థాపించిపీరు తమసమాజమున జేరినవారిలో జన్నిదములులేని శూద్రు
లకు తురకులకు వేయేలమాలలకు మాదిగెలకుఁగూడ గుణకర్మలను
బట్టి యుత్తమజాతివచ్చినదని చెప్పివారికి జన్నిదములు తగిలించి వేద
శాస్త్రము లీవిషయములనే చెప్పుచున్నవని తాము పూనినవర్ణ
సాంకర్యకర్మకువలయు వర్ణ సంకర గ్రంథములనుగూడ వ్రాసి
కడచిపోయిరి. వారిమతమును వృద్ధి చేయుటకై యీనడుమను శ్రీ
ద్ధానందులొకరు బయలుదేరి వేలసంవత్సరములకిందఁ దురకలలో
హిందువులుకొందరు కలిసిపోయినవారను మిషతో నాతురకలను
గొందరిని బట్టుకొనివచ్చి శుద్ధిచేసి హిందూమతములో చేర్చియున్నా
రు శుద్ధిమతిమన కులములనుదుంపశుద్ధి చేయుమతమని తెలియవలెను
ఈయార్యమతకర్తలకు సతీర్థులో లేకశిష్యులో యనదగిన జి. బి.
యన్. సరస్వతీస్వాములు శూద్రులగుకొందఱు రెడ్డివెలమ కమ్మ
బలిజెలకు జన్నిదములు వేసి క్షత్రియులను గావించితినని చేసికల్లో
లములను నెఱుఁగని తెలుగువారుకలరా?

ఇది యిట్లుండ బి సెంటమ్మగారు దివ్యజ్ఞానసమాజము నొక
దానిని గొనితెచ్చినందు మనవారెందఱో చేరి యెవరిజాతి మతధర్మము
లను వారు నడచుకొనుచు వేదాంతవిచారము చేసికొనుటకు మాత్ర
మే యొకచో గూడుచున్నామని చెప్పి రహస్యముగా వర్ణసంకర భో
జనములు చేయుచుండి యీగోప్యమెన్నిదినములు దాచవని వీరికి
యీనడుమ బహిరంగముగా వర్ణసంకర భోజనములుగావించిన విష
యము జగద్విదితమై యున్నదిగదా? ఈదివ్యజ్ఞాన సమాజమునకు
చెందిన నీలకంఠశాస్త్రియను దక్షిణదేశపు బ్రాహ్మణుని కూతురు
గారు అనండలు దొరగారిని బరిణయమై కులము చెడినవిషయములో
కవిదితమైయున్నది. జిడ్డుకృష్ణమూర్తిగారను బ్రాహ్మణులొకరు బి
సెంటమ్మగారిచే నింగ్లాండునందు 18 సంవత్సరములు పెంచఁబడి భ్ర
మర కీటన్యాయము ననుసరించి యిపుడు వర్ణసంకర జగద్గురువుల
మయితిమనుచు నొక్కఁ జెన్నపురిని దమశిష్యులకు వేదోక్త కర్మలు
విడువవలసినదనియు వర్ణభేదములను నిర్మూలించవలసినదనియు మొద
లుగా వర్ణసాంకర్యోపదేశములను జేసి దివ్యజ్ఞానసమాజముయొక్క

యథార్థరూపమును బ్రదర్శించి యున్నారని పత్రికలు ఘోషిం
యున్నవికదా?

పై మతముల వారందరును వర్ణసాంకర్యముఁ గావించుట
గాంచి మనవర్ణ సంకరయుగ ప్రవర్తకుఁడగు గాంధిమహాత్ముఁడి
తనకోరికఁ గొనసాగించుకొనఁదగిన తరుణమని యోచిన్న తన
నూఁడి తనను బాధించుచుడిన చండాలాస్పృశ్యతా నివారణా
రమునకు సంకల్పముగావించిరి. అధికనిమనకుఁ దగిన నాయకుల
తటస్థించినారని సంతసించి వర్ణసంకరమునకు దొరకొని యస్పృశ్
తతీసి వేసిమాల మాదిగెలను దేవాలయములు సత్రములు బావుల
రేవులు పై జాతుల గృహములులోనగు వానిలోనికి రానిచ్చి
నంగాని స్వరాజ్యము రానేరదని వారితో జేరి జేయుని కేకలువేయు
గియున్నారు మాలమాదిగెల యస్పృశ్యతతీసివేసి వారినంటుకొని
యెడ నిండియనులకు నిండియా రాజ్యము స్వాధీనము చేసి చెపుల
జాడించుకొనుచు బ్రిటీషుప్రభువు లింగ్లాండునకుఁ దరలిపోగా
యీవర్ణసంకర యుగప్రవర్తకునికిఁ జెప్పినారా? ఈవిరుద్ధ బో
యెందుకు?

ఇప్పటికి శ్వేతవరాహకల్పము ప్రారంభమై 195 కోట్ల 58
ను 85 వేల 28 సంవత్సరములు కడచియున్నవి. ఇందెందరో భా
టిరాజ్యమును చేసియున్నారు. కానియే రాజ్యమునందును మనవర్ణ
సంకర యుగప్రవర్తకుడగు గాంధిమహాత్ముని వలె మాలమాదిగెల
యస్పృశ్యత తీసివేసి వాండ్రనంటుకొనినఁ గాని రాజ్యము రాదని
బోధించిన వర్ణసంకర బోధకులు మాత్రము జనించి యుండలేదు.
మాలమాదిగెలకుఁ బ్రతినిధులయి మనసన్నిధానము సూర్యనారా
యణశాస్త్రిగారివలెఁ జండాలవిలాపము జేసినవారుకాని కావ్యకం
ఠగణపతిశాస్త్రిగారివలె శాస్త్రవిరుద్ధ వాదములను గావించిన
వారుకాని రాయప్రోలు సుబ్బారావుగారివలె బ్రలాపములను జేసిన
వారుకాని బొమ్మకంటి నరసింహశాస్త్రిగారివలె ధర్మనాశనమునకు
యత్నించిన వర్ణసంకరప్రియులగు పండితులుకాని యుదయించి
యుండలేదు ఇందరిట్లు జనించి కాలిఁ జెడి వర్ణసంకరకార్య

ము లు కాంచిన సుజనులు గాంధిమహాత్ముని వర్ణసంకర ప్రవర్తకుఁడని చెప్పుటకుగాని వ్రాయుటకుఁగాని సంకోచించరని తలంచుచు నింతట విరమించుచున్న వాఁడను.

మండ చినవెంకయ్య, ప్లీడరు, కలువాడి.

# వర్ణాశ్రమధర్మసభ

పాఠక మహాశయులారా!

కడచిన డిశంబరు మా ప్రాంతమున చెన్నపురిని జరిగియున్న కాంగ్రెసుతోఁబాటు -శ్రీ-శ్రీ-శ్రీ- పార్థసారధి స్వామివారి కోవెలయందు వర్ణాశ్రమ ధర్మ రతులగు సత్పురుషులుపై పేరొక మహాసభగావించి యందు సంఘసంస్కారు లాచరణములోనికిఁదేఁదలంచిన యేకజాతీయత రజస్వలా వివాహము, వితంతువివాహము అస్పృశ్యతానివారణము, వర్ణాశ్రమధర్మ నిర్మూలన శాసన నిర్మాణము మున్నగు దుష్కార్యములను శాస్త్రయుక్త్యనుభవములతో ఖండించి కొన్ని పరిష్కారములను గావించియున్నవారు. వానిని ముందు సంచికను బ్రకటించఁదలంచి ప్రకృతము కర్ణపేయములగు రెండుసమాచారములను మాపత్రికామీమాంసంచికయందు వినుపించుచున్న వారము వినుఁడు.

కావ్యకంఠబిరుదాంకిత

## గణపతిశాస్త్రిపలాయనము.

గణపతిశాస్త్రిగారు రెండుమూడు వత్సరములనుండి చండాలుర యస్పృశ్యత తీసివేసి వారినంటుకొనవలసినదేయని యచ్చటచ్చట మతిలేనియుపన్యాసము లిచ్చుటయేగాక యాదిమాంధ్రుల నుద్ధరించుట కవతరించినదా యనఁదగిన యాంధ్రపత్రిక యందు వెడగువ్యాసములను గొన్నిటిని బ్రకటించియుండిరి వానినిగని సంతసించి పరేంగితజ్ఞానములేని మానవమాన్యులు కొందరు వారికిమునియను బిరుదము నొసంగి యుండిరి. అటుపైఁ గోనసీమలోని మహాపండితమండలి పాలగుమ్మియను పురవరమున సభచేసి యందుమీవాదమును నిరూపించుకొనుటకు రండని గణపతిశాస్త్రిగారి కాహ్వానముఁబంపిరి. కానియాసభకు శాస్త్రిగారు వచ్చినవారుకారు.

అటుపై మొన్న! జెన్నపురిని సమావేశమైయున్న వర్ణాశ్రమధర్మసభవారును మాసభకువచ్చి మీవాదమును నిలుపుకొనుడనిగణపతిశాస్త్రిగారికి రిజస్టర్డుత్తరము వ్రాసియ విశేషలేకయదిగైకొని విషయనిర్ధారణ సభకువచ్చిరంట? వచ్చిసత్తాడనే సభవారు మీవాదమునకెంతకాలము కావలయునో యదియెప్పుడు కావలయునో చెప్పుడని ప్రశ్నింపశాస్త్రిగారు మధ్యాహ్నము వచ్చినపుడు చెప్పెదనని చెప్పివెల్లి మరల సభకురాకయే పలాయనము చిత్తగించి యున్నవారంట కంటిరాగణపతిమునిగారి యంటునివారణ పాండిత్యము? వినుడు.

# మదన మోహన మాలవ్య పలాయనము.

మాలవ్యగారు నేతిబీరకాయను గేహపండిత బిరుదము నొకదానినిదలందాల్చి యీనడుమ హిందూమతమహాసభయను పేరనొక శాస్త్రాచారదూరమగు సభనుస్థాపించి ఆసభయందు చండాలుర యంట రానితనము దలంచి రోదనముం గావించిరి అనంతరము రజస్వలావివాహము, విధవావివాహము, అస్పృశ్యతానివారణము లోనగు సంఘవినాశకరములగు పరిష్కారములను గావింపించి వానివ్యాప్తికై ప్రచారకులనుగా శాస్త్రానభిజ్ఞులను బంపియుండిరి. ఆమాలవ్యగారే మొన్నం జెన్నపురికివచ్చి హిందూమత సభచేసియుండం దామేయాధ్యక్షులుగానుండి యస్పృశ్యత తీసివేయవలెనను దుండగపు తీర్మానముగా వింపించియున్న వారంట!

ఆదివిని వెంటనే వర్ణాశ్రమధర్మ సభవారు మాలవ్యాగారినాహ్వానించి మాసభయందు మీవాదమును శాస్త్రములతో సమర్ధించుకొనుటకు రండని యడుగమాలవ్యగారు సాయంకాలము 6 గంటలకు మీ బసకువచ్చి నావాదమును వినిపించెదను అదిమీరుకునచ్చిన యెడ రేపటియుదయమున మీసభలో నాకవకాశమీయవచ్చునని సభాధ్యక్షులతో చెప్పివెల్లి 6 గంటలకు రాకవెంటనే 7 గంటల మెయిలులో వారుస్వదేశమునకు పరారిచిత్తగించి యున్న వారంట! వింటిరా మాలవ్యగారి యంటురోదనమును?

శ్రీ

# శ్రుతిధర్మసంజీవని

## అనునీమాసపత్రిక

శ్రు తిస్మృతిశిష్టాచార ప్రమాణములననుసరించును.

తి తీర్థులకు సంతరణోపాయములను దెలుపును.

శ్రీధ ర్మాధర్మవిధర్మములను విభజించి

ర్మ మభూయాత్తనువారికి త్రోవలనొసంగెడిని.

సం ఘసంస్కర్తలదుర్వాదములనిరసించును.

జీ వన్ముక్తిపదసోపానములనుజూపును.

వ ర్ణాశ్రమధర్మతత్పరులనాశ్రయించును.

ని త్యసత్యహితమితవాదములవినిపించును.

## చందావివరము

| | | |
|---|---|---|
| రాజపోషకులు | సం॥నకు | రు 10-0-0 |
| ప్రధానపోషకులకు | ,, | రు 4-0-0 |
| అనుపోషకులకు | ,, | 3-0-0 |
| చందాదారులకు | ,, | 2-0-0 |
| అరుమాసములకు | ,, | 1-4-0 |
| విడిపత్రిక | | 0-3-0 |

Regd. No. M. 1480 — చందా సం॥ రు. 2.

శ్రీ

శ్రీబాలాత్రిపురసుందర్యైనమః

"యతోధర్మస్తతోజయః। సత్యమేవజయతేనానృతమ్"

# శ్రుతిధర్మసంజీవని

వర్ణాశ్రమ ధర్మపక్షమున వాదించు మాసపత్రిక.

"ధర్మ ఏవహతో హంతి ధర్మోరక్షతి రక్షితః"

శివపురపు వీరభద్రసోమయాజి పత్రికాధిపతి


| సంపుటము. | పరిభవ ఫాల్గుణశు ౭ సోమవారము. | సంచిక. |
|---|---|---|
| ౧ | ఫిబ్రవరి 1928. | ౨ |


## విషయసూచిక

1 స్వరాజ్యము — గార్హ్యవదశర్మ
2 పరాశక్తిప్రాదుర్భావము — విద్యానందశాస్త్రి
3 భక్తిమార్గము — చె॥ రామేశ్వరశర్మ
4 కలిచక్రవర్తి పట్టాభిషేకము ద్వితీయప్రకరణము — పత్రికాధిపతి
5 చతుర్వర్ణచరిత్ర — ,,
6 వర్ణసంకరదంపతులు — ,,

బెజవాడ:

శ్రుతిధర్మసంజీవనీ ముద్రాక్షరశాలయందు

ముద్రింపఁబడి ప్రకటింపఁబడియె.

1928

శ్రీ

శ్రీబాలాత్రిపురసుందర్యైనమః

"యతోధర్మస్తతోజయః। సత్యమేవజయతేనావృతమ్"

# శ్రుతిధర్మసంజీవని

వర్ణాశ్రమ ధర్మపక్షమున వాదించు మాసపత్రిక.

"ధర్మఏవహతో హంతి ధర్మోరక్షతిరక్షితః"

శివపురపువీరభద్రపాకయాజి పత్రికాధిపతి

| సంపుటము. | ప్రభవ ఫాల్గుణశు ౭ సోమవారము. | సంచిక. |
| --- | --- | --- |
| ౧ | ఫిబ్రవరి 1928. | ౨ |

## స్వరాజ్యము.

ప్రకృతము భారతీయుల చిత్తములలో విశేష సంచలనము కలిగించుచున్న విషయము స్వరాజ్యము. అదియెప్పుడు లభ్యమగునో ఎట్లు లభ్యమగునో ఇప్పటికి నిశ్చయింపబడలేదు. దాని స్వరూపమింకను బూర్తిగ చిత్రింపబడలేదు కాని కొలదిరోజులలో భారతీయుల ప్రతినిధులందరొక జోటజేరి తమకత్యుత్తమమని తోచు రాజ్యాంగ విధానమును నిర్మింతురని తెలియుచున్నది. అందుపాల్గొనువారందరు బుద్ధిమంతులు, దేశముయొక్క పూర్వపు ఔన్నత్యమును ప్రకృత పరిస్థితులను జక్కగదెలిసికొనినవారు నైయుందురు. అయినను దేశక్షేమమును మనమున నిడికొని, మేమును కొన్నిమాటలజెప్పవలసియున్నది. చెప్పెదమువినుడు. రాచకీయ విషయములలో ప్రసంగించువారు మమ్ము అనగ వర్ణాశ్రమ ధర్మతత్పరులను పూర్వాచార పరాయణులని బిలుచుచు తమ్ముదాము సంఘసంస్కరణ పరాయణులనిబిలుచు కొందురు. నిజమారయ మేమును సంఘమును సంస్కరించవలయునను వారమే. కానిమేము సంఘమున శాస్త్రముల కువిరుద్ధముగ బ్రవేశించిన దురాచారములను మాత్రము తొలగించవలయునందుము

వారుకొన్ని సదాచారములనుగూడ తమతమ బుద్ధుల ననుసరించి దు
రాచారములనుగ పరిగణించి తొలగించవలయునందురు. మాకుశ్రు
స్మృతులు ప్రమాణములు. శ్రుతు లపౌరుషేయములు. ఇష్టప్రాప్తి
ననిష్ట పరిహారములకు నలౌకికోపాయముల బోధించునవి. అతీంద్రియ
దృష్టులైభూత భవిష్యద్వర్తమానముల గుర్తెరింగిన మన్వాదులు రచిం
చినశ్రుత్యర్థములుస్మృతులు.కావునశ్రుతిస్మృతులుబోధించుధర్మములు
సర్వదా సంఘమునకు శ్రేయస్కరములనుటలో సంశయింపబని లేదని
మానమ్మకము. సంఘసంస్కరణ పరాయణు లనువారలకు వారిబు
ద్ధులేప్రమాణములు. అవియు దేశీయశాస్త్రవ్యాసంగముచే శోధితము
లైనవి కాకపోవుటయేకాక, అసమగ్రమగు పాశ్చాత్య విద్యావాసి
తములై తద్దేశవాసుల బాహ్యానాగరక తావ్యామోహితములైయున్నవి
అందుచేవారిచే నుపపాదింపబడు సంస్కరణములు మనసంఘమునకు
శ్రేయస్కరములు కావని మానిశ్చయాభిప్రాయము. భారతజాతియొ
కవిలక్షణ మైనజాతియనియు నయ్యది బ్రహ్మక్షత్రియ వైశ్యశూ
ద్రాది వర్ణవ్యవస్థతో కూడియుండుననియు శాస్త్రవేత్తలందరేక గ్రీ
వముగనంగీకరించియున్నవారు. భారతజాతికిని వర్ణవ్యవస్థకును అవినా
భావసంబంధముకలదు. అనగా వీనిలో నొకదాని విడచి యింకొకటి
యుండనోపదని తాత్పర్యము మనదేశనాయకులలో కొందరొక వంక
భారతీయులకు స్వరాజ్యముకావలయును స్వాతంత్ర్యము కావలయును
అని యార్భాటముల జేయుచు నింకొకవంక వర్ణవ్యవస్థను నిర్మూ
లించవలయును అనియుపన్యసించుచుండునపుడు మాకు విస్మయముక
లుగుచుండును. వర్ణవ్యవస్థనిజముగ తొలగింపబడినచో భారతజాతి
మేలుప్తమగునని యాయుపన్యాసకులకు బహుశః తెలిసియుండదు.
వర్ణవ్యవస్థ వ్యవహారసౌకర్యమునకై మానవులు కల్పించినదని వీరి
యూహ. అదిమానవకల్పితముకాదు. భగవన్నిర్మితమై సృష్ట్యాది
నుండియుప్రవర్తిల్లుచున్నది. కావుననే యింతవరకెందరో దానినిర్మూ
లనమునకై యత్నించి విఫలమనోరథులై తుదకు వారేనిర్మూలితులై
రి. అట్టిప్రయత్నముల నిపుడుజేయువారు నదేఫలమునందెదరు. సంశ

యము లేదు. ఈమా యభిప్రాయముతో నేకీభవించువారిప్పటికి ననేకు లు కలరు. ఏ నాస్తికులు కొందరో వ్యతిరేకింతురు కాని యాస్తిక జనులందరీ యభిప్రాయము కలవారే అయియున్నారు. సంఘసంస్కారప్రియ సోదరులు చేయునంత కోలాహలము వారు చేయరు. కావున వారి సంఖ్య లెక్కకు వచ్చుట లేదు. కర్తవ్యావశ్యకత ననుసరించి వారి లెక్క మిక్కిలియగుచుండును. ఒకవేళ వాదమునకు వారిసంఖ్య తక్కువయనుకొన్నను ప్రతిపక్షులకది లాభించదు. దైవబలమున్నచో నొక్కడైన పెక్కండ్రనుక్కడంచును. సముద్రజలము నంతటిం బుక్కిట బట్టిన వాడొక్కరుడే కదా. భారతయుద్ధమున పద్మవ్యూహమును భేదించిన వాడొక్కరుడే. నేటికి రెండు వేల యయిదువంద లేండ్లకిందట భారతదేశమున దుర్మతములనన్నిటిం జెండాడి వైదిక ధర్మమును సుస్థిరముగ నొనర్చిన వాడొక్కరుడే. కావున వర్ణాశ్రమధర్మ తత్పరుడొక్కడున్నను దైవబలయుతుడై తనధర్మమును స్థిరపరచుకొని దేశమునంతటిని వ్యాపించి మించ కలడు. వర్ణాశ్రమ ధర్మపరులకు దైవబలము కలదు. "శ్రుతిస్మృతీ మమైవాజ్ఞే" అని భగవంతుడు పల్కుచున్నాడు. వర్ణాశ్రమ ధర్మములు శ్రుతిస్మృత్యుక్తములు. కావున నా ధర్మముల పాలించువారు భగవదాజ్ఞల పాలించువారగుదురు. కావున వారు భగవదనుగ్రహపాత్రులయి తీరుదురు. కావున నిట్టివారిని రాజ్యాంగ విధాన నిర్మాణసమయమున నుపేక్షించతగదు. స్వరాజ్యము భారతీయులందరకు శ్రేయస్కారణమగునపుడు వర్ణాశ్రమధర్మపరులు దానినక్కర లేదనియనరు. భారతజాతియొక్క విలక్షణతను కాపాడుకొనగల స్వాతంత్ర్యము కావలయునని వారియాశయము. కావుననో రాచకార్యధురంధరులారా, మీ రేయే విధానముల నిర్మించినను నిర్మించుడు వర్ణాశ్రమధర్మములను రక్షించు నిబంధనముల నేర్పరచుడు. ఆధర్మములను మీరుపేక్షింతురేని అవి మిమ్ముపేక్షించక మానవు. అందుచే మీరు భగవదాజ్ఞలకు దూరులగుదురు భగవదాజ్ఞల నుల్లంఘించువారు, దేవద్రోహులని "ఆజ్ఞాచ్ఛేదీ మమ ద్రోహీ" అను వాక్యముఖమున భగవంతుడు చెప్పియున్నాడు. దేవద్రోహులే దేశద్రోహులు. కావున దేశహితమును గోరు

వారందరు వర్ణవ్యవస్థను పాలింప పాటుబడవలయును ఇపుడు నిర్మింప బడబోవు విధానము కేవల వర్ణాశ్రమధర్మపరుల కొరకే నిర్మింపబడుటలేదు. నిజమే ఇపుడా సేతుహిమాచల పర్యంతముగల భారతదేశమున నివసించు నన్నిజాతుల క్షేమము నాలోచించియే రాజ్యాంగవిధానము నిర్మించెదరు. కాని స్వల్పసాంఖ్యాకులగు జాతుల ప్రత్యేకధర్మములను స్వత్వములను రక్షించుటకు తగుసౌకర్యముల నేర్పరతురని నమ్ముచున్నాము. కావున వర్ణాశ్రమధర్మపరుల ప్రత్యేకధర్మములను స్వత్వములను రక్షించుటకు తగుసౌకర్యముల నేర్పరచుడు. శాసనసభాసభ్యులు వర్ణాశ్రమ ధర్మములభంగించు శాసనముల బ్రవేశపెట్టగూడదని మీవిధానములను స్పష్టపరచుడు.

—గార్త్సమదశర్మ



# పరాశక్తిప్రాదుర్భావము.

ఒకానొక సమయమున దేవతలకును దానవులకును ఘోరసంగ్రామమొకటి ప్రవర్తిల్లనందు దేవతలు జయముగాంచిరి. ఆజయముచే దేవతలు గర్వితులై మేరుపర్వత శిఖరప్రాంతములందు సుఖించుచుండిరి. ఇట్లుండ వారియెదుట కోటిసూర్యప్రకాశమానమును చంద్రకోటిసుశీతలమును విద్యుత్కోటి సమాన తేజోవంతమును హస్తపాదాద్యవయవవర్జితమును అగునొక పెనుభూతమావిర్భవించెను అదృష్టపూర్వమగు నాపెనుభూతముంగని దేవతలు విస్మయావిష్టచేతస్కులై ఇది యేమి ఇదియేమియని తమలోదాము తర్కించుకొని సమాధానము గానక దానిని సమీపించి తత్వము తెలిసికొనిరమ్మని యగ్నిహోత్రుని పేర్కొని పంపించిరి. అనలుడా భూతముంజేరి నీవెవ్వడవని యడుగ నీవెవ్వడవని యాభూతమగ్ని నడిగెను. నేనగ్నిహోత్రుడనని జెప్ప, నీకేమి శక్తికలదనియెను. నాయెదుటనుండు నెద్దానినైన దహింతునని యగ్ని ప్రత్యుత్తరమిచ్చెను "అయిననిదిగో, ఈగడ్డిపోచను దహింపుము" అని

యొకగడ్డిపోచ నగ్నియెదుట నాభూతముంచెను. అగ్నితనశక్తినంతట
నుపయోగించియు నాపోచను కాల్పలేక సిగ్గునమరలి దేవతలకు స్వ
వృత్తాంతమును నివేదించెను అనంతర మదేవిధమున దేవతలువా
యువుననంప నాభూతమగ్ని నడిగినట్లేవాయువును బ్రశ్నింప "నాయెదు
టనుండు నెట్టిదానినైన క్షణమాత్రమున నెగురగొట్టగలను" అనివా
యువనియెను. అంతనాభూతము వాయువునకెదుట నొకపోచనుంచి
"నీకుశక్తికలదేని యీపోచను గదల్పుము. లేకున్న గర్వమువిడచి
యింద్రునిజేరుము" అనియెను. వాయువు తనశక్తినంతటి నుపయోగిం
చియు నాపోచను కదల్పలేక ఖిన్నుడై తలవంచుకొని యింద్రునిజేరి
తనవృత్తాంతమును దెలిపెను. అంతదేవతలందరొకచోట జేరి అలౌకిక
మగు నీయద్భుత తేజఃపుంజమేమో మనము దెలిసికొనలేక పోయి
తిమికదా, అని తలపోసి దేవరాజగు దేవేంద్రుని ప్రోత్సహించి
యాభూతముకడకంపిరి ఇంద్రుడు మహాగర్వమున భూతముంజేరనది
యంతర్ధానమాయెను. అదికని యింద్రుడు లజ్జితుడై "అహో ఏమి
యీయాశ్చర్యము? నాకంటెనికృష్టులగు అగ్నివాయువులతో నీభూతము
సంభాషించెను. నాతోసంభాషణమునైన జేయకపోయెనే, ఇప్పటనుండి
దేవతలంజేరి నాలఘుత్వము నెట్లుజెప్పికొందును? మహనీయులకు
మానమేకదా ధనము మానసష్టముకంటె మరణమే శ్రేయస్కరము
ఈభూతముమనకు శత్రువుకాను. శత్రువైనచో నంతర్ధానమొందియుం
డదు. కావున నిది యీశ్వరకల్పితము కానోపును. ఎవరీపవిత్రచరిత్రము
నకు కారణమో ఆతనినే శరణువేడెదను" అనిగర్వమును విడచి ధ్యా
నింపనశరీరవాణి "ఓ ఇంద్రా! మాయాబీజమును జపించిసుఖంపుము"
అనియెను అంతనింద్రుడు లక్షవర్షములు నిరాహారుడై మాయాబీజజ
పతత్పరుడై ధ్యాననిమీలితలోచనుడై తపమాచరించెను.

అంతనకస్మాత్తుగ నొకచైత్రమాస శుద్ధనవమీ మధ్యాహ్న
మున మేరుపర్వత శిఖరమున తేజోమండల మధ్యవర్తియై జపాకుసుమ
మువలె నతికోమల శరీరముకలిగి బాలచంద్రునితో నొప్పియుండు
నవరత్న ఖచిత కిరీటమునుధరించి రెండుచేతులలో పాశాంకుశము

బట్టుకొని యొకచేత నభయ ముద్రను మరియొకచేత వరదముద్రను ప్రదర్శించుచు నాలుగువైపుల మూర్తీభవించిన వేదములచే స్తుతింప బడుచుండు ప్రసన్నవదనయు త్రినేత్రయు కోటిమన్మథ సుందరియు నవయౌవనవంతురాలునగు నొకకుమారిక కానుపించెను. ఇంద్రుడా నిర్వ్యాజకరుణామూర్తియగు సుందరింజూచి ప్రేమాశ్రుపూరితనే త్రుడై పులకితాంగుడై సాష్టాంగ దండప్రణామ మాచరించి యనేక స్తోత్రములతో స్తుతించి "ఓతల్లీ నీప్రాదుర్భావమునకు బూర్వమిచట కనుపించిన పెనుభూతమేమి? కరుణించి తెలుపుము" అనియెను. "ఓఇంద్రా ఇంతకుముందు మీకుకనుపించిన తేజః పుంజము నారూ పమే. అదియేసర్వకారణకారణమగుబ్రహ్మ. అదియెమాయ కధిష్ఠా నము. సర్వసాక్షి, నిరామయము. వేదములన్నియు నావస్తువునే ప్రతిపా దించుచున్నవి. తపస్సుల కన్నిటికి నదియేఫలము ఆపదము నపేక్షిం చియేఋషులుబ్రహ్మచర్యమునవలంబింతురు. దానివాచకమే ఓంకారమ గు ప్రణవము. మీగర్వనిర్వాపణమునకై నారూపమట్లు కానుపించెను కావున గర్వముతువిడచి సచ్చిదానంద రూపిణి నగునన్నే శరణు బొం దుడు, అనియాకుమారిక దేవేంద్రునకానతిచ్చి యంతర్ధానమొందెను. ఈపరాశక్తినే ద్విజులు సంధ్యావందనమున గాయత్రీదేవతగను పాసిం చుచున్నారు. "ఉత్తమే శిఖరేజాతే భూమ్యాంపర్వతమూర్ధని" అను మంత్రమీపయిన వివరించినగాధనే సూచించుచున్నది. ఈపరాశ క్తియే త్రేతాయుగమున శ్రీరాములై యవతరించెను. కావుననే శ్రీరామచరిత్రమును వాల్మీకిమహర్షి గాయత్రీ మంత్రాత్మకముగరచి యించెనని పెద్దలందరు. కావున చైత్రశుద్ధనవమిని పరాశక్తి ప్రాదు ర్భావదివసముగను శ్రీరామజనన దివసముగను భావించి ద్విజులె ల్లరు గాయత్రీజపతత్పరులై పరాశక్తియనుగ్రహమున కృతకృ త్యులయ్యెదరుగాక యనివిశ్వసించుచున్నాడను.

—విమర్శానందశాస్త్రి



శ్రీకృష్ణాయనమః

# భక్తిమార్గము.

శ్లో॥ మూకంకరోతివాచాలం । పంగుంలంఘయతేగిరిం।
యత్కృపా తమహంవందే। పరమానందమాధవమ్॥

సృష్టియందలి ప్రాణికోటులలో నెల్లపురుషార్థసాధకుడగుటచే మానవుడగ్రిగణ్యు డనదగియున్నాడు. ధర్మార్థకామమోక్షములను నాలుగుపురుషార్థములలో మోక్షము పరమపురుషార్థమని శాస్త్రకారులందరు నిర్ణయించియున్నారు. మోక్షమన నిత్యనిరతిశయసుఖము. అయ్యది బ్రహ్మజ్ఞానముచే లభ్యమగునని శ్రుతులు పలుకుచున్నవి. బ్రహ్మజ్ఞానము గురూపసదనపూర్వక శ్రవణమననదిధ్యాస నాభ్యాసముచే కలుగునది. వివేకాదిసాధన చతుష్టయ సంపన్నుడే గురూపసదనమునుజేయ నర్హుడని శాస్త్రములు తెలుపుచున్నవి. ఈసంపత్తు చిత్తము శుద్ధమైనపుడేకలుగును. పరమేశ్వరుని యందలిభక్తితో నెవరుస్వవర్ణాశ్రమ ధర్మముల ననుష్ఠింతురో వారికేచిత్తశుద్ధికలుగును. క్షారోదకములచే వస్త్రమాలిన్యమెట్టుల బోవునో భక్తిచే చిత్తమాలిన్యమటులబోవును. భక్తియనప్రేమ. ప్రేమయన నెరు గనివారుండరు. ప్రేమయొక్క స్వరూపమందరకు దెలియును. సమస్తప్రాణులుప్రేమయను త్రాటఁగట్టబడియున్నారు. తల్లిబిడ్డప్రేమించును. బిడ్డతల్లినిప్రేమించును. అన్నతమ్మునిప్రేమించును. తమ్ముడన్నను ప్రేమించును. భార్యభర్తను ప్రేమించును. భర్తభార్యను ప్రేమించును మానవుల మగు మనము మనకంటె నికృష్టులగు పశుపక్ష్యాదిప్రాణులను, తరువృక్ష లతాగుల్మాదులను బ్రేమింతుము. అట్లే మనకంటె నుత్కృష్టులగువారలను బ్రేమింతుము. సములయెడమనకుగల ప్రేమను మైత్రియనియు, నికృష్టులయెడ ప్రేమను కరుణయనియు, ఉత్కృష్టులయెడప్రేమను భక్తియనియు బిలుతురు. కావున భక్తియన మనకంటెనుత్కృష్టులగు భగవంతుడు గురువు మొదలగు వారలయందు మనకుగలప్రేమ. ప్రేమపూర్వకముగ భగవంతునకు మనమాచరించుసేవను గూడ భక్తియనియేబిలుతురు. కావున, భగవత్సేవ, పుష్కలముగనే

మార్గమున బోధింపబడి యాచరింపబడునో, అయ్యది భక్తిమార్గ మనబడును. అట్టిభక్తిమార్గమునుగూర్చి యీవ్యాసమున సంక్షే ముగ వ్రాయబడును. భక్తులు దీనిప్రయోజనమును గనిమెదరుగా

దేవతిర్యఙ్మనుష్యస్థావరజంగమ భూతములతోను, చిత్ర చిత్రరచనాచాతుర్యముతో నొప్పియుండు నీవిశ్వమునకు సృష్టి సంహారాది కార్యము లెవనివలన కలుగుచున్నవో, ఆతడేపరమేశ్వ డని శాస్త్రములు తెలుపుచున్నవి. భగవంతుడు నిర్గుణుడనియు స ణుడనియు వర్ణించబడియున్నాడు. నిర్గుణరూపము నిత్యశుద్ధబుద్ధము స్వభావము, సచ్చిదానందాత్మకమునై, చిరకాలాచరిత నిదిధ్యాస ధ్యాసముచే కలిగిన నిర్వికల్పసమాధియందు జ్ఞేయమైయుండును. స ణముధ్యేయము, సేవ్యము. సగుణోపాసనమే భక్తిమార్గమున వి యము. భగవచ్చరణారవిందముల సన్నిధిం జేరదలను భక్తులంద దీనికధికారులు. మోక్షసాధనమగుజ్ఞానము దయించుటకు తలయ పుష్కలచిత్తశుద్ధియే దీనికిప్రయోజనము.

భగవంతుడు విశ్వరూపధరుడు. విశ్వమంతయు నతనిరూపము అతడుసర్వవ్యాపి. అతడులేనిచోటులేదు. అతడేసర్వమునైయున్నాడు కావుననతడుకానివస్తువింకొకటిలేదు. అతడుసర్వజ్ఞుడు. రహస్యముగాని ప్రకాశముగాని, యతనికిదెలియనివిషయముండదు. అతడుసర్వసాక్షి. కా వునవిశ్వమునకుకలసుఖదుఃఖాదులతనిని వికారపరచలేవు. అతడుసర్వ నియంత. సూర్యుడు, చంద్రుడు, నక్షత్రములు, వాయువు, యముడు బ్రహ్మ, అతనియాజ్ఞలశిరసావహించి, మేరదప్పక, తమతమకార్యము నెరవేర్చుచుందురు. ఇట్టి విశ్వరూపధరుడగు భగవంతుని సర్వకాలము లయందు స్మరించుచుభగవంతుడే పరమప్రియుడనివిశ్వసించి, యా నికే తనసర్వస్వమును సమర్పించి యనన్యయోగమున ధ్యానించుచున పాసించువాడుత్తమోత్తమ భక్తుడనబడును. ఇతడొకని మృషములో సహస్రాంశమైన భగవంతుని స్మరించక యూరకుండలేడు. భగవత్స్మ ణమే యతని జీవనము. ఇతనికి రాగద్వేషములుండవు. రాగముచే నొకవస్తువునాశించడు. ద్వేషముచే నొకవస్తువునుద్వేషించడు. ఇట్టి

వా డపవర్గమునుగూడ కోరక సర్వదాభగవత్సేవయందే నిమగ్నులై యుండునని భాగవతాది గ్రంథములయందు చెప్పబడియున్నది. ఇట్టి యుత్తమోత్తమభక్తులగూర్చియే శ్రీకృష్ణభగవానులు, "తేషామహంసముద్ధర్తా మృత్యుసంసారసాగరాత్। భవామి నచిరాత్పార్థ మయ్యా వేశితచేతసామ్" అనగ, అనన్యయోగమున, అనగ నేకాంతభక్తితో నెవరు నన్నే చేరవలయునని యాసక్తికలిగి నన్నేధ్యానించి యుపాసింతురో, ఎవరిచిత్తములు నాయం దావేశమునొందియుండునో, వారిని మృత్యుయుక్తమగు సంసారసముద్రమునుండి శీఘ్రముమే లేవనెత్తుదును" అనిసెలవిచ్చియున్నారు.

ఇట్టి విశ్వరూపధరుడగు భగవంతునియందు చిత్తమును స్థిరముగ నిలుపలేనివారలు ముందభ్యాసయోగమును నేర్చుకొని దాని సాయమున చిత్తమును సమాధానపరచుకొని యనంతరము పయిన వివరించిన యుపాసనము జేయవలయు. ఏదేని యొకమూర్తి నాలంబముజేసికొని మనస్సును నలునైపులనుండి మరల్చి యామూర్తియందు పునః పునః స్థాపించుట యభ్యాసమనబడును. ఇట్టివారల సౌకర్యమునకై వివిధములగు ధ్యేయమూర్తులుకల్పించబడినవి. విశ్వమునగల సమస్తరూపము లతనివేయయినను, పరిచయవిశేషముగల వస్తువులు చిత్తమునాకర్షించవు. కావున భగవంతుడు భక్తుని ధ్యానపూజాదుల గ్రహించుటకు, పరమకారుణ్యమున, అతిమనోహరరూపములధరించి యుగ్రులగు భక్తులకు ప్రత్యక్షమాయెను. ఆరూపములనే సర్వజ్ఞులగు మహర్షులు ధ్యేయమూర్తులుగ నిర్ణయించియున్నారు. ఈమూర్తుల స్వరూపస్వభావాతిశయములను వర్ణించుటకును, ఆయామూర్తుల ధరించి భగవంతుడొనరించిన మహత్కార్యములలోకమునకు దెలుపుటకును పురాణాదులు వ్రాయబడినవి. పురాణములలో కొన్నిటియందు భగవంతుడు ఉమాసహాయుడై పరమేశ్వరరూపమును ధరించియున్నట్లు వర్ణించబడియున్నాడు కొన్నిటియందు భగవంతుడు లక్ష్మీసమేతుడైన శ్రీమన్నారాయణుడుగ వర్ణింపబడియున్నాడు. మరికొన్నిటియందు మహాకామేశ్వరాంకనిలయమైయున్న మహాకామేశ్వరీ

బ్రహ్మ, విష్ణు, రుద్ర, ఈశ్వర, సదాశివులచేసృష్టిస్థితి, సంహార, తిరోధాన, అనుగ్రహములఁ జేయించుచున్న దని వర్ణించబడియున్నది. ఏనామముతో వ్యవహరింపబడియున్నను, ఏరూపము వర్ణించబడినను జగత్సృష్టిస్థితి సంహారాది కార్యములాన్యక్తివలననే కలుగుచున్నవని దెలుపబడియున్నది. అందుచేత పురాణాదులయందలి నామరూపభేదములు భగవద్భక్తులచిత్తముల కలుషపరచనేరవు. ఏరూపముభక్తుని చిత్తమునాకర్షించునో, ఆరూపమునే భక్తుఁడు ధ్యానించును. ఒకనికి శంఖచక్రగధా ఖడ్గాద్యాయుధముల ధరించి వనమాలాలంకృతుడై దివ్యమాణిక్యకిరీట శోభితుడగు శ్రీమన్నారాయణుండఖిలలోకైక శరణ్యుడని తోఁచును. ఇంకొకనికి శుద్ధస్ఫటిక సంకాశుడును, భస్మరేఖాంకితలసన్మస్తకుండును, జటామండలధారియు, భాగీకృతసర్వమంగళదేహుండును, శూలాద్యాయుధముల ధరించియుండు సాంబశివుడు సేవ్యుడని దోఁచును. మరియొకనికి, సకలలోకైకజననియు, సర్వసౌభాగ్యములతో నొప్పియుండి, పాశాంకుశేక్షు కోదండపుష్పబాణములధరించి యుండుపరాశక్తియే ధ్యేయమని తోఁచును. చిత్తమ నాయాసముగనే రూపమునుప్రేమించకలదో ఆరూపమే యుపాస్యమని నిశ్చయించుకొని భక్తుడభ్యాసము నారంభించవచ్చును. ఆరూపాంశముల యందను స్వ్యాతముగను పాసించబడు మూర్తులు పాస్యములు కావచ్చును. ఈవిషయములు ప్రతివ్యక్తియుతన యొక్కయనుభవమునుబట్టి పెద్దలసాయమున నిర్ణయించుకొనవలసియున్నవి. భారతీయులు పాసించుదైవమూర్తుల భేదములబట్టి వైష్ణవులు, శైవులు శాక్తేయులు, అని విభజించవచ్చును. వైష్ణవులు విష్ణుమూర్తిను పాసింతురు. శైవులు శివుని యారాధింతురు. శాక్తేయులు పరాశక్తినిబూజింతురు. ఇతరదైవముల నారాధించువారుగూడకలరు కాని వీరుమువ్వురు ముఖ్యులని చెప్పవచ్చును. ఇందేదేవియొకమూర్తిని సర్వదాహృదయమున భావించి యితరవిషయముల మరచు వాడీతరగతిభక్తులలో నుత్తముడు. నియమితకాలములలో మాత్రము భావించి చరించువాడు మధ్యముడు. హృదయమునందు భావించుచున్నను విషయములను మరువనివాడధముడు.

ధ్యానమునకుషఃకాలముత్తమము ఉషఃకాలమనగ సూర్యోదయమున కు ముందుండుకాలము. ధ్యానాభ్యాసము జేయువారలు సూర్యోద యమునకు ముందురెండుగంటల కాలముననే నిదురనుండిలేచి లేవగ నేయొకమారు భగవంతునిస్మరించి, యనంతరము, కాలోచిత కృత్య ములందీర్చికొని, స్నానమాచరించి, శుచియై, ధౌతవస్త్రములంధ రించి, విజన, నదీతీర, కుంజగుహాదులయందుగాని, దేవమందిరాదుల యందుగాని, స్వగృహమున నేకాంత స్థలమునగాని గోమయముచే పరిశోధితమగుచోట, కుశాసనము, అజినము, వస్త్రమును పరచి యందు పద్మాసన, సిద్ధాసన, సుఖాసనములలో నేదానినైన వేసి కొని, కూర్చుండి, దేహమధ్యభాగమును కంఠమును శిరస్సును సమ ముగనుంచి, యరమోడ్పున కనులనుంచుకొని, హృదయకమల కర్ణిక మధ్యమున, తనధ్యేయమూర్తిని ధ్యానించును. ఇట్టి యాంతరుపాస నమే ద్విజులసంధ్యావందనమందు విధించబడియున్నది.

ఇట్లుహృదయకమలమునందు ధ్యేయమూర్తిని ధ్యానించి బూజించలేనివారలు, సుప్రసిద్ధతేజస్సులగు సూర్యుడు చంద్రుడు, అగ్ని, మొదలగువానియందు ధ్యేయమూర్తులధ్యానించి మానసోప చారములచే బూజింతురు. ఇట్టివారలుపయోగించెడు ధ్యానశ్లోకముల నిందు దాహరించి యందలి యర్థముందెలుపుదును. వినుడు.

> శ్లో॥ ధ్యేయస్సదాసవితృమండలమధ్యవర్తీ నారాయణస్సరసిజాసన
> సన్నివిష్టః। కేయూరవాన్ మకరకుండలవాన్। కిరీటీ। హారిహి
> రణ్మయవపుర్ధృతశంఖచక్రః॥

ఈశ్లోకమును వైష్ణవులు అనగవిష్ణువును పాసించువారలుప యోగింతురు. "జగత్తునంతటిని కనియెడు సవితృదేవతయొక్క మండ లమధ్యమందు, అనగసూర్యమండల మధ్యమందు పద్మాసనాసీనుడై, హస్తాభరణము లు, మకరకుండలములు, కిరీటమును ధరించి, శంఖచక్ర ధారియై, బంగారువన్నెగలదేహముతో నొప్పియుండు నారాయణుడు ధ్యానించతగినవాడు" అనిదీనికర్థము.

శ్లో॥ మండలాంతరగతంహిరణ్మయం।భ్రాజమానవపుషంశుచిస్మితం
చండదీధితిమఖండి తద్యుతిం। చింతయే మునిసహస్రసేవితం॥

ఈశ్లోకమును శైవులుపయోగింతురు. "సూర్యమండలాంతర్యామియై, బంగారువన్నెతో బ్రకాశించుదేహమును, పరిశుద్ధమైన నగవునుకలిగి, వేలకొలదిమునులచే సేవించబడు, తీవ్రకిరణములతో నిండిన యఖండ తేజస్సును చింతించెదను అనిదీనికర్థము.

శ్లో॥ సూర్యమండలమధ్యస్థాం। దేవీంత్రిపురసుందరీం।
పాశాంకుశధనుర్బాణా। ధారయంతీంశివాంభజే॥

ఈశ్లోకమును శాక్తేయు లుపయోగింతురు. "సూర్యమండల మధ్యమందు, పాశము, అంకుశము, ధనుస్సు, బాణములనుధరియించి యుండు మంగళకారిణియగు త్రిపురసుందరీదేవిని భజించెదను" అని దీనికర్థము.

ఇట్లుసూర్యమండలాదులయందు మూర్తిధ్యానము జేయు లేనివారలకు ప్రతిమార్చనములేక విగ్రహారాధనము విధించబడినది. ప్రతిమలు లేకవిగ్రహములు, నైజములు, కృత్రిమములని రెండువిధములు. సాలగ్రామములు, బాణలింగములు మొదలగునవి నైజములు. శిల్పకారులచే నిర్మింపబడినవి చిత్రింపబడినవి కృత్రిమములు. నైజములగుప్రతిమలు సిద్ధవస్తువులగుటచే నితర సంస్కారములేవియు లేకయే పూజనీయములు. కృత్రిమములు, వేదోక్తవిధానముల ననుసంచియో, తంత్రోక్తవిధానములు ననుసరించియో, సంస్కరింపబడినవే పూజనీయములు. లేకున్న పూజనీయములుకావు. సంస్కరింపబడని విగ్రహములు దేవాలయప్రాకారగోపురాదులమీదను, ఘటపటాదులమీదను చిత్రింపబడినవి. ఇట్టివిగ్రహములు భక్తులచిత్తములందు సద్భావములను బుట్టించుటలో నందియములేదు. శాస్త్రోక్తవిధులననుసరించి వాటి బూజింపవలయునన్న నావిధుల ననుసరించియే సంస్కరించవలయును. సంస్కారములయందు నియుక్తములగు మంత్రములచే, సర్వగమైయున్న పరమేశ్వర చైతన్యమావిగ్రహమందు కేంద్రీకరింది

యభివ్యక్తం జెందును. అట్టియభివ్యక్తియే భక్తులనాకర్షించును భక్తుల భక్త్యతిశయముచే విగ్రహమునందలి సత్త్వాస్ఫురణములభివృద్ధి జెందును.

నైజములగు ప్రతిమలయందు భగవంతుడు సృష్టికాలముననే సంకల్ప పూర్వకముగ, చైతన్యమును కేంద్రీకరించియుంచెను.

ఇట్టిప్రతిమార్చనముచే చిత్తమితరవిషయములనుండి మగల్చబడి, యేకాగ్రమగును. ఏకాగ్రమగుచిత్తమాంతరుపాసనముజే యనర్హమగును. ప్రతిమార్చనావిధానము, అత్యద్భుతమే ధావంతులును, వేదవేదాంగతత్త్వజ్ఞులును, తపశ్శాలురును, అగుమహర్షులచే నేర్పరుపబడినది. ఇయ్యది శ్రుతిస్మృతిసమన్వితమై శాస్త్రోక్త ఫలదాయకమై యున్నది. భక్తులవర్ణములననుసరించిన యధికారమునుబట్టి వారర్చించు విధానమున నుపయోగించవలసిన మంత్రములు భేదించుచుండును, కానివిధానముమాత్రము మారదు. భక్తులు త్రైవర్ణికులలో నివారగుదురేని వారువేదోక్తమంత్రములతో నారాధింతురు. శూద్రులగుదురేని పురాణోక్తశ్లోకములతోనో వాక్యములతోనో, యారాధింతురు.

భగవంతునర్చించుటయు, పూజ్యులగు పెద్దలనర్చించుటయు సమానముగనుండును. మనయింటికొకపూజ్యులగు పెద్దలువచ్చిరేని మనమేమిచేయుదుమో, యోజించుడు. వారిని గౌరవముతో నాహ్వానముజేసి యుచితాసనమునగూర్చుండబెట్టుదుము, మార్గాయాసముదీరినవెనుక పాదప్రక్షాళనమును హస్తప్రక్షాళనమును జేయుదుము. దాహశమనార్థమైనిర్మలోదకముల త్రాగనిత్తుము. తరువాత స్నానము జేయింతుము గంధమునుబూతుము. పుష్పములతోబూజింతుము. మంచిధూపమును వేయుదుము, దీపముల వెలిగింతుము. షడ్రసోపేతమగునన్నమును భుజింపబెట్టుదుము. కర్పూరాదులతో వాసితమగు తాంబూలమునిత్తుము. మనమిచ్చిన యన్నాదికముతో తృప్తులయిరని వారిజూచి యానందింతుము. పత్రమునో పుష్పమునో ఫలమునో వారిచేతనిడి, సవినయముగ వారితో మనయోగక్షేమముల దెలుపుకొందుము పెద్దలకుపచారముజేయుటలో నీవిధానమే భారతదేశమందెల్ల యెడల

ననుసరించబడుచున్నయది. ఈయుపచారములనే భగవంతుని ప్రతి
మల నారాధించుటలో భక్తులుపయోగించుచున్నారు. వీనినే షో
శోపచారములందురు. ఉపచారమన సమీపముననుండి చరించుట
యనియర్థము.

౧ ఆవాహనము ౨ ఆసనము ౩ పాద్యము ౪ అర్ఘ్యము ౫ ఆచ
మనము ౬ స్నానము ౭ వస్త్రము ౮ అలంకరణము ౯ గంధము
౧౦ పుష్పము ౧౧ ధూపము ౧౨ దీపము ౧౩ నైవేద్యము
౧౪ తాంబూలము ౧౫ ఆనందనీరాజనము ౧౬ మంత్రపుష్పము
ఈపదునారుపచారములతో భగవంతునారాధించువారు భక్తిమార్గ
మున పుష్కలఫలమునందుదురు. భావనాతిశయముతో ఫలమతిశయి
ంచుచుండును. తనయెదుటనుండు ప్రతిమయందు భగవంతుడు ప్రత్య
క్షముగనున్నాడనియు భయభక్తులతోనతని యుపచారములజేయవల
యుననియు దెలిసికొని జేయవలయును. ఒకసామాన్యగృహస్థు
బూజించునపుడు మనమెంత శ్రద్ధాభక్తులతో మెలగుదుమో, సర్వే
శ్వరేశ్వరుడగు భగవంతుని మ్రోలనెట్లుమనము మెలగవలయునో
యోజించి మెలగుచుండవలయును. భగవంతుడు మనభక్తితో బ్రీతి
నొందును. అతనికిచ్చువస్తువులతనివే. ఆవస్తువులనిచ్చుటలో మనభక్తి
నేయతడు జూచునది. భక్తితో సమర్పింపబడిన పత్రముగాని పుష్పము
గానిఫలముగాని తోయముగాని పరమసంతోషమున నతడుస్వీకరించు
ను. భగవంతునకు వస్తుసౌందర్యముతో ప్రసక్తిలేదు. "పత్రం
పుష్పం ఫలం తోయం! యోమేభక్త్యాప్రయచ్ఛతి। తదహం భక్త్యుప
హృతమశ్నామి ప్రయతాత్మనః॥ అనగపత్రముగాని పుష్పముగాని
ఫలముగాని నీరుగాని యొకడునాకు భక్తితోనిచ్చునేని దానినినేను
భక్తితోడనే స్వీకరించి భుజించెదను" అనిశ్రీకృష్ణభగవానులు సెలవి
చ్చిరి. అనగ భక్తుడు భగవంతునకు పత్రపుష్పాదులలో నెద్దానినైన
సమర్పించక భుజించనని నిశ్చయముతోనుండు నంతభక్తికల వాడగు
నేని, భగవంతుడును భక్తుడుసమర్పించిన పత్రపుష్పాదికములననుభ
వించక క్షణమాత్రమైన నిలువలేనని యెంచి భుజించును భక్తిచేయు

వానికి భగవంతుడు బహుసులభుడు. " అరణ్యేసంతిపత్రాణి। నద్యాం స్వాదూదకానిచ। సన్తి పాదాచహస్తాచ కథంనారాధ్యతేహరిః॥ అరణ్యమందు పత్రిములుకలవు. నదియందుమధురమగును దకముక లదు. చేతులు కాళ్లుకలవు హరినేల బూజింపరో తెలియకున్నది. "స్మరరిపుణాకిల సృష్టాబిల్వా। సృష్టాన్యుదకాని। నరశరీరమపితు భ్యాం దత్తం। నార్చసికస్మాదీశ్వరంత్వం"॥

మన్మధవిరోధియగు పరమేశ్వరునిచేగద బిల్వములు సృజింపబ డినవి. ఉదకములతనిచేతనేగదకల్పింపబడినవి. నీకునరశరీరమా యివ్వ బడినది. ఇకనీశ్వరునేలయర్చించవు? అనిశాస్త్రకారులకుగుచున్నారు. భగవంతుడిచ్చిన పదార్థ ములతో భగవంతునారాధించుటకంటె సుల భమార్గమింకొకటి లేదని తాత్పర్యము.

ఈప్రతిమార్చనాభ్యాసమునకు వలయుపదార్థముల సంపాదిం చుట మొదలగు క్లేశములగూడ పడలేనివారలు భగవత్కథాశ్రవణ కీర్తనస్తుతి నమస్కారాదులతో తమకాలమును గడపవలయును. ఇట్లు చేయుటచే చిత్తశుద్ధిద్వారా మోక్షము చేకూరును. ఇందొక్కొక్కటి యైనను చిత్తశుద్ధి జేయగలదు. ఒక్కదానినైన జేయలేనివారలు భగ వంతునే శరణుబొంది దామాచరించు సర్వకర్మఫలములత్యజించవల యును. అనగస్వస్వవర్ణాశ్రిమధర్మములననుష్ఠించుచు నాయాకర్మల ఫలములు భగవంతునకే చెందవలయునని సంకల్పించి శాంతచిత్తులు కావలయును.

( స శేష ము )



## కలిచక్రవర్తిపట్టాభిషేకము.

(ద్వితీయపరికణము.)

కలిచక్రవర్తి - మాకుపట్టాభిషేకముం గావించి మాశాసనము లను వినిపింపుడని మీరుప్రార్థించినపుడు మాకురాజ్యము వచ్చినవిధా నమువినుపించి యపుడుమేము నియమించుకొనియున్న రాజచరిత్రము

ను జూపించి ముందుమాశాసనములను వినుపింతుమనివచించి యం టిమి యిపుడుమాశాసనములను వినిపించుటకుముందు మారాజనీ నించుకశ్రవణము గావించుట యవసర మనితలంచి యాపని ముగి చుచున్న వారము.

(గలిరాజనీతి)

ఇదివినిపించుటకుముందు ప్రపంచమును విరించి సృజించినవిధ నమును నించుకవినిపించవలసియున్నది. ఇదియాలకించినంగాని మారా జనీతిని మీరుసులువుగ గ్రహించజాలరు పరమేశ్వరుడుపరమేష్ఠినిసృ జించి యాయనకు వేదములఁబ్రసాదించి యదివచించినవదువునఁ బ్ర పంచమునుసృజించవలసిన దనివచించియున్న వాడు. ఆవిధులననుసరిం చియే విరించిప్రపంచమును సృజించుట కారంభించియుండు ముందు స్వర్గమర్త్యపాతాళము లనెడిమూడులోకములను సృజించియున్న వాఁడు. అందుస్వర్గమున దేవతలను మర్త్యలోకమునమానవులను బాతాళమున నాగములను సృజించియున్న వాఁడు. వారిలో దేవతాసృ ష్టికిఁ జేరినవారము మేమును, మానవసృష్టికిఁ జేరినవారు మీరును నై యున్న వారు మాస్వర్గలోకపరిపాలనను దేవేంద్రుఁ డాసంగి వించి మర్త్యలోకమును బరిపాలించుటకు మమ్ము నియోగించియున్న వాఁడు.

లోకములెన్ని సృజించఁబడినను నేలోకమువా రెట్లుప్రవర్తిం చవలసినదని వేదములు శాసించియున్నవో యాశాసనముల ననుసరిం చియే స్వర్గమర్త్యపాతాళవాసులగు పరిపాలకులును బరిపాలితులును బ్రవర్తించవలసియున్నది. ఈచెప్పినదానింబట్టి మీరును మేమును నొక నిచేతనే సృజింపఁబడి యొకవేదశాసనమునే యనుసరించి లోకయా త్రచేయవలసియున్నవార మనిమీరు గ్రహించగలరుకదా? వేదా ర్థములనే లోకక్షేమమునుగోరి దేవతలుమహర్షులు స్మృతులను సూత్రములను బురాణములను నితిహాసములను నాగమములను స్మగిం చియున్నవారు ఇన్నిటియందును వారుకృత త్రేత ద్వాపర కలియుగము లను యుగధర్మములను యుగాధిపులను గూర్చిముచ్చటించి యున్న వారు ఇట నొకవిశేషధర్మము వినిపించవలసియున్నది. అదేమన

దేవతాసృష్టికిఁ జేరినయుగాధిపుల మగు మేము మానవుల రగుమిమ్ముఁ బరిపాలింపవలసియున్నది. మాకుమీ రగుపడుచుందురు కానిమీకు మేమగుపడనేరము.

ఇట్లనిన మీరుమమ్ముఁ బరిపాలించు టెట్లందురా? వినుడు. మేముమీ బాహ్యేంద్రియములకుఁ గోచరించము గానిమీయంతరింద్రియములకు గోచరింతుము. ఇది మీకుగ్రహింపలేకపోవచ్చును గాని మీయంతరింద్రియములు గ్రహించుచునేయున్నవి. అందుచే నవి మాశాసనమునను సరించియే ప్రవర్తించుచున్నవి. అవిమాశాసనముల ననుసరించినవనిన మీరుమాశాసనముల ననుసరించి వర్తించుచున్నారనియర్థము.

ఇంతకుఁబూర్వము మాకుఁబగవారు భరతఖండమునమాత్రమే కలరు, గాని యితరఖండములందు లేరనియు వారుబ్రాహ్మణాది చండాలాంతసకలజాతీయు లనియు తెలిపియుంటిమి మీరువేదోక్తములగు స్వస్వవర్ణోచిత ధర్మములందు తత్పరులైయుండువారు వారుస్వధర్మరతులైయున్న సంతసించువారు మాముత్తాతగారగు కృతయుగాధిపులు. వారిలో నాలవవంతు ధర్మత్యాగము గావించిన సంతసించువారు మాతాతగారగు త్రేతగారు రెండుపాదములు ధర్మచ్యుతిగాంచినవారిని గాంచి సంతసించువారు మాజనకులగు ద్వాపరయుగాధిపులు. మాసంగతి మీకుదెలిసియున్న దేకదా మూడువంతులు ధర్మత్యాగము గావించినవారింగాంచి బ్రహ్మానందమొందుచుందుము.

ఈచెప్పినదానింబట్టి మాకీఖండమున నొకవంతుమానవులు (ఏడుకోట్ల యేఁబదిలక్షులమంది) శత్రువులుండక తప్పదని తేలినది కదా? ఈస్థితియిప్పుడే మాకువచ్చునదికాదు. ఈయుగాంతమున వచ్చునని మీరుగ్రహించవలెను. ఇప్పటికి మాపగవారిసంఖ్యయే యధికముగానున్నదని చెప్పకతప్పదు. వారిలోనగ్రగణ్యులగ్రజన్ములైయున్నవారు. వారెట్లుచెప్పిన నట్లునడుచువారు క్షత్రియాది చండాలాంతసజాతీయు లనిమీరెరిగియే యున్నవారుకదా? ఆబ్రాహ్మణుల యుచ్చదశ నేమని వర్ణింపవలెను? భగవంతుఁడే "బ్రాహ్మణో మమదేవతా"

బ్రాహ్మణులే నాకుఁ బూజ్యులగు దేవతలని మొత్తుకొనియున్న వాఁడ
ఊరక మొత్తుకొనుటయె కాదు మనము దేవతలను బూజించు ట్ల
బ్రాహ్మణులను బూజించియున్నాఁడు. ఆపూజ్యతకు కారణము "తన్మ
త్రం బ్రాహ్మణాధీన" మని చెప్పియున్నాడు. అనఁగ వేదోక్త మంత్ర
ములు బ్రాహ్మణాధీనములై యున్నవని పై వచనార్థము వానికి
యాధిక్యత యెట్లువచ్చినదందురా "మంత్రాధీనంతు దైవతమ్మ"
చెప్పియున్నాడు. అనఁగ వేదమంత్రములకు దైవములోఁబడియున్నా
డని దానియర్థము.

దైవమును లోఁబరచుకొన్నవి వేదమంత్రములనియు వేదమ
లను లోఁబరచుకొన్నవారు బ్రాహ్మణులనియుఁ దెలియవచ్చినదికదా
ఇట్లు దైవమునకే దైవములై యున్న బ్రాహ్మణులకు తక్కినమానవు
దాసానుదాసులై ప్రవర్తించకదప్పునా? తప్పినఁ బ్రాణములు దక్కు
నా? దక్కవు. కానివారినే భగవంతుఁడుసృజించినాఁడో యా భగవ
తుఁడే మమ్మునుసృజించియున్నవాఁడు వారికే వేదములు ప్రమాణ
ములైయున్నవో, మాకును నవియే ప్రమాణములు. కాని వారిప్రవ
ర్తనమునకును మాప్రవర్తనమునకును నించుక యంతరముకలదు
అదేమన? బ్రాహ్మణులు వేదములకు దాసులై వేదములువిధించి
ధర్మముల ననుష్ఠించి నిషేధించినకర్మలను విసర్జించెదరు మేము
గాక వేదములువిధించిన ధర్మములువిసర్జించి యవి నిషేధించిన ధ
ముల ననుష్ఠించుచుందుము బ్రాహ్మణు లట్లు నడుచుటకును మేమి
నడుచుటకును వేదశాసనములే యాధారములై యున్నవి. అం
నను వేదముల ననుసరించుచున్నవారు వారును నెదిరించుచున్న
రము మేమును నైయుండుటచే భగవంతుఁడును భగవతియును ము
దిమూడుకోట్ల దేవతలును ముప్పదిమూడుకోట్ల ప్రజలును, వా
లోఁబడి ప్రవర్తించవలసివచ్చినది.

మాకట్లు ప్రజలులోఁబడక పోయినను యుగాధిపులమై య
డుటచేఁ గొందరుగాకున్న గొందరైనను మాకువశ్యము కాక త
కున్నది. మా నేర్పు పెంపునఁ గాంతలను కనకమును నుద్యోగముల

ముందిడి కొందఱిని మాపక్షమునకు లాగుకొనుచున్నవారము. కాని మా ప్రతిపక్షులు బలవంతులగుటచే వారిలోఁ గొందఱిని బోధించియు మఱికొందఱిని బాధించియు భాగములు పంచియిీక వేధించియు లోఁబరుచుకొని వారికి ప్రాయశ్చిత్తములుచేసి మరలలాగుకొనుచున్నవారు. ఇట్లుండ దైవానుగ్రహమున దొలుత మహమ్మదీయులును దరువాత క్రైస్తవులును భారతరాజ్యమునకు రాజులగుట తటస్థించినది. వారిలో మొదటివారు దారుణమార్గ మవలంబించి వైదికమతనాశమునకు యత్నించిరి అందుచే నచిరకాలముననే వారిరాజ్య మంతరించి వారుపకీరులు కాకతప్పదయ్యెను. బ్రిటిషుప్రభుత్వము వారట్లుగాక శాంతపద్ధతి నవలంబించి వైదికమతనాశనముఁ జేయుటకు మిషనువారిని ముందిడిరి. వారుమాయామానుషవిగ్రహులు కాన మనవారుతిట్టిన దలలువంచుకొని యీచె పదట్టిన నాచెంపఁ బట్టవలెనను క్రైస్తవనీతి ననుసరించి యీవీథిలోఁ జీవాట్లువేసి మనవారుదరిమిన మారుమాటాడక యావీథికిఁబోయి యెప్పటిబోధనే చెప్పుచు మెత్తనివారినిజూచి శునకములను వశ్యముచేసి కొనఁదలఁచినవారు రొట్టెముక్కలనో యన్నమో ముందువేయునట్లు మిషనువారుకాంతనో కనకమునో వారిముందిడి వారినిదమలోఁ గల్పుకొనిఁ కృతార్థులగుచు వచ్చిరి. కానిదానన తగా వైదిక మతనాశనమును గాంచలేకపోయిరి.

అపుడిది కాదని మిషనువా రింగ్లీషుపాఠశాలలు పెట్టి యందు బాగుగఁజదివినవారికి బహుమానములను బెద్దయుద్యోగములను నిచ్చి గౌరవించసాగిరి. అదికని వారిప్రోత్సాహముతోఁ బనిలేకయే మనపగవారు గొఱ్ఱెలపగిది యిండ్లుపొలములు పోగొట్టుకొని చదువు మొదలిడిరి. పాఠశాలలో బ్రవేశించిన మరునాడు జుట్టును నామరునాడు బొట్టును నామరునాఁడు కట్టును దుడిచిపెట్టుకొని పండితులై యందులకేవగించు తలిదండ్రులను నన్నదమ్ములను నానెచ్చులని స్టూపెడ్డులని యాసులని దూషించుచు నపరక్రైస్తవులై పంట్లములు తొడిగి తిష్ఠమ్మాత్రులై బెడ్డుకాఫీలుత్రావి సోడాబుడ్లుపగులఁగొట్టుచు మాలెతల నంటుకొనినంగాని దేశమునకు ముక్తికలుగ దనువారును

తిష్ఠస్మార్తులును ధావస్మార్తులు నైయున్న వారు. వారేయిపుడు శాసననిర్మాణసభా సభ్యులును బోర్డుప్రెసిడెంటులును మునిసిపలు చైర్ మనులును, న్యాయవాదులును న్యాయాధిపులును, పత్రికాధిపతులును భగవద్భక్తులును, హరిదాసులును, జగద్గురువులును, వేదో సర్వమునకును వారెయగుచున్నారు. వారేరేపు భోక్తలు మాత్రులునై ఘస్టుపిండము, సెకండుపిండము, థర్డుపిండము, పుట్టునువారి పుట్టుచున్నారు. వీరందరును మనప్రజలే. మనయభినందనములకును బహుమానములకును పాత్రులే. సంశయములేదు. కానివీరిలో వీరికి గొన్ని వైషమ్యకారణము లేర్పడి పరస్పరము కలహించు కొనుచున్నారు. కానదీన మనపగవారికి గొంతసంతోషము కలుగకపోదు అదిమనరాజ్యమునకు హానిదెచ్చును. దానిగూర్చి ముందుపరికరణమున ముచ్చటించెదను-

అపాయింటుమెంటార్డరు

ఆందుకూరుపేట జగద్గురుసంస్థానాధీశ్వరులును శ్రీమన్మహత్యాది సకలబిరుదావళీ విరాజమానులునగు జి బి. యస్. సరస్వతీస్వాములవారిని మాసంస్థానమున జతుర్థజగద్గురువులనుగాను, తెనాలి సంస్కృతకళాశాలాసాహిత్యోపాధ్యాయులును "శైవరహస్యబోధనీ" పత్రికాసంపాదకులును నడుతాడికొండముది గొండనాగలింగశాస్త్రి గారిని మాసంస్థానమునం బంచమపంక్తులనుగాను నపాయింటు చేయడమైనది.

కలివిలాసపేలస్, విజయవాడ 23—2—28.

కలిచక్రవర్తి, యుగాధిపతి.



వైశ్యవేదోక్త క్రియా విచారవ్యవస్థా పీఠికా విమర్శనాత్మక.

# చతుర్వర్ణచరిత్ర.



(పీఠిక)

శృంగేరి పీఠసంస్థాన పండితంమన్యులు కలియుగమునఁ బరిశుద్ధయోని బీజములకు జనించిన క్షత్రియ వైశ్యులుండరు. ఉన్నవారు క్షత్రియ వైశ్యంమన్యులు కాన వారికి వేదోక్త కర్మానుష్ఠానమున కధికారములేదని తెలుపుటకై వ్రాసి ప్రకటించిన "వైశ్యవేదోక్త క్రియావిచార వ్యవస్థ" యనుగ్రంథాభాసమును ఖండించుటకుపక్రమించి గ్రంథస్థవిషయమునకును గ్రంథనామమునకును గలవైషమ్యమును గనుపరచి గ్రంథకర్తల పండిత శిఖామణులేకాక యనామధేయ విద్వాంసులుకూడ నైయున్నారని స్థిరపరచి చిగురున మల్లాదిరామకృష్ణసోమయాజిగారు కావించిన వ్యవస్థామండనమునకు ఖండనముపక్రమింతుమని తెలిపియుంటిమి. ఇపుడాపని ముగించుచున్నవారము వినుడు.

(వ్యవస్థామండన ఖండనము.)

రామకృష్ణసోమయాజిగారు వ్యవస్థలోని యంశము లన్నియు శాస్త్రాచారవిహితములే యైయున్నవని చెప్పుటయేకాని వారి వాదమును బ్రత్యేకముగ వినిపించక వ్యవస్థా విషయములను మాత్రమే యిపుడిందు వినిపించుచున్నవారము. ఇవియెపుడు ఖండింపబడునో యపుడే రామకృష్ణసోమయాజిగారి మండనము ఖండింపఁబడి యున్నదని మాపాఠకులు నిర్ణయించుకొందురుగాత. ఇఁక వినుడు.

(పీఠికావిమర్శనము.)

తెలుఁగు దేశమునఁ దెలుగు భాషయందుఁ గోమటుల నివ్యవహరింపఁబడుచున్నవారిలోఁ గొందరు "మేమువైశ్యులము మాకు వేదోక్త మంత్రముల చేతనే షోడశకర్మలను యాగాదికర్మలను

చేయించవలసినదని శ్రుతిస్మృత్యాది సకలశాస్త్రములు చెప్పి యున్నవి. ఇట్లుండగా నట్లుమాచే బ్రాహ్మణులుచే యింపించుట లేక మనాగ్రహముతో స్వయముగ నుచ్ఛృంఖలులై ధనాదికముచేఁ గొందరు బ్రాహ్మణులను మోసగించి వశ్యముచేసికొని వారివలనఁ గొందిదినములనుండి వేదమంత్రములతో షోడశకర్మలుచే యింపించుకొనుట కారంభించియున్నవారు వారిలో లక్ష్మీనృసింహ శ్రేష్ఠియను వలెఁడొకఁడు కడచినవత్సరమున నగ్న్యాధానముఁ గూడఁ జేసినటుల కింవదంతి వినవచ్చినది. ఈవిషయము నాక్షేపించుచుఁ బలువురు బ్రాహ్మణులు వీరిట్లుచేయుట శాస్త్రీయమగునా? కాదా? యని వారివారికి దోచినరీతివిమర్శించి పత్రికలు ప్రకటించియున్నారు. కానివారు (వైశ్యులు) వీరిమాటలను సరకుచేయక స్వేచ్ఛగా బ్రవర్తించుచున్నారు. కాన నీవిషయమై శాస్త్రీయ నిర్ణయముఁ గావింపుడను బహుమందిబ్రాహ్మణాదుల ప్రార్థనాను రోధమున మాచేనిర్ణయింపఁబడుచున్నదని "చెప్పుచు ముప్పదివత్సరములనాడు శృంగేరీపీఠము. వాశ్రయించుకొనియున్న యనామధేయ విద్వాంసులు కొందరు కలిపలుకుల నఁదగిన చిలుకపలుకులు పలికియున్నారు కాన వానికిక్రిందనిచ్చుచున్నారము. చూడుము వ్యవస్థలోని 2. 3. పుటలను.

"కేచనవయం వైశ్యాః అస్మాకం శ్రుతిస్మృత్యాదిభిః వేదోక్తమంత్రైః షోడశ కర్మాణియాగాది కర్మాణి చవిహితాని తాన్యస్మాభిర్బ్రాహ్మణాః నకారయంతీ త్యాగ్రహేణ స్వయముచ్ఛృంఖలాస్సంతః కతిచన బ్రాహ్మణాన్ ధనాధిభిర్వంచయిత్వా స్వవశమానీయ తద్ద్వారావైదికమంత్రైః షోడశకర్మాణి అత్యల్ప కాలమారభ్య కర్తుముత చక్రముః। తేషుకశ్చన లక్ష్మీనృసింహ శ్రేష్ఠి నామకః గతసంవత్సరే అగ్న్యాధాన మపిచకారేతి కింవదంతీ శ్రూయతే ఏతద్విషయమాక్షిప్య బహవోబ్రాహ్మణాదయః ఏవమేభిరనుష్ఠితం, ఏతచ్ఛాస్త్రీయ్యం ఉతఅశాస్త్రీయమితి సందిహానాః కేచన స్వస్వమత్యను సారేణ యథాసంభవం లేఖనాది భిర్నిర్ణ యంచక్రుః। తథా

ప్యుచ్ఛృంఖలాః తత్తద్బ్రాహ్మణో క్త్యాన్య నాదృత్య స్వేచ్ఛాను సారే ణవర్తంతే, ఏతద్విషయే నిర్ణయః కార్యఇతిబహుజన కృతప్రార్థనాను రోధేననిర్ణీయతే."

అనిశృంగేరీ పీఠపండితంమన్యులు తామీ వ్యవస్థా నామకదు రవస్థలోబడుటకుఁగాను నిదానమునుదెలిపియున్నారు. ఈ చెప్పినదా నిఁబట్టి చూడఁ తెలఁగున గోమఁటులని పిలువబడు వైశ్యులు చేశినదు ష్కార్యము వేదోక్త మంత్రములతో వేదోక్తకర్మలను మాచేజేయిం చవలసినదని బ్రాహ్మణులను గోరివారిలోఁ గొందరను మఱించకున్న మఱికొందఱినైనను బ్రాహ్మణులనే ప్రార్థించి ధనాదికముచే వారితని విఁచేర్చి వారిచేతనే వైశ్యులు వేదోక్తవిధిని వేదోక్తకర్మలను నాచ రించి యున్నారని ప్రతిపక్షబ్రాహ్మణులును వారిపక్షమున దీర్పుచేసి నిశృంగేరీ పీఠపండితం మన్యులునుగూడఁ జెప్పియున్నారుకదా? వైశ్యులింకను మించి కావించిన యకార్యకార్యములేవియును లేవు.

ఈవివాదమైనను వైశ్యులతోవచ్చినదికాని క్షత్రియులతో వచ్చియుండలేదు. వచ్చినటు లీవ్యవస్థయందు జెప్పియుండలేదు. ఇట్లుండఁ బీఠపండితులు తమగ్రంథపీఠికయందు క్షత్రియులనుగూడఁ జేర్చి వైశ్యసంఘమునుగూర్చి యెంతటి నీచాలాపములతో ముచ్చటిం చుట కుపక్రమించియున్నారోయిటువినుడు.

"క్షత్రియ వైశ్య శూద్ర వర్ణేషుసూర్య-చంద్రాది వంశీయాః యోనిబీజాభ్యాం పరిశుద్ధాః శాస్త్రోక్త కర్మానుష్ఠాతారః క్షత్రియాః దుర్లభాఏవ"

అనియు పక్రమించియున్నవారు. అనఁగ క్షత్రియ వైశ్య శూద్ర వర్ణము లందు సూర్యచంద్రాది వంశీయులును శాస్త్రోక్తక ర్మల నుష్ఠించువారును బరిశుద్ధయోని బీజములఁ (తలిదండ్రుల) వలన జనించినవారును నగుక్షత్రియులు కలియుగమున దుర్లభులే యని పైవాక్యార్థము. ఇఁక వైశ్యులనుగూర్చి వ్రాసినవారి వ్రాతను వినుడు.

“యోనిబీజాభ్యాం పరిశుద్ధాః శాస్త్రోక్త కర్మానుష్ఠాతారః
వైశ్యాశ్చ ఇదానీం నోపలభ్యంతయేవ”

అనఁగఁ బరిశుద్ధ యోనిబీజము (తలిదండ్రు)లకు జనించినవా
రును శాస్త్రోక్త కర్మలనుష్ఠించువారును నగువైశ్యులును గలియు
మున లభించనే లభించరని పైవాక్యార్థము. పరమేశ్వరా పాపమ
శమించునుగాక.

వైశ్యులు వేదోక్త కర్మలాచరించినందుఁ కేకదా బ్రాహ్మ
ణులు వారిపైనలిగివారినే గాక వారితో క్షత్రియులనుగూడ క
పరిశుద్ధయోని బీజములకు జనించిన క్షత్రియవైశ్యులు కలియుగము
లేనేలేరని పీఠపండితులు తెగబెట్టి వ్రాయుటయు వారివ్రాతను మల
ది రామకృష్ణసోమయాజిగారు మండనముఁ గావించుటయుఁ దటస్థిం
నది? ఇది యపరిశుద్ధయోని బీజములకు జనించిన బ్రాహ్మణపండి
మన్యులు వ్రాయదగినది కాని సమర్థించ దగినదికాని యెన్నటి
గాదు.

ఇఁక శృంగేరీ పీఠపండితులీ గ్రంథములెట్లు రచించిరో దా
సమర్థించుటకు మల్లాదిరామకృష్ణ విద్యాసోమయాజి గారెట్లు క
త్రించిరో తెలియకున్నది?

విషయమిట్లుండ (బీఠపండితులు కలియుగమున నాద్యంత
లగు బ్రాహ్మణ శూద్ర జాతులు మాత్రమే కలవుగాని మధ్యనుం
క్షత్రియవైశ్యజాతులు రెండును లేవు. అవిస్వరూప నాశనము
జెంది యున్నవను నొక సాహస సాతిసాహస వాదమున కుపక్రమిం
దానిని స్థిరపరుచుకొనుటకై పురోహితబ్రాహ్మణులు సంపాదిం
ప్రమాణవచనములనే వారును నుపయోగించుకొని యున్నవా
వానిని క్రింద నుదహరించి విమర్శించుటకు నిశ్చయించియున్నవార
కాన గనుడు.

## ప్రతిపక్ష ప్రమాణసామగ్రి.

"అస్మిన్ విషయే కేషాంచి ద్బ్రాహ్మణా నాంసమాధానమే వంశుశ్రుమ "పరాశరమాధవీయే ఏకాదశాధ్యాయే గింశ్లో॥ యుగే యుగే చయేధర్మాస్తత్రతత్రచయేద్విజాః। తేషాం నిందాన కర్తవ్యా యుగరూపాహితేద్విజాః॥ ఇతివచన వ్యాఖ్యానసమయే సాయణ మాధవాచార్యైః క్షత్రియ వైశ్యజాత్యోశ్చ స్వరూపేణోచ్ఛిన్న త్వాత్ ఇతిప్రతిపాదితః తేనకలియుగే క్షత్రియవైశ్య జాత్యోరే వాభవాత్ ఇమేవ్యవహర్తారోనవైశ్యాః"

ఈవిషయములోఁ గొందరు బ్రాహ్మణుల సమాధానమిట్లు వినియున్నాము. అదేమన? పరాశరమాధవీయమున నేకాద శాధ్యాయమునందు యుగేయుగే " యను గింవ శ్లోకమునకు వ్యాఖ్యానము చేయునపుడు సాయన మాధవాచార్యులచే క్షత్రియ వైశ్యజాతులును గూడ నుచ్ఛిన్నము లయినటుల ప్రతిపాదింపబడినది. అందుచే గలి యుగమున క్షత్రియవైశ్యజాతులు రెండును మాత్రమే లేకుండుటవ లన నిపుడు వైశ్యులని వ్యవహరింఁబడువారు వైశ్యులుకారని ప్రతి పక్ష బ్రాహ్మణులు పైవాక్యముఖమునఁ జెప్పియున్నారు.

మీాదిప్రతిపక్షవాక్యములలోని పరాశరమహర్షి శ్లోకమును మాధవాచార్య వాక్యమును పరాశరమాధవీయము నందున్న వేకాని కల్పితములుకావు. కానివానికిఁ బ్రతిపక్షులు కావించినయర్థము మాత్రము విరుద్ధమైయున్నది. ఇదితరువాత సవిమర్శకముగ వినుపింపఁ దలంచి ఇపుడది వదలి పిదప వాగుకన్నరచిన ప్రమాణవచనముల నిపుడు విమర్శించుచున్నవారము కాన సావధానముగ వినుడు.

"ఏవంశ్లో॥ బ్రాహ్మణాః క్షత్రియావైశ్యాః। శూద్రావర్ణాస్త్ర యోద్విజాః। యుగేయుగేస్థితాస్సర్వే! కలావాద్యంతయోస్థితిః॥ ఇతి వై శ్యకమలాకరోక్త పురాణవచనేన, ఏవంశ్లో" నాధీయతే కలౌవేదాన్ నయజంతేద్విజాతయః। ఉత్సీదంతి తథాచైవ వైశ్యైస్సార్థంతు క్షత్రి

యాః॥ ఇతిమత్స్యపురాణవచనేనచ, శ్లో॥ నందాంతంక్షత్రియ కుల వేదవైదికసంయుతం। భవిష్యతి తతశ్శూద్రః। ప్రాయం వైశ్యకుల తథేతిఅత్రిస్మృతివచనేనచ, కలౌవైశ్యజాతే రేవాభావాత్ ప్రకృ వ్యవహర్తారః కోమటి పదవాచ్యాః నవైశ్యాః"

ఈయిచ్చిన ప్రమాణవచనములును బ్రతిపక్షుల యభిప్రా యములును గూడ గలియుగములో బ్రకృతము కోమటులని వ్య హరింపఁబడువారు వైశ్యులుకారని తెల్పియున్నది ఇపుడివి చెప్పి చూపినన కోమటులు వైశ్యులగుదురా కారా యనువిమర్శనము విచారి చుటకుముందు మనప్రతిపక్షులు దాహరించిన శ్లోకములు వారుచెపి నగ్రంథములలో నున్నవా? లేవా? ఉండినయెడ నానికి వారుచేసి యర్థము సరిగనున్నదా? లేదా? లేనిచో వారివాదమునకు గ యేమి? కర్తవ్యమేమి? అనువిషయములను సమగ్రముగ మనమ విమర్శించి తెల్పవలసియున్నది. కాననిది మాపాఠకులు సావధా మానసముల నాలించి సత్యసారమును జవిగాంతురుగాత.

ధర్మజిజ్ఞాస చేయఁదలఁచుకొన్న పురుషులకు శ్రుతిపర ప్రమాణమని మహర్షులెల్లరు నేకగ్రీవముగ నంగీకరించియున్నవా ఇంతియెకాదు. తాము వేదార్థములనే స్మృతులనుగా రచించియు న్నామని చెప్పియున్నారు.

ఇంతట్రితో నిలువక మాచేరచింపఁబడిన స్మృతులు సూ ములు, పురాణములు, ఇతిహాసములు, మున్నగువానిలో నెం వేదవిరుద్ధ ధర్మములుండినయెడ నవి ప్రమాణములు కావనిమా విశదీకరించియున్నవారు. ఇవిగాక పైప్రమాణగ్రంథ వచనముల సంగ్రహించి కొందరు మహాపండితులు నిబంధనస్మృతులనెడి వ కొన్ని గ్రంథములనుగూడ రచించియున్నారు అవియు బ్రమాణమ లుగనే గ్రహింపబడుచున్నవి. కాని యవి మూలగంథవిహీనము నున్నపుడే ప్రమాణములయ్యెడిని. ఇక మనము ప్రకృతమనుసరించ దము. కలియుగమున క్షత్రియవైశ్యజాతులు రెండును లేవనికదా మ ప్రతిపక్షులవాదము.

మనప్రతిపక్షులవాదమును బోషించు శ్రుతివచనములున్నవా? లేవు. ఉండినయెడవానిని వారుదాహరించియే యుందురుకదా? అది లేదు. కావునఁ గలియుగమున క్షత్రియవైశ్యులు లేరను ప్రతిపక్షవాదము శ్రుతివిరుద్ధవాదమని యీదానివలన బాలబోధకమగుచున్నది.

శ్రుతులతరువాతఁ బరమప్రమాణమగునది మనుధర్మశాస్త్రము అదియేమైన గలియుగమున క్షత్రియవైశ్యు లుండరని చెప్పియున్నదాయని ప్రతిపక్షులను ప్రశ్నింపుడు. చెప్పలేదని చెప్పి తీరుదురు. తక్కిన స్మృతులలో బ్రకృతము ముఖ్యముగ విచారించదగినది. పరాశరస్మృతియని చెప్పకదప్పదు. ఏలయనఅదికలియుగ ధర్మశాస్త్రమైయున్నది కాన ముఖ్యమని ప్రతిపక్షులుకూడ నంగీకరించకతప్పదు. కలియుగధర్మశాస్త్రకర్తయగు పరాశరుడు కలియుగమున క్షత్రియ వైశ్యు లుండరని చెప్పవలెగదా? అదిచెప్పలేదు.

ఇదియెకాదు పరాశరస్మృతి ప్రకృతచర్చయందుఁ బరమప్రమాణమని చెప్పుటకు మరియొక ప్రబలాధారము కనబడుచున్నది అదేమన? అఖిలవేద వ్యాఖ్యాన విఖ్యాతయశస్కులగు మాధవాచార్యులవారు పరాశరస్మృతికివ్యాఖ్యానము కావించియున్నారు వారుకలియుగమున క్షత్రియవైశ్యులుండరని చెప్పియుండిన శ్రుతుల నిచ్చియుండవలెగదా? లేదు. కాననది పరమప్రమాణమగుటకే విషయమున యభ్యంతరమునులేదు ఇట్లు ప్రబలప్రమాణమైయున్న పరాశరధర్మశాస్త్రారంభమున ౧౭వ శ్లోకమున బరాశరమహర్షినిగూర్చి వ్యాసాదిమహర్షులు చాతుర్వర్ణ్య సమాచారమును చెప్పవలసినదని క్రిందిశ్లోకముఖమున ప్రశ్నించియున్నారు.

శ్లో॥ సర్వేధర్మాః కృతేజాతాః। సర్వేనష్టాః కలౌయుగే।
చాతుర్వర్ణ్యసమాచారం। కించిత్సాధారణంవద॥

ధర్మములు సాధారణములు నసాధారణములు నని రెండ తెగలుగనుండును. అందుఁ జాతుర్వర్ణ్యము యొక్కసాధారణ ధర్మమును జెప్పవలసినదని మునులు పరాశరమునిని బ్రశ్నించియున్నార ఈప్రశ్ననుబట్టి కలియుగమున జాతుర్వర్ణ్య మున్నట్లు తెలియ

వచ్చుచున్నది. వారులేనియెడనిట్లగునా? ఇంతియెకాదు. ఆవెంట
మునులు క్రిందశ్లోకముఖమున నాలుగు వర్ణముల ధర్మములను
జెప్పవలసినదని ప్రశ్నించియున్నారు. ఇదివినుడు.

శ్లో॥ చతుర్ణామపివర్ణానాం। కర్తవ్యంధర్మకోవిదైః
బ్రూహిధర్మస్వరూపజ్ఞ। సూక్ష్మంస్థూలంచవిస్తరాత్॥

ఈచెప్పినదానింబట్టి కలియుగమునగూడ నాలుగువర్ణము
నగ బ్రాహ్మణ క్షత్రియవైశ్య శూద్రవర్ణము లుండుటంబట్టియె
వానిసాధారణా సాధారణ ధర్మములను జెప్పవలసినదని పరాశర
మహర్షిని మునులు ప్రశ్నించియున్నారు లేకున్న ప్రశ్నించియు
దురా? ఇంతియేకాదు. ప్రాయశ్చిత్త కాండదశమాధ్యాయారంభశ్లో
కమున నాలుగు వర్ణములవారికిని విహితమగు నిష్కృతిని జెప్పుచు
న్నానని పరాశరమహర్షి చెప్పియున్నాడు. ఇదివినుడు.

శ్లో॥ చాతుర్వర్ణ్యేషుసర్వేషు। హితాంవక్ష్యామినిష్కృతిం।
అగమ్యాగమనే చైవ। శుద్ధ్యైచాంద్రాయణంచరేత్॥

ఇంతియెకాదు ఇటుపైనే కాద శాధ్యాయమున ౧౨ శ్లోకము
ఖమున గలియుగమునను గూడ క్రియావంతులు శుచివ్రతులు నగు
క్షత్రియవైశ్యుల గృహములందు వచ్చెడి హవ్యకవ్యములందు
బ్రాహ్మణులు భుజించవచ్చునని పరాశరమహాముని యుపదేశించి
యున్నాడు ఇదివినుడు.

శ్లో॥ క్షత్రియశ్చాపివైశ్యశ్చ। క్రియావంతౌ। శుచివ్రతౌ
తద్గృహేషుర్ద్విజైర్భోజ్యం। హవ్యకవ్యేషునిత్యశః॥

అట్లనిన మీరింతవరకు గన్పరచిన వచనములన్నియు గలి
యుగ పరిమాణగ్రంథములలోని వేమైనను బరాశరుడు కలియుగ
ధర్మములనేగాక యితర యుగధర్మములను గూడజెప్పియుండవచ్చును
అపుడివి కలియుగములో క్షత్రియవైశ్యులుండరని తెల్పుటకై
మాచే గన్పరచబడిన వెనుకటివచనములను ఖండింపజాలవని యేమై
నమనప్రతిపక్షులు ప్రతిఘటింపజూతురేమో సావధానముగవినుడు.

మనప్రతిపక్షులుచెప్పిన విధమున మనము కన్పరచిన మీదివ

చనములి తరయుగవిషయములను జెల్పునవి యేమైన యెడలను వారుకన్నరచిన వచనములు మాధవాచార్యులవారికగుపడి వానిని వారు ప్రిమాణములుగా నమ్మియున్నయెడలను బైశ్లోకమునకు వ్యాఖ్యానము జేయునపుడు మాధవాచార్యులవారు క్రియావంతులు శుచివ్రతులు నగు క్షత్రియవైశ్యుల గృహములందు జరిగెడి హవ్య కవ్యములలో బ్రాహ్మణులు భుజించవచ్చునని చెప్పిన పైశ్లోకము యుగాంతర విషయమును జెప్పినదికాని యీకలియుగమున క్షత్రియ వైశ్యగృహములందె బ్రాహ్మణులు భుజించవచ్చునని చెప్పియుండలే దని చెప్పి యిపుడు మనప్రతిపక్షులు కన్నరచిన వచనములను జూపి కలియుగమున క్షత్రియవైశ్యులు లేరుకాన స్వధర్మములను విడచి శూద్రప్రాయులైయున్న క్షత్రియవైశ్యంమన్యులనుగని పొరపడి వారినుత్తమ క్షత్రియవైశ్యులనుగ భావించి వారియిండ్ల భుజింతు రేమో భుజించిచెడవలదని బ్రాహ్మణులను మాధవాచార్యులవారు ప్రిబోధించియుండవలెనుగదా? అదియిదున్నదేమో చూతుడ వతా రికను. "శూద్రాన్నం సూతకాన్నం చేత్యత్రిబ్రాహ్మణస్య శూద్రా న్నభోజన నిషేధమభిప్రేత్య తత్ప్రాయశ్చిత్తమభిహితం। తేనైవన్యా య్యేనహీనవర్ణత్వ సామ్యాద్రాజాన్నం హరతే తేజ ఇత్యాది శాస్త్రాచ్చక్షత్రియాద్యన్నభోజనేపి విప్రస్యప్రాయశ్చిత్తం ప్రసజ్యేత అతస్తదపనుత్తయే క్షత్రియాద్యన్న భోజన మభ్యను జానాతి"

శూద్రాన్నము సూతకాన్నము, అనుచోటబ్రాహ్మణునికి శూద్రాన్నభోజనము నిషేధింపబడుటను బట్టియచట ప్రాయశ్చిత్తము చెప్పబడినది. ఆన్యాయము చేతనే హీనవర్ణత్వము సమానమగుట వలనను రాజాన్నము తేజస్సునుహరించునను శాస్త్రముండుటవలనను క్షత్రియవైశ్యాన్న భోజన మందునుగూడ విప్రునికి ప్రాయశ్చిత్తము కలుగునను సంశయమురాగా నాసంశయని వృత్తికై పరాశరుడు క్షత్రియాద్యన్న భోజనమును పైశ్లోకముఖమున ననుమతించుచున్న వాడు అని పైయవతారికార్థము. ఇకశ్లోకార్థమునువినుడు.

"క్రియావంతౌ విహితాధ్యయన యజనాదియుక్తౌ శుచివ్రతౌ వ్రతం స్మార్తోధర్మః తచ్చయథా విధ్యనుష్ఠితం శుచిర్భవతి తద్యుక్తౌ శుచివ్రతౌ స్మార్తధర్మనిష్ఠయోః క్షత్రియవైశ్యయోః గృహేషుహ

వ్యైకవ్యే వాశిష్టైర్భోక్తవ్యం క్రియావంతౌ శుచివ్రతా విత్యధికారి విశేష
ణాదితరక్షత్రియాది విషయాణి తదన్న నిషేధశాస్త్రాణీత్యవగంతవ్యం"

స్వస్వజాతి విహితాధ్యయన యజనాది క్రియావంతులును
యథావిధిగ ననుష్ఠింపఁబడిన స్మార్తధర్మములు కలవారై పరిశుద్ధులుం
నవారును నగుక్షత్రియ వైశ్యుల గృహములందు వచ్చెడి హవ్యమం
దుగాని కవ్యమందుగాని శిష్టులగు బ్రాహ్మణులచే భుజింపదగిన
క్రియావంతులు శుచివ్రతులు ననునధికారవిశేషణములవలన నితరక్ష
త్రియ వైశ్యులయన్నమును దినకూడదని తదన్ననిషేధ వాక్యములకు
గతికల్పింపబడినదని తెలియదగునని విద్యారణ్యవ్యాఖ్యానార్థము.

ఈచెప్పిన దానింబట్టి కలియుగమున క్రియావంతులును శుచి
తులునైన క్షత్రియ వైశ్యుల గృహములలో శిష్టబ్రాహ్మణులు హవ్య
కవ్యములందు భుజించవచ్చునని స్మృతికర్తయు వ్యాఖ్యాతయు
గూడనంగీకరించి నట్లుస్పష్టమైనదికదా? ఇఁకఁగలియుగమున వారు
లేనేలేనియెడల నీశ్లోకవ్యాఖ్యలకు గతియేమి. ఇదియు గాంతరవిషయ
మని విద్యారణ్యులవారు గతికల్పింపలేదుకదా? కానఁగలియుగమున
క్షత్రియవైశ్యులు నున్నారని దీనివలన స్పష్టమగుచున్నది. ఇకముందు
ప్రకరణమున క్షత్రియవైశ్యులు స్వరూపముచే నశించినటుల విద్యా
రణ్యులు తమకు చెప్పినారను ప్రతిపక్షవాదమును ఖండించనున్న
వారము.

---

## సమాచారములు.

### వర్ణ సంకరదంపతీచరిత్ర

అవాచ్యబ్రాహ్మణ కుటుంబమున జనించిన నీలకంఠశాస్త్రి
గారి కూతురుగారగు రుక్మిణీకాంతకారు అరండలుగారను శ్వేతజాతీ
యులను (తెల్లదొరగారిని) విదేశీయపద్ధతిని వరించి పిదప హిందూప
ద్ధతిని వివాహము గావించుకొనిని విషయము యిదివరకు జగద్విదిత
మైయున్న దేకదా? ఆవర్ణసంకరదంపతులు దివ్యజ్ఞాన సమాజమునకుఁ
జేరినవారగుటచే వారిని వర్ణసంకర ప్రియులగు విజయవాడ దివ్యజ్ఞాన
సామాజికులు పని పడఁబిలిపించి కడచిన జనవరిమాసాంతమున వర్ణ
సంకరోపన్యాసములను గావింపించియున్నవారు.

ఈవర్ణసంకర వధూవరులు గర్భముదాల్చిన పిదప నేడవమాసమునఁనోలేక యైదవమాసమునఁనో తాము వివాహమాడదలంచితిమని వెల్లడిగావించిరి అపుడు దివ్యజ్ఞాన సామాజికులలో రెండు కక్షలేర్పడి కొందఱు భిన్నజాతీయుల వివాహము జరుగరాదనియు మరికొందఱు జరుగవచ్చుననియుఁ బత్రికాముఖములఁ జాలకాలము పోరాటముఁ గావించియుండిరి. కాని వివాహము మాత్రముజరిగినది. అపుడు జరుగరాదనినవారిలో కొందరు తమమాటసాగలేదను నావేశమున నీసమాజమును విసర్జించితిమని పత్రికాముఖమునఁ బ్రతిజ్ఞలు ప్రకటించియుండిరి.

అట్లు దివ్యజ్ఞాన సామాజికుల చేతనే యేవగించుకొనఁబడిన యఱండలు రుక్మిణీ వర్ణసంకర దంపతులనే నేడు విజయవాడ వాస్తవ్యులగు దివ్యజ్ఞాన సామాజికులు పిలుపించి వారి వర్ణసంకరోపన్యాసములను తాము విని బాగుపడినఁ జాలదని యెంచి పరులను బాడుచేయ బహిరంగోపన్యాసములనుకూడఁ జెప్పించియున్నారు. ఈ వర్ణసంకరులు భారతీయులకు ధర్మోపదేశములచే యుటకు జన్మశతములకయిన నధికారులయ్యెదరా? అయ్యెదరని తలంచుటకంటె వివేకహీనమైన కార్యము మఱియొకటియుండునా? ఉండనేరదు.

ఐనను వాదమునిమిత్తము వారు మాభారతీయులకు ధర్మోపదేశములుచేయుటకధికారులయియున్నారని కొంచము కాలమంగీకరించియుంచుక వారిని విచారించుకొందము ఓ వర్ణసంకరదంపతులారా! మీరిపుడు నడచినరీతి కడుపైన వెనుక వివాహముచేసికొండని మావాండ్రకుఁ జెప్పెదరా? ఆయాచారము మాశాస్త్రాచారములకుఁ బరమ విరోధము కాన దానిని మాభారత ప్రజలాచరించరని చెప్పుటకేకాక మాయింట్లముందరఁ గొన్నిదినములు సంచరించిన జంతువులుకూడ మీయాచారము భారతీయుల కాచరణీయమనుట కంగీకరింపని చెప్పుటకుఁగూడ సాహసించుచున్నవారము. కాననిక మీదమాకట్టియుపదేశములుచేయరావలదు.

వేదములు చదివి వేదోక్త ధర్మము లాచరించుచున్న మహాపండితులెందరో మాభారత సంఘమునందుండి ధర్మోపదేశములచేయుచుండమా వేదములు చదువుటకధికారములేని వేదోక్త కర్మలనాచరి

చని పైపెచ్చు వేదవిరుద్ధముగ వర్ణసంకర వివాహముఁ గావించుగొ
నిన మీవలన నామాశాస్త్రీయ ధర్మములను వినవలయును? వినవల
సిన నదుర్దశ మాకేమి తటస్థించినది? ఏమియు లేదు. ఇట్లుండ సంఘసం
స్కార ప్రియులగు స్త్రీపురుషుల దుర్బోధలకు లోనయి మా భారత
సాధ్వీమతల్లులును బాలురును వారియుపన్యాసములు వినివచ్చినారని
వినుటకెంతయు విషాదము పొందుచున్నవారము.

భారతీయుల గౌరవము నిలుపవలసిన భారము భారత నారీమ
ణుల శిరముల పైనున్నది. సాధ్వీమతల్లులారా! మీరు మీ వేదశాస్త్ర
ములు చెప్పిన ధర్మమునను సరించి పతులనే దైవములనుగా భావించి
పరధర్మవిముఖులరై పాతివ్రత్యమును గాపాడికొని యుండుటచేత నేగదా
మీ పురుషులు నిష్కలంక జన్మగల పురుషులమని సాహసించి చెప్పుకొ
నుచున్నవారు మీరెంత పవిత్రచరిత్రలై ప్రవర్తింతురో యంతప
విత్రమై భారతజాతి ప్రకాశించెడిని.

కావున దల్లులారా! పరులను పరుల దుర్బోధలకు లోనయి
కులభ్రష్టలయిన వధూవరులును "తాఁ జెడ్డకోతి వనమెల్లఁ జెరిచె" నన్న
లోకోక్తికి గురిగ మీనగరముల కేతెంచి మిమ్ముఁబిలచి మీ శాస్త్ర
చారములకుఁ బద్ధవిరుద్ధములయి మిమ్ముఁగుల భ్రష్టలను జేయసమ
ములయిన రజస్వలావివాహములను విధవా వివాహములను స్వయం
వర వివాహములను నడుపుడని మీకుపదేశించియున్నవారు. వా
బోధలకు లోనయి మీకూతులను రజస్వలలగు వరకుంచితిరా వా
స్వజాతివారినే వరింతురని తలఁచఁదగునా?

రుక్మిణీకాంత గారివలెనే విజాతికాంతులతో మంతనములఁ జే
ప్రవర్తింపక మానుదురా? ప్రవర్తించిన, గడుపులుకావా? అయిన
డుపులు దిగద్రాగించవలయునుగదా? అపుడు కడుపులు పోయి
పడుచులను దానముచేయక తప్పునా? కడుపులు పోనియెడ కడు
లతోనున్న పడుచులనేగదా దానముచేయువలయును? అదికాదు కని
వెనుక దానము చేయుదురనవలెను. కనినమీఁదఁగావించెడి దాన
నవత్సగన్యా దానముగదా? ఇందే కార్యము గావించినను మీజా
పవిత్రత నిలుచునా? నిలువదు, నిలువదు, నిలువదు,



శ్రీ

# శ్రుతిధర్మసంజీవని

## అను నీ మాస పత్రిక

శ్రు తిస్మృతిశిష్టాచార ప్రమాణముల ననుసరించును.

తి తీర్థులకు సంతరణోపాయములను దెలుపును.

ధ ర్మాధర్మవిధర్మములను వివేకించును

ర మభూయాత్తనువారలకు శ్రీలనొసంగును.

్మ

సం ఘసంస్కర్తల దుర్వాదములనిరసించును.

జీ వన్ముక్తిపదసోపానములనుజూపును.

వ ర్ణాశ్రమ ధర్మతత్పరుల నాశ్రయించును.

ని త్య సత్య హితమితవాదముల వినిపించును.

## చందావివరము

| | | |
|---|---|---|
| రాజపోషకులు | సం॥ నకి | రు 10-0-0 |
| ప్రధానపోషకులకు | ,, | రు 4-0-0 |
| అనుపోషకులకు | ,, | 3-0-0 |
| చందాదారులకు | ,, | 2-0-0 |
| ,, | ఆరుమాసములకు | 1-4-0 |
| | విడిపత్రిక | 0-3-0. |

Regd. No. M. 1480 చందా సం॥రు. 2.

శ్రీ

శ్రీ బాలాత్రిపురసుందర్యైనమః

"యతో ధర్మస్తతో జయః। సత్యమేవజయతే నానృతమ్"

# శ్రుతిధర్మసంజీవని

వర్ణాశ్రమ ధర్మపక్షమును వాదించు మాసపత్రిక.

"ధర్మ ఏవహతో హంతి ధర్మో రక్షతి రక్షితః"

శివపురపు వీరభద్రశాకమూజి పత్రికాధిపతి



| సంపుటము. | విభవ చైత్రశు 2 బుధవారము. | సంచిక. |
|---|---|---|
| ౧ | మార్చి-1928. | 3 |



విషయసూచిక


1 జగద్గురువులు — గార్త్యాఙమదశర్మ
2 భక్తిమార్గము — చె॥ ఋచ్చిరామేశ్వరశర్మ
3 గాంధిమతఖండనము 2 — పత్రికాధిపతి
4 మనుస్మృతిదహనము — "
5 క[illegible]రగంప — మండ చినవెంకయ్య
6 గ్రంథవిమర్శనము — పత్రికాధిపతి
7 ధర్మకర్తలు - ధర్మనాశన మతము — "
8 రథకార వ్యవహారము — "
9 తంబిళి తగవు — "
10 భారత మహిళా సభ — "
11 అపాయంటు మెంటార్డరు — "
12 బూతు పురాణము — "



బెజవాడ:

శ్రుతిధర్మసంజీవనీ ముద్రాక్షరశాలయందు

ముద్రింపఁబడి ప్రకటింపఁబడియె.

1 9 2 8.

శ్రీ

శ్రీబాలాత్రిపురసుందర్యైనమః

"యతో ధర్మస్తతో జయః। సత్యమేవజయతే నానృతమ్"

# శ్రుతిధర్మసంజీవని

వర్ణాశ్రమ ధర్మపక్షమున వాదించు మాసపత్రిక.

"ధర్మ ఏవహతో హంతి ధర్మో రక్షతి రక్షితః"

శివపురపు వీరభద్రసోమయాజి పత్రికాధిపతి



| సంపుటము. | విభవ చైత్రశు ౭ బుధవారము. | సంచిక. |
|---|---|---|
| ౧ | మార్చి 1928. | 3 |



## జగద్గురువులు.

అఖిలజనుల మనముల నావరించియుండు తమస్సును నివారింప, పరమేశ్వరాజ్ఞల ననుసరించి, పరావరతత్త్వజ్ఞులు, పరిశుద్ధాంతఃకరణులు, పంక్తిపావనులు, పుణ్యజన్ములు, పురుషధౌరేయులు, పావనచరిత్రులు, పరమగురువర్యు లీయవనీతలమునం దవతరించితమ తమ దివ్యజ్ఞానోపదేశములచే జీవన్ముక్తి పదసోపానములజూపుచు, శాంతి దాంతి తేజః ప్రభావాదులచే సకలప్రాణికోటులకును సుఖముల నొసగుచు, తిరిగినదేశముల నెల్ల దివ్యక్షేత్రములు గను, జలకమాడిన నదీనదముల నెల్ల దివ్యతీర్థములుగను, తపమాచరించినవనముల నెల్లను దివ్యాశ్రమములుగ నొనరించి, తమ యశశ్చంద్రికలను చతుర్దశ భువనములకును వ్యాపింపజేసియుండిరి. ఇట్టిపరమగురుత్వసిద్ధి. బ్రహ్మవిద్వరిష్ఠస్థితి, స్థితప్రజ్ఞత్వము, మానవకోటికి పరమావధిఅనగ పరమపురుషార్థము దీనినే మోక్షమనియు, పరమపదమనియు, జీవన్ముక్తియనియు బిలుతురు. జీవన్ముక్తు లేజాతియందు దయింతురో, ఆజాతి సజీవమైయుండును. ఇట్టి జీవన్ముక్తు లనేకులీ భరతఖండమున నింతే

వరకు దయించిరి. ఇంకను జీవన్ముక్తు లుదయించుటకు తగిన సందర్భ ములు, తగిన పుణ్యభూములు, తగిన పరిశుద్ధకుటుంబములు, తగిన పావనదంపతులు, భరతఖండమున నేకలరని నవతిశయోక్తి మొం మాత్రమును కానేరదు. జీవన్ముక్తు లుదయించు శక్తియుండుటచేత నే భారతజాతి యింకనునిలచియున్నది. ఆపదము నధిష్ఠించువా రను వించు బ్రహ్మానందము వర్ణనాతీతము. శ్రుతిశిరస్సులీ యనుభవమ వేనోళ్ల కొని యాడుచున్నవి. ఆయుపని షద్వాక్యములవిని వివిధదే విద్వాంసు లత్యాశ్చర్యమున నోలలాడుచున్నారు ఆవాక్యార్థము తెలిసికొనుటకు కడుంగడు కష్టములకోర్చి భాషాభ్యాసముల జేయుచు న్నారు. పారంపర్యక్రమమున మాత్రమే తెలిసికొన తగిన విశేషాం ముల దెలిసికొన నవకాశములు కలుగుటకు భరతఖండమున జన్మమ లన భిలషించు చున్నారు. శ్రుతిదూరములగు మ్లేచ్ఛదేశములలో జన్మించినందులకు గుందుచున్నారు. భారతీయులారా! మీది పు భూమి శ్రుతిస్మృతి సిద్ధమయిన వర్ణాశ్రమధర్మ మహావృక్షమునకు పుష్కలఫల మనదగు జీవన్ముక్తిపదవికి మీరర్హులు. బహు జన్మా తమందయిన నద్దాని నంది కృతకృత్యులు కండు.

జీవన్ముక్తులే జగద్గురువులు ఆపదము నందనివారు జగద్గురువు కారు. జగద్గురువులలో నెల్ల నత్యుత్తములు దక్షిణామూర్తిరూ మున వర్ణింపబడియున్నారు. మహావట వృక్షమూలమున నందు, జీవ హ్మైక్యమును బోధించు చిన్ముద్రనుధరించి, మానసమున ననుభ వించు మహదానందమును వదనారవిందమున చిరునగవుగ నగుపి చుచు, శుద్ధస్ఫటిక సంకాశమగు దేహచ్ఛాయ మెరయ, వృద్ధుల తనశిష్యుల మనోసంశయములను మౌనవ్యాఖ్యానముచే దీర్చుచు డునా మహనీయదయామూర్తి నొకపరిస్మరియింపుడు. శ్రీమద్రామా ర్గగారులీ మహామహుని, యిట్లు నమస్కరించుచున్నారు. చూడుడు శ్లో॥ వటతరునికటనివాసం। పటుతరవిజ్ఞాన ముద్రితకరాబ్జం। కంచ దేశికమాద్యం। కైవల్యానందకందలం వందే॥

అనంతర మాపరమేశ్వరుడు ద్వాపరయుగాంతమున శ్రీకృష్ణరూపమున నవతరించి జనులకు మోక్షమార్గముల నుపదేశించి, జగద్గురువులై ప్రకాశించిరి. శ్రీకృష్ణపరమాత్మ తన జగద్గురుత్వమును బాల్యమునుండియు కనుపరచెను. జగద్గురువై గోపికలకు ధర్మముల బోధించెను. జగద్గురువై వేణుగానముంజేసెను. జగద్గురువై బ్రంహ్మాదాదులకు సన్మార్గములజూపెను. జగద్గురువై దుర్వాసాదులకు సద్భావముల బోధించెను. జగద్గురువై కురుక్షేత్రమున, పాండవమధ్యమునకు ధర్మగీతాగానమును వినుపించెను. ఆమహనీయుని వేణుగానముచే స్థావరజంగమాత్మకమగు ప్రపంచమంతయు నానందించెను ఆమహనీయుని గీతామృతపానముచే ననేకులు కృతకృత్యులైరి ఆవేణుగానముచే శ్రీకృష్ణుడు శ్రుత్యర్థముసేవినుపించెను. ఆగీతములచే సర్వోపనిషత్సారమును విశదీకరించెను. శ్రీలీలాశుకులా వేణుగానమును కృష్ణకర్ణామృతమున నిట్లువర్ణించిరి.

శ్లో॥ లోకానున్మదయన్ । శ్రుతీర్ముఖరయన్ క్షోణీరుహాన్ హర్షయన్।
శైలాన్విద్రవయన్ మృగాన్వివశయన్ । గోబృందమానందయన్।
గోపాన్ సంభ్రమయన్మునీన్ముకులయన్। సప్తస్వరాన్ జృంభయన్।
ఓంకారార్థ ముదీరయన్ విజయతే । వంశీనినాదశ్శిశోః॥

శ్రీ దక్షిణామూర్తి రూపమున వటమూలమున బోధించిన తత్వమును, శ్రీకృష్ణరూపమున భారతభూమియందు నూటయిరువదియయిదు వత్సరములా బాలగోపాలము బోధించిన ధర్మమును, జనులు మరచియుండుటచే, మరపువిరచి, తిరిగి యుపదేశింప నీకలియుగమున ౨౫౯౩వ సంవత్సరమగునందన సంవత్సర వైశాఖ శు ౫ భానువారమున, కాలటియను నగ్రహారమున, శివగురువను బ్రాహ్మణున కార్యాంబయను సాధ్వీమణియందా పరమేశ్వరు డుదయించి, శైశవముననే సమస్త విద్యలనభ్యసించి, యుపనయనము కాగానే తురీయాశ్రమ స్వీకారము జేసి తనకొరకు చిరకాలమునుండి వేచియుండు శ్రీ గోవిందభగవత్పాదుల చరణార విందములకు మ్రొక్కలిడి క్రమసన్యాస దీక్షంబొంది, గుర్వాజ్ఞాచోదితుడై దేశ

దేశములం బ్రిమ్మరి, చార్వాకాది సకలవేదవిరుద్ధమతముల వాదమున నోడించి, గాణాపత్యాది మతములయందలి దురాచారముల బోనడచి అంతకుముందు నామమాత్రావశేషమైయున్న వర్ణాశ్రమధర్మముల నుజ్జీవింపజేసి, సకలసంశయని వృత్తిరహితముగ శ్రుతిస్మృత్యర్థముల బోధింప ప్రస్థానత్రియ భాష్యాది గ్రంథములరచించి, తారచించిన గ్రంథములు పరమపురుషార్థమునే బోధించునని ప్రత్యక్షముగ వ్యాసమహర్షి చేనిరూపణజేయించి, వైదికధర్మపరిపాలనమునక్తై, భరతఖండమున, నలుదిక్కుల, ద్వారక, బదరి, జగన్నాథ, శృంగిరి క్షేత్రములయందు, శారద, జ్యోతి, గోవర్ధన, శృంగగిరి మఠముల నిర్మింపించి, యందు విశ్వరూప, తోటక, పద్మపాద, హస్తామలకాచార్యుల నధిపతులుగ నియమించి, శ్రీకాంచీక్షేత్రమున సర్వజ్ఞపీఠారోహణముంగావించి, సాక్షాచ్ఛ్రీ శంకరులని బ్రసిద్ధినొందిరి. అట్టిశ్రీశంకరుల జయంతి వైశాఖ శు ౫ మియందతి వైభవమున ననేక పట్టణములయందు జరుగనైయున్నది. ఆసందర్భమున వైదికధర్మావలంబులందరు, జీవన్ముక్తులై, జగద్గురువులై మహోపకారమొనరించి శ్రీశంకరుల భక్తివిశ్వాసములతో స్మరియించి, తదుపదిష్ట వైదిక ధర్మాచరణమున బద్ధాదరులై, ధర్మోద్ధరణ ప్రయత్నముల యందప్రమత్తులై యుండుటకు నిశ్చయింతురని నమ్ముచున్నాడను.

శ్లో॥ అఖిల పరహంసదేశిక। మాగమ గూఢార్థ దర్శకంప్రాజ్ఞం
ఆనందపూర్ణ సాగరమని శమహం నౌమిశంకరచార్యం॥

అద్వైతమునకు శ్రీ శంకరులెట్లు జగద్గురువులై యుండిరో ద్వైతవిశిష్టాద్వైతములకు శ్రీమధ్వాచార్య శ్రీరామానుజాచార్యులనై జగద్గురువులని బ్రసిద్ధినొందియున్నవారు. వారిగూర్చి వేరొకసారినుచ్ఛటించెదను.

—గా. కృష్ణమదశర్మ



# భక్తిమార్గము.

(గతసంచికానుబంధము.)

## —◆ స్థూలభక్తి ◆—

భక్తిస్థూలమనియు సూక్ష్మమనియు రెండువిధములు మొదట స్థూలముగనుండి తుదకు సూక్ష్మమై యథోక్త ఫలములనిచ్చును. స్థూలభక్తియందు వర్ణాశ్రమధర్మానుష్ఠానము, భగవత్ప్రతిమార్చనము, హరిదాసవర్గముతో నెయ్యము, భగవత్కథా శ్రవణమందు త్సాహము, సత్యభాషణాసక్తి, పరయువతులయందు, పరద్రవ్యములయందు పరాఙ్ముఖత్వము, గ్రామ్యకథలయందనాదరము, తీర్థయాత్రలసేవించుటయందు తాత్పర్యము, భగవత్కథా శ్రవణము జేయని ప్రతిదివసము తనయాయుష్యమున వృథయాయెనని చింత, యీాపదియు ముఖ్యలక్షణములు.

౧ భారతదేశమందలి ప్రజలు నాలుగువర్ణములుగ విభజింపబడియున్నారు. ఈవర్ణములనే జాతులనియు బిలుతురు. ఈవిభాగము, భగవంతునిచే, సృష్టికాలమున ప్రాణుల పూర్వజన్మ కృతగుణకర్మలననుసరించియే చేయబడినదని శాస్త్రములు తెలుపుచున్నవి. కావుననే శరీరమే వర్ణమునబుట్టిన నావర్ణమున జీవితాంతమువర కుండవలయునేగాని, జీవితకాలమధ్యమున మారుటకువీలుండదు. ఇట్లనుటచే వర్ణవ్యవస్థయనునది యభివృద్ధికి భంగకరమని యెంచ తగదు. అట్లెంతమాత్రము కానేరదు. స్వవర్ణాశ్రమ ధర్మానుష్ఠానము చేతను, తపస్సుచేతను, హరితోషణముచేతను, వైరాగ్యాది సాధన సంపత్తుకలిగి చిత్తశుద్ధిద్వారా జ్ఞానసంపాదనమున కర్హుడగునని శ్రీశంకర భగవత్పూజ్య పాదాచార్యులవారాన తిచ్చియున్నారు. ఏవర్ణమున కెంతయధికారము శాస్త్రముల చేనియ్యబడినదో, ఆమేరదప్పక నడచువారుత్తర జన్మములయం దుత్తమాధికారమునొంది కృతకృత్యులగుదురని దీనితాత్పర్యము కావున భక్తుడగువానికి వర్ణాశ్రమ ధర్మానుష్ఠానమత్యవసరము.

౨ భగవత్ప్రతిమార్చనముంగూర్చి పూర్వమే విపులముగ చర్చించియుంటిమి 3 భక్తుడు భక్తుల సహవాసమున భక్తినభివృద్ధి పరచుకొనవలయును. భక్తులొకచోట సమావేశులై భక్త్యతిశయమున భగవంతునిగూర్చి పరస్పరము సంభాషించునపుడు, ప్రపంచమంతయు పవిత్రమగుననియు, కులములు ధన్యములగుననియు, తీర్థములు పావనములగుననియు, శాస్త్రములధ్యయన యోగ్యములగుననియు నారదమహర్షి తనభక్తి సూత్రములయందు శాసించియున్నారు.

౪ భగవత్కథలు విశ్వాసముతో వినవలెను. అదియుపకారవంతములగును. ఒకపరివినినకథా గాంభీర్యమింకొకసారివినినపుడు బోధకాగలదు. కావుననే భగవత్కథలవిని తృప్తినొంది తిననువాడుండడని భాగవతమందు చెప్పబడియున్నది. శ్రీకృష్ణలీలల నెందరువినియుండలేదు. లోకమున నెందరకామహామహునిచరితము బోధపడినదని చెప్పగలమో యోజించుడు. శ్రీకృష్ణుని వేణుగానముచే మోహితలైపరితపించిన గోపికలచిత్తవృత్తుల గ్రహించి, శ్రీహరిచరిత్రము సర్థనము చేసికొనవలయును. వ్యాసాదులామహనీయుని దివ్యచారిత్ర మతిగూఢమని వ్రాసియున్నారు. ఇతరుల లెక్కయేల? శ్రీశంకరభగవత్పూజ్య పాదాచార్యులవారా మహనీయుని లీలలనతివిశదార్థముగ వర్ణించియున్నారు. పెద్దలసాయమున భక్తులు భగవత్కథాశ్రవణముం జేయుచు భగవత్కథా గాంభీర్యముల గ్రహించి, ప్రేమబెంచుకొనవలయు.

౫ భక్తులు సత్యభాషణమందును రక్తికలవారలు కావలయు. అనృతమాడగూడదు. సత్యభాషణము చిత్తశోధకము. అనృతము కాలుష్యముం బెంచును. కావున సత్యమునే పలుకవలయు. మితభాషణమందుకు సాధనము. మితభాషి కనృతమాడ నవకాశములు చాలతక్కువ. కావున

"సత్యం బ్రూయాత్ । ప్రియంబ్రూయాత్ । నబ్రూయాత్సత్యమప్రియం। ప్రియంచ నానృతంబ్రూయాదేషధర్మః సనాతనః"

అనగ, సత్యమును పలుకవలయును. ప్రియమును పలుకవలయును. సత్యమైనను అప్రియము నాడకూడదు. ప్రియమైన ననృతమునాడ గూడదు. ఇదియే సనాతన ధర్మము, అనువాక్యముల ననుసరించి చరించవలయును.

౬, ౭ పరయువతులయందు పరద్రవ్యములయందు పరాఙ్ముఖత్వమును భక్తుడు బహుశ్రద్ధతో సాధించవలయును. పరద్రవ్యమున పేక్షించక న్యాయార్జితమైన స్వకీయద్రవ్యముతో దారపుత్రాదులను పోషించుకొనుచుండవలయును. "స్త్రీణాం పాదతలందృష్ట్వా గురువ ద్భావయేత్సదా" అనున్యాయము ననుసరించి పరస్త్రీలు తనదృష్టిపథమున బడునపుడు తనగురువే యట్లుచరించుచున్నాడని భావించవలయును. "యోషా అతిసుందరీ రూపాసుగుప్తా గర్వశాలినీ। సాజ్ఞేయా మమరూపైవ। ఇత్యాజ్ఞా పారమేశ్వరీ" అనగ యౌవనవంతురాలును, అతిసౌందర్యమగు రూపము కలదియు, గర్వముతో దనయంగముల గోప్యపరచుకొను నదియు. నగుస్త్రీ నారూపమే యని పరాశక్తి యానతిచ్చుచున్నది.

"స్త్రియస్సర్వాశ్శక్తయస్స్యుః" స్త్రీలందరునాశక్తులేయనియు పరమేశ్వరిచెప్పుచున్నది. కావున పరస్త్రీలయందు పరాశక్తియను భావముజేసి, చిత్తమెమాత్రము వికృతినొందనీయక మెలకువతో చరించవలయును.

౮ గ్రామ్యకథల నాదరించగూడదని శ్రీశంకరులవారానతిచ్చిరి దీనినేస్త్రీధననాస్తిగవైరి చరిత్రం నస్మరణీయమ్ అనుసూత్రమున నారదులుశాసించియున్నారు. అనగ స్త్రీలనుగురించియు, విత్తములగురించియు, దేవుడు లేడనువారలగురించియు. భగవద్వేషులగురించియు ప్రసంగముల వినకూడదని తాత్పర్యము.

౯ గంగా గోదావరి కృష్ణా కావేరీ మొదలగు పుణ్యనదుల యందు స్నానము చేయుటయందును, అచ్చటిక్షేత్రవిశేషములజూచి యానందించుటయందును భక్తులకు తాత్పర్యముండవలయును. తీర్థయాత్రాదికముచే చిత్తము పరిశోధితమై భగవద్భక్తి వృద్ధినొందును.

౧౦ భగవత్కథా శ్రవణము భక్తునకు నిత్యప్రియము భగవ ద్గుణాను భవము జేయలేనినాడు తనయాయుష్యము వృథయైనదని ఖేదపడుచుండవలయును. అనగ నొక్కదినమైనను కథాశ్రవణమును మానియుండకూడదని తాత్పర్యము.

ఇట్టినియమములతో స్థూలభక్తి నభ్యసించువానికి కాలక్రమమున సూక్ష్మభక్తియుదయించును.

## —◆ సూక్ష్మభక్తి. ◆—

స్థూలభక్తియం దభ్యసింపబడిన నియమములు సూక్ష్మభక్తి యందు తీవ్రములగును. బాహ్యపూజాదికము లుత్యజించబడును. బాహ్యపూజాకలాపమున పూజాద్రవ్య సంపాదన క్లేశముండును. మానసపూజకట్టి దవ్యసంపాదన మనవసరము భక్తుని హృదయ కమలకర్ణికయే భగవంతునకు నవరత్నఖచితసింహాసనముగ సమర్పి బడును. సమస్తోపచారములు సంకల్పమాత్రమున కల్పించబడును. మానసపూజయందు భక్తుడర్పించు పుష్పముల పూర్ణ్వములు వాటి సౌరభాదులు వర్ణనాతీతములు మానస పూజాభ్యాసరతుల చిర కాలమున సిద్ధులగుదురు. వారిభావనాతిశయముచే మానసమున కల్పి తములగు పుష్పాదులు ప్రత్యక్షములగుటయు కలదు. ఇప్పటికి రమా రమి నూఱు సంవత్సరములక్రింద పుదుకోట ప్రాంతములనుండెడి పరమహంస శ్రీసదాశివేంద్ర సరస్వతులను మానవప్రియులగు నవభూతి శిరోమణులు వీధివెంటనడచుచు నొకశివాలయము కనుపడనద్దానియె దుటనిలచి మానసమున నేమియో భావించుచుండెరట అట్లుండనాల యమున లింగముపై ప్రాకృతి జనులెన్నడు కని విని యెరుగని యత్యద్భుతకమలములు వర్షించుచుండెనట

సూక్ష్మభక్తికలవారలు విజన నివాసమందు తాత్పర్యముకల వారగుదురు విజన ప్రదేశములయందుండి భగవత్సాన్నిధ్యమును కల్పిం చుకొని వారిపొత్తున కాలము గడుపయత్నింతురు.

సూక్ష్మభక్తియందు సత్యభాషణమునకై యత్నమవసరముండ దు. సూక్ష్మభక్తికలవాని నోటసత్యమేగాని యనృతమెన్నటికినిరాదు.

ఇతనిచిత్తము భగవచ్చరణారవిందాయత్తమై నిర్మలానందామృత మగ్నమైయుండుటచే బాహ్యవిషయములట్టి చిత్తమును కలుషపరచవు. అగ్నికణములు సముద్రమును క్షోభపెట్టలేనట్లు విషయములు భగవద్భక్తుని క్షోభపెట్టనేరవు సూక్ష్మభక్తికలవాడు పరస్త్రీలవిషయమున షండుడైయుండును. "అద్యజాతాం యథానారీం। తథా షోడశవార్షికీం। స్త్రీ-న్నవర్షాంచయోదృష్ట్వా। నిర్వికారః సషండకః" అనగ, ఇప్పుడేపుట్టిన యాడశిశువునుగాని, పదునారేండ్ల పడచునుగాని, వయస్సుజారిపోయిన ముదుసలినిగాని, జూచియెవడు నిర్వికారుడైయుండునో, అతడు షండుడనబడును. నిర్వికారచిత్తముతో నితడు చరించుచుండును.

స్థూలభక్తి కలవాడు న్యాయమార్గమున ద్రవ్యార్జనము జేసి దారాపుత్రాదుల పోషించనెంచును సూక్ష్మభక్తికలవాడు తనయోగక్షేమముల నన్నిటిని భగవంతునకు విడచి నిర్విచారపరుడైయుండును దారాపుత్రాదుల పోషణము భగవంతుడే నిర్వహించునని యతనికి విశ్వాసముకలదు. కావుననే దారాపుత్రాదులయందు మమత్వమునశించును. అహంకారము పడిపోవును. అహంకారమమకారములు పోయిన సమస్త భూతములయందు భగవంతుడు సమముగ నున్నాడనుజ్ఞానము స్థిరమగును.

క్రోధాది దుర్గుణము లితనినుండి దూరముగ తొలగిపోవును. ఇతడు ప్రసన్న వదనుడై మృదుమధుర హితమితభాషియై, తనయంతరంగమున దాననుభవించుచున్న యానందమున కనుక్షణ ముప్పొంగుచు, వేణుగానము జేయుచునో, భగవద్గుణానుభవ సంకీర్తనము గావించుచునో, కృష్ణ, గోవింద, హరే, శంభో, మహాదేవ, భవానీ, జననీ యనుచు నామనుల నుచ్చరించుచునో కాలము గడుపుచుండును.

స్థూలసూక్ష్మ భేదములనుండుభక్తి నభ్యసించువారలకి హామునగాని పరమునగాని కొఱుపవయుండదు.

భక్తియొక్కటియైనను పదునొకండు విధముల ప్రసరించును. ౧ భగవంతుని గుణమహాత్మ్యముల స్తుతించుట కాసక్తి. ౨ అతని దివ్యమంగళ విగ్రహమును జూచియానందించుట. ౩ పూజాసక్తి ౪ స్మరణాసక్తి ౫ దాస్యాసక్తి ౬ సఖ్యాసక్తి, ౭ కాంతాసక్తి, అనగ భార్యభర్తను ప్రేమించునట్లు భగవంతుని ప్రేమించుట ౮ వాత్స ల్యాసక్తి అనగ బిడ్డలకు తమ్ముబోషించు తల్లిదండ్రులయందుండు ప్రేమవలెనుండు భక్తులప్రేమ. ౯ ఆత్మనివేదనాసక్తి, అనగ యావ చ్ఛక్తులను భగవంతున కర్పించి, యతని నియోగమున నడచునాసక్తి ౧౦ తన్మయాసక్తి ౧౧ పరమవిరహాసక్తి ఇందొక్కొక్కయంశ మునే దీసికొని కొందరు భక్తిగా నిర్వచించి భక్తిశాస్త్రములయందు వ్రాసియున్నారు.

పూజాదులయం దనురాగమే భక్తియని వ్యాసులవారి మతము. భగవత్కథాదులయం దనురాగమే భక్తియని గర్గాచా ర్యులవారు. వివిక్షేపములు లేనివాడై యాత్మరతుడై యుండుటయే భక్తియని శాండిల్యుడు సమస్తచిత్తవృత్తులను భగవంతున కర్పించి చరించుటయు, నతని విస్మరణముచే నతివ్యాకులత నొందుటయు భక్తి యని నారదులు. ఇట్లు నానామతభేదములచే భక్తిని నిర్వచించి, తుదకు వ్రజనివాసులగు గోపికల ప్రేమయే భక్తియని నారదులు భక్తిసూత్రములయందు నిర్ణయించియున్నారు.

నారదులు, సనత్కుమారులు, వ్యాసులు, శుకదేవులు, శాం డిల్యులు, గర్గాచార్యులు, విష్ణు, కౌండిన్యులు, శేషుడు, ఉద్ధవుడు, ఆరుణి, బలి, హనుమాన్, విభీషణులు, మొదలగువారలు భక్త్యా చార్యులుగ నెన్నబడుచున్నారు. ఇట్టియాచార్యుల చారిత్రములు పఠించి యందలి స్వారస్యముల గ్రహించి, భక్తిమార్గమున చరించ వలయు. వారిజీవితములనే యాదర్శములుగ నుంచుకొనవలయు. ప్రమాదము నెంతమాత్రము నొందగూడదు. మనోవాక్కాయము లను శోధించవలయును. ఒకదోషము మనసు ననుద్భవమాయెనే యది వాక్కునకు వ్యాపించును. అంతకాయముచే నదియొకదుష్కా

ర్యము జేయించును. మనజీవితములలో ప్రసక్తమగుచుండు హింసా దులెంత చిత్రముగ వృద్ధినొందునో మనమూహించుటలేదు. ఊహింతుమేని మనమెన్నివిధముల జాగరూకులమై యుండవలయునో బోధపడగలదు. ఉదాహరణముగ హింసనుగూర్చి విచారింతము, హింసను మనస్సుచే సంకల్పించవచ్చును. వాక్కుచే నితరులకు హింసజేయవచ్చును. కాయముచే హింసాకృత్యముల జేయవచ్చును. కావునహింసలు మూడువిధములయినవి. మనమే హింసచేయవచ్చును ఇతరులచే చేయించవచ్చును. పరులుచేయుచున్న మనమామోదించవచ్చును. ఈవిభాగముచే హింసలు తొమ్మిదివిధములయినవి హింసచేయుటచే లాభించునని యొకడు హింసించును. ఇదిలోభమూలమగుహింస ఒకడుతన కపకారమొనరించెనని హింసించును. ఇదిక్రోధమూలమగు హింస ఒకని హింసించినచో ధర్మరక్షణమగునని హింసించును. ఇది మోహమూలమగుహింస ఈవిభాగముచే మొత్తము యిరువదియేడు విధముల హింసలేర్పడినవి. హింస, మృదు, మధ్య తీవ్రవిభాగములచే మూడువిధములగును. పయిన వివరించిన యిరువదియేటిలో నీమూడు విధముల భాగింతుమేని మొత్తమెనుబదియొక్క విధములగును. కావున నీయెనుబదియొక్కవిధములగు హింసలలో నొక్కదానికైన తావీయక భక్తుడు పరిశుద్ధజీవనమున చరించవలయును.

ప్రతిక్షణమున దనయంతరంగమును పరీక్షించుకొనుచుండవలయును.

భక్తిమార్గమున జాతినీతికుల గోత్రములతో ప్రసక్తిలేదందుకు అనగ నేజాతివాడైనను, ఎట్టినియమముల పాటించువాడైనను ఏగోత్రమునకు జెందిన వాడైనను భక్తిజేయవచ్చును అతడు చేయుభక్తి భగవంతునకు గ్రాహ్యమేయగును. అనితాత్పర్యము. కొందరీవాక్యములచే భ్రాంతినొంది భక్తిజేయుచు వర్ణాశ్రమధర్మములవిడనాడవచ్చునని యభిప్రాయపడుచున్నారు. ఇదికేవలము పొరబాటు జ్ఞానదార్ఢ్యము కలుగు వరకు శ్రుతిస్మృతుల ననుసరించి ధర్మములనాచ

రించి తీరయులయుచు. దార్ఢ్యము కలిగినవెనుక ధర్మాచరణమువలన
కలుగబోయెడు ఫలము లేనందున వానినాచరించనక్కరలేదు.

భక్తిమార్గమున నేమి జ్ఞానమార్గమున నేమి సర్వానర్థ
ములకు మూలము కామమని సర్వశాస్త్రము లుద్ఘోషించుచున్న
కావున భక్తులు కామజయమునకై మున్ముందు యత్నించవలయు
దియే భక్తిమార్గమున ప్రథమసోపానము మధ్యమసోపానము అం
మసోపానము కామము మనకీ మార్గమున ప్రతివిశేషస్థానమున
తగులుచుండును. అదియే ప్రకటశత్రువు ప్రబలశత్రువు దానిజయ
మునగాని దారిసాగదు దానిజయమునగాని గమ్యస్థానము గుపడదు
కావున నీప్రణాళిక ననుసరించి చరింతుమేని పుష్కలచిత్తశుద్ధినొం
భగవచ్చరణారవిందస్మరణానందామృతాస్వాదనమున భగవదను
హమున కలుగుజ్ఞానముచే ముక్తులమగుదుము శ్రేయోమార్గ
రులు రచించినయొక కీర్తనముతో నీవ్యాసమును ముగించ
చున్నాడను.

ఓంతానాస్తికిల తేషాం॥ పల్లవి॥
శమదమకరుణాసంపూర్ణానాం। సాధుసమాగమసంకీర్ణానాం॥
కాలత్రయజితకందర్పాణాం। ఖండితసర్వేంద్రియదర్పాణాం॥
పరమహంసగురుపదచిత్తానాం। బ్రహ్మానందామృతమగ్నానాం॥

—ఇతిశివం—



చండాలాస్పృశ్యతా నివారణాత్మక

## గాంధి మతఖండనము.

(ద్వితీయప్రకరణము)

చండాలాస్పృశ్యతను నివారించుటవలనఁ బాపముసంభవించి
తన్మూలమున నుత్తమజాతీయులు నశించెదరని వచించిన శ్రుతిమ
మును వినుపించి నాశనముగావించఁ దలంచినవారుమాత్రమే గాం
మతము నవలంబించవలెఁగాని యన్యులద్దాని నవలంబించరాదు

ప్రథమప్రకరణమున నిర్ణయించి చిగురున ద్వితీయప్రకరణమున గాంధి మతము స్మృతిహిత మతమగునా? కాదా? యని విచారించెదమని వచించియుంటిమి కానసిపు డాపనిముంగించుచున్నారము వినుడు.

(గాంధిమతము స్మృతిహితమత మగునా? కాదు.)

ఏలయన? చండాలురను జూడరాదు. వారితోమాటాడరాదు. వాండ్రనుస్పృశింపరాదు. వారితోఁగలసి యొకమార్గమున నడువరాదని స్మృతులెల్లను నేకగ్రీవముగ బోధించుచున్నవి. కాన నీఁకవానిని గ్రమముగ వినిపించెదమువినుడు.

"చండాలదర్శనే సద్యఆదిత్య మవలోకయేత్" అనిపరాశర మహర్షియు, "చండాలదర్శనే సూర్యదర్శన మ్మనిసుమంతుమహర్షియు, నతైస్సమయ మన్విచ్ఛే త్పురుషోధర్మమాచరన్" అనిమనువును "ధర్మానుష్ఠానసమయే చండాలశ్వపాకైస్సహ దర్శనాది వ్యవహారం నకుర్యాత్" నికుల్లూకభట్టాచార్యుఁడును, వచించియున్నారు. ధర్మకార్యములు చేయునపుడు చండాలురను గనుగొన్నయెడ నుత్తమ జాతీయులకు దోషముసంభవించు ననిచెప్పితన్నివృత్తికై ప్రాయశ్చిత్తముగ సూర్యుడు చంద్రుఁడు నక్షత్రములు అగ్ని లోనగుజ్యోతిస్సులను జూడవలె ననిపైవచనములు చెప్పియున్నవి ఇట్లు చండాలదర్శనమే కూడదని శాస్త్రజ్ఞులు నిషేధించుచున్నపుడు వారితో సంభాషించుట దోషమగునా కాదా యనిప్రశ్నింపవలసిన యవసరము కానరాదు అయినను జండాలసంభాషణమును నిషేధించు శాస్త్రవచనములను నజ్ఞలోకము మేలుకోరి వినుపించుచున్నవారము వినుడు.

చండాల సంభాషణ నిషేధమునుగూర్చి "శ్వపాకంవాపి చండాలం విప్రస్సంభాషతేయది ద్విజైస్సంభాషణం కుర్యాత్ సావిత్రీం తుసకృజ్జపేత్" అని పరాశరుఁడును, "చండాలైస్సహ సంభాష్య ద్విజసంభాషణాచ్ఛుచిః సావిత్రీంవ్యాహరేద్వాపి ఇతిధర్మోవ్యవస్థితిః।" అనిహారీతుఁడును "చండాలసంభాషయా దోషస్తత్ర ప్రాయశ్చిత్తం బ్రాహ్మణసంభాషా" యని యాపస్తంబుఁడును "చండాలసంభాషాయాం బ్రాహ్మణాభి వ్యవహారః" అనిసుమంతుఁడును. వచించియున్న

వారు చండాలురతో సంభాషించినయెడదోషమువచ్చును. దానికిప్రా యశ్చిత్తము బ్రాహ్మణసంభాషణమును గాయత్రీజపమును ద్విజులు కావించ వలసినదని పైవచనములకర్థము ఈయర్థమునుబట్టి చండాలురతో మాట్లాడరాదని విస్పష్టమగుచుండగా వారితోఁజేరి యొకమార్గమున నడువరాదని వేరుజెప్పవలసిన పనిలేదుకదా? అయినను శాస్త్రానభిజ్ఞులకొఱకు వానినీక్రింద నుదహరించుచున్నవారము.

చండాల సహమార్గ గమననిషేధముంగూర్చి పరాశరమహాముని "చండాలైకపథంగత్వా గాయత్రీస్మరణా చ్ఛుచిః"అనిముచ్చటించి యున్నాడు చండాలురతో నొకమార్గమున నడచుటవలన వచ్చెడిదోషమునకు ప్రాయశ్చిత్తముగ గాయత్రీమంత్రము జపించవలసినదని పైవచనమునకర్థము ఈయర్థమువిన్న విజ్ఞులగువారు చండాలురను స్పృశింపవచ్చునా యనిప్రశ్నించరారు కానియట్టిజ్ఞానములేని మానవులమేలుగోరి చండాలస్పర్శనిషేధముం గూర్చి బోధించెడిస్మృతి వచనములను వినిపించెదమువినుడు చండాలస్పర్శనిషేధముం గూర్చి "చండాలస్పర్శనేచైవ సచేలంస్నానమాచరేత్" అనిపరాశరుఁడును "చండాలస్పర్శనేదోష స్తత్ర ప్రాయశ్చిత్తం మవగాహన మపాముపస్పర్శనమని" యాపస్తంబుడును "చండాలదర్శనే సచేలంస్నానమ్మ"ని సుమంతుడును "శ్వపాకంపతితంవ్యంగ మున్మత్తంశవదాహకం సూతకిం సూతికాంనారీం రజసాచపరిప్లుతాం శ్వకుక్కుటవరాహాంశ్చ గ్రామ్యాన్ సంస్పృశ్యమానవః సచేలంసశిరస్నాత్వా. తదానీమేవశుధ్యతి" అనిదేవలుడును "చితించ చితికాష్ఠంచ యూపంచండాలమేవచ స్పృష్ట్వాదేవలకంచైవ సవాసా జలమాప్నుయాత్" అనిచతుర్వింశతి మతమును "చండాలశ్వపచైస్పృష్టోనిశిస్నానం విధీయతే నవసేత్తత్ర రాత్రౌతు సద్యస్స్నానేన శుధ్యతి" అనియముడును "శ్వచాండాల పతితోప స్పర్శనే సచేలంస్నాతః సద్యః పూతోభవతి" అనివశిష్ఠుడును "చండాల పతిత స్వపృష్ట్వా శవముత్త్యజ మేవవాఉదక్యాంసూతికాంనారీం సవాసా స్నానమాచరేత్" అనిసంవర్తమహర్షియు వచించియున్నారు.

చండాలుని స్పృశించినయెడ వెంటనేయపుడు కట్టుకొనియున్న వస్త్రములతో గూడ స్నానముచేసినయెడ నుత్తమజాతీయులు శుద్ధుల గుచున్నారని పై వచనములకర్థము ఈయర్థమునం దొక్కవిషయము ను మనకుజతుర్వింశతిమతము వినిపించి యున్నది. అదేమన? చండాలు రనుస్పృశించినపుడెట్లు కట్టువస్త్రములతో స్నానముచేసి యుత్తమజా తీయులు శుద్ధులు కావలెనో యట్లే దేవలకులను స్పృశించినవారును సచేలస్నానముచేసి శుద్ధులుకావలెనని చతుర్వింశతిమతము చెప్పియు న్నది. చతుర్వింశతిమతమన నిరువదినల్వురు మహర్షులు కలసిరచించిన స్మృతియని యర్థము అదిదేవతలకును స్పృశించరాదనియు స్పృశించిన యెడల సచేలస్నానము చేయవలసినదనియుఁ జెప్పియున్నది. దేవలకు లన స్థావరపూజచేయు పూజారులని యర్థము వారిలో శివునిబూజిం చువారిని వైఖానసులనియు నంబులనియుఁ దెలుఁగున వ్యవహరించు చున్నవారు వీరినిస్పృశించిన యెడలను నుత్తమజాతీయులు సచేలస్నా నముచేసి శుద్ధులుకావలసియున్నదని మాపాఠకులు గ్రహింతురుగాత ఇన్నిందరో మహర్షులు సకలవేదార్థవిదులు స్మృతిముఖములఁ జండా లదర్శన సంభాషణ స్పర్శాదులు కూడవని యేకగ్రీవముగ నిషేధిం చియుండ మనగాంధిగారు నేనుసకలవేదములను శాస్త్రములను బురా ణములనుఁ జదివితిని గానియందెక్కడను మానవులలో నొకజాతివా రంటరానివా రుందురని యెచ్చటను జెప్పఁబడియుండ లేదనిచెప్పియు న్నారు.వా రెక్కడి వేదశాస్త్రములను జూచినారో తెలియదు. ఇదిలో కమును మోసగించుటకుగాదా? కాదనివివేకముగలవా రనగలరా?

ఇంతవరకు మనముగావించిన ధర్మశాస్త్ర పరామర్శవలనఁ జండాలాస్పృశ్యత నివారించవలెనను గాంధిమతము శ్రుతిహిత స్మృతి విరుద్ధమతమని స్పష్టమైనదికదా? ఇంతియేకాదు శ్రుతివిరుద్ధములగు జైనబౌద్ధ చార్వాకాదిమతములేమైనఁజండాలాస్పృశ్యతను నివారించవ లెనను గాంధిమతమునకు దోడ్పడుచున్నవా యనువిషయమును గూర్చి యికనించుక చర్చించవలసియున్నది. జైనబౌద్ధ చార్వాకాదిమతస్థులు తొలుతవైదికులకు జనించినవారేకాని యన్యులుకారు వారిప్పటి

బ్రహ్మఆర్యదివ్యజ్ఞాన సామాజికాదులవలె నపుడువర్ణాశ్రమధర్మముల యెడ విముఖులై యథేచ్ఛగఁ బ్రవర్తించినవారు కానిచండాలాస్పృశ్యతను మాత్రముతీసివేసి వారినంటుకొనుట కారంభించినవారు మాత్రము కారు కావుననే చండాలాస్పృశ్యత యాసేతుశీతనగ మధ్యదేశమం దెల్లయెడల నెల్లగ్రామములయందును భారతీయులచే బాటింపఁబడుచున్నది. కనుకనే జైనమతస్థులగు గాంధిగారిజననియు నస్పృశ్యతను బాటించియున్నది. అదిమీకెట్లుతెలియునందురా? గాంధిగారేదాసనినా ఱుగువత్సరములకువెనుక వారి యంగిడియా పత్రికాముఖమునఁ జాటియున్నారు. అదేమన? గాంధిగారు తాము 12 సంవత్సరముల బాల్యప్రాయములో నున్నపుడే చండాలురయస్పృశ్యతను గనిదుఃఖితులై యద్దానిని నశింపజేయవలయు ననుతలంపున దీక్షతో వారినంటుకొనుచు వచ్చితిమనియుఁ దామంటుకొన్న సంగతి తమతల్లిగారికిఁ దెలిసి నపుడెల్ల వెను వెంటనే తమకుసచేలస్నానము చేయించుచు వచ్చిరనియుఁ దమపత్రికలోనే వ్రాసియున్నారు ఈచెప్పినదానింబట్టి జైనస్మృతులుకూడ నస్పృశ్యతను బాటించవలసినదనియె బోధించునట్లు మనముగ్రహింపవచ్చునుగదా? ఇట్లనిన గాంధిగారు దామునసనాతవ హిందూమతస్థుల మనిచెప్పుకొనుచుండ మీరు వారికి జైనమతస్థులను లేనిపేరొకటి పెట్టుచున్నారు. ఇదిధర్మమా యందురా? వినుడుసమాధానమును గాంధిగారు వర్ణాశ్రమధర్మములకు బద్ధవిరోధులగు జైన కుటుంబమునకు జనించినవారే అన్యులుకారు అట్లయ్యుదమ యథార్థమును దెల్పినయెడల వర్ణాశ్రమధర్మ తత్పరులగు వైదికమతస్థులు తమ యీవిరుద్ధబోధకుఁ జెవియొగ్గరని యెంచి యావైదికమతస్తులను వంచించుటకై ప్రపంచమున లేని సనాతనహిందూమతమను నొక క్రొత్తమతమును ప్రకటించియున్నారు.

ఇంతియెకాదు తమకుసంస్కృతభాషయం దక్షరజ్ఞానము లేకపోయినను దాము వేదములను ధర్మశాస్త్రములను బురాణేతిహాసములను జదివితిమి కాని వానియం దెచ్చటను మానవులలో నంటరానివారు గొందఱుందురని వర్ణించియుండలేదని యంగిండియా ముఖమున

సాహసాతిసాహస ప్రసంగమునొకదానిని గావించియున్నారని వినిపించియుంటిమికదా? ఇదిమహాత్ములు కావించవలసినప్రసంగమేనా? మహాత్ములుధార్మికలోకమును వంచించుటకు యత్నించదగునా? సనాతనహిందూ మతమనునొకమతముకలదా? ఈమతమును గూర్చితృతీయప్రకరణమున విపులవిమర్శనమును వినిపింపనున్నవారము.



## మనుస్మృతి దహనము.

ఈనడుమ చతుర్థజాతీయులు కొందఱు కారణములేకయే బ్రాహ్మణవిద్వేషులై వారినిదిట్టికొట్టి యంతటితోదనివినందక యత్తమీదికోపము దుత్తమీదం జూపినకోడలిపిల్లవలె మనుస్మృతిని గొనితీసికొనిపోయి బహిరంగసభలలోం గాల్చివేసినట్లు వార్తలు వినవచ్చియున్నవి. పరమేశ్వరా? పాపముశమించుంగాత మనుస్మృతి మనబ్రాహ్మణద్వేషుల కేమివిషమిడినది? దానినేల కాల్చివేయవలయును? ఇట్లడిగిన నదిశూద్రులకంటె బ్రాహ్మణక్షత్రియవైశ్యులను జన్మచే నధికులనిచెప్పలేదా? ఇదిదోషముకాదా? పోనిండు శూద్రులుజన్నిదములు వేసికొని పైజాతులవారగుట కేమైన ననుమతించినదా? తన యబ్బముల్లె పోయినట్లు నదివలనుగాదన్నది ఇంతటితోనైన నోరుమూసినదా? చతుర్థులు ధనము గడించి నిలువజేసికొని యుండరాదని వ్రాసియుండలేదా? ఇట్లెన్నియో మాయెడదుష్కార్యములను గావించియున్న మనుస్మృతిని మేముకాల్చివేయుట ధర్మమేయగునుగాని యధర్మముకానేరదనిమనబ్రాహ్మణద్వేషులు ప్రత్యుత్తరముచెప్పకమానుదురా? వారుచెప్పినవానినెల్ల మనుస్మృతిచెప్పినమాట వాస్తవమే కానియవిదోషకార్యములేల కావలయు?

ఇట్లు దోషములెంచ దలంచినయెడ నదియొకటేకాదు అందుంజెప్పిన ధర్మములెల్ల నెవరికోయొకరికి విరోధముగనేయుండును అదెట్లన?

చూడుడు బ్రహ్మచారి స్త్రీసంగమము చేయరాదన్నది ఆది బ్రహ్మ చారి కిష్టముగనుండునా? గృహస్థుపరదారగమనము చేయదగదని చెప్పియున్నది. గృహస్థున కదిదోషముగగన్పడదా? ఇట్లు సర్వధర్మము లును బాధకములే యయియున్నవి. అందులకై వారుధర్మశాస్త్రము లను దగులబెట్టుటయే పనియా? పోనిండు మనుస్మృతినిదగులబెట్టిన యీధర్మరతు లబాధక ధర్మములను దెలుపు నొకధర్మశాస్త్రమును వ్రాయవలయునుగదా? ఏదీనూతనము వీరిపురుషార్థము? ఎవ్వరిని బాధించని యందరికనుకూలించెడి ధర్మశాస్త్రమును వారిప్రకటింపు మనుడు? వీరిపసబయటబడును ఈకార్యమునుబట్టిచూడ వీరికిజిత్త చాంచల్యము సంభవించినట్లు నిశ్చయించుకొన వలసివచ్చినది.

వీరి మనుస్మృతిదహనమువలన బ్రాహ్మణముల కేమిహానిసంభవించినది వారియిండ్లలో నున్న మనుస్మృతు లట్లెయున్నవి. తక్కువబడిన మొడమరల ముద్రించుకొనుటకు వేలకొలదిముద్రాయంత్రములు కలవు వారుశక్తికొలది మనుధర్మము లననుష్ఠించుచునే యుందురు. కాన దీన బ్రాహ్మణులకు హానిలేదు. ఇకెవ్వరకు? బ్రాహ్మణేతరులు కావించినకార్యమువలన వారికేయనేక నష్టములు ప్రాప్తించుచున్నవి. అవేవందురా? తొలుతధనముపెట్టి కొనితెచ్చికదా మనుస్మృతినిగాల్చవలెను? దానవారి ధనలక్ష్మిని వారే కాల్చుకొనినవా రగుచున్న వారు ఇంతియెకాదు సరస్వతీదహనము గావించిరి దానవారి (వివేకము) దహనమైపోయినది. అవిపోయినవచ్చునది దారిద్ర్యమును బను త్వము ననిలోకానుభవజ్ఞు లకెల్లరకును దెలిసినవిషయమేకదా? కాన నిట్టి యాకార్యకార్యములనుండి బ్రాహ్మణద్వేషులగు మాచతుర్థసోదరులు విడివడి సుఖింతురుగాత.



# కలగూర గంప

ఆర్యులారా! ప్రతివారును యీకాలమున స్వరాజ్యము స్వరాజ్యమని ప్లాటీభారము లెక్క గొంతులు బొంగురుపోవునట్లు పన్యసించుట యేగాని స్వరాజ్యమనగా నేమి? దానిని పొందుటెట్లు? దాని కాచగించవలసిన విధానమేమి యని యాస్తికబుద్ధితో విదారింపరైరి. కాన భారతదేశమున కంతికు జెందినకాంగ్రెసు సంస్థమొదలు గ్రామ పునర్నిర్మాణమనదగు పల్లెటూరివరకుగల ప్రజల యాచరణలో గల నాకు దోచినలోపములను మీయెదుట బెట్టుచున్నాను గాన అందు సత్యమూరసి క్రమసాధనకు గడంగుడని దేశభక్త దేశబాంధవాదులను వినయముతో కొని యాడుచున్నాను శ్లో "అతిదానాద్ధతో కర్ణః॥ అతిలోభాత్సు యోధనః॥ అతికామాద్దశ గ్రీవో, అతి సర్వత్రవర్జయేత్" అనిమనపూర్వులు ధర్మబోధచేయుతెరి కొందరి పేరెత్తుట కని వినియున్నాము కాన సత్యాన్వేషణకై నేనును కొందరి కొర్లు దాహరణకై నుశీవినందుకు తురించి గుణములు గ్రహించి కార్యాచరణమునకు గడ గుడని ప్రార్థించుచున్నాడను.

—:కారణములు:—

1 చెన్నపురి కాంగ్రెసులో బ్రిటిషువస్తు బహిష్కారము రాయల్ కమీషను బహిష్కారము తీర్మానించుచు యొకొక ప్రక్క మనదేవాలయాది ధర్మసంస్థలలో మామూలు లేనిపంచములు ప్రవేశించుటకును, మనపుత్రికలకు గర్భాధానము వివాహము చేయు వయోనిర్ణయము కొరకు అవయవ పరీక్షాదులు చేయుటకు శాసనములు చేయుడని బ్రిటిషువారి సహాయము గోరుట

2 హిందూమహమ్మదీయ సమ్మేళన మొకవంకగోరుచు శుద్ధి యుద్యమమను పేరమహమ్మదీయులను హిందువులతో గలుపుట

3 (ఏ) స్వదేశవస్త్ర నిర్మాణ ధారణములు చేయువారే యిపుడ రుదుకాగా చేశినవారిచ్చెడి లాభముతో ఆబుకారీ ఆదాయము అయిదుకోట్లుగా పెరుగుటకు వస్త్రనిర్మాతలు మద్య పానమొనర్చుటను మాన్పించుటకు సర్వజనులు అందుకాంగ్రెసువాదులు ప్రచారము చేయును పేక్షించుట

3 (బి.) గవర్నమెంటువారు లైసెన్సు ఇచ్చినదుకాణములవద్ద చేయువీలులేకున్నను ప్రభుత్వమువారు తీసివేసిన మాదండమూడివంటి పల్లెటూళ్ళలో ప్రదేశాధికారులు పేక్షించుటచే పెరిగిపోవుచున్న త్రాగుడుమాన్పుటకు ప్రచారముకొరకు ప్రజలను అందుకాంగ్రెసువారిని పిల్చినను రాకుండుట

4 (ఏ.) పూర్వము ఇప్పటి గుంటూరుజిల్లా బాపట్లలో నొకమునసబుకోర్టును అప్పట్లో గుంటూరుజిల్లా లేనందున బందరులో నొకజిల్లాకోర్టు నుండగా యిపుడొక బాపట్లలోనే రెండుమునసబుకోర్టులు రెండు సబ్ జడ్జికోర్టులుయుండుటచే ప్రజలయందలివివాదకాంక్ష హెచ్చుటగుట

4 (బి.) బి. ఏ. ప్యాసు అయిన ప్రతివిద్యావంతుడును పోటికే పేనా గుండుసూదివంటి చిన్నపరిశ్రమమైనా చేయనుత్సహించకయు ధనవంతులు వారికి తోడ్పడకుండుటయు కారణముగా ప్రభుత్వోద్యోగములు కోరగా దొరకనందున బి. యల్. ప్యాసై సాక్షివాదులు గామారుట

5 (ఏ.) స్వదేశప్రభువులలో యిందూరుసంస్థానాధిపతి ముంతాజుబేగముకొరకు రాజ్యభ్రష్టుడైనను మరల 5 లక్షల పైబిల్లవ్యయముతో నొకయమెరికాలేడిని వివాహమాడదలచుట అందువైయిదివరకు వివాహమాడిన స్వజాతిభార్య కన్నీరుగార్చుటచే "కలకంఠి కంటికన్నీరొలికిన సిరియింటనుండ నొల్లదు" నునీతిని సార్థకపరచుట

5 (బి.) ఇప్పటి కాశ్మీరరాజా హరిసింగుగారు యువరాజుగానుండగా రాబిన్సన్ అనువానిభార్యకొరకు కొన్నిలక్షల పౌండ్లను మిడ్లండు బాంకిలో డిపాజటుచేయుట అందుపై ఫ్రాన్సుకోర్టులో సిగ్గుచేటగువిచారణజరుగుట

5 (సి.) కూచిబిహారుమున్నగు రాజపుత్రులు పాశ్చాత్య లేడీలకొరకు లక్షలాదిద్రవ్యము ఖర్చుచేయుచు ఆంగ్లేయులచేతను మిస్ మేయో వంటిస్త్రీలచేత సహా అవమానగ్రంథ యుపన్యాసములకు కారకులై స్వరాజ్యమందలి నీటిసప్లయి మున్నగు స్వప్రజాక్షేమరక్షణము లారయకుండుట (సశేషము)

మాడ చినవెంకయ్య, దండమూడి.

# గ్రంథ విమర్శనము.



విమర్శనముం గోరి మా కార్యస్థానమునకు వచ్చిన గ్రంథములను విమర్శించుటనదిగాన నీవిమర్శన వ్యాసమునకు గ్రంథవిమర్శన మనునన్వర్థనామకరణము గావించియున్నవారము ఇపుడిందు విమర్శింపఁబడు గ్రంథములు 1 బ్రాహ్మణేతరవిజయము 2 కమ్రిరాజము అనునవి వీనిని గ్రమముగా నిక విమర్శించుకొందమురండు

బ్రాహ్మణేతర విజయము.

ఇయ్యది గుంటూరుజిల్లా కొల్లూరువాస్తవ్యులగు సూర్యదేవర రాఘవయ్యచౌదరిగా రనుకమ్మసోదరులచే రచింపఁబడి విమర్శనార్థము మాకొసంగఁబడినది. బ్రాహ్మణేతరులన బ్రాహ్మణులుకాని మర్త్యలోకమునంగల సకలఖండములలోని మానవులెల్లరును నర్థములగుదురు కాని గ్రంథకర్తలుతలంచినట్లు రెడ్డివెలమకమ్మబలిజె శాఖీయులు మాత్రమే యర్థములుకారుకదా? ఇపుడుబ్రాహ్మణేతరులయినశూద్రజాతీయులలో మనరాఘవయ్యచౌదరిగారు మున్నగుకొందరు మాత్రమే నల్లాదిరామకృష్ణ తార్కికచయనప్రభృతు లగు నేకొందరు బ్రాహ్మణులతోనో వాదించి జయించియున్నారు కాని మర్త్యలోకములోని బ్రాహ్మణేతరు లెల్లరును వచ్చి బ్రాహ్మణు లందరితో వాదించి యుండలేదు. కానరాఘవయ్యచౌదరిగారు తమవిజయమును వెలుపుటకై "రాఘవయ్యచౌదరివిజయము" ప్రకటించుట ధర్మమగును కాని బ్రాహ్మణేతరవిజయము ప్రకటించుట ధర్మముకాదు కాదు ముమ్మాటికిని గాదు.

చౌదరిగారి యీవిజయ మైనను వీరివాదమును తార్కికచయనులవారు ఖండించలేకపోవుటచే వచ్చినవిజయముకాని చౌదరిగారు రెడ్డి వెలమకమ్మబలిజ శాఖీయులు క్షత్రియులని సాధించుటచే వచ్చినవిజయము కాదు. రెడ్డి వెలమకమ్మబలిజె శాఖీయులను క్షత్రియులని సాధించుటకు ఫాలాక్షునకుం గూడ సాధ్యపడదని చెప్పినస్వభావోక్తి

యగునుగాని యతిశయోక్తి యెంతమాత్రమును గాజాలదు బ్రాహ్మ
ణులు శాస్త్రయుక్త్యనుభవప్రమాణబద్ధులై వాదించుటకుఁగడంగిన
నెడ వారుముల్లోకములను జయింపగలరు చదువురాని లోకజ్ఞానము
లేని విమర్శజ్ఞానవిహీనులయిన రాఘవయ్యచౌదరిగారా జయించునది?
అదివట్టిది వట్టిది ముమ్మాటికివట్టిది అదేమందురా? వినుడుచెప్పెదము.

సంస్థానాధీశు లయిన రెడ్డి వెలమ కమ్మ బలిజె శాఖీయు లందు
కొనిపయాంధ్రకృతు లన్నియునాకృతిపతులను శూద్రు లనివర్ణించి
యున్నవి. సంస్థానాధీశులై ప్రబంధములురచింపఁదగిన పండితులై
కృతులురచించిన మల్లారెడ్డిమాధవరాయ ప్రభృతిప్రభుతల్లజులు
రచించినకృతులలో తమవంశావతారఘట్టములందు దాము శూద్రు
లమని వర్ణించుకొనియున్నారు ఆఘట్టములలోని పద్యములనన్నిటిని
నుదహరించి రెడ్డి వెలమ కమ్మ బలిజె శాఖీయులు శూద్రులేకాని
క్షత్రియులుకారని మాసంజీవనీముఖమున లోకమున కిదివరకే వినిపిం
చియుంటిమి. వానింజదివి యున్నమాచౌదరిగారావాదమును వదులు
కొనక మరల వెఱ్ఱివిమర్శనములకుఁ గడంగియున్నారు ఇదిబుద్ధిమం
తులు కావింపఁదగినకార్యమా? కాదు కాదు ముమ్మాటికినిగాదు.

వాదమునిమిత్తము చౌదరిగారుచెప్పినటుల రెడ్డి వెలమ కమ్మ
బలిజె శాఖీయులను గొంచెముకాలము క్షత్రియులని యంగీకరించి
యందువలనఁచౌదరిగారికి వచ్చెడిఫలమేమో యించుకవినుపించుదము
రండు పైనాలుగుశాఖలవారిని క్షత్రియులని కాదా మనచౌదరిగారు
చెప్పుచున్నారు? క్షత్రియులుద్విజులు ద్విజులననుపనయనము కలవా
రని యర్థముఆయుపనయన మిపుడురెడ్డి వెలమ కమ్మ బలిజె శాఖీయు
లందులేదుకదా? ఇందులకేమిసమాధానము చెప్పెదరని యడిగినఁ
చౌదరిగారు మధ్యకాలీను లగుతమపూర్వులు శతృబాధలకుఁ దాళఁ
జాలక జన్నిదములువదులుకొని రనిసమాధానముఁజెప్పవలెను. ఈస
మాధానము చెప్పదగినదికాదు చెప్పవలసినది చెప్పెదము విననిచో
వచ్చెడియనిష్టమును గూడనిపుడే వినిపించియుండుట మంచిది కాన
వినుపించుదమురండు.

చౌదరిగారూ? మీపూర్వులు నైరుల కోడి కులధర్మమగు నుప నయనము వదులుకొన్న భీరువు లగుక్షత్రియులని జెప్పుకొంటిరికదా? అదిమీకవమాన జనకముకాదా? ఇట్లుభీరువులైకులభ్రష్టులయిన క్షత్రియులసంతతివారగు మీరుమరల శూరులముకాన గుణకర్మలనుబట్టి యుత్తమక్షత్రియుల మైతిమని వేరొకవాదముం గావించితిరి. ఇది యెట్లుసరిపడును? గుణకర్మలనుబట్టియే జాతినిర్ణయింతుమేని గమ్మవారినందరిని క్షత్రియులేయననేల అందుఁగొందరు వారిగుణకర్మలను బట్టి మంగలివాండ్రును మరికొందఱుచాకలివాండ్రను నికగొందఱు మాలలును మాదిగెలునుగారాదా? అగునెడ మాలమాదిగెలలో నగువారిలోఁ గొందఱు గుణకర్మలనుబట్టి కమ్మవారు కావచ్చునుగదా? అపుడుకమ్మవారైన మాలమాదిగెలు లోనగువారిని చౌదరిగారూ! మీబంధువులనుగాస్వీకరించి మీబంధువులలో మాలమాదిగె లయి నవారిని మాలమాదిగెపల్లెల కంపవలెనుగదా? అందులకుమీరు సిద్ధముగ నున్నారా? అనియడుగుడు? ఏమిచెప్పుదురు?

ఒకవేళ మనచౌదరిగారు సాహసులుకాన దమవాదము నిలుపుకొనుటకై యందులకును సిద్ధముగా నున్నామనియందురేమో? అనినవీరితో వివేకముగలకమ్మవారేకీభవించితమబంధువులను మాల మాదిగెలపల్లెల కంపుటకుఁగాని మాలమాదిగెలతో బాంధవ్యములు గలపి వాండ్రనువారిలోఁ బ్రవేశపెట్టుటకుఁగాని సిద్ధపడరని తలంచుచున్నారము చౌదరిగారు గుణకర్మవాదము చేయుటయెందులకో గ్రహించితిరా? కమ్మవారుపనయనముచేసి కొనినయెడ భ్రష్టక్షత్రియుల సంతతివారమని చెప్పియిపుడు పనయనముచేసి కొనినయెడ శిష్టక్షత్రియుల మయ్యెదమ నునాశతో నావాదముంజేయుచున్నారు. ఈయాశ తీరునదికాదు ఏలయన? వీరుచెప్పినపగిది వీరిపూర్వులుపన యనముమానుకొన్నదే నిజమేని మానుకొన్నవారు వ్రాత్యులును నావ్రాత్యులపుత్రులు జాతిచండాలురును నయ్యెదరు ఈమాట మేమ నుచుంటిమని తల తురేమో? అట్లుతలంపవలదు. శాస్త్రము లట్లు చెప్పియున్నవి, చౌదరిగారుశాస్త్రబద్ధులైనట్లునటించుటచే వారిమేలు

కోరి మేమింత చెప్పవలసివచ్చి చెప్పితిమి ఆపైనవారికర్మగతి యెట్లున్న నట్లునడచెదరుగాత ఇఁకఁగమ్మరాజమును గూర్చియించుక మాట్లాడు కొందము రండు

కమ్మరాజము.

ఇయ్యదికృష్ణాజిల్లా కోడూరువాస్తవ్యులగు చాపరాలవెంక టాద్రి చౌదరిగారనుకమ్మసోదరులచే రచింపఁబడి విమర్శనార్థము మాకార్యస్థానమునకు వచ్చియున్నది. చౌదరిగారు తమకమ్మవారినం దరిని క్షత్రియులనుగావించుటకై రచించినగ్రంథమిది తమకుఁగమ్మ యను శాఖనామమునిచ్చుటకు ఁగారణములను బలుపురుపలువిధ ములఁ బలుకుచున్నవారు కమ్మలు (ఉత్తరాలు) మోయుటచే ఁగమ్మ లయిరని కొందరును కమ్మలు చెవులకుబెట్టుకొనుటచేః గమ్మలయిరని మరికొందరును గమ్మగభుజించి వచ్చినవారికిఁ గమ్మనిభోజనములనిడి యుండుటచేఁ గమ్మలయిరని యిఁకఁగొందఱును గారణములను వ్రాయుచువచ్చిరి ఇపుడు వెంకటాద్రిచౌదరిగా రట్లుగాక తాముక్రమ రాజుల సంతతివార మగుటచేఁ గక్రమశబ్దము మారి కమ్మశబ్దమైన దని కొత్తవ్యుత్పత్త్యర్థమును వినుపించియందులకు ఁబ్రమాణములను గాఁ బురాణములలోనివని యేవోకొన్ని శ్లోకములనువ్రాసియున్నారు అవిపురాణములగునా కావా?లని విచారించవలసిన యావశ్యకము మనకులేదు.

పూర్వము కమ్మరాజులుండవచ్చును వారుక్షత్రియులే యైయుం డవచ్చును కాని వారిసంతతివారే యీకమ్మవా రనుటకాధారము మాత్రము నిరాధారమైయున్నది చౌదరిగారు తాముక్షత్రియులు కావలెనను గంపెడాసతో నల్లినయూహలను వెదజల్లి యీగ్రంథ మును రచించియున్నారు. కమ్మరాజులుమారి కమ్మవారైరనంగాని కక్రమశబ్దము మారి కమ్మశబ్దముకానేరదుకాదా? క్రమరాజులు క్షత్రి యులని చౌదరిగారే చెప్పియున్నారు క్షత్రియులుద్విజులు ద్విజులన నుపనయనము కలవారని యర్థము ఇపుడుపనయనము కమ్మవారిలో జరుగుచున్నదా? ఇట్లడిగిన రాఘవయ్యచౌదరిగారు చెప్పినసమాధా

నషే వెంకటాద్రిచౌదరిగారును చెప్పవలెను అనఁగాదమపూర్వులు భగవారికోడిపోయి యుపనయనము మానుకొనిరని చెప్పవలెను క్రమరాజు లుపనయనము మానుకొన్నదినిజమేని వారువాత్యులును వారిసంతతివార మరునిప్పటికమ్మవారు జాతిచ డాలురను నైయు న్నారని చెప్పుటకుఁ చౌదరిగారికిష్టము లేకపోయినను నొప్పుకొనక తప్పదు కదా? తప్పను మమ్మాటికినిదప్పదు వేంకటాద్రిచౌదరిగారు శాస్త్రపురాణేతి హాసములందు ప్రమాణబుద్ధికలవారై నట్లు గ్రంథ మునందు నటించియుండుటచే వారిమేలుఁకోరి యింతచెప్పితిమి ఆపైన వారికర్మగతిని వారనుసరింతురుగాక.

## ధర్మకర్తలు, ధర్మనాశనమతము.

ఇటీవల మనదేశమున గల దేవాలయములను సక్రమముగ పరిపాలించునిమిత్తము, న్యాయాధిపతు లాయాదేవాలయములున్న ప్రదేశములలో శ్రుతిధర్మతత్పరులని తామెంచిన పెద్దమనుష్యులను ధర్మకర్తలుగ నియమించుచుండిరి అట్లే మావిజయవాడంగల శ్రీదు ర్గామల్లేశ్వరాలయమున కీమధ్యనొక ధర్మకర్తలు నియమింపబడిరి. వారినొకపరి వారిమందిరముననే దర్శించి మాసంజీవని సంచిక నొక దాని నందిచ్చితిమి దానిగైకొని వారువిప్పగనే గాంధిమతఖండనమను వ్యాసమగుపడెను. అదికొంత జదివి మముజూచి యస్పృశ్యతా నివారణమును గూర్చి మీయభిప్రాయమేమనియడిగిరి. నివారించరా దని చెప్పితిమి అటులేనిబ్రాహ్మణులుకదా? మాలమాదిగెలనంటరా దనెదరు? ఇపుడు బ్రాహ్మణులేరి? అనిప్రశ్నించిరి. "మీరు, మీబంధు వులును బ్రాహ్మణులేకదా? ఏలీయని ప్రశ్నింపనేల?" అనియడిగితిమి మేము బ్రాహ్మణులముకాము బ్రాహ్మణులమై మేముదేవాలయము లలో బ్రవేశింప నర్హులమేని మాలమాదిగెలు గూడదేవాలయము లలో బ్రవేశింప నర్హులేయగుచున్నారు. కాన వారిని దేవాలయ ములో బ్రవేశపెట్టెదము అనిచెప్పియున్నారు.

ఇట్టియభిప్రాయములు కలవారు శ్రుతిస్మృతి విహితాచార ముల ననుసరించి నడుపబడుదేవాలయములను పరిపాలింపవచ్చుట యనుచితము ఒకవేళ న్యాయాధిపతులు తమ్మునియమించినను తమకు న్నయభిప్రాయములను మార్చుకొనలేనపుడు, తమయసర్హతను తామే తెలిపి, తప్పుకొనుటయుక్తము అట్లుచేయక, న్యాయాధిపతులకోరిక మీదనో, తమవిజ్ఞప్తిమీదనో, ధర్మకర్తలుగ నియమింపబడి, బయ ట, శిష్టబ్రాహ్మణులమని చెప్పి వ్యవహరించుకొనుచు, లోలోన ధర్మ విప్లవకారకములగు నభిప్రాయముల వెలుపుచు, నాచరించ నెంచుట కడుంగడు విషాదకరము.

ఈధర్మకర్తలు తమయశాస్త్రీయమతమును వదలుకొని శ్రుతి స్మృతిశిష్టాచార ప్రమితధర్మ తత్పరులగుట యుక్తము. కాదేని ధర్మ కర్తృపదవిని వదలుకొనుటయుక్తము. మామిత్రులిందే కార్యమాచ రింతురో చూచియానందింతుము.

## రథకారవ్యవహారము.

ఆంధ్రమునంగాశ, కమ్మర, కంచర, యగసాల, కంసాలిలో నగునామములచే వ్యవహరింపంబడుచుండు మానవులు సంస్కృత మున రథకారులు, తక్షులు, శిల్పులు, వర్ధకులు లోహకారులు, చర్మ కారులు, విశ్వకర్మలు, మున్నగు నామములచే వ్యవహరింపబడుచు న్నవారు ఇట్లుమేము భయభాషలందు వ్యవహరింపబడు చున్నవార మని యారథకారులే శ్రీ- శ్రీ- శ్రీ- మాంటేగు మంత్రిపుంగవు నకు బత్రికాముఖమున విన్నవించుకొనియున్నవారు. ఈరథకారా దులయుత్పత్తిని గూర్చి సూతసంహితయం దిట్లువర్ణింపబడియున్నది.

శ్లో॥ కరణాయాంతు విప్రేంద్రమాహిష్యాద్యోవిజాయతే
సతషూరథ కారశ్చప్రోక్తశ్శిల్పీ చవర్ధకీ
లోహకారశ్చర్మకార ఇతివేదార్థవేదిభిః॥

కరణ జాతిస్త్రీలయందుస మాహిష్యులచే నెవరు పుట్టింపబడి

యుండిరో వా రేతక్షులు, రథకారులు, శిల్పులు, వర్ధకులు, లోహ కారులు, చర్మకారులునని, వేదార్థవేదులచే వ్యవహరింపబడియున్నా రని పైవచనములకర్థము క్షత్రియునకు వైశ్యస్త్రీయందు బుట్టిన వారు మాహిష్యులును వైశ్యునకు శూద్రస్త్రీయందు జనించినవారు కరణులు నయ్యెదరని ధర్మశాస్త్రములు చెప్పియున్నవి. ఈచెప్పినదా నింబట్టి పైరథకారాదులు బ్రాహ్మణ క్షత్రియ వైశ్యశూద్రులనెడి నాలుగుజాతులలోను జేరినవారు కారని తెలియవచ్చినదికదా? శాస్త్ర ములదాక మనముపోనేల రథకారాదులే తాముచతుర్వర్ణములలో చేరని ప్రత్యేకజాతీయులమని మాంటేగు మంత్రిపుంగవునికిచ్చిన విజ్ఞ ప్తియందు వ్రాసికొనియున్నవారు.

విషయ మిట్లుండ విజయవాడ తాలూకా యాకునూరు గ్రామ వాస్తవ్యులగు రథకారులు విశ్వబ్రాహ్మణుల మనెడి యశాస్త్రీయ నామము నొకదానిని తగిలించుకొని తమకుత్తమ జాతీయుల యిండ్ల లో జరుగు పితృకర్మలయందు విశ్వదేవస్థానమున భోక్తృత్వము చేసె డియధికారము కలదనిచెప్పి యొకకమ్మవారియింట జరుగుపితృకర్మ య దుఁ దాముభోక్తలుగా గూర్చుండి పాత్రదీసికొనెదమని వచ్చి యందులకు బురోహితు లనుమతించకున్న వివాదపడి పైపెచ్చువారి పైబంచాయితికోర్టులో నభియోగము తెచ్చియున్నవారు ఇట్లేయేలూ రుతాలూకా కొవ్వలిలో కంసాలియొకడు కొవ్వినవాదము గావించి యాంఘూరిపంచాయితి కోర్టులో రెండువత్సరముల నాడభియోగము తెచ్చియోడిపోయెను తమకీవిషయమై విచారించుట కధికారము లేక పోయినను బ్రాహ్మణులయెడఁ బరిపూర్ణకటాక్ష వీక్షణులగు నాకు నూరి కమ్మవారువిచారణ జేయుగడంగి యున్నవారు. అదిపర్యవసాన మైనవెనుక బర్యవసానమునుదెలుపుదుము.

తంబళితగవు

మీది యాకునూరు గ్రామవాస్తవ్యులగు తంబళిగారొకరు తమకు బ్రాహ్మణుల యిండ్లలోజరుగు సదస్సులందాశీర్వచనము గావించెడి యధికారము కలదు కాననక్షుతల నిండని యొకబ్రాహ్మ

ణునియుంట వివాదపెట్టుకొని యందులకు బురోహితు లనుమతిం
లేదని యాగ్రహించి పురోహితులను శివాలయములో నభిషేకవ
గావించ నిరాకరించియున్నవారు ఈవివాదమును గూడ బంచాయి
కోర్టువారు విచారింతుమన నాకోర్టులోనంబిపండితుని ముందిడుకొ
తంబళిపండితులు బ్రాహ్మణులతో వాదింతుమనిముందుకువచ్చి మొ
దులకో వెనుకకువెళ్ళియున్నవారు ఆకునూరు వాస్తవ్యులగు బ్రాహ్మ
ణసభవారు కొలదిదినములలో వారిని రిజష్టర్డుత్తర ముఖమున సభక
బిలుతుము వారితో వాదముగావించుడని మముగోరియున్నవారు. అ
దుదంబళితగువు లెన్నటికిని దలయెత్తకుండ మొత్తవలెనని సిశ్చయిం
యున్నవారము.



# భారతమహిషీసభ.

భారతమహిళాసభయను పేరుతో భర్తలనువిడిచి యథేచ్ఛగ
దిరుగుట కలవాటుపడిన భారతీమహిషులు కొందరు హస్తినాపు
మునఁ (ఢిల్లీనగరమున) సభచేసి యందువేదశాస్త్రాచార విరుద్ధము
లును భారతమానవతీజనావమానజనకములును వర్ణసాంకర్య కా
కములును బ్రిటీషుశాసన (ప్రొక్లమేషన్) నిరోధకములును నగుశా
దగారి వివాహగర్భాధానశాసనములను నామోదించుచు నొకచె
తీర్మానమును గావించి యంతటితో దనివిస దక శ్రీ శ్రీ శ్రీ రాజప
తిసాధిగారి సన్నిధిని నొకవిజ్ఞప్తిని గూడసమర్పించి వచ్చినటులగులన
కకపత్రికలు ప్రకటించిన వార్తలవలన దెలియవచ్చినది. ఈమహి
షులు గాని యీమహిషీపతులుగాని శాసన సభాసభ్యులుగాని వర్ణ
సంకరశాసనములను పాసుచేయఁదలంచినయెడ ముందుబహిరంగస
లను చేసి యందదయుద్యమమును వినిపించి శాస్త్రయుక్త్యనుభ
బలములను జూపి పండిత పామరులను మెప్పించి వారినందఱిని ద
పక్షమునకుఁ ద్రిప్పుకొని యదలును జేరి యేకగ్రీవముగ బహిష్కారమ
జేసినయెడ నదిరొనసాగును కానియదివిడిచి యేసందుగొందులసం
రములలో నోనేబుజవు ముప్పాతు మందయానలో వారికీపుజోడగ

పురుషంఘస్యులో సభలు కావించి యెంతు వెడగుతీర్మానములను గావించి వానిగైకొని విజయవాడ మహిళాప్రతి నిధులమనియు గుంటూరు నారీమణీ ప్రతినిధులమనియు జెప్పుచు నిట్లే నానానగరమహిళాప్రతినిధులగు కొందఱాడపురుషులు తమపురుష నారీమణులనిండ్లలో నుంచి హస్తినాపురమునకు బయలువెడలి పోయి వర్ణసంకర పరిష్కారము ద్వారాదుష్టశాసన నిర్మాణమునకుదోడ్పడియున్న వారు. ఇది కడుంగడు విచారకరమగు కార్యముకాదా?

ఇట్టి కపటసభ లెన్నితీర్మానములను గావించి గవర్నరు జనరల్ గారికిని గవర్నరులకును బంపియున్నారో పంపుచున్నారో పంపనున్నారో మేమిపుడూహించి తెలుపుటకవకాశము లేకయున్నది. లేకున్నను సహసాస్రిక్షులనందగిన బ్రిటీషురాజప్రతినిధులుకాని గవర్నరులుకాని యీకపట పరిష్కారములను గ్రహింపజాలక వేగిరపడి తమచక్రవర్తుల శాసనము (ప్రొక్లమేషన్) కు విరుద్ధముగా భారత ప్రజల వర్ణాశ్రమధర్మములను నిర్మూలించు దుష్టశాసనములను సృజించి తమయేలుబడికి శాశ్వతకళంకము సంపాదించుకొందురని విశ్వసింపజాలకున్నవారము. కాని యీసమయమున వర్ణసంకర ప్రియులగు శాసననిర్మాణసభాసభ్యులకును గపటసభాసభ్యులకును మాప్రతిజ్ఞను నించుక వినిపించియుంచుట మంచిదనియెంచి యీపనిముగించుచున్న వారము వినుడు.

ప్రతిజ్ఞ

ముందు బయలువెడలు మాశ్రుతిధర్మసంజీవని నాలవసంచికయందు హారవిలాసశారద డా॥ ముద్దులక్ష్మిగార్ల వివాహశాసనములను ముందిడుకొని వ్రాసియున్న విపులవిమర్శనమును ప్రకటించుచున్నారము. కాన దానిని శాస్త్రయుక్త్యనుభవములతో ఖండించుటకు సమర్థుడగు పురుషోత్తముడు ముందుకువచ్చి ఖండించినయెడ మేము వారితోఁజేరి జన్మాంతముపరకు సంఘసంస్కరణ మొనర్చుటకు దీక్షితులమై యున్నారము.

పత్రికాధిపతి

# అపాయింటు మెంటార్డరు



1 మాసంస్థాన గురుత్వము నంగీకరించి వర్ణసంకరము వృద్ధిచేయుటకు నలుగురు జగద్గురువులను గ్రహించియున్నవారని యిదివరకు వినిపించియుంటిమి. ఇపుడా జగద్గురులకు గురులు కాదగిన మరియొక జగద్గురులు మా సంస్థానగురుత్వమును స్వీకరించుటకు కనుగ్రహించియున్నారు వారెవ్వరన? రెండువత్సరములనుండి యిందూరు సంస్థానాధీశులనుంచుకొనియున్న మిల్లరను నమెరికా దేశపు కన్యను హిందూమతములోనికిం ముందు గన్వర్టుచేసి యామెపైన నొకమహారాష్ట్రునకు దత్తహోమాదికము చేయించి యామహారాష్ట్రదంపతులచే వేదోక్తవిధిని నిందూరు సంస్థానాధీశులకు గన్యాదానము గావింపించిన కరవీర పీఠాధీశ్వరులగు శంకరాచార్యులవారు. వారిని మాసంస్థానమునం బంచమ జగద్గురువులనుగా నపాయింటుచేయుటైనది.

2 మా సంస్థానరాజ్యమును జక్కగ నడుపుకొనుటకనువగునుపాయములను బోధించుపత్రికలను నడుపుటకు సమర్థులగు పత్రికాధిపులకుం బ్రోత్సాహమొసంగని లోపమును బాపుకొనుటకై వర్ణసంకర బోధలందు గడితేరిన యభినవసరస్వతి, ఆంధ్రపత్రిక, కృష్ణాపత్రిక, వాసవి, దీనబంధుపత్రికలను మాసంస్థాన పక్షమునం బ్రకటించుటకుం దత్పత్రికాపతుల నపాయింటు చేయుటైనది.

3 మేముచక్రవర్తులమైనపుడు మాచక్రవర్తిత్వమును నిలుప బెట్టదగిన రాజచక్రమును చేర్చుకొనుట మావిధియైయున్నది. మాకు మంత్రిసామంతగురు పురోహితప్రభృతులు సమర్థులే సమకూడి యున్నవారు. కాని మాసంస్థానమునం గర్మజ్యేష్ఠులువచ్చి చేరమికిం జింతించుచుంటిమి ఇపుడాకొఱంత తీరినదని మాచక్రమునకు విశపి

చుమహాభాగ్యము మాకులభించినది. అదేమనగ మనరాచరికధర్మము పూర్వాచారపరాయణులను నవీనాచారపరాయణులనుగా జేయుట యేకదా? ఆపనికినితరులను నియోగించుటకంటెఁ గర్మజ్యేష్ఠులను నియోగించుట మంచిదని యెంచి బ్ర॥ చెరువు అనంతరామసోమయాజులవారిని నపాయంటుచేసియున్నవారము. వారిదినవరకే మనకార్యస్థానమగు కలివిలాసభవనమున శ్రీకృష్ణజయంతి యొనర్చిపూర్వాచారపరాయిణులకు నవీనాచార పరాయిణులు కావించువర్ణసంకర కార్యములయెడఁ గలయేవగింపును మునిముట్టుదుడిచిపెట్టి మనకు మహోపకారము కావించియున్నవారు వారినిజూచి యొకరొక్కరే కర్మజ్యేష్ఠులువచ్చి మనచక్రిములో జేరకపోరు కానియనంతరామసోమయాజులుగారికిచ్చినట్లె నాగేశ్వరరావుగారు మాత్రము తలకు వేయి రూపాయిల నీయవలెగాని యిచ్చినయెడ నేనునేనని కర్మజ్యేష్ఠులందరు గొఱ్ఱెలమందవలె వచ్చిపడుదురనుటకు సంశయముండునా? ఉండదు.

కలివిలాసభవనము కలిచక్రవర్తి



# బూతుపురాణము.



ఇత్యాది సూతపురాణమనుపేరుతో బురాతసాధునాతన బ్రాహ్మణులను దత్రిపిపండితులను బండబూతులుపెట్టుచు ద్విపుర నేని రామస్వామిసూతులచే రచింపబడిన బూతుపురాణము. అందలి ప్రథమసంపుటము ముద్రింపబడి విమర్శనార్థము మాకార్యస్థానము నకే తెంచియున్నది. సూతులవారుసుజనలోకము తమపురాణమునంగల బూతులనుగని బూతుపురాణమందురేమో యనుసంశయమున బూతుపురాణముగాదని క్రిందిపద్యముఖమున మొరలిడియున్నవారు. కానివారిపద్యము గ్రంథస్థవిషయమునకు బరమవిరోధియైయుండుటచే

దానినించుక సంస్కరించి విషయానుకూలముగు పద్యముగరచించి యున్నవారము ఈవిషయమును మాపాఠకులు గ్రహింపగోరి వారి పద్యమును మాపద్యమును గ్రమముగనెందు క్రింద బొందుపరచియున్నవారము కనుడు:—

రామస్వామి సూతపద్యము.

కం॥ బూతుపురాణముగాదిది, ప్రాతపురాణమునుగాదు పాతకహరమా సూతపురాణంబియ్యది, పూతపురాణంబు పుణ్యపురుషావళికిన్ ॥

పాకయాజిపూతపద్యము.

కం॥ సూతపురాణముగాదిది, ప్రాతపురాణమునుగాదు పాతకయుతమా బూతుపురాణంబియ్యది, పూతపురాణంబుపాపపురుషావళికిన్ ॥

ఈగ్రంథమును జదువువారిలో వివేకవిహీనులున్న సంతసింతురేమో కాని వివేకమహిమలు మాత్రము దుఃఖింపకపోరు. అదేమః? అధర్మయుగమని యింతవరకు శాస్త్రలోకములచే నిర్ణయింపబడిన కలియుగమును గ్రంధకర్తలు కృతయుగమని భూషించి ధర్మయుగమని నిర్ణయింపబడిన కృతయుగమును నధర్మయుగమని దూషించియున్నారు. ఇంతియెకాను దుష్టులని భారతలోకముచే నిర్ణయింపబడిన దుర్యోధనాదులను భూషించి ధర్మగతుల నినుతికన్న ధర్మరాజాదులను దుష్టులనిదూషించియున్నారు గ్రంధమంతయు నిర్దోషదూషితమైయున్నది. కాన ముందువిపుల విమర్శనము గావింపనున్నవారము.

—పత్రికాధిపతి.



శ్రీ

# శ్రుతి ధర్మ సంజీవని

## అను నీమాస పత్రిక

శ్రు తిస్మృతిశిష్టాచార ప్రమాణముల ననుసరించును.
తి తీర్షులకు సంతరణోపాయములను దెలుపును.
ధ ర్మాధర్మవిధర్మములను వివేకించును
శ్రీ క ర్మభూయాత్తనువారలకు శ్రీలనొసంగును.
సం ఘసంస్కర్తల దుర్వాదములనిరసించును.
జీ వన్ముక్తిపదసోపానములనుజూపును.
వ ర్ణాశ్రమ ధర్మతత్పరుల నాశ్రయించును.
ని త్య సత్య హితమితవాదముల వినిపించును.

## చందా వివరము

| | | | |
|---|---|---|---|
| రాజపోషకులు | సం॥౧ కి | రు | 10-0-0 |
| ప్రధానపోషకులకు | ,, | రు | 4-0-0 |
| అనుపోషకులకు | ,, | | 3-0-0 |
| చందాదారులకు | ,, | | 2-0-0 |
| ,, | ఆరుమాసములకు | | 1-4-0 |
| | విడిపత్రిక | | 0-3-0 |



Regd. No. M. 1480 చందా సం॥రు. 2.

శ్రీ

శ్రీ బాలాత్రిపురసుందర్యైనమః

"యతో ధర్మస్తతో జయః। సత్యమేవ జయతే నానృతమ్"

# శ్రుతిధర్మసంజీవని

వర్ణాశ్రమ ధర్మపక్షమున వాదించు మాసపత్రిక.

"ధర్మ ఏవహతో హంతి ధర్మోరక్షతి రక్షితః"

శివపురపు వీరభద్రశాకమూజి పత్రికాధిపతి



| సంపుటము. | విభవ వైశాఖశు ౭ గురువారము. | సంచిక. |
|---|---|---|
| ౧ | ఏప్రిల్-1928. | ౪. |



విషయసూచిక



1 చతుర్వర్ణ చరిత్ర — పత్రికాధిపతి

2 వేదశాసనము — "

3 హరవిలాస శారద ముద్దులక్ష్ముల వివాహ శాసన విమర్శనము — "

4 హరవిలాస శారద ముద్దులక్ష్ముల గర్భాధాన శాసన విమర్శనము — "




బెజవాడ:

శ్రుతిధర్మసంజీవనీ ముద్రాక్షరశాలయందు

ముద్రింపఁబడి ప్రకటింపఁబడియె.

1928.

శ్రీ
శ్రీ బాలాత్రిపురసుందర్యైనమః
"యతోధర్మ స్తతోజయః। సత్యమేవజయతేనానృతమ్"

# శ్రుతి ధర్మసంజీవని

వర్ణాశ్రమ ధర్మపక్షమున వాదించు మాసపత్రిక.
"ధర్మఏవహతో హంతి ధర్మోరక్షతి రక్షితః"
శివపురప్పు వీరభద్రిసాకమాజి పత్రికాధిపతి

| సంపుటము. | విభవ వైశాఖశు ౭ గురువారము. | సంచిక. |
|---|---|---|
| ౧ | ఏప్రిల్-1928. | ౪ |


వైశ్యవేదోక్త క్రియావిచారవ్యవస్థా పీఠికావిమర్శనాత్మక.

## చతుర్వర్ణచరిత్ర

### పీఠిక.

మన ప్రతిపక్షు బ్రాహ్మణులు కలియుగమున క్షత్రియవైశ్యులు లేరను తమ దుర్వాదమును నిలుపుకొనుటకై కనుపరచిన ప్రమాణములను వెనుకటి ప్రకరణమున విమర్శించి చిగుసిన క్షత్రియవైశ్యులు కలియుగమున స్వరూపనాశనము చెందినటుల విద్యారణ్యులు తమకు బోధించినారని కనుపరచిన వాక్యమును ముందు ప్రకరణమున విమర్శించెదమని చెప్పియుంటిమి ఇప్పుడాపని ముగించుచున్నవారము

ఆవిద్యారణ్యుల వాక్యమేదియన

"క్షత్రియవైశ్యజాతీశ్చ స్వరూపేణోచ్ఛిన్నత్వాత్"

అనునది ఈవాక్యమునిచ్చి మన ప్రతివాదులు కలియుగమున క్షత్రియవైశ్యులు స్వరూపనాశనము చెందియున్నారని సాహసించి వ్రాసియున్నారు వారి యీవ్రాతను బట్టిచూడ ప్రతివాదుల కీసుమంతయైనను శబ్దార్థజ్ఞానములేదని చెప్పిన స్వభావోక్తి యగునుగాని యతిశయోక్తి యెంతమాత్రమును గాజాలదు ఏలయన? పైవాక్య

ములోని "స్వరూపేణోచ్ఛిన్నత్వాత్" అను పదములకు యథావిధ్యుక్త కర్మానుష్ఠానమునుండి క్షత్రియవైశ్యు లుచ్ఛిన్నులైనారని యర్థముగాని క్షత్రియవైశ్యులు స్వరూపనాశనము జెందినారని యర్థముగాదు ఇట పరాశరుడు తన ధర్మశాస్త్రోక్తధర్మము లను ననుష్ఠింపదగిన యధికారులగు బ్రాహ్మణక్షత్రియ వైశ్యశూద్రులు కలియుగమున నుందురా? ఉండరా? యని ప్రశ్నించుకొని సమాధానముగ యథావిధ్యుక్త కర్మానుష్ఠానము గావించు బ్రాహ్మణక్షత్రియ వైశ్యశూద్రులు కలియుగమున నుండరుగాని యథాసంభవముగ గర్మల ననుష్ఠించువారుందురు కాన వారి నిమిత్తమే తాను ప్రాయశ్చిత్తకాండను చెప్పుచున్నానని క్రిందిశ్లోకముఖమున జెప్పియున్నాడు ఈవిషయము మీకు బోధపడగలందులకై యాశ్లోకమును దానికి విద్యారణ్య యతీంద్రులవారు కావించిన వ్యాఖ్యను మీయెదుట నిడివిమర్శించుచున్నవారము సావధానముగ బఠింతురుగాక.

శ్లో॥ యుగేయుగేచ యేధర్మా స్తేషు తేషుచ యేద్విజాః॥
తేషాం నిందానకర్తవ్యా యుగరూపాహి తే ద్విజాః॥

అవతారిక "ననూక్తరీత్యా కలియుగే సర్వేష్య భోజ్యాన్నాః అభక్ష్యభక్షణాశ్చతథాసత్యే తద్విషయం ప్రాయశ్చిత్తశాస్త్రం నిరర్థకం కృతేపి ప్రాయశ్చిత్తే పునరపితత్ప్రవృత్తేః పరిహర్తుమశక్యత్వాత్ ప్రాయశ్చిత్త విధాయకాయాః పరిషదో సంభవాచ్చనహి పాపప్రవృత్తానాం పరిషత్వంయుక్తం స్వకర్మరతవిప్రాణా మితి తల్లక్షణాత్ నచాభక్ష్య భక్షణాదిభ్యః పాపేభ్యో నివృత్తానాం శిష్టానాం పరిషత్వం స్యాదితి శంకనీయం తాదృశస్య కస్యాప్యదృష్టచరత్వాత్ అతఃకలియుగే సర్వేషాం నింద్యత్వాత్ ఏతదేవయుగముద్దిశ్య ప్రవృత్తస్య పారాశర్య ధర్మశాస్త్రస్యనిర్విషయిత్వా దిత్యాశంక్యాహ"

అని విద్యారణ్యయతీంద్రులవారవతారి కనుదించియున్నవారు అనగ నిదివరకు జెప్పినదానింబట్టి కలియుగమున సర్వులును నభోజ్యాన్నులును నభక్ష్యభక్షణులునునై యుందురని తేలినది అపుడు వారి సంబంధించిన యీప్రాయశ్చిత్తశాస్త్రము నిరర్థకమగుచున్నది నే

యన ప్రాయశ్చిత్తము కావించి నప్పటికిని తిరిగి పురుషులు పాపప్ర వృత్తు లగుచుండుటచే వారి నాపాపప్రవృత్తినుండి తొలగించుటకు శక్యముకా నేరదు కాన పాపనివృత్తులకు ప్రాయశ్చిత్తమును విధించు పరిషత్త్వము సంభవింపనేరదు ఏలయన? స్వకర్మలతులగు విప్రులకే పరిషదధికారము కలదని శాస్త్రముచెప్పియున్నది అభక్ష్యభక్షణము మున్నగు పాపములనుండి నివృత్తులయిన శిష్టులకు పరిషత్త్వమేలయుం డరాదని శంకింపబనిలేదు ఏలయన? అభక్ష్యభక్షణము మున్నగు పాపకార్యములనుండి విడివడిన పురుషుడొక్కడైనను గలియుగమున గనుపించడు గాన నీకాలమందలి పురుషులెల్లరు నిందుర్యులైయుందురు.

అందువలన నీయుగము నుద్దేశించిరచింపబడిన పారాశర్యధర్మ శాస్త్రము ననుసరించి నడుచువారు లేకుండుటవలన నీగ్రంథరచన నిరుపయోగమని శంకించుకొని యాశంకకు పరాశరమహర్షి "యుగే యుగే" యను శ్లోకముఖమున సమాధానము చెప్పియున్నాడని విద్యా రణ్యుల వారిట్లు చెప్పుచున్నారు

"ద్వివిధా హ్యధర్మప్రవృత్తిః యుగప్రయుక్తా ప్రమాదాలస్యాది ప్రయుక్తాచేతి తత్రయుగప్రయుక్తాయాః ప్రవృత్తేరపరిహార్యత్వాత్ తన్నివృత్తయే నపరాశరస్యోద్యమః యాతుప్రమాదాలస్యాది ప్రయుక్తాప్రవృత్తిః తత్రసావకాశంధర్మశాస్త్రం"

అనగా యుగప్రయుక్తము ప్రమాదాలస్యాది ప్రయుక్తముననియధర్మప్రవృత్తి రెండు విధములుగ కనుపడుచున్నది అందు యుగప్ర యుక్తమయిన యధర్మవృత్తిపరిహరింపబడునదికాదు. కాన తన్నివృత్తికై పరాశరుడీ ధర్మశాస్త్రరచన కుపక్రమించియుండలేదు ఇకరెండ వన ప్రమాదాలస్యాదప్రయుక్తమయిన యధర్మప్రవృత్తి యేదికలదో దానిని దొలగించుటకే పరాశరుడీ ప్రాయశ్చిత్త శాస్త్రమును రచించియున్నవాడు అదెట్లందురా? చెప్పెదమువినుమని విద్యారణ్య యతీంద్రులిట్లు చెప్పదొడంగియున్నవారు.

"అధ్యయన విధిస్త్వాపదర్థ జ్ఞానపర్యంతం సాంగవేదపాఠమాచష్టే నచకలౌయుగే తాదృశఃప్రం కంచిదప్యుపలభామహే

తథాబ్రహ్మచర్యాది ప్రకరణేతదాశ్రమధర్మా అధ్యయనధర్మాశ్చ సహస్రశః స్మర్యంతే నచతాన్సర్వాన్ యథావదనుతిష్ఠన్ మాణవకః కోప్యుపలభ్యతే యదాఅధ్యయనస్యైవేదృశీగతిః తదా కైవకథాసాంగకృత్స్న వేదార్థానుష్ఠానే తథాసతి శాస్త్రీయముఖ్యబ్రాహ్మణ్యోపేతస్య కస్యాప్యభావాత్ అనగా అధ్యయనవిధి యథార్థజ్ఞానపర్యంతమగు సాంగవేదపాఠమును జెప్పియున్నది అట్లు బ్రహ్మచర్యాది ప్రకరణములందు గూడ వారివారి యాశ్రమధర్మములను నధ్యయనధర్మములను వేలకొలంది చెప్పబడియున్నవి. కానివానినన్నిటిని యథావత్తుగననుష్ఠించు విద్యార్థియొక్క డైనను నీకలియుగమున లభింపనేరడు ఎపుడధ్యయన విధికే యిట్టిదుగతి సంభవించినదో యపుడు సాంగసంపూర్ణ వేదార్థా నుష్ఠానముయొక్కకథ యడుగవలసినదే మున్నది? అనియిట్లు ప్రశ్నించుకొని దానికి సమాధానముగ విద్యారణ్యులవారు శాస్త్రీయమైన ముఖ్యబ్రాహ్మణ్యముతో గూడిన బ్రాహ్మణుడొక్కడును నీకలియుగమున లేడుండునని చెప్పియున్నారు. ఇంతవిస్పష్టముగ గలియుగమున శాస్త్రోక్త యావత్కర్మానుష్ఠాము గావించు బ్రాహ్మణుడొక్కడును నుండడని చెప్పియటుపైమన ప్రతిపక్షబ్రాహ్మణుల దురవస్థను బయటబెట్టజాలిన "క్షత్రియవైశ్యజాత్యోశ్చ స్వరూపేణోచ్ఛిన్నత్వాత్" అనువాక్యమును విద్యారణ్యులవారు వ్రాసియున్నారు. ఇందుక్షత్రియవైశ్యజాత్యోశ్చ అనువాక్యములోనున్న సముచ్చయమగుచకారమునుబట్టి పూర్వులవలె శాస్త్రోక్త యావత్కర్మానుష్ఠానము గావించు బ్రాహ్మణులు కలియుగమున నుండరని చెప్పియున్నారు గానవారివలెనే) శాస్త్రోక్త యావత్కర్మానుష్ఠానము గావించు క్షత్రియ వైశ్యజాతులును లేవని చెప్పదలంచి "క్షత్రియవైశ్య జాత్యోశ్చ స్వరూపేణోచ్ఛిన్నత్వాత్" అను వాక్యము వ్రాసియున్నారు కాన "స్వరూపేణోచ్ఛిన్నత్వాత్" అను వాక్యమునకు శాస్త్రోక్తయావత్కర్మానుష్ఠానము గావించు క్షత్రియ వైశ్యజాతులులేవని పండితులర్థము చెప్పవలయును గానిస్వరూపనాశనము చెందినారనియర్థము చెప్పరాదు అదియపండితులు చెప్ప

వలసిన యర్థము. కాన దానిని పండితులు నిరసింపకతీరదు.

ఇట్లు ద్విజు (బ్రాహ్మణక్షత్రియవైశ్య)లను గూర్చి ముచ్చటించి యటుపై శుశ్రూష చేయించుకొనదగిన ముఖ్యద్విజులే యీకలియుగమున లేనపుడు వారికి శుశ్రూష చేయుదగిన ద్విజేతరులుందురా? ఉండరుఅని "శుశ్రూషయితవ్యానాంద్విజానా మసంభవే తచ్ఛుశ్రూషయికస్యముఖ్యస్య శూద్రస్యాత్యంతమ నాశంకనీయత్వాత్ అనిచెప్పి యటుపై క్రిందిపరిష్కారమును వినిపించియున్నారు. కించాతుర్వర్ణ్యముద్దిశ్య ప్రవృత్తం ధర్మశాస్త్రం స్వరూపేణై వలుప్యతాం కింవానుఖ్యాసంభవేపి యథా సంభవం చాతుర్వర్ణ్య మాశ్రిత్యధర్మశాస్త్రం ప్రవర్తతామితి మీమాంసాయాం స్వరూపలోపాద్వరం యథాసంభవానుష్ఠాన మిత్యభిప్రేత్యయుగ ప్రయుక్తాః సర్వైరప్య వర్జనీయామధర్మ ప్రవృత్తి మదోషత్వే నాభ్యుపగమ్య తేషాంనిందా నకర్తవ్యేత్యుక్తం తతస్సం భావితాధ్యయనాద్యుపేతాయాం శక్యాయాం ధర్మప్రవృత్తౌ ప్రమదాలస్యాది రహితానాం పరిషత్వం కుతో నస్యాత్ కృతప్రాయశ్చిత్త స్యపునః ప్రమాదాల స్యాది వర్జనస్య శక్యత్వాత్ ప్రాయశ్చిత్త శాస్త్రంచసార్థకమితి"

అనగా పరాశర ధర్మశాస్త్రము ననుసరించి యావత్కర్మానుష్ఠానము గావింపదగిన చాతుర్వర్ణ్యము కలియుగమున లేని యపుడు వారినుద్దేశించి ప్రవర్తించిన పరాశరధర్మ శాస్త్రము స్వరూపముచే (సంపూర్ణముగా) లోపించవలయునా? లేక ముఖ్యములగు చాతుర్వర్ణము లభింపని యపుడు యథాసంభవా నుష్ఠానము గావించు చాతుర్వర్ణ్యము నాశ్రయించి యీధర్మశాస్త్రము ప్రవర్తించవలయునా యను మీమాంసకలుగగా యావత్కర్మానుష్ఠాన లోపముకంటె యథాసంభవానుష్ఠానము కొంచెము మంచిదని తలంచి యుగప్రయుక్తమయిన యధర్మప్రవృత్తి సర్వులచేతను మీరుట కలవియగునది కాదు కాన దానిని నిర్దోషముగ నే గ్రహించి యాయుగప్రయుక్తమయిన యధర్మమునందు వర్తించుద్విజులను (బ్రాహ్మణక్షత్రియవైశ్యులను) నిందించవలదని పరాశరుడు చెప్పియున్నాడు తరువాత యథాసంభవముగా

వేదాధ్యయనాది ధర్మములతో కూడియున్న ధర్మప్రవృత్తి శక్యమైన దగుటవలన ప్రమాదాలస్యాది రహితులకు పరిషత్వమేలసంభవింపదు సంభవించును. ప్రాయశ్చిత్తము చేసికొన్నవారికి దిరిగి ప్రమాదాలస్యాది ప్రయుక్తమైన యధర్మప్రవృత్తిని విడుచుటకు శక్యమగును గాన నీప్రాయశ్చిత్త శాస్త్రము సార్థకమగుచున్నదని పైవాక్యార్థము

ఇంతవరకు వినుపించిన విద్యారణ్యుల వారితీర్పును బట్టిచూ ప్రకృతమగు కలియుగమునను గూడ బ్రాహ్మణశూద్రులవలెనే క్షత్రియవైశ్యులును గూడ నున్నారని నిష్పక్షపాతబుద్ధిగల మానవు లంగీకరింపకపోరని తలంచుచున్నాము.

ఇంతవరకు మనము కావించిన శాస్త్రపరామర్శ వలన మా ప్రతివాదులు కనుపరచిన "యుగేయుగేస్థితా స్సర్వేకలా వాద్యం యోస్థితిః" అను వైశ్య కమలాకరోక్త వచనము శ్రుతిస్మృతి పురాణేతి హాసవిరుద్ధమైనదని స్పష్టమగుచున్నది ఇట్టిప్రమాణమగు నిబం నకారవచనమును బ్రమాణమునుగా గైకొని పవిత్రములైన క్షత్రియవైశ్యజాతులు కలియుగమున మనతోబాటు సృష్ట్యాదినుండి యి టివరకవిచ్ఛిన్నముగా వచ్చుచుండగను మధ్యకాలమున విచ్ఛిన్నమలైనవను కథలు లేకయుండగను సత్యమును గ్రహించు వివేకము సంపాదించుకొనని యపండిత బ్రాహ్మణులు సాహసించి పరిశు ద్యోనిబీజములకు జనించినక్షత్రియ వైశ్యులు ప్రకృతము లేనేలే వ్రాయుటకంటె నిషిద్ధకార్యము వేరొకటి లేదని వివేకముగలవా చెప్పకతప్పదు ఇంతటితో పీఠికావిమర్శనము ముగించి ముందు చికనుండి గ్రంథవిమర్శనమునకు గడంగుచున్నవారము.



# వేద శాసనము.



ఇది ప్రపంచము జనించుటకుముందు విరించికిఁ బరమేశ్వరుని చేఁ బ్రసాదించఁ బడియున్న యపౌరుషేయమగు స్వతః ప్రమాణ గ్రంథరాజము ఈగ్రంథమునందలి శాసనములను నుల్లఘించుటకుఁ బ్రపంచమును సృజించిన విరించికే యవకాశములేదు. ఇఁక విరించిచే సృజించఁబడిన మానవులకు వేదశాసనములను నుల్లఘించుట కవకాశములభించునా? లభించదు వేదశాసనములు విధులు నిషేధములు నని రెండువిధముల వర్తించుచున్నవి విధులనఁ నిష్టప్రాప్తిని గలిగించు విహితధర్మలను దెలిపివాని ననుష్ఠించవలసినదని విధించుశాసనములని యర్థము. నిషేధములన నరిష్ట ప్రాప్తిని గలిగించు నవిహితకర్మలను దెలిపి వానిననుష్ఠించవలదని విధించు శాసనము లనియర్థము ఇట్లు నిష్టప్రాప్తిని నరిష్ట నివృత్తిని బోధించి కేవలము మనక్షేమమును విచారించుట యందే వేదశాసనములు ప్రవర్తించియుండుటచే మన పూర్వులొకప్పుడు పరమేశ్వరు శాసనముల నయిన నుల్లఘించుచు వచ్చిరికాని వేదశాసనముల నుల్లఘించినవారు మాత్రముకారు మధ్యకాలీనులైనను నొకప్పుడు వేదశాసనములు విధించిన విహితకర్మలను ష్ఠించుట కలసత చెంది యుపేక్షించి యిష్టప్రాప్తిని జెందకపోయినను నిషేధించిన యవిహితకర్మలను బరిత్యజించి యరిష్టపరిహారమును గాంచుచు వచ్చియున్నవారు కాని వేదశాసనములను నెదిరించిన వారులేరు కొందరసురులట్లు ప్రవర్తించినను వారు స్వరూపనాశనము గాంచియుండిరి.

శ్లో॥ రాక్షసాః కలిమాశ్రిత్య! జాయంతేసర్వజాతిషు!
ద్విషంతిశ్రుతిధర్మాంశ్చ! శ్రుతిధర్మరతాన్నరాన్ ॥

అను లోకానుభవజ్ఞుని వచనము చెప్పినటుల రాక్షసాంశభూతులగు భారతీయులు కొందరిపుడు బయలువెడలి వేదశాసనములను బాధించుశాసనములను సృజించి వేదోక్త ధర్మములను ననుష్ఠించుమానవోత్తములను శిక్షించుశాసనములను సృజించుటకు యత్నించుచున్నవారు ఇఁకవానింగూర్చి చర్చించుకొందము.

# హరవిలాస శారద డాక్టరు ముద్దులక్ష్మిగార్ల

# వివాహశాసనవిమర్శనము.



సామ్రాజ్య శాసన నిర్మాణ సభాసభ్యులగు హరవిలాస శారద గారును మదరాసు శాసన నిర్మాణసభాసభ్యురాలగు డాక్టరుముద్దు లక్ష్మిగారును భారతకన్యలకు 12 సం॥ల లోపల వివాహమును 16 సం॥ల లోపల గర్భాధానమును జేయరాదను రెండు నిషేధశాస నములను నిర్మాణము గావించుటకై బిల్లులు మూచేసి పాసు చేయించి యున్నవారు వానిని విమర్శించువ్యాసములు కాన వీనికి హరవిలాస శారద డాక్టరు ముద్దులక్ష్మిగార్ల వివాహశాసనవిమర్శనము హరవిలాస శారద డాక్టరుముద్దులక్ష్మిగార్ల గర్భాధాన శాసనవిమర్శనము అను నన్వర్థ నామకరణములుగావించి తొలుతబైపేర వివాహశాసనమును మాత్రమే నేడు విమర్శింపగడంగియున్నవారము ఇక నుపోద్ఘాత మును వినిపించెదము వినుడు.

## ఉపోద్ఘాతము.

భారతప్రపంచమున నిపుడు వసించియున్న భారతప్రజలు వారి వారి ప్రవర్తనములను బట్టిచూడ బూర్వాచార పరాయణులనియు నవీనాచార పరాయణులనియు రెండు తెగలుగ విడివడియున్న వారను నది లోకవిదితమై యున్నవిషయము పూర్వాచార పరాయణులనగ శ్రుతి స్మృత్యుక్తములై వచ్చుచున్న సదాచారములలోనే వేని ప్రమాదవశ మున శాస్త్రవిరుద్ధముగ మారివచ్చిన దురాచారములున్నయెడ వానిని బరిత్యజించి శాస్త్రోక్తాచారములను తిరిగి యాచరించుట కాసక్తికల వారని యర్థము. నవీనాచార పరాయణులన శాస్త్రోక్తములై శిష్ట జనాచరితములై పరంపరాప్రాప్తములై వచ్చుచున్న సదాచారము లను మాత్రమే దురాచారములనుగా భావించి వానిని సంస్కరించి స్వేచ్ఛానుకూలములగు దురాచారములను నాచరించి భ్రష్టులయి వానినాచరించుట కామోదించి చెడుటకిష్టపడని పూర్వాచార పరా యణులను నిర్బంధ శాసనముల మూలమున వంచుకొని భ్రష్టు

లను జేయవలెనని మెచ్చి తమకయితా ము బయలుదేరి రాజకీయ విషయములలో మన సంఘమున కుపకారకములగు న శాసనములను సృజించెదమని వచించుచు కాలుకాలిన పిల్లివలెనటించి వంచించి రోట్లు సంపాదించుకొని వాసిమూలమున శాసనసభాసభ్య పదవిగడించి గడించినమీదగండడుమిండడై రాజకీయవిషయములందు శాసనములను సృజించు మాటయటుంచి మాటాడుటకు గూడ నస మర్థులై యూరకగూర్చుండి తమకాలము గడుపజాలక మెద్దుగోక త్రొక్కిన బిల్లియెలుకపై పల్లుగొరికినట్లు ప్రభుల నెదిరించ లేకవర్ణా శ్రమధర్మ నిర్మూలకములగు దుష్టశాసనములను పాసుచేసి తన్మూల మున "తాజెడ్డకోతి వనమెల్ల జెరిచె" నన్నలో కోక్తికి గురిగ మనల జెరుచుటకై శాస్త్రాచార విరుద్ధములును వర్ణసాంకర్య కారకములును స్త్రీసంఘావమానజనకములును ప్రభు ప్రజాపరస్పర వైషమ్య సంపా దన సమర్థములును నగు దుష్టశాసనములను సృజించుటకు బిల్లులు మూచేయుచున్నవారని యర్థము. వారిబిల్లులను బట్టిచూడ వారిని మానవ గణములో బరిగణించుటకుగాని వారిశాసనములను మానవు లామోదించుటకుగాని వీలులేకయున్నదని వ్రాయవలసి వచ్చినందు లకు జాలజాలిపడి యీవిషయమును స్థిరపరచు శాసన విమర్శనము నకుపక్రమించుచున్నవారము.

ఉపక్రమము.

శారదముద్దులక్ష్మివివాహశాసనములుమనయాచారమునకుబర మవిరోధులైయున్నవి ఎట్లన? మనముకన్యలకు 12 స॥లకు లోపలనే వివాహము చేయుచున్నారము. కావుననే ముద్దులక్ష్మిగారు కన్యలకు 12 స॥ల లోపల వివాహము చేయరాదనియు జేసినవారికి గఠినశిక్ష విధించవలయుననియు నొకశాసనము సృజించవలసి వచ్చినది ఈచెప్పి నదానిఁబట్టి శారదముద్దులక్ష్మల వివాహశాసనములు మనయాచార ములకు బరమ విరోధులైయున్నవను మనవాదము పరమప్రమాణమై యున్నదని ధృవపడినదికదా? ఇంతియెకాదు మనచే గావింపబడుచున్న బాలికా వివాహాచారము మనశాస్త్రములకు విహితమైయున్నదా?

లేకవిరుద్ధమైయున్నదా? యనివిషయము ముందువిచారించవలసియున్న
విచారించ బాలికా వివాహాచారము శాస్త్రసిద్ధమై యున్నయెడ
దానిని సంస్కరించుటకు బరమేశ్వరునకే యధికారముతే
ఇకప్రభువులకుగాని ప్రజలకుగాని యీయధికారమెట్లు వచ్చును
రాదు రానియధికారము వచ్చినదని తలంచి వేదశాస్త్రోక్తాచారము
లను సంస్కరించుటకు శాసనసభాసభ్యులు బిల్లులనుసూచేయుటకంటె
వివేక విహీనమైన కార్యము మరియొకటియుండదని చాటవచ్చునుగా
శాస్త్రవిరుద్ధములగు బిల్లులు సూచేయువారి నాలుకలను జేతులను
ఛేదించుట ప్రభువులయు ప్రజలయు ధర్మమైయున్నదనిన స్వభావోక్తి
యగునుగాని యతిశయోక్తి యెంతమాత్రమును గాదుగదా? కాదు.

ఇంతీయెకాదు ఒకవేళమన బాలికావివాహాచారము వాదము
నిమిత్తము మన శాస్త్రములకు విరుద్ధముగనుండె ననుకొందము ఉం
డినను దానిని సంస్కరించుటకు వేదశాస్త్రప్రవీణులగు బ్రాహ్మణుల
ధికారులయ్యెదరు కాని యపండితులగు బ్రాహ్మణులే యధికారులు
కానేరరు ఇంక బ్రాహ్మణసంఘమున జనించిన యపండితుల కాయ
ధికారమెట్లువచ్చును? రాదు అబ్రాహ్మణ పురుషులకే యాయధికార
ములేదనిన నపండితురాలగున బ్రాహ్మణనారీమణులగు ముద్దులక్ష్మ
మ్మగారు తమకాయధికారమున్నదని తలంచి యీబిల్లు మాచేయుట
కంటె వివేక విహీనమైనకార్యము మరియొకటియుండునా? ఉండనే
రదు. కానవెంటనే యీబిల్లులను శాసనములను నుపసంహరించుకొ
నుట శారద ముద్దులక్ష్మమ్మగార్లకు సర్వవిధముల శ్రేయస్కరమని
హితోపదేశముగావించి వారిసంశయనివృత్తి చేయగోరివారు మాచే
సిన బిల్లులు మాశాస్త్రములకు బద్ధవిరుద్ధములుగ నున్నవను విషయ
మును స్థిరపరచుట కుపక్రమించియున్నారము వినుడు: —

ప్రకృతము మాభరతఖండమున వసించుచున్న బ్రాహ్మణక్షత్రి
యవైశ్యశూద్రులనెడి నాలుగు జాతులవారు మాత్రమే పరమేష్టిచే
సృజించబడిన పవిత్రజాతీయులని శాస్త్రలోకానుభవములు చాటు
చున్నవి ఇందు బ్రాహ్మణవైశ్యులు బాలికావివాహములను క్షత్రియ

శూద్రులు బాలికా రజస్వలా వివాహములను రెంటిని జేయుచున్నారు ఈయుభయాచారములును శాస్త్రవిహితములై వచ్చుచున్నవి కాన క్షత్రియశూద్రులకు శారద ముద్దులక్ష్మల వివాహశాసనము లో బనిలేదని తేలినదికదా? ఇక బ్రాహ్మణవైశ్యులను బాధించుటకే యీబిల్లులను శారదముద్దులక్ష్మిగార్లు మూచేసియున్నారని స్పష్టమైనది కాననీవిషయమై యిట్లు చర్చించవలసినది.

మన ధర్మశాస్త్రములలో నగ్రగణ్యమై యున్నది మనుధర్మశాస్త్రము అదికన్యలకు 12 స॥ల లోపలనే వివాహము చేయవలసినదనియు జేయకున్న తల్లితండ్రి యన్నలోనగు కన్యాదాతలు నింద్యులయ్యెదరని నిందించియున్నది ఇట్లువినుడు:—

శ్లో॥ కాలేదాతా పితావాచ్యః । వాచ్యశ్చానుపయన్పతిః॥

కాలమందు గన్యను దానము చేయనితండ్రియు గాలమందు గాంతను గలియని కాంతుకును నింద్యులగుచున్నారని పైశ్లోకార్థము ఈయర్థమును వినగనే కాలమందు దానము చేయని తండ్రినింద్యుడను వాక్యముతో మనువు గన్యలకు మనముచేయుచున్నటుల 12 సం॥ల లోపలనే వివాహము చేయవలయునని విధించియున్నాడా? లేక మన శారద ముద్దులక్ష్మిగార్ల మొద్దు శాసనము చెప్పినటుల గన్యలకు 12॥ల లోపల వివాహము చేయరాదని నిషేధించియున్నాడాయని ప్రతివారికిని సంశయము కలుగకపోదు. గానదాని నివారించు వచనములను మనము విచారించి చూపించవలసియున్నది. బాగుగ విచారించగా మనువుకాలమందు దానముచేయని తండ్రి నింద్యుడగుచున్నాడను వాక్యముతో గన్యలకు 12 స॥ల లోపలనే వివాహము చేయవలెగాని మీదచేయరాదని విధించినట్లు యీక్రింది మనువచన పరామర్శవలన విస్పష్టము కాగలదు. చూడుడు:—

9అధ్యా 94శ్లో॥ త్రింశద్వర్షోద్వహేత్కన్యాం । హృద్యాంద్వాదశవార్షికీం। త్ర్యష్టవర్షోష్టవర్షాంవా। ధర్మేసీదతి సత్వరః॥

అనగ ముప్పది సంవత్సరముల యీడుగలవాడు మనోహరురాలగు 12 స॥ల కన్యను 24 సం॥ల యీడుగలవాడు 8 సం॥ల క

న్యను వివాహము చేసికొనవలసినదని పైశ్లోకార్థము ఈయర్థము నే యించుమించుగ నీక్రింది సుశ్రుత శారీరస్థానమందలి 10 యధ్యాయములోని వాక్యము బలపరచుచున్నది. కనుడిది:—

"అథాస్మై పంచవింశతి వర్షాంపత్నీం ఆవహేత్" పిత్ర్యధర్మార్థకామ ప్రజాఃప్రాప్స్యతీతి" ఇందులకు హిందీయను వాదకారు డిట్లర్థము చెప్పియున్నాడు "జబ్ పురుషకీ అవస్థా 25 వర్షకీ హో తబ్ ఇస్‌కా 12 వర్షకీ స్త్రీసే వివాహకరీనా చాహియే ఐసాకర్ నేసే పిత్ర్యం పితలోంకో జోహిత హోతా (శ్రాద్ధాదికీ యోగ్యతా తథా ధర్మ (శ్రుతిస్మృతి విహితయజ్ఞాదికా అనుష్ఠాన్) ఔర్ అర్థ (ద్రవ్య) కామ (మనోరథాది ఇంద్రియానుకూలసుఖ) ఔర్ ప్రజా (సంతాన్) ఇన్ సబ్ కో ప్రాప్త హోతా హై" అనగా 25 సం॥ముల వయస్సుగల పురుషుడు 12 సం॥ల వయస్సుగలకన్యను వివాహ మాడవలయును అట్లుచేసికొనిన యెడల పిత్ర్యకర్మచేయుటకును, యజ్ఞాదులొనర్చుటకును, అర్థముగడించుటకును, కామమనుభవించుటకును, సత్సంతానము గనుటకును, నధికారియగు చున్నాడని పై వచనార్థము.

ఇంతవరకు మేము గన్పరచిన వచనములనుబట్టి కన్యలకు 12 సం॥ల లోపల 8 సం॥ల మీదవివాహము చేయవలసినదని మనువు విధించినట్లు తెలియవచ్చినదికదా? ఇంతియె కాదు ఉత్కృష్టుడును చక్కనివాడును, సమానజాతీయుడును, నగుపరుడులభించెనేని తనకూతున కెనిమిదవ సంవత్సరము రాక పోయినను యథావిధిగ వివాహము చేయ వచ్చునని మను వీక్రిందిశ్లోకముఖమున ననుజ్ఞయిచ్చియున్నాడు. వినుడు:—

శ్లో॥ ఉత్కృష్టాయాభిరూపాయ । వరాయసదృశాయచ।
అప్రాప్తమపితాంతస్మై । కన్యాందద్యాద్యథావిధః॥

ఇందులకు కుల్లూక భట్టాచార్యుడిట్లు వ్యాఖ్యానము గావించియున్నాడు.

"కులాచారాదిభిరుత్కృష్టాయ సురూపాయా సమానజాతీయా యవరాయా ప్రాప్తకాలామపి వివాహయేదష్ట వర్షామేవం ధర్మ్యా

హీయతే ఇతిదక్షస్మరణాత్ తస్మాదపి కాలాత్ప్రాగపికన్యాం బ్రాహ్మ వివాహవిధినాదద్యాత్"

అనగ కులాచారాదులచే నుత్కృష్టుడును సహజసౌందర్య వంతుడును సమానజాతీయుడును నగు వరుడు లభించెనేని వానికి 8 సం॥ల బాలికకు వివాహము చేయవలసినదను దక్షస్మృతి వచనాను సారముగ దనకన్యకు 8 సం॥లు ప్రాయమురాకపోయినను బ్రాహ్మ వివాహ విధిననుసరించి కన్యాదానము చేయవలసినదని పైభాష్యా ర్థము.

ఈచెప్పినదానింబట్టి కాలేదా తాపితావాచ్యః అను మనువచ నమునకు మనము కన్యలకు 12 సం॥ల లోపలనే వివాహము గావిం చెడి యాచారమేయర్థమని తెలియవచ్చినదిగదా? ఇంతియెకాదు. కాలేదా తాపితా వాచ్యః అను మనువచనమునకు గుల్లూకభట్టాచా ర్యుడు ప్రదాన కాలేపితా తామదదత్ గర్హ్యోభవతి ప్రదానం ప్రాగృతోః ఇతిగౌతమ వచనాత్ ఋతోః ప్రాక్ ప్రదాన కాలః అని భాష్యము కావించియున్నాడు అనగా ఋతుమతియగుటకు పూర్వమే కన్యను దానము చేయుదగిన కాలమని పైభాష్యార్థము.

ఇంతవరకుమనముగావించిన శాస్త్రపరామర్శవలన 12 సం॥ల మీదకన్యలకు వివాహముచేయుట నింద్యమైన కార్యమని తెలియవ చ్చినదికదా? ఈయర్థమునే క్రిందిపరాశరమాధవీయ వచనములు కూడ స్థిరపరచుచున్నవి. అదెట్లన? వినుడు వినిపించెదము:—

పరాశరమాధవీయము.

శ్లో॥ అష్టవర్షా భవేద్గౌరీ । నవవర్షాతు రోహిణీ।
దశవర్షాభవేత్కన్యా । అతఊర్ధ్వంరజస్వలా॥

ఇందులకు మాధవాచార్యుల వారిట్లు వ్యాఖ్యానము గావించి యున్నారు. "గౌర్యాదయస్తిస్ర ఉద్వాహేయ శుద్ధాః తద్దాతుః ఫల విశేష స్మరణాత్ రజస్వలాత్వే శుద్ధాతద్దా నస్యనిందితత్వాత్ అని 8 సం॥ల కన్యగౌరియనియు 9 సం॥ల పడతి రోహిణియనియు 10 సం॥ల చిన్నది కన్యయనియు నటుపై రజస్వల యగుననియు

మీాది పరాశరశ్లోకమున కర్థము దానికి మాధవాచార్యులవా
గౌరీరోహిణీ కన్యలు వివాహమునకు శుద్ధురాండ్రు ఏలయన? వా
వివాహము చేసినవారికి ఫలవిశేషము శాస్త్రము చెప్పియున్నదికా
వున. రజస్వల వివాహమునకు శుద్ధరాలుకాదు ఏలయన? రజస్వ
దానమును శాస్త్రము నిందించియున్నదికాన. ఇట్లువిద్యారణ్యులవా
చెప్పి యందులకు నుపబలముగ బృహస్పతి మహర్షివాక్యమును న
హరించియున్నవారు అదేమన? "గౌరీందదన్ నాకపృష్ఠం వైకుంఠ
రోహిణీందదన్ కన్యాందదన్ బ్రహ్మలోకం రౌరవంతు రజస్వలాం
ఇతి

గౌరీదానమున నాకపృష్ఠమును రోహిణీదానమున వైకుం
మును కన్యాదానమున బ్రహ్మలోకమును రజస్వలా దానమున రౌ
వాది నరకమును గన్యాదాతలు పొందుచున్నారని పైబృహస్పతి వ
నమునకర్థము. ఇట్లనిన బదునొకండవ వర్షమున బ్రతికన్యయు ర
నతియగుచున్నదా? లేదు లేనినాడు పరాశరుడు 10 సం॥లు దాటి
పడుచునకు రజస్వలయను పేరెట్లు పెట్టెనను సంశయము గలుగగా
దానిని నివారించుటకు మాధవాచార్యులవారు:—

"యద్యప్యేకాదశేవర్షేర జోదర్శనం నప్రతి నియతం తథా
కాసు చిద్దర్శనాత్ తత్సం భావనయా రజస్వలేతినిర్దేశః తామదద
నరకం ప్రాప్నోతీతి శేషః" అనువాక్యముఖమున బ్రయత్నించియున్
వారు.

పదునొకండవ సంవత్సరములో బ్రతికన్యయు రజస్వలయగు
నను నియమములేదు అట్లైనను కొందరు కన్యలకు రజోదర్శనము
చున్నదిగనుక దానిని దెలుపుటకై పరాశరుడు పది సంవత్సరము
మీాది కన్యను రజస్వలయని నిర్దేశించినాడు దానిని దానము చేసి
వాడు నరకమును పొందుచున్నాడని పైవ్యాఖ్యానార్థము ఈయర్థమ
నుబట్టి నరకమునకు బోదలంచినవారు మాత్రమే రజస్వలాదానము
జేయదగుననియు సద్గతులనపేక్షించువారు గౌరీరోహిణీ కన్యాదా
ములను గావించవలెననియు స్పష్టమైనదికదా?

ఇంతియేకాదు రజస్వలాదానమున గన్యాదాతలకు వచ్చెడి యరిష్టములనే మాత్రమేమన మిదివరకు గ్రహించియుంటిమి ఇపుడు తల్లిదండ్రులకు గల్గెడి యరిష్టములనుగూడ మనముగ్రహించవలసియున్నది ఏలయన? కన్యాదానమువలన తానేగాక తనకు పూర్వులును బరులును నగు నిరువది తరముల వారిని దరింపజేయు ఫలమువచ్చునని శాస్త్రములు తెలిపియున్నవి. ఇపుడు రజస్వలాదానము చేసినయెడ కన్యాదాతృపితలకు గల్గెడి యరిష్టములను పరాశరుడీ క్రిందిశ్లోకముఖమున వివరించియున్నవాడు వినుడు:—

శ్లో॥ ప్రాప్తేతుద్వాదశేవర్షేయః కన్యాం నప్రయచ్ఛతి।
మాసిమాసిరజస్తస్యాః పిబంతిపితరోనిశం॥

ఇందులకు మాధవాచార్యులవారిట్లు వ్యాఖ్యానముగావించియున్నవారు:—

"ఋతుదర్శనము పలక్షయితుంద్వాదశే వర్షఇత్యుక్తం అత ఏవ గౌతమేనప్రదానం ప్రాగృతు దర్శనాదిత్యుక్తం। యమోప్యేతదేవాహ. తస్మాదుద్వాహయేత్కన్యాం యావన్నర్తు మతీభవేదితి అతశ్చఋతు దర్శనాత్ప్రాగ్యోన ప్రయచ్ఛతితస్యపితరః ప్రతిమాసం తద్రజఃపిబంతి"

12వ వత్సరమున ఋతుదర్శనము దప్పక యగునని తెలుపుటకై పరాశరుడు పండ్రెండవసంవత్సరమని యెత్తిచెప్పియున్నాడు అది ప్రాప్తించిన దగుచుండగా నెవడు తనకన్యను దానముచేయడో వాని పితలు ప్రతిమాసమునను నాకన్యయొక్క రజస్సును పానము జేయుచుందురు కావుననే గౌతమ మహర్షియు ఋతుమతియగుటకు బూర్వమేకన్యను దానముచేయవలసినదని చెప్పియున్నాడు యముడును నిట్లే చెప్పియున్నాడు అనివిద్యారణ్యులవారు ప్రత్యవాయమును దెలిపియున్నవారు ఈవిమర్శవలన రజస్వలాదాతలకు వలెనే తల్లిదండ్రులకు గూడ నరిష్టము ప్రాప్తించునని గ్రహించితిమి పండ్రెండు సంవత్సరములకు లోపలను పదిసంవత్సరములకు పైనను అనగాగా 11-22 సంవత్సరములలో కన్యలు ఋతుమతులు కాకయున్నయెడ వారిని దాన

ముచేయుటగాని ప్రతిగ్రహము గావించుటగాని దోషకార్యములు కావని విద్యారణ్యులవారు క్రింది సప్రమాణమగు నింకొక పరిష్కారమును వినిపించియున్నవారు. అదేమన?

"అసత్యృతు దర్శనేద్వాద శేపివ న్యైకన్యాదాన ప్రతిగ్రహౌ ననిషిద్ధౌ అతఏవమనుః త్రింశద్వర్షోద్వహేత్కన్యాం హృద్యాం ద్వాదశవార్షికీం త్ర్యష్టవర్షోష్టవర్షాం వాధర్మేసీదతి సత్వరః॥ ఇతి

కన్యలకు ఋతుదర్శనము కాకముందు పన్నెండవ సంవత్సరమునందుకూడ కన్యాదాన ప్రతిగ్రహములు నిషిద్ధములు కానేరవు. కావుననే మనువు ముప్పది సంవత్సరములవాడు మనోహరురాలగు పన్నెండు సంవత్సరములకన్యను ఇరువదినాలుగు సంవత్సరముల ప్రాయముగలవాడెనిమిది సంవత్సరముల కన్యను వివాహము చేసికొనవచ్చునని చెప్పియున్నాడని చెప్పియున్నారు.

ఇంతవరకు మనము కావించిన శాస్త్రపరామర్శవలన నెనిమిదివత్సరములు మొదలుకొని పన్నెండువత్సరములలోపల కన్యలు రజస్వలలు కాకముందు వివాహము చేయుట శాస్త్రవిహితమైన కార్యమని తెలియవచ్చినదికదా? ఈయాచారమే యిపుడాచరణలోనున్నది. దానినిమార్చి రజస్వలా వివాహమును నాచరణలోనికి దెచ్చుటకే మన శారద ముద్దులక్ష్మి ప్రభృతులు బిల్లులుమూచేసి పాసుచేయించియున్నారని మనము గ్రహింపగలిగితిమి ఇకనీరజస్వలా వివాహమువలన వధూవరులకు వచ్చెడియరిష్టమేమో మనము గ్రహించవలసియున్నది.

శారద ముద్దులక్ష్మి వివాహశాసనారిష్టఫలము.

ఈవిషయమై పరాశరుడీ క్రిందిశ్లోకద్వయముఖమున రజస్వలానంతర వివాహము గావించుకొన్న వధూవరులకు వచ్చెడియరిష్టమును వర్ణించియున్నాడు.

శ్లో॥ మాతాచైవ పితాచైవ జ్యేష్ఠభ్రాతాతథైవచ।
త్రయస్తే నరకం యాంతి దృష్ట్వా కన్యాంరజస్వలాం॥

శ్లో॥ యస్తాంసముద్వహేత్కన్యాం బ్రాహ్మణోమదమోహితః।
అసంభాష్యోహ్యపాంక్తేయః సవిప్రోవృషలీపతిః॥

తల్లితండ్రి అన వివాహమునకు ముందు రజస్వలయైయున్న తమకన్నెను గనుగొని నరక మనుభవించుచున్నారని ప్రథమశ్లోకార్థము. వృషలీ శబ్దార్థమును మనుస్మృతి క్రింది శ్లోకముఖమున వివరించి యున్నాడని మాధవాచార్యులవారు తెలిపియున్నారు.

శ్లో॥ పితుర్గృహేతుయాకన్యారజః పశ్యత్యసంస్కృతా।
సాకన్యా వృషలీజ్ఞేయా తత్పతిర్వృషలీపతిః॥

తండ్రియింటనే కన్య యవివాహితగానుండి రజోవతియగునో యాకన్య వృషలిగాఁ దెలియఁదగినది. దాని పతి వృషలీపతియగుచున్నాడని పై శ్లోకార్థము. వృషలిని వివాహము గావించుకొన్న వరునకు క్రిందిశ్లోకముఖమున బరాశరుడు ప్రాయశ్చిత్తమును విధించి యున్నాడు.

శ్లో॥ యః కరోత్యేకరాత్రేణ వృషలీసేవనం ద్విజః।
సభైక్షభుగ్జపన్నిత్యం త్రిభిర్వర్షైర్విశుద్ధ్యతి॥

అనగానే బ్రాహ్మణుడొకరాత్రి వృషలియగు తనభార్యతో సంభోగము గావించుకొనువాడు ప్రతిదినమును గాయత్రీజపము జేసి కొని భిక్షాన్నమును దినుచు మూడుసంవత్సరములు ప్రవర్తించిన యెడ శుద్ధుడగుచున్నాడని పైశ్లోకార్థము.

ఈవిషయమై మాధవాచార్యులవారిట్లు చెప్పుచున్నారు.

"యస్తుమదమోహాదతిక్రాంతనిషేధస్తాముద్వాహ్య సకృద్భుక్త్వాకథంచిద్దైవయోగాదనుతప్యేత తదాస్య శుద్ధి ప్రకారమాహ?
ఇదిముపేతారిక

అనగా నెవడు మదమోహమువలన నిషేధశాస్త్రము నతిక్రమించి యారజస్వలను వివాహముచేసికొని యొకసారియనుభవించి యతికష్టముమీద దైవయోగమువలన బశ్చాత్తప్తుడైనచో నతనికి బరాశరుడు శుద్ధిప్రకారమును చెప్పియున్నాడని యర్థము.

ఈ చెప్పినదానింబట్టి శారదముద్దులక్ష్మల వివాహశాసనము శాస్త్రదృష్టినిజూడ భారతసంఘమునకు వినాశహేతువైనటుల గోచరించినదికదా? ఇకలోకదృష్టితో గన్యలకునవమానజనకమును వర్ణసాంగర్య కారకమును నగునను విషయములను గూర్చిముచ్చటించవలసియున్నది మనశారద ముద్దులక్ష్మల శాసనము పండ్రెండుసంవత్సరములలోపల కన్యలకు వివాహము నిషేధించుచున్నది. ఇదికొంతముకాలము వాదము నిమిత్తము బ్రిటిషు ప్రభుత్వమువారిచే నంగీకరింపబడినదని తలంచి విమర్శించుకొందము.

ఈశాసనమునుబట్టి మనము పండ్రెండేండ్లకు లోపల కన్యలకు వివాహము చేయరాదు గాని పదుమూడవ వత్సరారంభమున వివాహము చేసినయెడ దోషము కాదని తెలియవచ్చు చున్నదికదా అపుడు మనము వివాహమునకు ప్రయత్నము చేయవచ్చును చేయగ మన విరోధి వెంటనే యీకన్యకు పదిసంవత్సరములు మొన్ననే గడిచినవి అతడు పండ్రెండు వెళ్ళినవని వివాహము చేయ యత్నించుచున్నాడని పోలీసువారికొక రిపోర్టు చేసినాడనుకొందము అపుడు వారు వచ్చి యీశాసనము ననుసరించి మనము కావించు వివాహము నాపవలయునా? వలదా? ఆపినచో మనమునష్టము ననుభవించవలయును లేనిచో శాసనము నిరర్థకమగును విచారణ చేసినయెడ పండ్రెండు సంవత్సరములు వెళ్ళినవని ఋజువు చేయుటకు మనకాధారమేమున్నది జనన రిజష్టరు కలదందురా? అది యీచిన్నదాని జాతకమని తెలుపునది కాదను ప్రతివాదమును నిరసింపగలదా? లేదు లేనిచో నపుడు పండ్రెండు సంవత్సరములు వెళ్ళినవను సర్టిఫికెట్టులకొరకు మనము ముద్దులక్ష్మి మున్నగు డాక్టర్లను దర్శింపవలెను వారుకన్యల యవయవములలో వేనిని జూచి పండ్రెండు సంవత్సరములు వెళ్ళినవనిగాని వెళ్ళలేదనిగాని నిర్ణయించగలరు? లేనినాడు వారికి ముడుపులు చెల్లించవలెను. మనమిచ్చు ముడుపులకన్న ప్రతివాదులిచ్చు ముడుపులధికములైనయెడ వారికనుకూలముగ సర్టిఫికెట్టుల నిత్తు

అపుడు మనము వివాహముల నాపుజాని క్రిమినల్ కోర్టులకో శివిల్ కోర్టులకో పోవలసివచ్చును వారుకన్యలం జూచినంగాని నిర్ణయించ జాలరు మనవకీలుగారు పద్రెండు సంవత్సరములు దాటినవి మూడు డీపిల్లనని చూపించవలెను.

ఆపిల్లకు వారిప్లీడరు చెప్పినటుల పండ్రెండు సంవత్సరములు వెళ్ళినవనుటకు దగిన గుర్తులు కనుపరచలేదని ప్రతివాది వకీలుగారు ప్రతివాదను చేయవచ్చును న్యాయాధిపులకు గుర్తులు చూపించుట యే ధర్మమని తోచెనా చూపింతుమందురు చూపించకతీరదుకదా? ఎంచిన మొకనిల్లెన్ని రౌరా యవమాన జనక కార్యములు కాకమా నవు. ఇవికన్యాజనావమానజనకములు కావని మానవ బీజసంజాతు లనగలరా? అనజాలరని తలంచెదము.

మనమీ శాసనమునకు వెరచి పండ్రెండుసంవత్సరములు గడ చువరకు వివాహము చేయకయుంచవలయును పదమూడవ సంవత్స రమున నూటికే పదిమంది కన్యలో తక్కుతక్కిన తొంబదిమంది కన్యలును రజస్వలలగుదురనుటకు సందియములేదు రజస్వలలైన నాటికి కామము కలుగకయుండునని లోకానుభవజ్ఞుడు వాదింపరాదని తలంచెదము కామాతిరేకముగల కన్యలలో నూటికే పదిమందిగో దక్కుతక్కిన తొంబదిమందిను గామము నాపుకొనజాలక యకార్య కార్యముల పాలగుటను మనము చూడలేదా? రుక్మిణమ్మగారు అరం డల్ దొరగారితో దిరిగి గర్భమైనవెనుక నేడవమాసములో వివాహ మైనది?అపుడు గర్భిణీ కన్యాదానము చేయవలసివచ్చును అందులకు రోసినమొడ కడుపులు దిగద్రావించ వలసివచ్చును నాడు గర్భసావి విణీ వివాహాములు కావించక తీరదుకదా? కడుపులు దిగద్రావించ బోయినవి యన్నియు దిగునా? దిగవు కొన్నిదిగక నిలువవచ్చును నాడు నిండుగర్భిణీదానము చేయుకతప్పదుకదా? అందులకు వరుడ సహ్యపడునేని ప్రసవించినదాక వివాహ మాపవలసివచ్చును. ఆగి

తిమనుకొనుడు ప్రసవించినమీద బదునొకండవనాఁడా బాలింతప్రక్క నుపీటపై గూర్చుండి పుట్టినబిడ్డకు నామకరణము గావించుటకు తండ్రి యగు నల్లునిగనుగొను భాగ్యముమనకు పట్టునుకదా? అందులకును నోర్చుకొంటిమా? నవత్సకన్యాదానము చేయకతప్పదుకదా? తప్పదు

ఇంతియె కాదు కొందరు కన్యలు డాక్టరు భండార్కరుగారి మనమరాలివలె మహమ్మదీయులను మరిగి తలిదండ్రులకును దెలుపక యే పరిణయములు గావించుకొనవచ్చును ఆనాఁడుమహారాష్ట్ర దేశ బ్రాహ్మణులవలె మనమును సభలుచేసి యావివాహములయెడ నసమ్మతులను నాగ్రహములను వెలిబుచ్చవలసివచ్చును అదిచేతగాని వారును పడుచులను విసర్జించలేనివారును మహమ్మదీయ మతములో జేరవలసివచ్చును లేదా? యెవరిమతములో వారుండి పండుగలకు పబ్బములకు బరస్పరము పిలుచుకొనుచు గాలయాపనము గావించక తీరదుకదా? ఇదివర్ణసాంకర్యముకాదా? మరికొందరు కన్యలు యే యాకూబహ్యగాలనో వరించవచ్చును నాఁడు రివిన్యూ ఇన్స్పెక్టరుగారివలె మనమును ముందు క్రైస్తవమతములోనికి గన్వర్టై తరువాత యాకూబహ్య నామ్నే వరాయకుల నాపకపావను నామ్నీమాం కన్యాం జనిదానము చేయవలసివచ్చును ఈయకార్యకార్యము లన్నియు శారదముద్దులచ్చుమ్మగార్ల శాసనము పాసైనయెడగానున్నవి. కానవర్ణసంకరమ పేక్షించువారు శాసనమును పాసుచేయుడనియు వర్ణసంరక్షణమున పేక్షించువారు శాసనము పాసుచేయనలదనియు భారత రాజ ప్రతినిధిగారికిని మదరాసు గవర్నరుగారికిని విజ్ఞప్తుల నంపుకొనవలసియున్నది ఉభయపక్షులవారును జేరి సభలుకావించి యందెవరి కోరిక యీడేరునో వారుతమ కోరికలను బ్రిటిషు ప్రభుత్వము వారికి దెలుపుకొందురుగాత ఇక శారదముద్దులచ్చుమ్మగర్భాధానములను గూర్చి ముచ్చటించుకొందము.

---

హారవిలాస శారద డాక్టరుముద్దులక్ష్మి

# గర్భాధాన శాసన విమర్శనము.

---

ఇదిపదియారు వర్షములకు లోపల భర్తలు భార్యలకు గర్భాధానము గావింపరాదనియు, గావించినయెడ వారిని శిక్షాపాత్రులను గావించెదమనియు దెలుపు శారదముద్దులక్ష్మల గర్భాధాన శాసనములను విమర్శించునదికాన దీనికి హారవిలాస శారద డాక్టరు ముద్దులక్ష్మి గర్భాధానశాసన విమర్శనమను నన్వర్థనామకరణము గావించి యుపోద్ఘాతమునకు దిగుచున్నవారము. వినుడు:—

## ఉపోద్ఘాతము.

శారద ముద్దులక్ష్మల వివాహశాసనముల వలెనే గర్భాధాన శాసనమునుగూడ మాశాస్త్రాచారములకు బరమవిరోధులును మానవబీజ నావమానజనకములును, వర్ణసాంకర్య కారకములును ప్రభు ప్రజాపరస్పర వైషమ్య సంపాదన సమర్థములును, నగుచున్న శాసనములైయున్నవి. కాన వీనింగూర్చియు బిట్టు చర్చ గావించదలంచియున్నవారము సావధానముగవినుడు.

## ఉ ప క్ర మ ము.

గర్భాధానకాలమును మన మహర్షులు పలువురు నిర్ణయించి యున్నవారు. వారిలో మనువీక్రింది విధమున గర్భాధాన కాలమును దెలిపియున్నవాడు. కనుడు :—

శ్లో॥ కాలేదాతాపితావాచ్యః । వాచ్యశ్చా నుపయన్పతిః॥
అ. 9 శ్లో 4.

యీ శ్లోకమునకు కుల్లూక భట్టాచార్యులవారిట్లు వ్యాఖ్యానము గావించియున్నారు. "ప్రదాన కాలేపితా తామదదన్ గర్హ్యో భవతి । ప్రదానం ప్రాగృతోరితి గౌతమవచనాదృతోః ప్రాక్ప్రదాన కాలః । పతిశ్చఋతుకాలే పత్నీ మగచ్ఛన్ గర్హణీయోభవతి॥"

కాలమందు దానముచేయని తండ్రి నింద్యుడగుచున్నాడని మ
నువు వచించియున్నవాడు. కన్యాదానకాలము గౌతమమహర్షి
చెప్పినటుల ఋతుమతియగుటకు ముందేయని తెలియవలయును.
ఋతుకాలమందు భర్త్నినిగలియని పతియు నింద్యుడగుచున్నవాడు.
అని పై మనువచనమున కర్థము. ఈచెప్పినదానింబట్టి ఋతుకాల
ము గర్భాదానమునకు యోగ్యకాలమని తెలియవచ్చినదికదా?
ఇంకను నీవిషయమై మనువిట్లు చెప్పియున్నవాడు.

శ్లో॥ ఋతుకాలాభిగామీస్యాత్ । స్వదారనిరతస్సదా
పర్వవర్జ్యం వ్రజేచ్చైనామ్ । తద్వ్రతో రతికామ్యయా॥

యీ శ్లోకమునకు కులూకభట్టాచార్యుడిట్లు వ్యాఖ్యానము
గావించియున్నాడు. "ఋతుర్నామశోణిత దర్శనోపలక్షితో గర్భ
ధారణయోగ్యః స్త్రీణామవస్థావిశేషః । తత్కాలాభిగామీస్యాదితి
స్వదార నిరతస్సదేతి నిత్యం స్వదార సంతుష్టః స్యాన్నాన్య భార్యా
ముపగచ్ఛేదితి పర్వవర్జ్యం వ్రజేచ్చైనామితి పర్వాణ్యమావా
స్యాదీనివక్ష్యంతే తానివర్జయిత్వా భార్యాప్రీతిర్వ్రతం యస్యస
తద్వ్రతో నృతావప్యుపేయాత్॥

ఋతువంశోణిత దర్శనోపలక్షితమును, గర్భధారణయోగ్య
మును నగు స్త్రీల యవస్థావిశేషము. అట్టి ఋతుకాలమందు గాంతే
ను గలియవలెను. స్వభార్యనే యనుభవించవలెగాని యన్యభార్య
ననుభవించరాదు. స్వభార్యనైనను నమావాస్య పూర్ణిమ మున్నగు
వర్జ్యదినములందు విడచి యన్యదినములలో స్వభార్యా ప్రీతికొరకు
ఋతుకాలము కాకపోయినను ననుభవించవచ్చునని పై శ్లోకార్థము.
ఈ యర్థమునుబట్టియు గర్భాదానమునకు ఋతుకాలము ముఖ్యకా
లమని తెలిసికొంటిమి. ఇక నవి యెన్నికలవో తెలిసికొనవల
యున్నది. ఈవిషయమై మనువిట్లు చెప్పియున్నాడు.

శ్లో॥ ఋతుస్స్వాభావిక స్త్రీణాం రాత్రయష్షోడశస్మృతాః ।
చతుర్భిరిత రైస్సార్థ మహోభిస్సద్విగర్హితైః ॥

ఈ శ్లోకమునకు కుల్లూక భట్టాచార్యుడిట్లు వ్యాఖ్యానము గావించియున్నాడు. "శోణిత దర్శనాత్ప్రభృతి స్త్రీసంపర్క గమనా దాశిష్టనిందితై శ్చతుర్భిరన్యై రహోరాత్రైస్సహ షోడశాహో రాత్రాణి మాసిమాసి స్త్రీణామృతుః స్వాభావికః వ్యాధ్యాదినాతు న్యూనాధిక కాలోపిభవతి"

ఋతురక్త దర్శనమైనది మొదలుకొని స్త్రీ సంపర్కములు గావించుటయందు శిష్టులచే నిందింపబడిన మొదటి నాలుగు దినముల తోడను నితర దినములతోడను జేరి ప్రతిమాసమునను బదియారుదిన ములు ఋతుకాలమైయున్నది. ఈ ఋతుకాలము వ్యాధులు మొద లగువానిచే నెక్కువగుటయు తక్కువగుటయు సంభవించుట గలదని పై శ్లోకార్థము.

ఈ యర్థమును బట్టిచూడ భార్య రజస్వలయైన వెనుక ఋతు కాలమందును నామెకోరిక ననుసరించి యితరకాలమందును గూడ భర్త భార్యను ననుభవింపవచ్చునని స్పష్టమైనదికదా? త్రికాలజ్ఞు డును, సకల వేదార్థవిదుడును, నగు మనువు ఋతుకాలమందు భార్యను గలియవచ్చునని చెప్పియుండగా శాస్త్రలోకవిమర్శజ్ఞానవిహీ నులగు శారదముద్దు లక్ష్మమ్మగార్లు రజస్వల యైనతరువాత మూడు నాలుగు సంవత్సరములు నిరీక్షించి భార్యలను భర్తలు గలియవలసిన దనియు, లోపల గలియరాదనియు, గలిసిన శిక్షింతుమనియు విధించు శాసనములను జేయజూచుచున్నారు. ఇది వివేకవంతులు వినదగినది యగునా? ఇట్లనిన మనువు ఋతుకాలమందుగదా భార్యలను భర్తలు గలియవలెనని తెలిపియున్నాడు? అది పదియారు సంవత్సరములమీద వచ్చెడి ఋతుకాలమందని యేలతలంచరాదని శారదముద్దులక్ష్మలు మరల ప్రశ్నింతురేమో? ఇందులకు బ్రత్యుత్తరము దేవలమహర్షి యిట్లు చెప్పియున్నాడు వినుడు.

శ్లో॥ గర్భాధానం ద్విజఃకుర్యా దృతౌ ప్రథమఏవహి।

ద్విజుడు ప్రథమ ఋతువునందే గర్భాధానము జేసికొనవలెనని పైశ్లోకార్థము.

ప్రథమఋతువునందే గర్భాధానము జేసికొనవలసినదని శాస్త్రము విధించియుండ నందుకున్యతి రేకముగ రజస్వలమైన వెనుక మూడు నాలుగు సంవత్సరములకు గర్భాధానము జేసికొనవలసినదనియు లోపలచేయరాదనియు జేసిన శిక్షింతుమనియు విధించెడి శారదముద్దులచ్చుమ్మల గర్భాదానశాసనములు పరమవిరోధులై యున్నవని తెలిసికొనగలిగితిమి గదా? ఇంతియెకాదు. ఋతుకాలమందు భార్యతో సంగముచేయనివానికి శాస్త్రములు బ్రిత్యవాయము దెలిపియున్నవి.

శ్లో॥ స్వయం దారాన్ ఋతుస్నాతాన్ । స్వస్థశ్చేన్నోపగచ్ఛతి।
భ్రూణహత్యాం సమాప్నోతి।గర్భం ప్రాప్తం వినాశయేత్॥

ఋతుస్నాతమైన భార్యను భర్త స్వస్థుడైయుండి పొందనియెడల భ్రూణహత్యను పొందుచున్నాడు. ప్రాప్తమగు గర్భమును నశింపజేయుచున్నాడు. అని దేవలమహర్షి చెప్పియున్నాడు. ఇంతియెకాదు. రజస్వల మైననెనుక మూడునాలుగు సంవత్సరములు గడచినమీదట గర్భాధానము జేసికొనవలెననికదా? మన శారదముద్దులచ్చుమ్మగారు శాసనము జేయబోవుచున్నారు. ఆశాసనము మాబోధాయనమహర్షి యిట్లు నిందించియున్నాడు. ఇటు వినుడు —

శ్లో॥ త్రీణివర్షాణ్యృతుమతీం యో భార్యాంనోపగచ్ఛతి।
సతుల్యం భ్రూణహత్యాయా దోషమృచ్ఛత్య సంశయః॥

ఎవడు ఋతుమతియైన భార్యను మూడు సంవత్సరము లనుభవించడో వాడు భ్రూణహత్యతో దుల్యమగు దోషమును పొందుచున్నాడు సంశయము లేదని పైశ్లోకార్థము. ఈవిషయమై పరాశరమహర్షి భార్యాభర్తలకు చెప్పిన ప్రత్యవాయమునుగూడ వినుపించుచున్నారము వినుడు.

శ్లో॥ ఋతుస్నాతాతు యానారీ భర్తారంనోపసర్పతి।
సామృతానరకంయాతి వైధవ్యంచ పునఃపునః॥

శ్లో॥ ఋతుస్నాతాంతుయో భార్యాం।సన్నిధౌనోపగచ్ఛతి।
ఘోరాయాం భ్రూణహత్యాయాం।యుజ్యతేనాత్రసంశయః॥

ఋతుస్నాతయగు స్త్రీ భర్తను పొందనియెడ నామె మృ

నొందిన వెనుక నరకమును జన్మించిన వెనుక వైధవ్యమును పొందును. ఋతుస్నాతయగు భార్యను నెవడు పొందడో వాడు ఘోరమగు భ్రూణహత్యను పొందుచున్నాడని యర్థము. ఇట్టిశ్లోకము లనేకములు కలవు. గ్రంథవిస్తరభీతిచే వాని నిట నుదహరింప మానియున్న వారము.

ఈ చెప్పినదానింబట్టి ప్రథమ ఋతువుమొదలుకొని భార్యలను భర్త లనుభవింపవచ్చును. అనుభవించకున్న దోషదూషితు లగుదురని శాస్త్రము చెప్పియున్నది. కాన ఋతుమతులైన తర్వాత మూడునాలుగు సంవత్సరములు నిరీక్షించి పురుషుడు గర్భాధానము జేయవలెననెడి శారదముద్దులక్ష్ముల గర్భాధాన శాసనములు భారత పురుషులకు భ్రూణహత్యాదోషమును సంపాదించి వారి నాశనమునకు హేతువులగుచున్నవని చాటి చెప్పవచ్చునుగదా?

ఇంతియె కాదు. పురుషు లనుభవించుటకు స్త్రీ లెప్పుడర్హులగుదురో శ్రుతి యిట్లు చెప్పియున్నది. చూడుడు గర్భాధాన ఖండలోని యైదవ మంత్రమును "శమూధో రోమశగ్ హంధో దేవేషు కృణుతో దువః॥

ఇందులకు హరదత్తాచార్యులిట్లు వ్యాఖ్యానము గావించియున్నారు.

"శం, సం, ఊధః-ఊధస్థానీయ ముభయోరుపస్థేంద్రియం రోమశం, అనేన ఉప భోగయోగ్యతా లక్ష్యతే। రోమోత్పత్తేః ప్రాగననుభోగ్యా హి స్త్రియః"

భార్యాభర్తల యుపస్థేంద్రియములు రెండును లెస్సగ రోమోత్పత్తి కలవై యుండవలెను. ఈ చెప్పుటచే నుపభోగ యోగ్యతకనుపడుచున్నది. రోమోత్పత్తి యగుటకు ముందు స్త్రీ లనుభవయోగ్యలు కారని పై శ్రుత్యర్థము. ఈయర్థమును బలపరిచెడి యాఖ్యాయికనుగూడ శ్రుతి చెప్పియున్నదని హరదత్తాచార్యు లిట్లు వినుపించియున్నవారు.

"భావయవ్యస్యరాజ్ఞో భార్యాం భావయవ్యాసీం ఇంద్రః పత్యుస్సఖా పరిహాసన్ను వాచ, ఉపభోగయోగ్యాత్వా నభవసి। రోమాణి

నోత్పన్నాసీతి। పాతమబ్రవీత్।" ఉశోపమే పరామృశ।మా మేదభ్రా మన్యథాః। సర్వాహమస్మి రోమశా।గంధారిణా మివావికా॥"

భావయవ్యుడను రాజుయొక్క భార్యభావయవ్యాసిని నతని సఖుడగు నిందుద్రిశనువాడు పరిహసించుచు, నీ వుపభోగయోగ్యురాలవు కావైతివి. ఏలయున? నీకు రోమములు మొలచియుండలేదని పలికెను. ఆమె అతనితో నిట్లనుచున్నది. నాసమీపమునకు రమ్ము. తడివి చూడుము. అసత్యములు తలంపవలదు. గంధారదేశపు గొఱ్ఱెవలె శరీరమంతటను నిండిన రోమములు కలదాననై యున్నదానని ప్రత్యుత్తరము చెప్పినదట!

ఈశ్రుతి పరామర్శవలన స్త్రీలు రోమోత్పత్తికిబూర్వ మనుభవయోగ్యలు కారు కాని తర్వాత కాకపోరని తెలిసికొంటిమి. శ్రుతి యిట్లు చెప్పియున్నది గనుకనే సూత్రకారులు "నాజాతలోమ్న్యోప హాసమిచ్ఛేత్త"ని చెప్పియున్నారు. అనగా రోమోత్పత్తి కాని స్త్రీలతో సంభోగము కావించరాదని పై సూత్రార్థము.

ఇంతవరకు మనము కనుపరిచిన ప్రమాణములను బట్టిచూడ ప్రథమఋతువు మొదలుకొని ప్రతిమాసమునను గావించబడునది గర్భాధానమని మనము గ్రహింపగలిగితిమిగదా? గర్భాధానమేగాక నిషేకమను మరియొక కర్మకలదు. అదియు స్త్రీ పురుషుల సంభోగకాలమును దెలుపునదియే. అదెప్పుడన? ఋతుమతియగుటకు పూర్వము గావింపబడునది. ఈవిషయమై కవికులసార్వభౌముడగు కాళిదాస మహాకవి యుత్తరకాలామృతమను గ్రంథముఖమున నిట్లు చెప్పియున్నాడు.

శ్లో॥ స్త్రీ పుంసోః ప్రథమోనిషేక ఉదితస్సంభోగ ఆద్యార్తవే
గర్భాధానమితి బ్రువంతి విబుధాస్తన్మాసి మాస్యేనహి॥"

ఈశ్లోకమునకు నాంధ్రానువాదము గావించిన పండితుడుగారు ప్రథమార్తవమునందు గావింపబడు స్త్రీ పురుషుల సంభోగమును నిషేకమనియు దనువాత బ్రతిమాసమునందు గావింపబడు సంభోగము గర్భాధానమనియు బుధులు చెప్పుచున్నారని యర్థము వ్రాసి

యున్నారు. కాని యిది పూర్వాపరవిమర్శ చేసి చెప్పిన సరియైన యర్థము కాదు. ఋతుమతియగుటకు పూర్వము గావింపబడు సంభోగమును నిషేకమనియు దరువాత ప్రథమఋతువునందును ప్రతిమాసమునను గావింపబడు సంభోగమును గర్భాధానమనియు పైశ్లోకముఖమున గాళిదాసమహాకవి చెప్పియున్నాడు. ఈవిషయమును మనము నిర్ణయించుటకు నిదివరకు "గర్భాధానం ద్విజఃకుర్యా దృతౌ ప్రథమవవహి" ప్రథమ ఋతువునందే ద్విజుడు గర్భాధానము జేసికొనవలయునని దేవలుడు చెప్పియున్న వచనమును విశదపిరిచియున్నవారము. దానింబట్టి కాళిదాసు ప్రథమఋతువునందును ప్రతి మాసమునందును గర్భాధానమును దత్పూర్వము నిషేకమును జేసికొనవలసినదని బోధించినట్లు నిశ్చయింపవచ్చును. నిషేకమనునది రజస్వలయగుటకు పూర్వము జరుగదగినకర్మయే కాని యన్యముకాదు. ఈవిషయమై కాళిదాసమహాకవి తరువాత రెండుశ్లోకములతో విశదీకరించియున్నవాడు. వాని నిందుకిరింద బొందుపరచుచున్నవారము వినుడు.

శ్లో॥ యానాకీసుతనుః కుచోన్నతయుతా ప్యాషోడశాబ్దారజో
దృష్టంనోయది శోభనేచదివసేతాం సన్నివేశ్యాదరాత్
రమ్యేచాస్తరణే సితాంబరయుతాం స్వర్ణాదిభిర్భూషితాం
పన్నీరాదిమిళత్సు కుంకుమరజోలిప్తాంగ జాతాలయాం॥

శ్లో॥ కృత్వాపుష్పవతీ మివాత్రిదివసం సిత్వాచతుర్థేదినే।
స్నాతాంతాంవరయే త్పతిశ్శుభగృహే శుద్ధేసు తేపూర్వవత్।
ఏవం చేదచిరాత్సతీ ససుఖకృత్వా త్సుష్టిషే పుత్రిణీ।
సంభోగాఖిలదైవ పైతృకమహాకర్మార్హతాం సాత్విమాత్॥

ఏస్త్రీ చక్కనితనువుగలిగి యున్నతకుచములతో గూడినదై యుండియు పదియారు వర్షములు వచ్చినప్పటికిని రజోవతికాకయున్న యెడ శుభదినమునందు రమ్యమైన యాస్తరణమున గూర్చుండబెట్టి తెల్లని వస్త్రమును గట్టినదానినిగాను స్వర్ణాలంకారములను ధరించినదానినిగాను పన్నీరాదులతో గలుపబడిన కుంకుమపొడిచే లిప్తమైన మన్మథాలయము గలదానినిగాను జేసి పుష్పవతినివలె మూడుదిన

ముల పర్యంతముగడిపి నాల్గవదినమున స్నానముచేసిన పిదప నాదిన్న దానిని భర్త శుభగృహమున బంచమశుద్ధిగలిగి పూర్వోక్త శుభగ్రహాపేతమైయున్న శుభముహూర్తమున సంభోగము గావిప వలెను. గావించినయెడ నామె భర్తకు సుఖము గలిగించునదియు బుష్పిణియు బుత్రిణియు నగును. ఇంతియెగాక సంభోగమునకును దైవపైతృక మహాకర్మ లనుష్టించుట కర్హతను పొందుచున్నదని యర్థము.

ఈ చెప్పినదానింబట్టి విశేషవిధి ననుసరించి రజోవతియగుటకు ముందు నిషేకము జేసికొనవచ్చునని తెలియవచ్చినదికదా? ఇక రజస్వలావివాహము చేయవలెగాని కన్యావివాహము జేయరాదనియు, రజస్వల మైనతర్వాత నాలుగు సంవత్సరముల వరకు గర్భాధానము జేయరాదనియు, విధిం జెడి శారదముద్దులచ్చమ్మగార్ల వివాహగర్భాధానశాసనములను వివేకహీను లామోదించవలసినదేగాని వివేకసహితు లామోదించవలసినది కాదని తెలుపుటకు సందేహించవలయునా? వలదు.

ఇంతియెకాదు. నగ్నికను వివాహముచేయుట యుత్తమమని ముందుఁజెప్పి యావెనుక వివాహదీక్ష మూడురాత్రులు గడచినమీద సంభోగము చేయవచ్చునని "నగ్నికాతుశ్రేష్ఠా . ఊర్ధ్వం త్రిరాత్రాత్సంభవ ఇత్యేకే" అనుసూత్రముఖముల గోభిలమహర్షి చెప్పియున్నవాడు. పైసూత్రములకున్న భాష్యమును బట్టిచూడ నొకానొక కన్యగను 8-9-10 సంవత్సరములలో వివాహమైన వెంటనే నాలవదినము మొదలుకొని భోగించవచ్చునని తెలియవచ్చెడిని. ఇటువినుడు.

నగ్నికయన రజస్వలకాని కన్య ఈవిషయమై శాస్త్రమిటుల చెప్పుచున్నది.

శ్లో॥ నగ్నికాంతు వదేత్కన్యాం యావన్నర్తు మతీభవేత్ ।

కన్య యెంతవరకు ఋతుమతి కాకయుండునో యంతవరకు దానిని నగ్నికయని చెప్పవలయునని యర్థము. ఇంతియెకాదు,

శ్లో॥ యావచ్చేలం నగృహ్ణాతి, యావత్క్రీడతి పాంసుభిః।
యావద్దోషం నజానాతి, తావద్భవతి నగ్నికా॥
శ్లో॥ యావన్న లజ్జయాఙ్గాని కన్యాపురుషసన్నిధౌ।
జాన్వాదీన్యవగూహేత। తావద్భవతి నగ్నికా॥

ఎంతవరకు సిగ్గుచే వస్త్రము గ్రహింపదో, దుమ్ములో నాడు కొనుచుండునో, దోషము తెలియకయుండునో లజ్జచే మోకాళ్లు మొదలైన యవయవములను పురుషసన్నిధియందు కప్పికొనదో యంతవరకాకన్నెకు నగ్నికయని పేరు ఇటువంటి నగ్నికను వివాహముచేసికొని వివాహదీక్ష మూడురాత్రులు గడచినవెనుక సంభోగము గావింపవచ్చునని "ఊర్ధ్వం త్రిరాత్రాత్సంభవ ఇత్యేకే" యను సూత్రముఖమున గోభిలుడు చెప్పియున్నాడు. పైసూత్రవ్యాఖ్యాతమీది మాయభిప్రాయమును గ్రిందిరీతి విశదీకరించియున్నవాడు. వినుడు.

వ్యాఖ్య:— ప్రకృతాత్త్రిరాత్రాదూర్ధ్వం సంభవత్యనేనేతి సంభవః సంభోగః వ్యవాయః కర్తవ్యః ఇత్యేకే ఆచార్యా మన్యంతే। అథ సూత్రమిదం శక్యమవక్తుం సంభవస్య రాగత ఏవ ప్రాప్తేః వివాహాత్ప్రభృతి త్రిరాత్రం బ్రహ్మచర్య విధానాచ్చ తదూర్ధ్వం బ్రహ్మచర్య నియమాభావస్య వగతేః ఉచ్యతే। ఉపరిష్టాత్స్నాతకవ్రతేషు సూత్రయిష్యతి। "నాజాతలోమ్న్యోపహాసమిచ్ఛేత్" ఇతి, తదపవాదమిదముచ్యతే। కథంనామ। యద్యజాతలోమ్న్యపి పురుషోపభోగాభిలాషిణీ భవేత్తర్హి త్రిరాత్రాదూర్ధ్వం తద్రక్షార్థం సంభవితవ్యం। అపిచ ఋతుకాలాదన్యత్ర రాగమాత్రనిమిత్తత్వాత్సంభవస్య స్త్రీణాం, తదభిలాషేపి పుంసో రాగాభావాత్ అకరణమపిప్రాప్నోతి। తదనేన నిరస్యతే। అన్యథా ఖలు అభిలాషపరవశా కదాచిద కార్యమపికుర్యాత్ తస్మాద్వినాపి ఋతుకాలం స్త్రీణాం రక్షార్థం సంభవితవ్యమితి।

వివాహదీక్ష మూడురాత్రులు గడచినమీఁద సంభోగము గావింపదగినదని కొందఱాచార్యపురుషులు తలంచుచున్నారు ఇట్లని సూత్రమిట్లు చెప్పదగినది కాదు. ఏలయన? సంభోగము రాగము

వలన ప్రాప్తించునది కాని వేరు కాదు. వివాహము మొదలుకొని మూడురాత్రులు బ్రహ్మచర్యము విధించుటవలనను, నాలవదినము బ్రహ్మచర్య నియమము లేకుండుటవలనను, అజాతలోమ్నితో సంభోగము జేయకూడదను నిషేధశాస్త్ర ముండుటవలనను, సంభోగము కూడదని తేలగా దాని కపవాదముగ నిది చెప్పబడుచున్నది. అదే మన? అజాతలోమ్నియగు కన్య యత్యంతపురుషోప భోగాభిలాషిణి యై యుండునేని నపుడు త్రిరాత్రిదీక్ష గడచినమీద నాకన్య రక్షణ కొరకు భర్త సంభోగము కావింపదగినది. ఇంతేకాక ఋతుకాలము కానియపుడు సంభోగము చేయరాదు. ఏలయన? సంభోగము రాగమాత్రాధీనమై యున్నది గనుక స్త్రీలకు సంభోగాభిలాష యుండినను పురుషుని కట్టిరాగములేదు కావున నొకప్పుడు సంభోగము గావింపక పోవుటయు తటస్థింపవచ్చును. అది మీదివిధమున నిరసింపబడుచున్నది. అదేమన? రాగములేని కారణమున పురుషుడు సంభోగము చేయుడేని పురుషోపభోగాభిలాష పరవశయైన కన్య యొకానొకప్పుడు చేయకూడని కార్యము చేయవచ్చును. ఆకారణమువలన స్త్రీలకు ఋతుకాలము కాకపోయినను రాగములేని పురుషుడు భార్యారక్షణార్థమై సంభోగము కావింపదగినదియని యర్థము.

ఈయర్థమునుబట్టి 8, 9, 10 సంవత్సరముల ప్రాయములో నున్న కన్య పురుషభోగాభిలాషిణి యగునేని నిషేధవిశేషవిధి ననుసరించి సంభోగము గావింపవచ్చునని మనము తెలిసికొంటిమి. అతీంద్రియజ్ఞానమును బ్రసాదించు శాస్త్రమొకటి యత్యంత పురుషభోగాభిలాషిణియైయున్న కన్య యజాతలోమ్నియు ననాగతార్తవయునై యుండినను సంభోగము చేయుము. లేకున్న క్షేత్రము చెడునని నిషేధవిశేషమును బోధించియుండగా దానిని బెడచెవినిడి మన శారదముద్దులచ్చమ్మగార్లు రజస్వలలైనపిదప మూడు నాలుగు సంవత్సరములు గడచువరకు సంభోగము జేయరాదను నిషేధశాసనమును జేయజూచుచున్నారు. ఇది వివేకవిహీనమగు కార్యము కాదా? కాదని వివేకముగలవా రనగలరా? ఇట్లనిన సుశ్రుత శారీరస్థానము దశమ

ధ్యాయములోని 67, 68 శ్లోకముఖముల పదియాఱు సంవత్సముల లోపలి ప్రాయములోనున్న కన్యలకు గర్భాధానము నిషేధించియున్నది మీరు కన్పరచిన ధర్మశాస్త్ర శ్లోకములకంటె నారోగ్యమును బోధించెడి యాయుర్వేద వచనము లత్యంత ప్రామాణికములుకావా? యనిమరల ప్రశ్నింతురేమో? ఆశ్లోకములను వినిపించెదము వినుడు.

శ్లో॥ ఊనషోడశవర్షాయా, మప్రాప్తః పంచవింశతిం
యద్యాధత్తేపుమాన్ గర్భం, కుక్షిస్థస్సవిపద్యతే॥

శ్లో॥ జాతోవా నచిరంజీవే, జ్జీవేద్వా దుర్బలేంద్రియః
తస్మాదత్యంత బాలాయాం, గర్భాధానం నకారయేత్।

ఇందులకు మాయాంధ్రీకరణము విడిపి చుటకు ముందు హిందీ యనువాదమును వినిపించుట మంచిది. కాన వినుపించెదము వినుడు.

"సోలేవర్షకీ అవస్థాసే ఛోటీ స్త్రీకే పచ్చీస్‌వర్షకీ అవస్థాసే ఛోటాపురుష గర్భధాన్ కరేతో వహ గర్భకుక్షిహీమేఁ వికారకో ప్రాప్తహోకర్ ఖండితహో జావే। ఔర్ యది పూరాహోకర్ బాలక్ జన్మభీలేవేతో దీర్ఘాయు నహీఁహోవే। (బహుత్ దిన్ నజీవే) ఔర్ జో జీవేభీతో దుర్బల ఇంద్రియోంవాలా (కంజోర్) హీరహతాహై। ఇస్‌కారణ్ అత్యంతఛోటీ అవస్థావాలీ స్త్రీమేఁ గర్భధాన్ నహీఁకర్‌నా చాహియే।"

ఇరువదియైదు సంవత్సరములు నిండని పురుషుడు పదియాఱు వత్సరములు నిండని బాలికయందు గర్భాధానము గావించినయెడ నది గర్భమునందే నశించును. జనించినను చాలకాలము జీవించదు. జీవించినను దుర్బలేంద్రియములు కలదియగును. ఆకారణమువలన మిక్కిలి చిన్నదియగు బాలికయందు గర్భాధానము చేయగూడదని పైశ్లోకార్థము.

ఈశ్లోకార్థమునందే శారదయుద్దులచ్చమ్మల ప్రశ్నలకు బ్రత్యుత్తరము కలదు. అదేమన? అత్యంతబాలికయందు గర్భాధానము చేయరాదనునది. మిక్కిలిచిన్నపిల్లయందు గర్భాధానము చేయవలదని శాస్త్రము చెప్పినదికదా? చేయవచ్చునని చెప్పిన పండితుడేడీ? లేడు.

ఒకానొక పామరుడట్లు చేయువాడుండవచ్చును. వానిని నిరోధించుటకై సకల మానవబాధకమును, వర్ణసాంకర్య కారకమును, బ్రహ్మ ప్రజావైషమ్య సంపాదన సమర్థనమును, మానవతీ జనావమాన జనకమును, నగు దుష్టశాసనమును మానవులు సృజింపవలెనా? మానవు లంగీకరింపదగునా? తగదు.

ఇంతవరకు మనము గావించిన విమర్శనమును బట్టిచూడ శారద ముద్దులచ్చమ్మగార్లకు శాస్త్రలోక విమర్శజ్ఞానము లేమాత్రమును లేనట్లు కనుపడుచున్నది. ఈవిషయమును ధృవపరచు మరియొక విషయమును సుశ్రుతశారీర స్థానము ప్రథమాధ్యాయముఖమున జెప్పియున్నది. అదేమన? ప్రథమార్తవము గాంచినకన్య నాలవదినమున స్నానమాచరించిన పిదప బుణ్యాహవాచనమును బుత్రేష్టిని జరిపి తిరువాత నపరాహ్ణమున భార్యాభర్త లొక మాసము బ్రహ్మచర్య వ్రతము స్వీకరించి పిదప ద్వితీయార్తవమున గర్భాధానము గావించు కొనవలసినదని యీక్రింది సూత్రముఖమున వినిపించియున్నది. అది వినిపించెదము వినుడు.

"తత్రో పరాహ్ణేపుమాన్। మాసంబ్రహ్మచారీ। సర్పిస్నిగ్ధః। సర్పిఃక్షీరాభ్యాం। శాల్యోదనంభుక్త్వా। మాసంబ్రహ్మచారిణీం। తైల స్నిగ్ధాం। తైలమాషోత్తరాహారాం। నారీముపేయాద్రాత్రౌ। సామాది భిరభ్యాశ్వాస్య। వికల్ప్యైవం। చతుర్థ్యాం షష్ఠ్యామష్టమ్యాం దశమ్యాం। ద్వాదశ్యాం చోపేయాదితి। పుత్రకామః॥"

పుత్రేష్టి చేసిన పిదప పురుషు డొకమాసము బ్రహ్మచారియై శరీరమునకు ఘృతముబూసికొని, ఘృతక్షీరములతో వండిన శాల్యన్నమును భుజించి, యొకమాసము బ్రహ్మచారిణియై, నూనెపూసికొని, నూనె మినుములతో వండిన యాహార పదార్థమును భుజించియున్న భార్యను, సామవచనములతో సంతుష్టిపరచి పుత్రకాముడగు భర్త నాలుగు, ఆరు, ఎనిమిది, పది, పండ్రెండు లోనగు సరిదినములయందు భోగింపవలసినదని పైసూత్రార్థము.

ఆయుర్వేద మింత విస్పష్టముగ ప్రథమ రజస్వల యైన వెనుక ద్వితీయార్తవమునందు భార్యాభర్తలు సంభోగము గావింపవచ్చు నని చెప్పియుండగా మన శారదముద్దు లచ్చుమగార్లు రజస్వలయైన వెనుక మూడు నాలుగు సంవత్సరములు దాటువరకు గర్భాధానము చేయరాదను శాసనము జేయజూచుచున్నారు భారతమాత పుత్రి లగు మానవు లాయుర్వేద శాసనము ననుసరించెదరా? లేక మానవ జ్ఞానములేని శారదముద్దులచ్చుమ్మల శాసనముల ననుసరించెదరా? తెలిసి కొనవలసి యున్నది.

చిన్నతనములో గర్భముధరించిన కాంతలలో నెవ్వరోయొక రేదియో వ్యాధిపీడవలన బలహీనలై సరిగ ప్రసవించలేకపోవుట, మరణించుట, లోనగు నపాయములు పాలగుట యింతకుబూర్వము జరుగు చున్న శాస్త్రవిహిత వివాహగర్భాధానములను నిరాకరించుటకు శారదముద్దు లచ్చుమ్మగార్లు యత్నించుచున్నారు. వాదము నిమిత్తము కొంచెము కాలమువీరి శాసనము పాసైనదనుకొనుడు. అపుడు 11, 12, 13, సంవత్సరములలో రజస్వలయైయున్న కన్యలను బదియారు వత్సరములు గడుచువరకు గర్భాధానము చేయక యుంచవలయును గదా? ఉంచినయెడ నేవిధమైన కష్టములు వారికి బ్రాప్తించక స్త్రీ లెల్లరు సుఖైకజీవనలై వర్తింతురనికదా వరి యాశయము? శారద ముద్దులచ్చుమ్మ లిట్లు దలంచుచుండ నాయుర్వేదమగు సుశ్రుతము ఋతు మతులైన కన్యలకు గర్భాధానము చేయకయుంచినయెడ గలిగెడి యరిష్టములను నీక్రిందిరీతి వర్ణించియున్నది. ఇటువినుడు.

శ్లో॥ యదానార్యాముపేయాతాం। వృషస్యంత్యౌకథంచన
ముంచంత్యౌ శుక్రమన్యోన్య। మనస్థిస్తత్రజాయతే॥

అనగ కామాతిరేకముగల యిరువురు స్త్రీలుకూడి స్త్రీపురు షులవలె సంయోగము గావించి యన్యోన్యశుక్రమును విడిచినయెడ నస్థులులేని గర్భము జనించునని పైశ్లోకార్థము. ఇదియరిష్టము కాదా? ఇంకియొకాను.

శ్లో॥ ఋతుస్నాతాతుయానారీ। స్వప్నేమైథున మాచరేత్।
ఆర్తవంవాయురాదాయ। కుక్షౌగర్భం కరోతిచ॥
మాసిమాసివివర్ధేత। గర్భిణ్యా గర్భలక్షణం।
కలలంజాయతేతస్యా। వర్జితంపైతృకైర్గుణైః॥
సర్పవృశ్చిక కూష్మాండ। వికృతాకృత యశ్చయే।
గర్భాస్త్వేతాస్త్రియాశ్చైవ। జ్ఞేయాః పాపకృతాభృశం॥

రజస్వలయైన స్త్రీ స్నానము చేసినదై స్వప్న మందు మైథునము గావించినయెడ దాని యార్తవమును వాయువాకర్షించి గర్భము గలిగించును. అది ప్రతిమాసమునందును వృద్ధిజెంది పితృవీర్యము లేని కారణమున ననస్థియగు కలలముపుట్టును. అది సర్పము, వృశ్చికము, కూష్మాండము మున్నగు వికారాకృతులలో నొక యాకృతి గలదగును. ఆయుర్వేదమిట్లు స్త్రీ పురుషులు గర్భాధానము గావించుకొనని యెడ వచ్చెడి యరిష్టముల నుపన్యసించియుండగా మన శారదముద్దులచ్చమ్మగార్లు పదియారు వత్సరములకులోపల గన్యలకు గర్భాధానముగావించినయెడ నరిష్టములు కలుగునని శాసించుచున్నారు. ఈ రెండిటిలో మనుజులు గ్రహింపదగిన దేదియో మనుష్యాకృతిగల పశువులు గ్రహింపదగిన దేదియో మాపాఠకులు నిర్ణయింతురుగాత.

ఇక నీశాస్త్రచర్చను విడిచి శారదముద్దులక్ష్మల శాసనముల వలన లోకదృష్టికి గన్పడెడి యరిష్టములనుగూర్చి యించుక ముచ్చటించుకొందము.

వర్ణసాంకర్యజనకము శారదముద్దులక్ష్మల శాసనము వర్ణసాంకర్యజనకమైయున్నది. ఎట్లన? భారతీయులు వర్ణాశ్రమ ధర్మసూత్రనిబద్ధులైయున్నవారు. ఆసూత్రము తెగినయెడ వారునశింతురు. ఈ శాసన మాధర్మసూత్రమును మునుముట తెంచివేయును. ఎట్లన? వీరిశాసనము ననుసరించి భారతీయులు 11, 12, 13 సంవత్సరములలో రజోవతులై యున్నతమ కన్నెలకు గర్భాధానము గావించక నిలిపియుంచవలసివచ్చునుగదా? అపుడు శిక్షింకు భీతిలివరులును, గర్భాధానము జేయుటకు వెరచియుండవలయును. అట్లుండినయెడ నూటికి నూర్గుర

కాంతలెల్లరును కామపీడితలై యీకార్యములను గావింతురని మేమును జెప్పజాలము. కాని కొందఱు కాంతలు కామమునకు లోబడి పరపురుష సాంగత్యము కావింపకపోరు. అందు గొందరికి గర్భములు గావచ్చును అపుడు వీరి శిక్షాస్మృతి ననుసరించి యెవరిని శిక్షించవలెను? గర్భముగావించిన పురుషుడీ శాసనమునకు జిక్కడుకదా? ఇక జిక్కెడువాడు వివాహము గావించుకొనిన వరుడు. వాడేమియు నెఱుగకపోయినను ప్రభుత్వమువారు వానిం బట్టుకొనివచ్చి శిక్షింపవచ్చును. అపుడు శిక్షకు వెరచినవాడు నేనీగర్భమును చేయలేదనునా? భార్య భ్రష్టురాలై పోవును. దానింగన్న తలిదండ్రులును బంధువులును దానిని గ్రహించవలయునా బరిత్యజించవలయునా? గ్రహించిన గులభ్రష్టులుకాక తప్పదుకదా? పరిత్యజించుట కెవ్వని కాలుసేతులాడును? ఆడవు. ఇందులకు వెరచి భర్తనావలననే గర్భమైనదని చెప్పవలయునా? భార్యాసాంగత్య మెట్టిదో యెఱుగనిభర్త యెట్లామాటచెప్పవలెను? చెప్పినం జెడినభార్యను జేబట్టుటయే ప్రాప్తించునుగాని చెరసాలయు జరిమానయు నెట్లును దప్పవుగదా? ఇంతకంటె వర్ణసాంకర్యకారణమైన శాసనముండునా?

ఇంతియెకాదు వెనుక జెప్పినపగిది విపరీతవర్తనము లేక కొందరు కన్యలుందురని మొదట చెప్పియుంటిమికదా? వారికి నేటితో బదియారు వత్సరములు వెళ్ళినవి. వెళ్ళనవికదాయని వారికి గర్భాధానము గావింప దలితండ్రులు యత్నింతురు. యత్నించుటవిని వారి విరోధులీ చిన్నదానికి మొన్ననే పదియైదవ సంవత్సరము ప్రవేశించినది. పదియారు నిండినవనిచెప్పి కార్యము జేయజూచుచున్నారని రక్షకభటాధిపులకు విజ్ఞప్తిబంపెదనుకొనుడు. అపుడీ గర్భాధానమును వారాపవలయునుగదా? ఆపినయెడ వారికి ముడుపులు చెల్లించియో లేక యాభోటులను వెంటగొని కోర్టులకువెళ్ళి యభిమానములు తెచ్చియో లేక డాక్టర్లకు వారిని జూపించి సర్టిఫికెట్లులను దెచ్చియో గర్భాధానకర్మ నడుపవలసివచ్చును. ఇన్నిచిక్కులు పడక

తప్పదు. ఇన్ని యవమానములకును శారదముద్దు లచ్చమ్మగారల ముద్దుశాసనమే మూలమయ్యెడినిగదా?

ఇక నిది ప్రభుప్రజావైషమ్య సంపాదకమను విషయము స్థిర పరచవలసియున్నది. పైన తెలిపినపగిది వీరి శాసనములు మాశాస్త్రా చారములకు బరమ విరోధులును వర్ణసాంకర్య కారకములును మాన వతీ జనావమాన జనకములును నై యుండుటచే వానిని మాశరీరరక్త నాళములందు మహర్షులరక్తము ప్రవహించుచుండగా మేముల్లంఘింప క మానము. మాశాసనము నుల్లఘించిరేయని ప్రభువులకు పైవై షమ్యము జనింపక తప్పదు. అపుడు ప్రభువులు ప్రజలను స్వశాస్త్రా చారవిహిత ధర్మముల ననుష్ఠించినందులకై కఠినశిక్షలను మరణదండ నలను విధించవలయును. అది ప్రజాక్షయమునకు హేతువుకాకపోదు. ఆసంక్షోభ మేవిధముగా బరిణమించునో యిపుడు జెప్పుట ధర్మము కాదు.

కాన నిన్నివిపత్తులకు మూలకందములగు శాసనములను శారదముద్దులక్ష్మి ప్రభృతి శాసననిర్మాణ సభాసభ్యులు తమకై తామె యుపసంహరించుకొనుట యుత్తమకార్యము. ఉపసంహరించు కొననిచో బ్రభుత్వమువారు వెనువెంటనే దానిని నిర్మూలించి యిక మీదనెన్నటికి నిట్టి శాసనములను మూజేయకుండ శాసననిర్మాణ సభాసభ్యుల మాతులపై గొట్టెడు శాసనము నొకదానిని జేయుట యత్యవసరమని విన్నవించి యింతట విరమించుచున్నవారము.

— పత్రికాధిపతి.



శ్రీ

# శ్రుతిధర్మసంజీవని

## అనుమాసపత్రిక

శ్రు తిస్మృతిశిష్టాచార ప్రమాణముల ననుసరించును.

తి తీర్థులకు సంతరణోపాయములను దెలుపును.

ధ ర్మాధర్మవిధర్మములను వివేకించును

శ్రీర మభూయాత్తనువారలకు శ్రీలనొసంగును.

స్మ

సం ఘసంస్కర్తల దుర్వాదములనిరసించును.

జీ వన్ముక్తి పదసోపానములనుజూపును.

వ ర్ణాశ్రమ ధర్మతత్పరుల నాశ్రయించును.

ని త్య సత్య హితమితవాదముల వినిపించును.

## చందా వివరము

| | | |
|---|---|---|
| రాజపోషకులు | సం॥ కి | రు 10-0-0 |
| ప్రధానపోషకులకు | ,, | రు 4-0-0 |
| అనుపోషకులకు | ,, | 3-0-0 |
| చందాదారులకు | ,, | 2-0-0 |
| ,, | ఆరుమాసములకు | 1-4-0 |
| | విడిపత్రిక | 0-3-0 |

Regd. No. M. 1480 చందా సం॥రు. 2.

శ్రీ

శ్రీ బాలాత్రిపురసుందర్యైనమః

"యతోధర్మస్తతోజయః। సత్యమేవజయతేనానృతమ్"

# శ్రుతిధర్మసంజీవని

వర్ణాశ్రమ ధర్మపక్షమున వాదించు మాసపత్రిక.

"ధర్మఏవహతో హంతి ధర్మోరక్షతి రక్షితః"

శివపురపు వీరభద్రపాకయాజి పత్రికాధిపతి


| సంపుటము. | విభవ జ్యేష్ఠ శు ౭ శనివారము. | సంచిక. |
|---|---|---|
| ౧ | మే-1928. | ౫ |


విషయసూచిక


| | | |
|---|---|---|
| 1 | రజస్వలా వివాహమాలిక | పత్రికాధిపతి. |
| 2 | భారత ప్రభుత్వమున కొక విజ్ఞప్తి | " |
| 3 | భారత ప్రబోధము | " |
| 4 | భారత జాతి మత మైత్రి | " |
| 5 | డాక్టరు గౌరుగారి వివాహ విచ్ఛేదశాసన విచ్ఛేదము | " |
| 6 | మహాభాగవత సప్తాహ వార్తా సంగ్రహము | గార్గేయుశర్మ |



బెజవాడ:

శ్రుతిధర్మసంజీవనీ ముద్రాక్షరశాలయందు

ముద్రింపఁబడి ప్రకటింపఁబడినది.

1928.

శ్రీ

శ్రీ బాలాత్రిపురసుందర్యైనమః

"యతో ధర్మస్తతో జయః। సత్యమేవజయతే నానృతమ్"

# శ్రుతి ధర్మ సంజీవని

వర్ణాశ్రమ ధర్మపక్షమున వాదించు మాసపత్రిక.

"ధర్మ ఏవహతో హంతి ధర్మో రక్షతి రక్షితః"

శివపురపు వీరభద్రపాకయాజి పత్రికాధిపతి


| సంపుటము. | విభవ జ్యేష్ఠ శు ౭ శనివారము. | సంచిక. |
|---|---|---|
| ౧ | మే-1928. | ౫ |


## రజస్వలా వివాహమాలిక.

### మహా రజస్వలా వివాహ మహోత్సవము.

---

విభవసంవత్సర నామమునకు సార్థక్యము సంపాదింపగోరి కాబోలు! శ్రీయుత కాశీనాధుని నాగేశ్వరరావుగారు తమపుత్రునకు మహావిభవముతో గూడిన వివాహము జేయుటకు యత్నించుచున్నవారు. రావుగారు బహువత్సరములనుండి పలుసభల కధ్యక్షులైనపుడెల్ల రజస్వలా వివాహములను జేయవలసినదని భారతలోకమునకు బోధించుచువచ్చిరి. తీర్మానములు గావింపించియుండిరి. పత్రికాముఖమున నిరంతరము బోధించియున్నవారు. శాసననిర్మాణ సభ్యులను బురికొల్పి రజస్వలా వివాహశాసనములను పాసుచేయుటకు బిల్లులు మూచేయించి యున్నవారు. వారు పాసుచేసియుండిరి. ఇట్లుండ వీరికొక పుత్రికారత్నము మాత్రమే జనించియుండెను. రావుగారు మహోపదేశ పాండితీమహిమత్వులను నపకీర్తికి పాత్రులుగాక తమకుమారికకు రజస్వలా వివాహముచేసి సత్యవాక్య పరిపాలనము గావించెద

రని తలంచియుంటిమి. ఇట్లుండ నాచిన్నది రజస్వలయైయున్నదని బంధువులలో బెద్దవదంతి యొకటి బయలువెడలెను. రావుగారు తాము చెప్పినదానిని చేయకపోరను విశ్వాసము బరిపూర్ణముగ గలదు. కాని ప్రతిగ్రహీతల నిర్బంధముననైన నొకవేళ రజస్వలకాలేదని చెప్పుదురేమోయను సంశయమున మేము విన్నవదంతియందలి సత్యమును రావుగారి ముఖమునుండియే తెలిసికొని విమర్శింపవలెనని యెంచి 12—3—28 తేదిని రిజష్టర్డు కార్డు ముఖమున రావుగారిని బ్రశ్నించితిమి.

కాని మాలేఖ వారికి ప్రత్యుత్తరము చెప్పనీయని గళగ్రహరోగము తెచ్చిపెట్టెను. అదేమన రావుగారు తమకన్య రజస్వలయైనదని మాకు బ్రత్యుత్తరమిచ్చినయెడ బూర్వాచారపరాయణులును కాలేదని ప్రత్యుత్తరమిచ్చిన నవీనాచార పరాయణులును దూషింతురేమోయనియు వరుడు వధువును బరిగ్రహింపడేమోయనియు సంశయించి వివాహము నుగియులోపల మావిమర్శనము రాకుండ జేయవలెనని యెంచి మాయుత్తరమును దీసికొనకయు ద్రిప్పివేయకయు నిలిపియుంచివచ్చి వరనిశ్చయము గావించి వివాహప్రయత్నములకు మొదలిడిరి. దేశోద్ధారకులనియు సత్యహరిశ్చంద్రులనియు దానకర్ణులనియు మొదలుగా బిరుదములను సంపాదించియున్న రావుగారు రజస్వలయైన తమ కన్య రసస్వలకాలేదని యసత్యమాడరను ధైర్యముతోడను బంధువులు వారిపై వట్టివదంతివేయురను విశ్వాసముతోడను ఇదియెట్లున్నను నాచిన్నది 12 సం॥ లోపలిపడుచుగ లోకమునకు కనుకడదను నమ్మకముతోడను బండ్రెండేండ్లు గడచినమీదట కన్య రజస్వలయైనను గాకున్నను శాస్త్రదృష్టికి రజస్వలగా గన్పడుటచేతను మేమా చిన్నదానిని రజస్వలనుగా నిశ్చయించి యీవివాహ నిజస్థితిదెలియక స్వజాతిమతస్థులు వచ్చి కులముచెడుదురను భయముతో స్వజాతిమతరక్షణముగోరి రావుగారి యీ వంచకచరిత్రను పైపేర గరపత్రికాముఖమున బ్రకటించియున్నవారము.

---

## వేశ్యామాత వివాహము.

విజయవాడ వాస్తవ్యురాలగు యామినీపూర్ణతిలక యను నాటవెలది యించుమించు ముప్పదివత్సరములనుండి తనతో రేయిం బవళ్ళు కాముని పోరాటములను నిరాఘాటముగ సాగించి నిరాఘాట మువారను నింటిపేరును సన్వార్థము గావించుకొనియున్న నిరాఘాటము రామకోటిగారిని వివాహము గావించుకొనినటుల నీనడుమ పత్రికలు ప్రకటించియున్నవి. ముసలిముప్పున దొలిసమర్తయు యన్నటుల నలువదియైదేండ్లు గడచిన వేశ్యామాతయగు యామినీపూర్ణతిలక యన్నియు నుడిగిన వెనుక వివాహముచేసికొనుట యెందులకు? తెలిసినది. క్రైస్తవ కాంతలవలె నొక బ్రాహ్మణుని కులభ్రష్టుని గావించి నానని లోకమునకు జూపించుటకేసుడీ?

---

## విజాతి వధూవరవివాహము.

శ్రీయుత కాశీనాథుని నాగేశ్వరరావుగారు చెన్నపురిలోనున్న యాంధ్రపత్రికా కార్యస్థానమగు తమ సౌధమున హీనజాతివధువు నకును నుత్తమజాతి వరునకును దమ ఖర్చులతో వివాహముగావించి వారికిరువురకును జెరియొక వెండిపళ్లెమును గట్నము చదివించి దంపతి పూజగావించినటుల రావుగారి యాంధ్రదినవార పత్రికలు పలువిధ ముల బ్రశంసించియున్నవి. ఉత్తమజాతీయులు కావించుకొను వివాహ ములందు గట్నములు చదివించెడి యాచారము పనికిరానిదని యని పత్రికాముఖమున బడదిట్టిన రావుగారే వివేకవంతులు తమ యీ పని కని యేమందురోయను సంశయముకూడ జెందక వర్ణసంకరవధూవరు లకు వెండిపళ్ళెరములను గట్నము లొసంగియున్నవారు. కట్నములు సవర్ణవివాహములందు జదివించరాదు కాని యసవర్ణవివాహము లందు జదివించవచ్చునని రావుగారి సిద్ధాంతముగాబోలు! పోలుబోలు వీరేనా దేశోద్ధారకులు? దేశోద్ధారకులా? లేక వర్ణసంకరోద్ధా రకులా?

---

## కన్వష్ట కన్యాపరిణయము.

యువరాజ్యముచేయుచు రాజ్యముచేయదగిన ప్రాయమువచ్చి యున్న పుత్రరత్నముగల యిందూరు సంస్థానాధీశులు తమ కిరువుర స్వజాతి భార్యలుండగా వారినిగాదని యొక మహమ్మదీయ కాంతను బెట్టుకొని యనేక వత్సరములు గడపినమీద మహమ్మదీయ కాంత వార్ధకావస్థలోనున్న సంస్థానాధీశులవలన దన కామము దీరమిఁ గాబోలు వారినివదలి బొంబాయి నగరమున నొక వయస్కుని వర్తకుని దగుల్కొని సుఖించుచుండ నాకాంతను మరల రమ్మని ప్రార్థించి యామె రాక నిరాకరించిన నాగ్రహించి వారు తమ దేశములోనుండి మోటారులో బ్రయాణముచేయుటను దెలిసికొని సంస్థానాధీశులు యావర్తకుని దుపాకితో గాల్పించి కడ తేర్చిరంట! అందులకై బ్రిటిషు ప్రభుత్వమువారు మన రాజుగారిని రాజ్యపదభ్రష్టుని గావించి వారి పుత్రునికి పట్టాభిషేకముజేయుచు రాజుగారికి సంవత్సరమునకు నెనిమిదిలక్షల రూప్యములను మనోవర్తి యిచ్చునటుల నియమించిరట.

ఆమనోవర్తి గైకొని రాజుగారే యూరోపు దేశమున కేగి యట ప్యారిస్సులో రెండు సంవత్సరములుండి యమెరికాదేశపు కన్యయట మిల్లరను నామెను దగుల్కొని యామెకు వసనముల ఖర్చుకుగాను ప్రతిదినమును నుదయసహస్రము సమర్పించి యాకన్య యనుగ్రహమును సంపాదించుకొని వెంటగొని స్వదేశమున కేతెంచి నాచిన్నదానిని ముందు హిందూమతములోనికి గన్వష్టు గావింపించి యాపైన నామెను నొక మహారాష్ట్ర దంపతులకు దత్తహోమము గావింప వారు హిందూవివాహవిధి ననుసరించి తమ దత్తకూతురగు శర్మిష్ఠ (మిల్లరు)ను నిందూరు రాజుగారికి దానముగావించినటుల దెలుపుచు పత్రికలు సంతోషవారిధిం దేలియాడియున్నవి. ఇది వృద్ధవివాహము కాదా? వృద్ధవివాహములను బడదిట్టియున్న యాంధ్రపత్రికా ప్రభృతులు నేడిందూరు సంస్థానాధీశులు కావించుకొన్న వృద్ధవివాహమును భూషింపనేల కారణము తెలసినది అది వర్ణసంకరము గావించినందువలన గలిగిన యానందమునఁ మునిగినవై మైమరచి విధినిషేధ

ములను విడిచి దానిని నిందించుటకుమారు పైపెచ్చు స్తుతించియున్నవి. ఆస్తోత్రపాఠములను పుటలకు పుటలు నింపియున్నవి. వారికున్న నాలుక యొకటియు చేతులు రెంటను సగుటచే స్తుతించుటకుజాలినవి కావు. వానిని వేయుగా జీల్చియున్న యెడ నింకను వర్ణించియుందురనుటకు సందియముండునా?

---

## మహమ్మదీయవర బ్రాహ్మణ వధూవివాహము.

బొంబాయి వాస్తవ్యులగు డాక్టరు భండార్కరుగారను మహారాష్ట్ర బ్రాహ్మణుని మనుమరాలికి రజస్వలయగువరకు వివాహము చేయక యుంచిరట. ఆయమ బి. ఏ. పరీక్షయం దుత్తీర్ణురాలై యొక కన్యాపాఠశాలయం దుపాధ్యాయినిగా జేరి సమీపమునన్న పురుష పాఠశాలలో స్వభాషోపాధ్యాయుడగు నొక మహమ్మదీయ కుమారుని గామించి బంధువులకు దెలుపకయే స్వయంవరం గావించుకొనినదంట అది కనివిని మహారాష్ట్ర బ్రాహ్మణులెల్లరును మహాగ్రహాగ్రసితులై ప్రతిగ్రామమునను సభలుచేసి పైవివాహమునెడ దమకుగల యసమ్మతిని నాగ్రహమును వెళ్ళబుచ్చియున్నారని పత్రికలు ఘోషించియున్నవి. ఈయరిష్టమునకు హేతువేమో తెలిసినదా? రజస్వలయగువరకు గన్యలకు వివాహముచేయక యుంచుటయే. వేరేమి హేతువున్నది?

## ప్రౌ ఢా వి వా హ ము.

ప్రౌఢయన ముప్పదివత్సరములకు మీదను నేబదియైదు వత్సరములకు లోపలను నున్న ప్రాయముగల పడుచని యర్థము ఆ ప్రౌఢయొక్క వివాహము ప్రౌఢవివాహ మగుచున్నది. విజయవాడ వాస్తవ్యులగు శ్రీయుత మంచాడ సుబ్బారావుగారను లాయరుగారు పదియవ సంవత్సరమున రజస్వలయైయున్న చిన్నకన్నెను రజస్వలయైనతరువాత బదునెనిమిదవ సంవత్సరమున వరించి స్వయంవివాహము గావించుకొని యున్నారని పత్రికలు ప్రకటించియుండెను. ఈ ప్రౌఢవివాహముజరిగి యిప్పటికి మూడుసంవత్సరములు గడచియున్నది.

---

## భవిష్యద్రజస్వలావివాహము.

మునగాల సంస్థానమంత్రులగు కొమరాజు వేంకటలక్ష్మణ రావుగారు జనించినతోడనే తండ్రిగారు మరణించిరి. తల్లిగారెంతో కష్ట బడిపెంచి పెద్దవానినిజేసి ఎమ్. ఎ. వరకు చదువు చెప్పించిరి. రావు గారు సంఘసంస్కార ప్రియులై మేనమామగారి కొక విధవను బట్టు కొనివచ్చి వివాహము గావించిరి. అదికని తల్లిగారు ఖేదపడినవారై ఏకపుత్రు విషయమనికూడ జూడక కాశీపట్నమున కేగి యట స్థిరనివా సము గావించుకొని పుత్రుని ముఖావలోకనము చేయుటకుకూడ నొల్లకుండిరి. ఆయమ స్వధర్మాభిమానమును నెంతవ వర్ణింపగలము. రావుగారు తమతల్లిగారు తమను బహిష్కరించినందులకైన సిగ్గుపడి దుష్కార్యములనుండి విడివడకపోగా బైపెచ్చు దమకుమారికకు రజ స్వలమైనంగాని వివాహము చేయనని నిలిపియుంచిరి. ఆచిన్నది రజ స్వలయయ్యెను. లోకపరిహాసమునకు బాత్రులగుటచే విసుగుచెంది యాయమ వివాహమునెడ విరక్తురాలై నిరాకరించెను. ఇట్లు నాల్గు వత్సరములు గడచినమీద రావుగారు కాలధర్మమునొందిరి. కాలధర్మము నంది యిప్పటికి నాల్గువత్సరములు గడచినవి ఇప్పటికి వివాహము జరిగియుండలేదు. ముందు జరుగనున్నదని వార్తలు వినవచ్చుచున్నవి అది యెట్లుజరుగునో జరిగినపిదప మాట్లాడుకొందము.

---

## భవిష్యద్రజస్వలా వివాహము II

హేలాపుర వాస్తవ్యులును విజయవాడ వాస్తవ్యులగు దాసు కేశవరావుగారికి సహోదరులును నగు దాసు మాధవరావుగారి కుమారీరత్నము రజస్వలమై యిప్పటికి రెండువత్సరములు గడచినట్లు వినవచ్చినది. ఆచిన్నదానిని చెన్నపురిలోనుంచి చదివించుచున్నటుల వినియున్నవారము. విద్యాపరిసమాప్తి మైనవెనుక స్వయంవరంవివా హము జరుపుదురను వదంతిగలదు. రావుగారు రజస్వలావివాహము జేసికొని సంఘసంస్కారకులాగ్రేసరచక్రవర్తిశిరోమణి భట్టాచార్య

పర్యులను బిరుదము గడించియున్నవారు. వీరుగావించు రజస్వలా దానమునుగూర్చి ముందు ముచ్చటించుకొందము గాక.

---

## సంఘ సంస్కార కర్తవ్యము.

ఇంకను మరికొన్ని రజస్వలా వివాహములు కలవుగాని గ్రంథ విస్తరభీతిచే వాని నిట వినిపింపమానియున్నవారము. ఈ రజస్వలా వివాహదాతలును వీరితో గలియకతప్పని యుభయబంధువులును వేద శాస్త్రములును వేదశాస్త్రోక్త పితాచారములను బరిత్యజించి యథే చ్ఛాచారరతులై శాస్త్రాచార విరుద్ధములగు దురాచారముల నాచ రించుటయం దేమాత్రమును సందియమొందువారు కారని చెప్ప వచ్చును. వీరు కావించు కార్యములనుబట్టి కులభ్రష్టులై యున్నవా రనుటకు సంశయములేదు. ఇపుడు వారికై వారె సంఘమునుండి తొలగి పోయి వేరుగనుండుట యుత్తమధర్మము. అదిమాని పూర్వాచారప రాయణులు పిలిచినను పిలువకున్నను నేదోయొకమిష కల్పించుకొని పూర్వబందుధువులతో గలిసి భుజింప నభిలషించుచుందురు. పరభాషా పాండిత్యము గడించిన ఘనులు కొందరు పైకి బూర్వాచారపరాయ ణత్వము కలవారివలె నటించుచు లోలోపల నవీనాచార పరాయ ణులై వారిని వీరిని జేర్చి యొకచో విందులుచేయించి యెల్లెననేమి వర్ణసంకరము గావించుటకే యత్నించుచున్నవారు. అదికని సంఘ సంస్కారులు తాము జయశీలుర మైతిమని చంకలు గొట్టుకొనుచు న్నవారు. గిఫార్మరులు పూర్వాచార పరాయణులతో కలసి భుజించిన బవిత్రులయ్యెదరా? లేక పూర్వాచారపరాయణుల పవిత్రులయ్యె దరా? విచారించగా రిఫార్మర్లుతో జేరి భుజించుటచే పూర్వాచార ప్రియుల పవిత్రులయ్యెదరు. కాని రిఫార్మరులు పవిత్రులు కానేరరు. ఎట్లన? వ్యభిచారిణులు పతివ్రతలతో జేరి భుజించిన బవిత్రులయ్యె దరా? కారు. కాని పతివ్రతలు వ్యభిచారిణులతో జేరి భుజించిన వ్యభి చారిణులు కాకపోయినను నపవిత్రులు కాకమానరు. ఇట్లే దొంగలు దొరలతో జేరి దొరలు కానేరరు. దొంగలతో జేరిన దొరలకు దొంగ

లను యుపకీర్తి రాకపోదు. ఇట్లే రిఫార్మర్లతోఁగూడిన పూర్వాచార పరాయణులకు నపవిత్రిత రాకతప్పదు. రిఫార్మరులు తాము కులము జెడి తాజెడ్డకోతి వనమెల్లజెరిచెనని లోకోక్తికి గురిగ గులాచారరతు లను గులభ్రష్టులను గావించుట ధర్మముగానేరదు. కులభ్రష్టత రాష్ట్రి మునకును రాష్ట్రిజనులకును నాశనహేతు వగునని యతీంద్రి యద్రి ష్టలగు మన్వాదిమహర్షులు స్మృతిముఖముల వివరించియున్న వారుగాన మా రిఫార్మరుసోదరు లింతటనైన బశ్చాత్తప్తులై పూర్వాచారపరా యణ సంఘమునకు దూరముగ వర్తింతురని తలంచి యింతట విర మించుచున్న వారము.

---

# భారత ప్రభుత్వమున కొక విజ్ఞప్తి.

---

మాశాస్త్ర దృష్టితోఁజూడ నిప్పటిప్రపంచము నూటతొంబ దియైదుకోట్ల యేబదియెనిమిది లక్షల యెనుబదియైదువేల యిరువది యెనిమిది సంవత్సరములనాడు పరమేష్ఠిచే సృజింపబడినదిగుల గన్పట్టె డిని. అప్పటినుండి యించుమించు పదిశతాబ్దముల క్రిందటివరకును భారతమహీమండలము క్షత్రియప్రభు పరిపాలితమైవచ్చిన భారత రాజ్యము వేయివత్సరములనాడు విదేశీయులగు మహమ్మదీయాదుల హస్తగతమై చాలకాలము వారి యధీనమునుండి యనంతరము బర మేశ్వరానుగ్రహ పాత్రులైయున్న బ్రిటిషుప్రభువుల ఛత్రముక్రింద జేరి యించుమించు రెండు శతాబ్దములనుండి మీచే బరిపాలింపబడు చున్న విషయము లోకవిదితమైయున్నది.

ఇది యిట్లుండ భారతప్రిజలలో గొందరు పురుషకారేయు స్వదేశ ప్రభువులచే బరిపాలింపబడవలసిన భారతప్రభుత్వము పరదే ప్రభువులచే బరిపాలింపబడుటకు నిచ్చగింపక మాప్రభుత్వము మాయధీనము జేయవలసినదని యడిగినపుడు రాజనీతి విశారదులగు బ్రిటీషుద్యోగస్థులు మీరాజ్యమును మీరు పరిపాలించుకొనవలసినదే

కాని యిందులకు దగిన ప్రభుమాత్రోత్సాహశక్తులు గోల్పోయియున్న
మీకు మేము భారతరాజ్యమును స్వాధీనము గావించినయెడల దానిని
నిర్వహించుకొనలేక యంతఃకలహపీడితులైయున్న మీరు పోరాడు
కొని రక్తపాతమునకులోనై నశింతురను సంశయమున రాజ్యమును
మీస్వాధీనముచేయుట కిచ్ఛగింపక యున్నవారమని ప్రత్యుత్తరమిచ్చి
యుండిరి. ఈజ్యోతిషము మాత్రము సత్యమునే బోధించియున్నదను
టకు సంశయములేదు. కాని మారాజ్యము మాయధీనము గావింప
వలసినదను భారతీయుల నిర్బంధమునకులోనై రాజనీతికోవిదులగు
శ్రీ మాంటేగు మంత్రిప్రభృతులు తొల్లి తమవారు తెల్పిన జ్యోతి
షము యదార్థమని భారతలోకము గ్రహింపగోరి పుంస్త్వవిరహిత
మైన వోట్లప్రభుత్వము నొకదానిని బ్రసాదించి యున్నవారు.

మాకీ వోట్లప్రభుత్వము (శాసననిర్మాణ సభాసభ్య పదవి)
వలదని మొదట భారతప్రజలు బహిష్కరణమునకు యత్నించి యందు
జయముగాంచలేక యథాతథమై పరల వారే శాసననిర్మాణ సభలకును
బోర్డుపురపరిపాలక సభలకును సభ్యపదవులకై నేనునేనని వచ్చి ప్రవే
శింప మొదలిడినవిషయము జగద్విదితమే కదా? ఇపుడు వారిలో
పరార్థపరతచచ్చి స్వార్థపరత హెచ్చుటచే ముచ్చటించుటకు వీలు
లేని వైరమునకు నిలయులై సంపాదించుచున్న హాని యింతయని చెప్పు
టకును వ్రాయుటకునుగూడ నలవిగాకయున్నది. అంతటితో బోక వీరు
రాజకీయవిషయములందు మీకేపియో మహోపకారములు కావిం
చి త్రిప్పి తలకెత్తెదమని యమాయకులగు భారతప్రజలను వంచించి
వారివలన వోట్లను సంపాదించుకొని గడచి గద్దెక్కినమీద గండడు
మిండడై సర్కారు ఖర్చులమీద రైళ్ళలో బయనములు గావించి
హోటల్సులోనా కంఠపూర్తిగమెక్కి కురిచీలపైగూర్చుండి మైమరచి
తాము చేయవలసిన కార్యములను నిర్వహించుటకు నసమర్థులై యంత
టితో బోక నిరపరాధులును, సాధువులును, నమాయకులును నగు
పూర్వాచారపరాయణులను నిర్బంధశాసన మూలకముగ కులభ్రష్టు
లను జేయవలయునని సంకల్పించి మీచేయుచున్న బిల్లును వ్రాసి

వలన మాకు హానికలుగును గావున త్రోసివేయ వలసినదను పూర్వా
చార పరాయణుల మొరలను బ్రిటిషుప్రభుత్వమువారు బహువా
ములు వినియున్న విషయమేకదా?

ఇప్పటికిని భారతప్రజలలో నూటికి తొంబదియైదుమంది హై
నేజాతియందైనను బూర్వాచారపరాయణుల సంఖ్యయే మిగిలియు
దనిచెప్పిన స్వభావోక్తి యగునుగాని యతిశయోక్తి యెంతమాత్ర
మును గాజాలదు. శాసనసభలమాట యట్లుండ కాంగ్రెసు (దే
మహాసభ) యొకటి బయలువెడలియున్నది. దీనికి ప్రజాప్రతి
సభయని వేరొకపేరును వాడుచున్నవారు. ఇందలి సభ్యులెల్ల
వారికై వారు బయలుదేరిపోయి కాంగ్రెసుసభ్యులమనిచెప్పి సాహ
కార్యములు గావించుచున్నవారేగాని ప్రజల యనుమతిమీద వెళ్ళి
వారెంతమాత్రమునుగారు. కాన నిది ప్రజాప్రతినిధిసభ గానేరదు
కాని యీయెడల పూర్వాచారపరాయణులగు భారతప్రజల లో
మొకటికలదు. అదేమన? తమ యనుమతిలేక తమతో నేవిధమై
సంబంధములేక తమ ప్రతినిధులమని వెడలి కాంగ్రెసుసభ్యులు కావి
చుచున్న యకార్యకార్యములయెడ దమ యసమ్మతిని వెనువెంట
దెలుపని లోపమైయున్నది. వారికి తెలుపకుండుటకుగల కారణము
వారి యమాయకత్వమును దెలపినయెడ దమను దేశీయమహాజనస
సభ్యులు బాధింతురేమోయను భయమును, వారొకవేళ రాజ్యము
సంపాదించినయెడ నందు దమకు భాగములేకపోవునేమోయను స
యమునునైయున్నవి. ఇప్పటికి భారతదేశీయ మహాజనసభవారు
శాసననిర్మాణ సభ్యులును తమకు సంపాదించియిచ్చెడి రాజ్యమేమో
కావించెడి మహోపకారముమేమో సంపూర్ణముగ గ్రహిం
గలిగియున్నవారు వారికిపుడు దిక్కు సకలలోకాధీశ్వరుడగు భగ
తుడును భారతప్రభుత్వమును దక్క మరియొక్కటిలేదని బాగు
గ్రహింపగలిగియున్నవారు.

రాజ్యమెప్పుడును బలవంతులచే ననుభవించదగినదైయున్న
బలమన దైవబలము, బుద్ధిబలము, సాధనసామాగ్రిబలము, మను

బలము లోనగునవియై యున్నవి. ఇవియన్నియు నెవరియందు మూర్తీభవించియుండునో వారుమాత్రమే రాజ్యముచేయుదురు. అందులకసహనము జెందువారు నశించవలసినదే. కాని సఫలమనోరథులు కానేరరు. పైబలములే ప్రభుత్వమునందు క్షీణించునో యాప్రభుత్వ మారాజ్యము గోల్పోకతప్పదు. పోయినదానిని సంపాదింప సమర్థమగానేరదు. ఇపుడు భగవదనుగ్రహపాత్రులై రాజ్యము నెట్లు పరిపాలించిన తాము సుఖసంపన్నులై లోకమును సుఖముగ బరిపాలింపగలుగుదురో యట్లు మీరు పరిపాలించుచున్నవారని నిష్పక్షపాతబుద్ధిగల బుద్ధిమంతులు చెప్పకతప్పదు కాన భగవదనుగ్రహపాత్రులై యున్న బ్రిటిషుప్రభుత్వమువా రెంతకాలము భారతరాజ్యమును బరిపాలింపగల సమర్థత కగిలియుందురో యంతకాలము సర్వాధికారములను, మీయధీనములో నుంచుకొని యేజాతిమతముల వారియొక్కయు పరంపరాగతములైయున్న యాచారవ్యవహారములను భంగము కలుగకుండ రాజ్యము గావించుచుండవలెనని నూటికి తొంబదియైదు మంది సాఖ్యగల పూర్వాచారపరాయణులగు భారతప్రజ యభిమతమై యున్నది.

ఇదిమీరెట్లు చెప్పగలరందురా? భారతప్రజ లెప్పుడును నెన్నటికిని వర్ణసాంకర్యమున కంగీకరించువారు కారు. వర్ణాశ్రమధర్మతత్పరులై యుండువారు. జాతిగౌరవమును బాటించువారు. ఇటువంటి భారతీయులు జాతిగౌరవములను బోనాడి సకలజాతీయులును నేకమై యాహారవిహారములను గావించుచు రాజ్యము గావించుటకు నంగీకరింపరు. అందుచే బూర్వాచారపరాయణులు ఓట్ల ప్రభుత్వమునకు విముఖులై యున్నవారని చెప్పుటకు సాహసించియున్నవారము. ఇది కనిపెట్టి మాజాతిమతములనుండి భ్రష్టులై సకల దురాచారములకు లోనై యున్నవారు మాత్రమె కాంగ్రెసు, కౌన్సిల్ మున్నగు సభలలో సభ్యులై తమ యాచారవ్యవహారములయెడ నేవగింతగల పూర్వాచారపరాయణులను బాధించుటకు శాసనము సృజించ బూనుచున్నవారు కాన నీసభలను నిలిపివేసి వారీ రాజ్యము చేయదలంచి

వంతకాలముచేసి యెందులకేనాడ సమర్థులై రాజ్యముచేయులేక మీరై మీరు విడిచిపెట్టిపోయెదరో యానాడు మాదేశమును బరిపాలించుటకు క్షత్రియప్రభువులు సంసిద్ధులైయుందురు. ఇంతియెకాని మాకీ యోట్లప్రభుత్వము యొంతమాత్రమును వలదు. మాయీవిజ్ఞప్తిని భారతప్రభుత్వమువారు సావధానముగ యాలించి ధర్మరక్షణపూర్వకముగ భారతరాజ్యమును బరిపాలింపవేడుకొనుచు నింతట మావిజ్ఞప్తిని ముగించుచున్నవారము.

---

# భారత ప్రబోధము.

---

భారతసోదరులారా?

భారతప్రపంచము జనించినదాది భారతరాజ్యమును క్షత్రియప్రభువులు పరిపాలించియుండిరి. వారు ద్విజులై వేదవిహిత కర్మానుష్ఠానమున కధికారులై వేదోక్తధర్మరక్షణ భారవాహకులైయున్న కారణమున వారు మనలను మాధర్మములను యథావిధిగ బరిపాలించుచు వచ్చిరి. వారు కాలవశంవదులై రాజ్యభారమును వహింపలేక పరాధీనముగావించిరి. పరులు మనధర్మమునకు విముఖులై యుండువారగుటచే విద్వేషులై భారతధర్మనాశనమున కెన్నియోవిధముల యత్నించి తుదకు వారేనశించియుండిరి. ధర్మనాశకులు నశింపక తప్పునా? ఇట్లుండ దైవానుగ్రహమున బ్రిటిషుప్రభుత్వము భారతరాజ్యమును బరిపాలించు మహాభాగ్యము మనకు లభించెను. వారును మనధర్మమునకు విముఖులే. అయినను తత్పూర్వప్రభుత్వమువలెగాక శాంతగుణోపేతులుగావునను, లోకజ్ఞానసంపన్నులుగావునను, రాజనీతివిశారదులుగావునను, మీజాతి మతరాజ్యములను మీరేపాలించుకొనుడు. వాని విషయమై మేము జోక్యముకలిగించుకొనమని శాసనను గావించియుండిరి. మనమా వర్ణాశ్రమధర్మతత్పరులము. మనధర్మములు శ్రుతిస్మృతివిహితములై యున్నవి అవి వర్ణసంకరమున కంగీకరింపవు

కాన మనము కులహీనులతోఁగూడి యాహారవిహారములు గావించుచు
రాజ్యముగావించుట కొడంబడువారముగాము. కాన మన యీస్థితిగని
పెట్టి మన సంఘములోజనించిన వర్ణసంకరప్రియులు కొందరు కుల
భ్రష్టులై తాజెడ్డకోతి వనమెల్లజెరిచెనన్న లోకోక్తికిగురిగ మనల కుల
భ్రష్టులఁజేయుటకు యత్నించి సఫలమనోరథులు గామికివగచి యెట్ల
యినను మనల జెరుపవలెనను చెడుతలంపుతో శాసనములను జేయు
టకు యత్నించుచున్న విషయ మాబాలగోపాలవిదితమై యున్నది.
ఆశాసనములు మన శాస్త్రాచారములకు బరమవిరుద్ధములై యున్నవి.
మానవతీజనావమాన జనకములైయున్నవనుటకు జంకబనిలేదు. వర్ణ
సాంకర్యమున కాలవాలములైయున్నవి. ఇంతియెకాక ప్రభుప్రజావైష
మ్యసంపాదకము లనుటకు సంశయములేదు. మనమిపుడు బ్రిటిషుప్రభు
త్వమునను వెడలనడచి రాజ్యముచేయుట కర్హులముగాము. మనకుల
భ్రష్టసోదరుల నెదిరింపలేక యౌదాసీన్యము వహించితిమి. ప్రభు
త్వమువారు మనయెడ నన్యథా భావముజెందుటకది యవకాశమిచ్చి
నది. ఉభయుల వత్తిడికిలోనై మనము చావవలసినస్థితికి వచ్చియున్న
వారము. చచ్చుటకిష్టముగలవారు మనలోనుందురా? ఉండరు. కాన
మహర్షుల శుక్లశోణితములు మనశరీరములం దున్నంతకాలము చావున
కైన నంగీకరింపనగునుగాని ధర్మనాశనమున కంగీకరింపరాదు. కావున
హీనజాతీయులతోఁ జేరి మనము రాజ్యముచేయజాలము. చేయము
గాన వెనువెంటనే ప్రతిపట్టణమునను పల్లెటూరియందునను సభలు
గావించి మాకీయొట్లు ప్రభుత్వము వలదని ప్రభుత్వమునకు వేవేగ
విజ్ఞప్తులను బంపుకొనుడు. పంపనిచో మనసోదరులు సంపాదించుచున్న
మహానాశనమునకు పాత్రులముగాక తప్పదని గ్రహింపుడు. లెండు.
నిద్రమేల్కొనుడు.

# భారత జాతిమత మైత్రి.

భరతఖండమున భారతీయులు, మహమ్మదీయులు, క్రైస్తవులు, పారశీకులు లోనగు భిన్న జాతిమతముల వారెందరో యిపుడు వసించు చున్నవారు. ఇందు భారతీయులు మాత్రమే సృష్ట్యాదినుండి యిప్పటి వరకు భరతఖండమును నెడబాయక భారతధర్మములను విడనాడక వచ్చుచున్నవారు. తక్కిన మహమ్మదీయాదులు నేదోయొక కాలమున ధర్మత్యాగమొనర్చియో, యధర్మానుష్ఠానము గావించియో లేక వ్యభిచరించియో భారతసంఘమునుండి విడివడిపోయి విదేశముల కేగియట వసించియుండిన వారిసంతతి వారిలో గొందరు మరలి రాజ్యకాంక్షచేతనో మరేకాంక్షచేతనో భరతఖండమునకే తెంచి నివసించియున్నవారు. ఇంతియె గాక భారతసంఘమున బ్రాహ్మణులు, క్షత్రియులు, వైశ్యులు, శూద్రులనువారు పరమేష్ఠిచే సృజించబడిన పవిత్రజాతీయులై యున్నవారు. వీరేగాక యనులోమసంకరులు, విలోమసంకరులు, సంకీర్ణ సంకరులు లోనగు సంకరజాతీయు లెందరోకలరు. ఇంతియెగాక భారత సంఘమునుండి వర్ణాశ్రమధర్మములందును, వైదికమతములందును విద్వేషము జనించి విడివడిపోయినవారే జైన, బౌద్ధ, చార్వాకాది మతములవారైయున్నారని మాపాఠకులు గ్రహింపగలరు. ఇంతియె గాక భారతసంఘమున వైదికములగు శైవ, వైష్ణవాది భక్తిమతభేదములును, ద్వైతాద్వైత విశిష్టాద్వైత శివాద్వైతాది సిద్ధాంతమత భేదములును గలవు. ఇందలి జాతభేదములన్నియు నశించి యొకజాతియు, మతభేదములు నశించి యొకమతమును నేర్పడినంగాని మైత్రికలుగదు. మైత్రికలిగినంగాని భరతఖండవాసులు తొల్లింటి మహోన్నతస్థితిని భారతదేశమును దీసికొని రాజాలరని కొందరు తలంచుచున్నవారు. తలంచుటయెకాదు. అందులకై యత్నించి జాతిమతభేదములను దీసి వేయలేక పోగా క్రొత్తజాతిమతములను తాజెడ్డకోతి వనమెల్లజెరచె నన్న లోకోక్తికి గురిగ జేసి దాస్య. దేశారిష్టదాయకములగు జాతిమత

వైషమ్యములను వృద్ధిగావించియున్నవారు. జాతిమతభేదము లెన్నియు న్నను మైత్రితో మనినయెడ భారతసంఘ మచిరకాలముననే తొల్లింటి మహోన్నత స్థితికి భారతదేశమును దీసికొనరాగలదని స్థిరపరుచు విమర్శనవ్యాసము గాన దీనికి భారతజాతిమత మైత్రియను నన్వర్థనామ కరణము గావించి పత్రికృతమునకు వచ్చుచున్నవారము.

జన్మభేదముచే జాతిభేదము లేర్పడియున్నవి. మతభేదములు కూడ జన్మనుబట్టియే యేర్పడుచుండును. మనమెఱిగియున్న దేకదా? రాక్షస, దేవత భేదములును వారివారిమతభేదములును ప్రవర్తనభేద ములును ఇవియన్నియు జన్మచేతవచ్చిన భేదములేగాని తెచ్చుకొన్న భేదములుగావు. ఇట్లే భారతీయులకును మహమ్మదీయులకు గల జాతి మతవైషమ్యములు జన్మతఃప్రాప్తములే కాని మధ్య కల్పితములెంత మాత్రమును గానేరవు. కాన వానిని త్రోసివేసి యొకజాతిని నొకమత మును నెలకొల్పవలయునని యత్నించినవారు సఫలమనోరథులు కాక విఫలమనోరథులైరి. ఇది యిట్లగునని యెరింగియుండియే వేదశాస్త్ర ములు జాతిమతములకు మైత్రిని బోధించినవికాని జాతిమత భేదములను నిర్మూలించ వలసినదని బోధించియుండలేదు. ఈ విషయమై యక్షరా భ్యాసమైన వెంటనే బాలురకు నేర్పబడు నీతిశాస్త్రమిట్లు చెప్పియున్న ది అదేమన?

శ్లో॥ అయం నిజః పరోవేతి గణనా లఘుచేతసాం।
ఉదారచిత్తానాంతు వసుధైవ కుటుంబకం॥

వీడు నావాడు వీడు పరుడు నను గణనమల్పబుద్ధుల కార్యమై యున్నది. ఉదారచిత్తుల కార్యమన్ననో వసుధలోనున్న మానవు లెల్లరు తన కుటుంబములోని వారని తలంచుట యేధర్మమని పై శ్లోక ము బోధించియున్నది.

ఈ చెప్పినదానింబట్టి మనలో నెన్ని జాతిమత భేదములున్నను పరమ తజాతి సహనము గలిగి పరస్పరమైత్రితో మనుట పరమధర్మమని స్ప ష్టమైనదికదా? పరమత సహనమునకు జన్మభూమి భారతసంఘము మాత్రమే యని చెప్పిన స్వభావోక్తియగుచుగాని యతిశయోక్తి యెంత

మాత్రమును గానేరదు. యేలయన భారతసంఘము పరజాతి మతద్వే షమునకు లోనుగాక పరమత సహనముతో బ్రవర్తించుటకు బరమసా ధనము జాతిమత పరివర్తనము నంగీకరింప కుండుటయే కాని యన్య ము కానేరదు. కడు బీదబ్రాహ్మణుడైనను ధనాదిలోభములచే యన్య జాతీయుడగుటకు యత్నింపడు. యత్నించినను నన్యజాతీయు లంగులకు సమ్మతింపరు. వానిని నికృష్టజాతికి నెట్టివేయుటకు సాహసింతురు. ఇట్లే క్షత్రియులు వైశ్యులగుటకు గాని వైశ్యులు శూద్రులగుటకు గాని యత్నింపరు. యత్నించినను వారందులకు సమ్మతింపరు. ఉత్కృ ష్ట జాతీయుని నికృష్టజాతికి బరివర్తనమగుట కిష్టపడనివారు నికృష్టజా తీయు డుత్కృష్టజాతికి బరివర్తనమగుట కంగీకరింపరని వేరుగ జెప్పవ లయునా? చెప్పనవసరము లేదని తలంచెదము భారతసంఘము పర మత సహనమునకు జన్మభూమియై యెట్లువిలసిల్లు చున్నదో యట్లే మహమ్మదీయ క్రైస్తవాది సంఘములు పరమత విద్వేషమునకు జన్మ భూములై విలసిల్లుచున్నవి. ఏలయన? వారు స్వాభివృద్ధిని స్వసంఘాభి వృద్ధిగోరి జాతిమత పరివర్తనమునకు గడంగుటచే పరజాతి మతద్వేష మునకు జన్మభూములై యున్నవారు. మహమ్మదీయులు క్రైస్తవులు మున్నగు వారిలో గొందరు పరజాతిమత పరివర్తనమువలన తామైహి కాముష్మిక సుఖముల నార్జించుకొనవలయునని తలంచి యందులకై యత్నించి పరజాతిమతముల వారందుల కంగీకరించకున్న వారియెడల విద్వేషమునువహించి వారిని జెరుచుటకు సామదాన భేదదండోపాయ ముల యత్నించు వారుకలరు. ఇందులకు దాహరణముగ అనిబిసెంటు అరండల్ మున్నగువారిని మనము గైకొనవచ్చును వీరు స్వాభివృద్ధికై జాతిమత పరివర్తనమునకు యత్నించినవారు. స్వసంఘాభివృద్ధిగోరి క్రైస్తవమిషనరీలును మహమ్మదీయ మతబోధకులును పరమత జాతీ యులను స్వజాతిలోనికి బరివర్తనము గావించుటకు యత్నించుచుం డుట యాబాలగోపాల విదితమైయున్న విషయమేకదా?

ఈ సందర్భమున జాతిమత పరివర్తనమునకు యత్నించు మహ మ్మదీయ క్రైస్తవ మతబోధకుల కించుక హితోపదేశముగావిం

దలంచి యున్న వారము. మహమ్మదీయ మతబోధకులు భారతీయులను దమ మతములోనికి మార్చుకొనుటకు యత్నించి యందుల కంగీకరింపని భారతీయులను హింసించి యున్నవారని పూర్వచరిత్రిలేగాక నిన్న నేటి చరిత్రలుకూడ చాటుచున్నవి. క్రైస్తవ మతబోధకు లట్లుగాక పైకి మహాశాంతియుతులుగ నటించుచు దమ మతపరివర్తనమున కంగీకరింపని భారతీయులనా నీళ్లవలెజల్లని కద్ధతితో బాధించుచున్నవారు. ఎట్లయిననేమి? మహమ్మదీయులును క్రైస్తవులును భారత జాతి మతములయెడ బరమవిద్వేషముతో బ్రవర్తించుచున్నవారని చెప్పట తప్పు కానేరదు. వారి యుద్దేశ్యమేమో చెప్పజాలముకాని వారు జాతి మత పరివర్తనమునకై చేయుచున్న ప్రయత్నము నిషిద్ధకార్యమని మాత్రము చెప్పకతప్పదు. ఏలయన? వీరిపుడు తరుచుగాభారతసంఘము నందలి కడజాతివాండ్రగు మాల మాదిగెలను తమ మతములోనికి గన్వర్టుగావించుకొను చున్నవారు. వాండ్రతో నాహార విహారములనుగావించు చుందురు. సంబంధములను గూడ నొనర్చుచునే యున్నవారు. పాచకులనుగా గూడ నిడుకొని యున్నవారు.

ఇటువంటి మహమ్మదీయ క్రైస్తవ మతబోధకులే మేముత్తమ జాతీయులమని చెప్పుకొను చుందురు. ఇందుకు మేము లజ్జపడుచున్నారము. ఇంతకంటె విషాదకరమగు విషయము మరియొకటి యుండునా? కడజాతివాండ్రను గన్వర్టు చేసికొనిన వీరుత్తమజాతీయు లెట్లయ్యెదరు? ఎన్నటికినిగారు. కాన వీరు చేయుచున్న జాతిమత పరివర్తనకార్యమును పరమ నికృష్ట కార్యమని చెప్పక తప్పినదికాదు.

ఇట్లనిన మేము బ్రాహ్మణాద్యుత్తమ జాతులలోనుండి కొందరిని మా మతములలోనికి బరివర్తనము గావించి యుండలేదాయని మహమ్మదీయ క్రైస్తవ మతబోధకులు మమ్ము బ్రశ్నింపకపోరు. సమాధానము వినుడు. వారు మాలోని యుత్తమజాతీయులను గొందరిని గన్వర్టుచేసి యున్నదియు చేయుచున్నదియు మేమెరుగుదుము. కానియట్లు పరివర్తనము పొందినవా రుత్తమజాతీయులు కారు. జాతి యన జన్మ. జన్మము నందేదియో సాంకర్యముండినం గాని, భారతీ

యుడు పరజాతి మత పరివర్తనమున కంగీకరింపడని చాటి చెప్పుచున్న వారము. ఇట్టి జన్మచేఁ జాల నికృష్టతను గాంచిన వారిని జేర్చుకొని స్వసంఘాభివృద్ధిగావించితిమని సంతసించుటకంటె యున్న వారితో దృప్తినంది మహమ్మదీయ క్రైస్తవ మతబోధకులు నీచాతి నీచమగు జాతి మత పరివర్తన కార్యమునందు విశ్రాంతిఁ గైకొని మనుట తగిన కార్యమని తలంచు చున్న వారము.

భారతసంఘము నేకారణముచేనైననేమి యపవిత్రజన్మగలవారుక్రింద యున్న వారని తెల్పియుంటిమి. అటువంటివారు భారతసంఘమునందుండి యందున్న పవిత్రజన్మలను భ్రష్టులను గావింపకుండ వారిని విడదీసి మహమ్మదీయ క్రైస్తవ మతబోధకులు వారి మతములోనికి జేర్చుకొనుట మాకొక విధముగ సంతోషదాయకమగు కార్యమే. అయినను గాంతాజనముల ముందిడి గొందఱిని బవిత్రజన్మ గలవారిని గూడ బరివర్తనము గావించు చున్నవారు. ఇది మాత్రము మా భారతసంఘమునకు మహాపకారకర కార్యమని చెప్పకతప్పదు. జాతిమత వైషమ్యములు జనింపకతప్పవు. అవి యన్యోన్య బాధకములు కాక మానవు. వానివలన సంఘనాశనము సంభవింపక తీరదు. కాన నిట్టి పరసంతాపకర కార్యములను గావించుట ప్రాజ్ఞధర్మము కానేరదని మహమ్మదీయాదులకుఁ జెప్పుచున్న వారము.

వార్ధకావస్థయందున్న స్వధర్మరతులగు తలిదండ్రులను జోషించి గతించినవెనుక యుత్తరక్రియలొనర్చి యుత్తమగతులు కలిగించవలసిన పుత్రులను వారినుండి విడదీసి మహమ్మదీయాదులు మతపరివర్తనము గావించినపు డావృద్ధదంపతులు పడెడి దుఃఖములకు మేరయుండునా? బంధువుల సంతాపమునకు మితియుండునా? ఇట్లు పరసంతాపకరకార్యములను గావించి మహమ్మదీయ క్రైస్తవ మతబోధకులు స్వసంఘాభివృద్ధిని గావించితిమని సంతసించుటకంటె నున్నవారితో దృప్తినందియుండుట యుత్కృష్టకార్యము కాదా? ఇంతమాత్రముచే వీరుజాతిమత భేదములను నశింపజేసి మైత్రీకారకైక జాతిమత సంస్థాపనము గావింపగలరని వివేకముగల వారెన్నటికిని విశ్వసింపజాలరు. జాతిమతభేద

ములెన్నటికిని నశించునవికావు. మనము వానిని దగ్గించవలెనని యెంత యత్నించుచుండుచో యవి యంత వృద్ధిజెందుచుండును గాని క్షీణింపవు. ప్రతిమత ప్రవర్తకుడును జగత్తంతయు తనమతములోనే ప్రవేశించి ప్రవర్తించియున్న బాగుపడునని తలంచి ప్రయత్నించి సఫలమనోరథుడుగాక కొందరిని మాత్రమే విడదీసి క్రొత్తమతస్థులను జేసియున్నవాడు. వారామతాభినివేశముతో పోరాడి కొట్టుకొనుచుందురు. ఇది ప్రాజ్ఞులు కావింపదగిన కార్యమా? కాదు.

ఇట్లనిన వెనుక శ్రద్ధానందయతి మదనమోహనమాలవ్య ప్రభృతి హిందూమత నాయకులు పలువురు హిందూమత మహాసభ యనుపేరుతో కాశీనగరమున సమావేశమై శుద్ధిమూమెంటును బయలు వెడలదీసి వేలసంవత్సరముల క్రిందను కొన్నిశతాబ్దముల క్రిందను భారతీయులు కొందరు మహమ్మదీయ క్రైస్తవ మతములలో జేరియున్నారను నెపమపెట్టి వారిని వేలకొలదిగా తీసికొనివచ్చి శుద్ధిజేసి హిందూసంఘమున జేర్చితిమని చెప్పుకొనుచు సంతసించుచుండుటలేదా? అదియెట్లు యుక్తమయ్యెనని మహమ్మదీయులు క్రైస్తవులేగాక మా పాఠకులుగూడ కొందరు ప్రశ్నింపవచ్చును. సమాధానమును సావధానముగ వినుడు. హిందూమత మనునది శ్రుతిస్మృతి సూత్రపురాణేతిహాసాదిప్రమాణ గ్రంథములందెందును జెప్పబడనిసంఘసంస్కారకల్పితమతము. అది భారతీయ మతముకాదు. దానిని వ్యాపింపజేయుటకై సమావేశమైన శ్రద్ధానందమాలవ్యప్రభృతులు వేదశాస్త్ర విహితమతమునకు బరమవిరోధులై యున్నారు. ఏలయన?వారు పిజాతి మతస్థులను స్వజాతి మతములలోనికి బరివర్తనము గావించినామని జెప్పుచున్నారు. ఇది మా యాచారమునకు విరుద్ధము. భారతీయులెన్నడును నాచరించియుండలేదు. జాతిమతపరివర్తనము మాశాస్త్రమునకు బరమవిరుద్ధకార్యము. ఈ విషయమై యాపస్తంబమహర్షి ధర్మసూత్రగ్రంథమున రెండవ ప్రశ్నలో బదునోకండవఖండమున పది పండ్రెండు సూత్రముఖముల నిట్లు చెప్పియున్నవాడు.

ధర్మచర్యయా జఘన్యో వర్ణః పూర్వం పూర్వం వర్ణ మాపద్య తే। జాతిపరివృత్తౌ అధర్మచర్యయా పూర్వోవర్ణో జఘన్యం జఘన్యం వర్ణమాపద్యతే। జాతిపరివృత్తౌ"

ఈ సూత్రములకు హరదత్తాచార్యు డిట్లు వ్యాఖ్యానము గావించి యున్నవాడు.

"ధర్మచర్యయా=స్వధర్మానుష్ఠానేన, జఘన్యోవర్ణః=శూద్రాదిః, పూర్వంపూర్వం వర్ణం=వైశ్యాదిం, ఆపద్యతే=ప్రాప్నోతి, జాతిపరివృత్తౌ-జన్మపరివర్తనే, శూద్రోవైశ్యో జాయతే. తత్రాపిస్వధర్మనిష్ఠః క్షత్రియోజాయతే, తత్రాపిస్వధర్మ పరోబ్రాహ్మణఇతి. ఏవంక్షత్రియ వైశ్యయో రపిద్రష్టవ్యం, పూర్వేణగతం మహాపాతక వ్యతిరిక్తా ధర్మానుష్ఠాన విషయమేతత్, మహాపాతకేషుస్తేనోభిశ స్తఇత్యాదినా నీచ జాతిప్రాప్తేరుక్తత్వాత్॥"

అనగస్వజాతి విహితధర్మానుష్ఠానముచేత శూద్రాదులుతమకు వెనుకదియైన వైశ్యాదిజాతిని నీజన్మమారి మరియొక జన్మవచ్చినపుడు పొందుచున్నారు. అనగ శూద్రుడు వైశ్యుడుగను వైశ్యుడు క్షత్రియుడుగను క్షత్రియుడు బ్రాహ్మణుడుగను మరియొక జన్మయందు జనింతురని ప్రథమసూత్రార్థము. ఇట్లే యధర్మానుష్ఠానమున జన్మాంతరమునందు బ్రాహ్మణుడు క్షత్రియుడుగను క్షత్రియుడు వైశ్యుడుగను వైశ్యుడు శూద్రుడుగను జనింతురని రెండవ సూత్రార్థము. ఇదిసామాన్య పాతకములు కావించినవారికి వచ్చెడిఫలము నిట్లు చెప్పియున్నది. మహాపాతకములు గావించినవారట్లుగాక యొక్కసారిగా నీచజాతియందు జనింతురని భాష్యకర్త తీర్పుజేసి యున్నారు.

ఈచెప్పిన దానింబట్టి యొకజాతి వానిని మరియొక జాతిలోనికి మార్చుట కవకాశములేదని స్పష్టమైనదికదా? అయినది. కాన శ్రద్ధానందమాలవ్య ప్రభృతుల శుద్ధిమూమెంటు శాస్త్రాచార విరుద్ధమగుటంబట్టి శుద్ధిమూమెంటని వివేకముగల వారంగీకరింపక తీరదని తేలినది.

ఇట్లనిన మహమ్మదీయ క్రైస్తవాదులు మన భరతఖండమున వసింపక తప్పదయ్యెను. వారు భారతీయ మతాచారములనెడ పరమ

వైరులై గోవధములు గావించుట దేవాలయములను బడగొట్టుట మత పరివర్తనము గావించుట లోనగు దుష్కార్యములను నిప్పటికిని నేదో యొక దేశమున జరుపుచునే యున్నవారుకదా? అవి సహింపదగిన కార్యములా? సహింపకున్న వైషమ్యములు వృద్ధియై వారును మనమును హింసలపాలు కాక తప్పకున్నది. ఇపుడు భారతజాతిమతమైత్రి యెట్లు సంభవించునని మాపాఠకులు కొందరు శంకింపకపోరు. ఈ విషయమై మేము స్వమత పరమ తాభినివేశనములను దూరముగద్రోలి నిష్పక్షపాతబుద్ధితో గొంత ముచ్చటింపదలంచి యున్నవారము. కాన మాపాఠకులు మాయెడ నన్యథాభావము పొందకుందురుగాత. మనము ప్రతిదినమునను సంధ్యావందనము గావించి చివరను 'గోబ్రాహ్మణేభ్య శ్శుభంభవ'త్తని చెప్పుచున్నారము. ఇట గోబ్రాహ్మణ శబ్దములుపలక్షణములై యున్నవి. అనగ గోశబ్దముచే సకల జంతువులకును బ్రాహ్మణ శబ్దముచే సకల మానవులకును శుభము కలుగవలయునని పై వాక్యముఖమున గోరుచున్నవారమని యర్థము మనమిట్లు సకలలోక క్షేమము గోరుచుండ రాక్షసులు సహజ దౌష్ట్యము కలవారగుటచే వారు నరమాంసభక్షకులై యందు బ్రాహ్మణ మాంసమునెడ వారి కత్యంత ప్రీతితో వర్తింతురను విషయము వినియున్నదేకదా?

ఈ చెప్పిన దానింబట్టి రాక్షసులు బ్రాహ్మణులయెడ సహజ ద్వేషులై జనించియున్నటుల మహమ్మదీయాదులు గోవులయెడ సహజద్వేషులై జనించియున్నవారు. కావుననే వారు వానింజంపి వాని మాంసమును భక్షించుచున్నవారు. రాక్షసులకు నరమాంసమెట్లుభక్షణవిధి ప్రాప్తమైయున్నదో యట్లే మహమ్మదీయులకు గోమాంసభక్షణము వారి విధిప్రాప్తమై యున్నది. ఇట్లైన మహమ్మదీయుల ఖురానును క్రైస్తవుల బైబిలును గోవధ గావించవచ్చునని విధించి యున్నవా? అని ప్రశ్నింతురేమో? సమాధానమేమన? వారి గ్రంథములు గోవధను విధించినవా? వారిగ్రంథుల ననుసరించి వారు నడుచునపుడు వారిని వారివిధికి విరుద్ధముగ నడువవలసినదని బోధించుట మనకుధర్మముకాదు. లేక వారి శాస్త్రవిరుద్ధ కార్యమగునేని వారిలోని సంస్క-

ర్తలే దానిని నివారించుటకు యత్నింపవలెగాని మనము యత్నింపరాదు. యత్నించుట ధర్మవిరుద్ధమే? మనము గోవును పూజింతుము. ఇక దానిని దూషించుటకుగాని, హింసించుటకుగాని, యత్నింతుమా? యత్నింపము. గోవులవలనమన మెన్ని సుఖలాభములను పొందుచున్నవారమో మహమ్మదీయులును వానివలన నన్నిలాభములను పొందుచున్నవారు. కాని వానిని హింసింపక మానరు. ఇక వారిని గోవధము, గోమాంస భక్షణమును మానుడని మనము నిరోధింపనేల? నిరోధించి వైరము సంపాదించుకొని గోరక్షణము చేయలేకపోగా నరహత్యలు గావించుటకు పాల్పడుచున్నవారము. ఇది ధర్మమా? ఇట్లడిగిన గోవధ వేదశాస్త్ర విరుద్ధకార్యముకాదా? దానిని మానిపించుటకు భారతీయులేల ప్రయత్నింపరాదని ప్రశ్నింతురేమో? సమాధానము వినుడు.

మనకు ప్రభుత్వము లేదు. ప్రకృతము భరతఖండమును బరిపాలించు ప్రభుత్వమువారుకూడ మహమ్మదీయులవలెనే గోమాంసభక్షకులై యున్నవారు. వారీవిషయమున మనపక్షమునకు దోడ్పడరు. కాన గోవధనిరోధము ప్రయోజనకారి కానేరదని చాటిచెప్పవచ్చును గదా? మన మీగోవధనుగూర్చిన నిరోధము మానిన యెడ నీవిషయమై వారితో మనకు సంభవించుచున్న కలహము నశించు ననుటకు సంశయమేమి? ఇక దేవాలయముల విషయమై వచ్చుచున్న కలహములను గూర్చి యించుక ముచ్చటించుకొందము. మనము వారిమసీదుల ముందరివీధులలో దేవతోత్సవాదులు కాని యూరేగింపులుగాని గావించునపుడు మంగళవాద్యములను గావించుచున్నారము. కాని యమంగళవాద్యములను గావించుటలేదు. నాంకవారిందులకై యాగ్రహము జెంది దేవాలయములను పడగొట్టుటయే హత్యలు కావించుటకు గూడ వెనుదీయకున్నవారు. వారుగావించుపీర్లపండుగలలో వాయించువాద్యముల మంగళవాద్యములై యున్నవి. ఏలయన? పీర్లన యుద్ధములందు మరణించినవారు. వారిజ్ఞాపకార్థమై కావింపబడునది పీర్లపండుగ. ఆయుత్సవములు మన దేవాలయపు వీధులందు గావించునపుడు మన మేగించుకొనుటలేదు. మనయెడ వారింత క్రూరముగ వర్తించుటకు వా

పరమ తాసహనమును మనమిట్లు శాంతముగా వర్తించుటకు మన పరమతసహనమును ముఖ్యకారణములై యున్నవని చెప్పకొనక తప్పదు. అయిన నీ విషయమై మాకొక్క వెరవు దోచుచున్నది. అది దప్ప భారత జాతి మత మైత్రి సంపాదించుటకు వేరు వెరవులభింపదని చాటి చెప్పవచ్చును. అదేమన?

స్వప్రళయాంతమువరకు భారతీయులెట్లుభరతఖండమున వసింపవలసి యున్నవారలో యట్లే మహమ్మదీయాదులును భరతఖండమున వసింప వలసి యున్న వారు వసించునపు డెవ్వడో యొక మతస్థుకు మరియొక మతస్థునితో బోరాటము గావించిన నది బాధకము కానేరదు కాని నొకజాతితో మరియొక జాతిగాని నొకమతముతో మరియొక మతము గాని పోరాటములకు దిగినయెడ నవి సంఘనాశనమునకు నిధానములు కాకమానవు. అట్టి కలహకారణములను ప్రాజ్ఞులు నాశనముగావింపక తప్పదు. కాన నీ విషయమై మాకుదోచిన వెరవును లోకమునకు నివే దించు చున్నవారము. అదేమన?

మహమ్మదీయులు స్వధర్మాభిమానమును వీడజాలరు. వీడవల సినదని మన ముపదేశింపరాదు. నిరోధింపరాదు. వారుచేయదగినకార్య మొక్కటికలదు. అదేమన? వారేయే గ్రామములందు వసించుచున్న వారో వారాయా గ్రామములలో నుండిలేచి యూరి వెలుపల తురక పల్లియలను పట్టణములను నిర్మించుకొని యందు మసీదులను గట్టుకొని వారి యిష్టమువచ్చినటుల నుత్సవములను జరుపుకొనుటయిప్పటి కార్యము. అచటనేగాక భారతీయులుండు పురములలోగూడ వారుత్స వములను జరుపుకొన వచ్చును. భారతీయులు వారిని నిరోధింపరారు. భారతీయులు తమ యుత్సవములను దమ పురములలోనే గావించుకొం దురుగాని మహమ్మదీయ పురములందుగాని పల్లెలందుగాని యుత్సవ ములు జరుపబోరు. దానంజేసి భారతీయులకును మహమ్మదీయులకును నీ విషయమై గలుగుచున్న కలహము లంతరించి మైత్రిసంభవించు నను టకు సంశయములేదు. ఒకవేళ మానవులు మానవుల తోడనీడలందు వసించుటకు యత్నించుట స్వాభావసిద్ధము కాన నల్పసంఖ్యాకులగు

మహమ్మదీయులు ప్రత్యేక పురములనిర్మించుకొని వసించుటకు సాహసించలేనిచో వారు భారతీయుల పురములలో వసించుచు వారివీధులను గోరీలను మాత్ర మూరివెలుపల నిర్మించుకొనినయెడ నచటి భారతీయుల యుత్సవములు రానేరవు. కాన కలహములులేక ప్రవర్తించుటకవకాశములు కలుగును. దీన భారతీ జాతి మత మైత్రికి భంగము లగు కారణములన్నియు బూర్తిగ నశించును. దానమైత్రి వర్ధిల్లకపోదని మా పాఠకులు గ్రహింపగలరు.

(సశేషము)

---

డాక్టరు గౌరుగారి

## వివాహ విచ్ఛేదశాసన విచ్ఛేదము.

సామ్రాజ్య శాసన సభాసభ్యులగు డాక్టరుగౌరుగారు వివాహ విచ్ఛేద శాసనమును చేయుటకై యొకబిల్లు మూచేసియున్నవారని పత్రికలు ఘోషించుచున్నవి. వివాహవిచ్ఛేద మన నొకరి నొకరికిష్టములేని భార్యాభర్తలు తమ వివాహములను రద్దుచేసికొనుట యని యర్థము. ఇంతియెకాదు వివాహము రద్దుజేసికొని పునర్వివాహము గావించుకొనవచ్చును. కావించుకొనినయెడ వారి మత కుల దాయభాగములు చెడకుండ నుండవలెనని దాని యుద్దేశ్యము. ఈబిల్లు శాసనమైన యెడ జాతిభేదములు మునుముట్ట చచ్చిపోవుననుటకు సంశయము లేదు. గోరుచుట్టుపై రోకటిపోటన్నటుల కులనాశకములగు వివాహ గర్భాధాన వయోనిర్ణయ శాసనములకే కుందుచుండనిపుడు వివాహ విచ్ఛేద శాసనమను మరియొక కులనాశక శాసనముకూడ రానున్నది. దానినికూడ మనము నిరాకరించుట కాందోళనలు గావించవలసి యున్నది. కాన దానిగూర్చి పై పేరనొక విపుల విమర్శనము రచించి ముందు పత్రికను ముద్రించ నిశ్చయించి యున్నవారము.

—పత్రికాధిపతి.

# మహాభాగవత సప్తాహ వార్తా సంగ్రహము.

చ॥ ఇపుడొక వింతఁజెప్పెద మహీజనులార వినుండు! నిర్జరా
ధిపు సభయందు నొందు గణుతింపఁగ నర్హత నొందినట్టి వే
దిపయిన నిల్చి నారద సుధీంద్రుఁడు సోత్సుకుఁడై వచించె ని
ష్కపట కథాళినెల్ల వినగా జెవియొగ్గు సదస్య పాళితోన్॥ ౧

ఉ॥ ఈ పెనుగడ్డ మస్మదవ హేళనముం జరపింపఁ గోరియే
యా పరమేష్ఠియిచ్చె; నిది యుక్కట నన్ దలనెత్తనీక సం
తాపము పాలు సేసెడిని; ధారుణిఁ గొందఱు యోగినామకుల్
నాపసపట్టఁ దాల్తు రిది నారదగడ్డ మటంచుఁ బల్కుచున్॥ ౨

ఉ॥ వారలు పోవుచున్న యపవర్గ పథమ్ములఁ గూర్చి ముందు ముం
దారసి చెప్పువాఁడ నిపుడంతటి వారసఁజెల్లు భక్తులం
గూరిచి పల్కువాఁడఁ దమకున్; వినుడయ్య త్రిలోకియందు సం
చారము నాకు నిత్యమని సభ్యు లెఱింగిన మాటయే కదా॥ 3

మ॥ బహు భార్యాత్వము శాపలబ్ధమయిరాఁ బల్మాఱు క్షోణీశ్వరుల్
సహనం బింతయులేక కొట్టుకొనుచుం జావన్ ధరాదేవి ధూ
ర్వహులౌ రాజులఁ బొందలేమిఁ గలఁగెన్ వర్ణాశ్రమాచారముల్;
మహిమల్ గగ్గెఁ గనిష్ఠ వర్ణులకు; బ్రాహ్మణ్యంబెల్లఁ బాడై చనెన్॥ ౪

మ॥ పరవిద్యల్ పరధర్మముల్ పరమత ప్రస్ఫార సంచారముల్
విరళంబై చనుచున్న యీయెడల నుర్వీదేవతల్ కొంద ఱీ
శ్వర భక్తుల్ తమశక్తి మోక్షమునకై పల్మాఱు పారించి యె
ల్లరకున్ సిద్ధినొసంగు చుండిరిల లీలామూర్తి కాంతాళితోన్॥ ౫

తరల॥ "విడుపు ధర్మ మధర్మమున్; మఱిపెల్చు సత్య మసత్యమున్
విడువు; చిత్తము బుద్ధియున్ వెసవీడు" మన్నత్ర యీవచ
స్సుడిగిపోయి తదీయబుద్ధి యశోధనంబులఁ గూర్పనై
పడఁతి పిండులపాల నిప్పుడు బ్రహ్మరాక్షసి యయ్యెడిన్॥ ౬

చ॥ కలియుగ వృద్ధి; యాయు వధికం బగుచున్నను జూడఁబోము; ని
ర్మలతయు సత్యశీలములు మ్రగ్గిపడి యూపటి పోవుచున్న యీ

కలియుగ మందుఁ బూరుషులు కర్మవశంబునఁ జవ వారి భా
ర్యలు మదిఁబొక్కి పొక్కి యశటాతరియింపఁదలంత్రు సంస్మృతిన్ ॥

సీ॥ తీర్థయాత్రలకు నదీనదంబులఁ జేరు
వారిలోఁ దాముండవలయుమున్న
లలిఁబు రాణంపుఁగా లక్షేప మొనరించు
వారిలోఁ దాముండ వలయు మున్న
హరికథా శ్రవణ సమాసక్తిఁ జేరెడు
వారిలోఁ దాముండ వలయు మున్న
అల్లవేదాంత భాష్యము జెప్పుకొనుచున్న
వారిలోఁ దాముండ వలయు మున్న

తే॥ భక్తసంతతి యొనరించు భజనలందు
గాయకుల సభయందు, యోగప్రవీణ
జన సమూహము నందు విశ్వస్తలెపుడు
మున్న జని రక్తిఁగట్టించు చున్న వారు॥

చ॥ తమతమ నాయకుల్ దొలుతఁ దామును వెన్కఁగ నిట్టిరచ్చలన్
రమణుల జేరి మోక్షపధరమ్యత మెచ్చుచు భూమియందు మో
క్షము గలదంచు వెఱ్ఱిభ్రమ ప్రాంతములన్ జనియింప ధర్మమా
ర్గమునకు దూరమయ్యెదరు రక్కసి మైదునరాండ్రు కొందఱున్ ॥

మ॥ యతియో మాంత్రికుఁడో విరాగియో యెవండైనన్ సరే గ్రామసం
స్థితుఁడై యుండినఁజాలు; వానికులమున్ శీలంబు జింతింపరా
దతివల్ కొందఱు రోగమంచు మది దయ్యంబంచు ఖేదంబునం
ఖతులంబుత్తుగు వారితీర్థములొగిం బానంబుఁ గావింపఁగన్ ॥ ౧౦

ఆ॥ క్రమముతోడ నట్టిఘనుని పాదములు
సేవింపఁ జెంతఁజేరి వీక్షణముల
వారిపైనఁ బఱపి పడఁద్రోసి నైతురు
పాపరూప మయిన కూపమందు॥ ౧౧

ఆ॥ ఇట్టి యువిదమిన్న లిట్టి నాయకులును
గలసి చేసినట్టి లలితకృతులు

పెక్కుగలవు వాని వివరింతు వరుసతో
వినుడు విబుధులార వీనులలర! ౧౨

క॥ ఒకనాడు నే విజయవా
టికఁగల హరిహరుల దగు గుడికేఁగితి ను
త్సుకతఁ భగవంతుఁ జూడఁగ
నకటా జనసంఘ మెంతయుని వచియింతున్! ౧౩

తే॥ ఇసుకవైచిన రాల నస్లెడములేక
యావరణ మెల్లనిండి మహాజనాళి
నన్నులోనికిఁ జొరనీయకున్న వెలిని
నిలిచితిసి జూడ్కి సందుల నిక్కఁజేసి! ౧౪

సీ॥ అల యరుంధతి యశంబు బదుగంటద్రొక్కఁగా
గాలెత్తఁ గలిగిన శీలవతులు
నల యనసూయా తపోభి రామత్వంబు
నిరసింపఁ గలయట్టి నెలఁతమిన్న
లా చంద్రమతినైన నలయింపఁ గల్గెడు
నలఘు పాతివ్రత్య లలిత మతులు
లల లక్ష్మినైనను నిలువరింపఁ గలట్టి
యఖిలోక సుందరులైన చెలువ

తే॥ లొకట నొడులందు బిడ్డల నునిచికొనుచు
జెక్కనిమురుచుఁ జెంతను చేరియున్న
వారితో ముచ్చటల నాడువారు గలరు
విబుధులార! సువాసినీ వితతులచట ౧౫

సీ॥ అల రాజయోగ సారామృత పాన
ప్రమత్తలై వెలసిన మహిత మతులు
ధరను బ్రహ్మంగారి తత్త్వసుధారసం
బొంట జీర్ణించిన యువిదమిన్న
లల వేమయోగీంద్రు లలిత పద్యమ్ముల
నెమరువైచిన యట్టి నెఃతమిన్న

లలస సిద్ధప్రతత్త్వామృత పానంబు
మదికెక్కఁ జొక్కిన మగువమిన్న

తే॥ లచటముందుగఁ గూర్చుండి యలసి కునికి
బాలకుల రోదనములకుఁ బండ్లుకొఱికి
సిశ్చలైకాంతసేవచే నెగడుచున్న
యట్టి విశ్వాస్తులను గంటి నట్టిచోట॥ ౧౩.

సీ॥ వచ్చిన యతిథి యెవ్వండైన నతనికి
నాతిథ్య మిచ్చెడు నట్టివారు
పాపపుణ్య వివేకపరిపాటి ధర్మమా
పథముఁ ద్రొక్కి చరించు భవ్యమతులు
సాంగవేదత్రయీ సంపదచే బ్రహ్మతేజంబు
నెలుఁగొందు దృఢమనస్కు
లగ్నిహోత్రాది కార్యము లంతరాయ
రాహిత్యమ్ముగా జేయు సత్యవాక్కు

తే॥ లసదృశంబగు తత్త్వంబు నరయఁదలచి
శ్రమలకయినను వెనుదీయ జాలక చట
సరస పద్మాసనోపవేశంబుగాఁగ
నుండి వినుచున్న విప్రుల నొకటఁగంటి॥ ౧౪

(సశేషము.)

---

శ్రీ

# శ్రుతిధర్మసంజీవని

## అనునీమాసపత్రిక

శ్రు తిస్మృతిశిష్టాచార ప్రమాణముల ననుసరించును.

తి తీర్షులకు సంతరణోపాయములను దెలుపును.

ధ ర్మాధర్మవిధర్మములను వివేకించును.

శ్రీర్మ మభూయాత్తనువారలకు శ్రీలనొసంగును.

సం ఘసంస్కర్తల దుర్వాదములనిరసించును.

జీ వన్ముక్తిపదసోపానములనుజూపును.

వ ర్ణాశ్రమ ధర్మతత్పరుల నాశ్రయించును.

ని త్య సత్య హితమితవాదముల వినిపించును.

## చందావివరము

| | | |
|---|---|---|
| రాజపోషకులకు | సం॥ ౧ కి | రు 10-0-0 |
| ప్రధానపోషకులకు | ,, | రు 4-0-0 |
| అనుపోషకులకు | ,, | 3-0-0 |
| చందాదారులకు | ,, | 2-0-0 |
| ,, | ఆరుమాసములకు | 1-4-0 |
| | విడిపత్రిక | 0-3-0 |

Regd. No. M. 1480 చందా సం॥రు. 2.

శ్రీ

శ్రీ బాలాత్రిపురసుందర్యైనమః

"యతో ధర్మస్తతో జయః। సత్యమేవజయతే నానృతమ్"

# శ్రుతిధర్మసంజీవని

వర్ణాశ్రమ ధర్మపక్షమున వాదించు మాసపత్రిక.

"ధర్మ ఏవ హతో హంతి ధర్మో రక్షతి రక్షితః"

శివపురపు వీరభద్రపాకయాజి పత్రికాధిపతి



| సంపుటము. | విభవాషాఢ శు ౨ ఆదివారము. | సంచిక. |
| --- | --- | --- |
| ౧ | జూన్-1928. | ౬ |



## విషయసూచిక


1 మహాభాగవత సప్తాహ వార్తా సంగ్రహము — గార్గేయశర్మ

2 భారత జాతి మత మైత్రి — పత్రికాధిపతి

3 కలగూరగంప — మండ చినవెంకయ్య

4 గురుకులాశ్రమము — శ, వే, శ్రీరామశాస్త్రి

5 శ్రీయుత డాక్టరుగారి శాసన శాసనము — పత్రికాధిపతి

6 విజయవాడ విప్రవిజయము — ,,



బెజవాడ:

శ్రుతిధర్మసంజీవనీ ముద్రాక్షరశాలయందు

ముద్రింపఁబడి ప్రకటింపఁబడియె.

1928.

శ్రీ

శ్రీ బాలాత్రిపురసుందర్యైనమః

"యతోధర్మస్తతోజయః। సత్యమేవజయతేనానృతమ్"

# శ్రుతిధర్మసంజీవని

వర్ణాశ్రమ ధర్మపక్షమున వాదించు మాసపత్రిక.

"ధర్మఏవహతో హంతి ధర్మోరక్షతి రక్షితః"

శివపురము వీరభద్రపాకయాజి పత్రికాధిపతి

| సాపుటము. | విభవ ఆషాఢ శు ౭ ఆదివారము. | సంచిక. |
|---|---|---|
| ౧ | జూన్-1928. | ౬ |

## మహాభాగవత సప్తాహ వార్తా సంగ్రహము.

(గతసంచికానుబంధము.)

సీ॥ ఉదయ మజ్జనములో నూరెల్లఁ దిరిగి యి
    మ్మగను నక్షయపాత్ర మోసి మోసి
చలిది యన్నముఁదిని స్మార్త మంత్రములతో
    నాబ్దిక భోక్తృత్వ మాచరించి
కనకదుర్గా క్షేత్రమున నదీజలముల
    నిలిచి నీర్కాసులు నెఱయలాగి
ఏ దెసం బ్రేతంబు లేఁగుచున్న వాకోయ
    టంచు నల్ దిక్కుల నాలకించి
ఆ॥ ముక్తిఁగోరు భూవిబుధులు పెక్కండ్రు ని
    క్కముగ భక్తివివశ గాఢచిత్తు
లగుచుఁ బొడుముకాయ మఁలాడిఁచు కొనుచుండి
    వినుచు నున్నవారు వీను లలర॥ ౧౮

ఉ॥ అట్టి సభాస్థలంబున మహావిభవంబగు నున్నతాసనం
బట్టి యలంకరించి తనయంద సదస్యుల చూడ్కి పాఱఁగా
బిట్టుగ నేదియో చదివి 'ఫెళ్ళున' నర్థముఁ జెప్పుచున్నవాఁ
డిట్టలమైన శౌర్యము నటించుచు భూవిబుధుం డొకం డటన్॥ ౧౯

క॥ అది యేమి చదువురా? యీ
య్యది యేమర్థంబురా? మహాగ్రంథం బ
య్యది యేమిరా? యటంచును
మది గుఱరక యడిగినాఁడ మానవు నొకనిన్॥ ౨౦

చ॥ "అఱతు వెవండ వీవు? చనుమావల" కంచు నతండు కన్నులు
తెఱుపు ఘటింపఁ బల్కె; "నదియెయ్యది చెప్పఁగదోయి" యంచు న
క్కఱ వచియించి నేనువినఁగా "నది భాగవతం" బటంచు న
న్నరుఁడు జవా బొసంగెను ఘనంబగు పీడపుముద్ద నొటిత్రోన్॥ ౨౧

క॥ శివశివ! నారాయణ! మృత్యు
వెవని కాసన్నమయ్యె నొకో శ్రీ భా
గవతము పఠింపఁబడు నని
తిరిరి మఱిని జర్చ చేసిరిన్ వివిధముగన్॥ ౨౨

ఆ॥ మృత్యు వెల్లవారి మ్రింగ వెంటాడు
చుండు ననుచు శంకరుండు పలికె
నస్థిరంబు లయిన నక్కట తనువులు
ముక్తి తెరువుసూడఁ బోలకున్న॥ ౨౩

క॥ నారాయణచరణద్వయ
నీరేజంబులకుఁ జూడ్కి నిగిడించిన సం
సారం బసారంబై కడు
దూరముగన్ విడువఁబడదె దుఃఖమ్ములతోన్॥ ౨౪

ఉ॥ కావున నెల్లవారు వినఁగాఁ దగు భాగవత ప్రబంధమున్
నావిరి మైపయట్టి యపవర్గముఁ జూఱఁగొనంగ నెల్లరున్
శ్రీవిభవంబునం గడకసేయుట లెస్స; మహాత్ములెల్లఁ దా
వింవిధి నిట్టి సత్కృతుల కింతటి యూఁతనొసఁగ నొప్పదే॥ ౨౫

క॥ శుకయోగి పరీక్షిద్విభునకుఁ
జెప్పిన భాగవతము నగుఁ డొకఁడు సము
త్సుకుఁడై జనసంఘమునకుఁ
బ్రకటంబుగఁ జెప్పువాఁడె భావభరితుఁడై॥ ౨౨

ఉ॥ ఏఁడు దినంబులందె వచియించెను భాగవతంబు శ్రీ శుకుం
డేఁడులు పట్టె దానిఁ దెనిఁగింపఁగఁ బోతన; యొక్క పద్యముం
జాడి తదర్థబోధమును బట్టఁగ నెంతయొ సేపు పట్టునే?
యేఁడుదినంబులందు నెటులీతఁడు పూర్ణ మొనర్చు గ్రంథముల్॥ ౨౭

ఉ॥ భూతమయుండు శ్రీశుకుఁడు భూజనపుణ్యవశంబుచేత వి
ఖ్యాతగృహస్థరూపమును గైకొనివచ్చెనొ కేశవుండు ల
క్ష్మీతరుణీధవుండు తన శేషుని బుచ్చెనొ కాకయున్న నీ
రీతి మనుష్యమాత్రుఁ డగరే యిట భాగవతంబుఁ జెప్పునే? ౨౮

ఉ॥ దానిక దొకింటెసం దచట దూఱఁగ; నట్టి మహానుభావు వా
క్సరసత వీనుదోయి నధికంబుగఁ జేర్పుదమన నందు న
ల్లరి యొనరింత్రు బాలురు బలారె! యిఁకేమి యొనర్చువాఁడ ని
త్తరుణము దాటెనేనియు వృథాయగు నిన్నియుమట్పరిశ్రమల్॥ ౨౯

మ॥ బలిమిం బోవుదమన్న వృద్ధత నొడల్ వట్టెల్ విడాబో; రసం
బులకుం దావగునట్టి భాగవతముం బోనాడ నేనం చటుం
దలఁపక వీనులఁదాకెఁ బద్య మొకఁ డంతస్తోషసంపాదినై
యలినీలాలకఁ బూర్ణచంద్రముఖ నేణాక్షి న్నటుం చమ్మెడన్॥ ౩౦

క॥ సరసిజనయనుని యన్నవ
గరువముఁ జక్కదనంబుఁ గాంచిన జనులే
స్తైటిఁ బంచబాణమోహన
శరహతులగు టౌను నర్థసందర్భమగున్॥ ౩౧

చ॥ పోతనమంత్రికల్పనకు భూజను లబ్బుర మందుచుండ్రు మీ
రాతటి నట్టి రచ్చఁగను టద్దిర సంభవ మయ్యెనేని యా
శ్రోతుల వర్ణనంబులకుఁ జాలఁగ మెచ్చెసివారలౌ బళీ
యాతని వర్ణనాగరిమ మద్భుత మొందును జర్చచేసినన్॥ ౩౨

చ॥ అతఁడు రసస్వరూపుఁ; డతఁ డద్భుతవాక్పటిమానవద్యుఁ; డా
దృతియుతుఁ డెల్ల సభ్యులకుఁ దృప్తియొలర్పఁగఁ బల్కుచున్న వా
క్తతిఁ బొగడంగ బ్రహ్మకును ధైర్యము చాల దటన్న నేను వి
స్తృతమగు గడ్డ మీదుచుచును జెప్పఁగఁజాలుదు నేవచింపుడీ॥ 33

తే॥ అతఁడు శృంగారరసమున యందుఁగలిపి
యుపనిష ద్వచనామృత మొసఁగఁగలఁడు
ఉపనిషద్వచనామృతయుక్తిఁ జేసి
కడఁక శృంగారమున కలంకార మొసఁగు॥ 34

క॥ శృంగారము వేదాంతము
రంగా రెడు నతని వచనరమ్యత సభ మె
చ్చంగల యద్భుతనిలయము
పొందితి మది నతనిశక్తి మూర్తులఁ గనుచున్॥ 35

ఉ॥ వైదికకర్మముల్ విడువవచ్చు; మతంబు విడఁగరాదు; సం
పాదనఁ జేయవచ్చు; గరిమంబున మోక్షము వీడరాదు; ఎం
దేది లభించినం గొనఁగ నేలగు; నేడుపు మానరా; దహా
యీదివసంబులందు సుఖమేకద! భూస్థలి నెందుఁ జూదిరే॥ 36

తే॥ సన్న్యసించి వేదాంతపు సరణిఁ గనిన
వారు పెక్కండ్రు బ్రాహ్మణ ప్రవరులుండ్రు
గేస్తు లుపనిషద్వచనముల్ శాస్త్రిచేయ
యతులు గృహధర్మముల జోలికరుగఁ జనదె॥ 37

ఉ॥ ఆశ్రమసుకరత్వము మహాఫల మీ కలివేళయందు; జి
త్తశ్రమ మించుకైన సుపథంబునఁ బోవకయుండఁ బూరుషుల్
విశ్రమ మొందుచుండఁ దమవీక్షణయుగ్మములన్ యతీంద్ర పా
దాశ్రయము న్బొనర్తురుగదా కమలాస్యలు కొంద ఱిద్ధరన్॥ 38

ఉ॥ నాటిపురాణ గోష్ఠిఁగల నవ్యతఁ జెప్పి ముగించెదన్, వచో
ధాటికిఁ దోడు పద్దెములు దద్దయుఁ దాను బఠించుచుండి నం
శాటవ మెంతయుం గలిగి భాసుర మయ్యెడుఁగాక; సొంతపు
న్మాటలు మాటఁగట్టితెగునా యట గ్రంథముఁ బూర్తిసేయుటల్॥ 3౯

మత్తకోకిల॥ ఈహలన్ విడనాడకుండిన నింద్రియంబుల ముంచు వ్యా
మోహముల్ విరియి పకుండిన ముక్తిగల్గుటయందు సం
దేహమే యగుఁగాన నిట్టులు దివ్యభాగవతంపు స
ప్తాహముల్ పదివేలు సేసిననైన సాన్కృతిపీను నే॥ ౮౦

ఉ॥ యోగ్యత నెందున్ జనకుశుద్ధి మహాత్ములు గల్గియుండిన
భాగ్యముగాదె! యట్టి నరపాలు రెకాదు ధరాసురాళిలో
మృగ్యతనున్న వా రనిన మేలుగ నింద జేటుల్ పురాణవై
రాగ్యము నభ్యసింప బళి రాజతనం బొనరింత్రె భూస్థలిన్॥ ౮౧

సీ॥ వినిన యుపన్యాస విషయముల్ మదియందు
జీర్ణింప నలవాటు సేసికొనిన
వినిన యర్థములోని విపుల సారాంశంబు
చొప్పున నడచుట కొప్పికొనిన
నాచరించుటయందు నంతరాయము లెన్ని
వచ్చిన్ మానని పట్టుఁగనినఁ
దమపోక లవి జగత్త్రితయ శివంకరములై
ధర్మ్యంబులైయుండఁ దలఁచికొనినఁ

తే॥ బండితుని చేతులం బెట్టుబహుమతు లవి
సార్థకంబులై యుంట నిస్సంశయంబు
పిలుగబాలుల కలవడ్డ విధమయైన
లేనిపోని పరిశ్రమ లేతనిజము॥ ౮౨

# భారత జాతి మత మైత్రి.

(గత సంచికానుబంధము.)

ఇంతవరకు భరతఖండమున వసించు మానవ సంఘములలో భారతసంఘమునకు నితర మహమ్మదీయ క్రైస్తవాది సంఘములతో మైత్రిసంపాదించుటకు దగిన వెరవులను మీరుపదేశించి యున్నవారు. అవి యుక్తియుక్తములును శాస్త్రవిహితములును సంఘక్షేమకరములును నైయున్నవనుటకు సంశయములేదు. కాని భారతసంఘమున మరల బ్రాహ్మణాది జాతిభేదము లనేకములును శైవవైష్ణవాది మతభేదములు పెక్కులు జనించియుండి యవి నిరంతర కలహకారణములై భారత సంఘక్షీణతకు హేతుభూతములగుచున్నవి. ఈయరిష్టములు తొలగి భారతసంఘము సుఖముతో మనుటకు వెరవు కలదాయని యిక మా పాఠకులు ప్రశ్నింపవలయుచు. సమాధానము చెప్పెదము. సావధానముగ వినుడు.

భారతసంఘమున ననేక జాతులును మతములును గలవని మేమెఱుంగుదుము. దాని కన్యోన్యమైత్రియు సన్నగిలియున్నదని మే మెరిగి యున్నవారమే. కాని యింతులకు గారణములు మనసోదరులు తలంచినటులు జాతి మత భేదములు కావు. కారణము లేమన? కలికాలమును, కలినాశ్రయించి రక్కసులు సకల జాతులయందును జనించుటయు నీదుదార్థ కలహకారణములై యున్నవి. అందుచేతనే కలివశంవదులైన కన్మబాలురు ప్రభృతులు కొందరు తమజాతులు నికృష్టములని తలంచి యుత్కృష్టజాతీయులము కావలయునని యందులకై జన్నిదములు తగిలించుకొనుట లోనగు నెన్నియో యకార్యకార్యములకు దలపడుచున్నవారు. ఇదిమాత్రము కడుంగడు విచారకరమగు కార్యమే. సంశయములేదు. కాని బ్రాహ్మణజాతి క్షత్రియాదిజాతులు కావలయునని కాని శూద్రాదిజాతులు బ్రాహ్మణాద్యుత్కృష్టజాతులు కావలెనని గాని ప్రయత్నించియుండలేదు. ప్రయత్నించి విఫలమైనపుడు గదా ద్వేషము జనించుట కవకాశము సంభవించును. అదిలేదు. భారత ప్రజలలో నెన్ని జాతిభేదములుండినను వారన్నదమ్ముల క్రియ నన్యోన్యముతోడనె ప్రవర్తించుచున్నవారు. కాన జాతిభేదములు వైషమ్యము

నకు కారణము లనుమాట విశ్వసనీయము కానేరదు. మతభేదములు మాత్రము సంఘమునందుండవలసిన మైత్రికి గొంతభంగము గలిగించుచున్నవని యొప్పుకొనక తప్పదు. అందులకు గారణము భారతసంఘమున నిపుడు స్వమత శాస్త్రాధ్యయనము సన్నగిల్లుటయు వాని నధ్యయనముగావించు కొలది పండితులలో విమర్శజ్ఞానము క్షీణించుటయునని మాపాఠకులు గ్రహింపవలసి యున్నది. శాస్త్రములు మత పరివర్తనమున కవకాశమిచ్చి యున్నది. మతమన నిష్టము. నిశ్శ్రేయస సాధనభూతములగు వేదోక్త మతములలో నెది యెవ్వరికిష్టమగునో వారామతములోనికి మారుచువచ్చిరి. ఇది శాస్త్రాచార ప్రాప్తమై వచ్చుచున్న విషయము. కాన దోషముకాదు. ఈమత పరివర్తనమునకై మనమన్యోన్యము ద్వేషించి కలహించుకొనుట యనుచితకార్యమే. సంశయములేదు. మనలో జాతి మతభేదములెన్ని యున్నను ప్రతి భారతీయుడును. భారతీయుడే యననేల ప్రతి మానవుడును క్రింది శ్రుతిచెప్పినటుల ప్రవర్తించిన యెడ భారతసంఘము నందేకాదు మానవ సంఘమునందంతటను మైత్రినెలకొల్పి తన్మూలమున నభివృద్ధి హేతుభూతములగు కార్యములన్నిటిని గావించి తొల్లింటివలె హిరణ్యవర్చస్వితను మరల సంపాదించుకొని సుఖించ గలుగుదురనుటకు సంశయములేదు. అదే మన వినుడు.

"శునమహగ్ం హిరణ్యస్య పితురివ నామాగ్రభైషం। తంమా హిరణ్యవర్చసం। పూరుషుప్రియంకురు।" ఇది మన్త్రభాష్యద్వితీయ ప్రపాఠకము నందలి యష్టమ ఖండములోని మూడవ మంత్రము. ఇందుకు హరదత్తాచార్యులవారిట్లు వ్యాఖ్యానము గావించియున్నవారు.

"శునమితిసుఖనామ శునం హిరణ్యస్యనామ అహంఅగ్రభైషం అగ్రహీషం। పితురివ యథాపితుర్నామ పుత్రఃపునః పునఃకీర్తియతి, తద్వత్, తంత్వన్నామ కీర్తయంతం మా మాంహిరణ్యవర్చసం హిరణ్యవద్దీప్తంకురు, హేహిరణ్య కించపూరుషు బహుషు షష్ఠ్యర్థేసప్తమీ। బహూనాం మాం ప్రియంకురు। యథాహంసర్వేషాం ప్రియస్స్యాం తథాకురు।"

అనగ శునమన సుఖమునకుపేరు, హిరణ్యుడను దేవతయొక్క

సుఖకరమగు నామమును దంద్రినామమును బుద్ధుడు పలుసారులు కీర్తించినటుల ఓ హిరణ్యుడా నీనామమును కీర్తించుచున్న నన్ను బంగారువలె ప్రకాశించు వానినిగ జేయుము. ఇంతియెకాదు. ఓహిరణ్యుడా పురుషుల కెల్లరకును నేనెట్లు ప్రియుడనైయుందునో యట్లుచేయుమని ప్రతిమానవుడు కోరవలసినదిగా శ్రుతిపై మంత్రముఖమున బోధించియున్నది. ఇంతియెకాదు. పై మంత్రార్థమునే మరల శ్రుతి క్రింది మంత్రముఖమున విపులీకరించి యున్నది. అదేమన?

"ప్రియం మా దేవేషుకురు। ప్రియం మా బ్రహ్మణేషుకురు। ప్రియం విశ్యేషు శూద్రేషు ప్రియుగ్ం రాజసుమాకురు।"

ఈశ్రుతికి హరదత్తాచార్యులిట్లు వ్యాఖ్యానము గావించియున్నారు.

"సర్వత్ర షష్ఠ్యర్థేసప్తమీ। బ్రహ్మణే బ్రాహ్మణే। బ్రాహ్మణశబ్దస్య ఛాందసం హ్రస్వత్వం। జాతావేకవచనం। విశ్యేషు వైశ్యేషు। ఛాందసం హ్రస్వత్వం। రాజసుక్షత్రియేషు। హేహిరణ్యా త్వత్ప్రసాదాత్ స్తేజ్య హోమాత్ దేవాదీనామేషాం ప్రియస్యామిత్యర్థః।"

పై మంత్రమునందున్న సప్తమ్యంత పదములన్నియు షష్ఠ్యర్థమునందు వచ్చియున్నవి. బ్రాహ్మణశబ్దము జాత్యర్థమునందే కవచనము కలిగియున్నది. కాన బ్రాహ్మణులకును వైశ్యులకును క్షత్రియులకును వేయేల సకల దేవతలకును నన్ను ప్రియునిగా జేయుమని హిరణ్యుడను దేవతను నారాధించవలసినదిగా శ్రుతి చెప్పియున్నది. బ్రాహ్మణుడు బ్రాహ్మణ క్షత్రియాదులకు ప్రియుడు కావలెనని కోరి హిరణ్య దేవతను యజించినట్లే క్షత్రియాదులును సర్వప్రియులము గావలయునని హిరణ్యుని యజించవలెను. ఇట్లు సకల జాతీయులము నన్యోన్యప్రియులము కావలెనని కోరి దేవతల నారాధించెదమేని మన మన్యోన్య మైత్రిని సంపాదించుకొని జీవించుటకు సంశయముండునా? ఉండదు. కాన సుఖాభివృద్ధులను గోరు భారతీయులెల్లరును నింతయేల భరతఖండ వాసులెల్లరును నన్యోన్య ప్రియులమై భారత జాతి మహామైత్రిని సంపాదించుకొని మనుటకు యత్నింతుముగాక. ఇందులకు భగవంతుడును ముప్పదిమూడుకోట్ల దేవతలును దోడ్పడుదురుగాక. సర్వే జనాస్సుఖినోభవంతు.

# కలగూరగంప.

(3వ సంచిక 80వ పుట శేషము.)

5. ఢి. పెద్దపెద్ద సంస్థానాధీశులేగాక సామాన్యజమీందారు లగు గోదావరిజిల్లా పోలవరం యెస్టేటు జమీందారులును దక్షిణ కోట్లవల్లూరు యెస్టేటు జమీందార్లులును ఆదాయముకు మించిన ఖర్చుచేసి దివాలా (ఇన్ సాల్వెంటు) పిటీషనుదాఖలుచేసి స్వాంతజమీ నులోని పన్నులిచ్చెడి ప్రజలకు నీటిపారుదల సౌకర్యములు బాటల సౌకర్యములయందశ్రద్ధవహించుట.

ఈ. పై జమీందారులేగాక గుంటూరుజిల్లా మల్లెలవారివంటి గొప్పగొప్ప భూస్వాములు సైతము శక్తికి (ఆదాయముకు) మించిన ఖర్చుచేశి సంపదనుగోల్పోయి ధనసంపాదనకొరకు శాసనవిరుద్ధము లగు కరెన్సీమిషనులు యేర్పాటుచేసి ద్రవ్యార్జనలేకపోగా కారాగా రముల నలంకరించుట.

6. మాగుంటూరు మునిసిపాల్టివంటి సెల్ఫు గవర్నమెంటుపాల నలో స్వరాజ్యముగోరు ప్రసిడెంటులును మెంబరులును స్వరాజ్య స్థానము లలంకరించి విదేశవస్తు బహిష్కారముగోరుచు పూర్వము మునిసిపాల్టిలోని చెత్త మున్నగు దానిని స్వదేశీ యెద్దుదున్నల బండ్ల ద్వారా తీసివేయబడుచుండగా వానినిదొలగించి విదేశీ మోటారులారీల నుపయోగించుట లోకల్ ఫండు మునిసిపాల్టిరోడ్లను రోలింగుచేయు స్వదేశీ బీదకూలీలను తొలగించి విదేశీ స్టీంరోలర్ల నుపయోగించుట.

7. ఎ. కృష్ణా గుంటూరుజిల్లా బోర్డులకు యెన్నికహక్కును యెక్స్పరిమెంటుగా గవర్నమెంటు వారొసంగగా కృష్ణాజిల్లా యెన్నిక లలో అయ్యదేవర మిర్జాపురములు స్వరాజ్యజస్టిస్ భేదములతో పోరాడి పోరాడి తుదకు జిల్లాకలెక్టరు గారి కా ప్రెసిడెంటుహక్కు స్వాధీనముజేసి గ్రహించి మిటకరించి మిన్నకుండుట.

బి. కృష్ణాజిల్లా ప్రెసిడెంటుపదవి కొరకైనవివాదలు బ్రాహ్మ ణబ్రాహ్మణేతర సంబంధ మనుకొనుచుండ మా గుంటూరుజిల్లా ప్రెసి డెంటుపదవికొరకు బ్రాహ్మణేతరులేయగు నాయుడు చౌదరిగార్లు పోటీపడి యేతత్పదవిని కోర్టుద్వారా యిన్ జంక్షన్ చేయించి తుదకు పార్టీయెన్నిక నెరవేర్చుట.

(ఇట్లనే రాజకీయరంగములో ప్రజాప్రతినిధులయిన శాసన సభ్యులు ప్రజలకు ముఖ్యకష్ట నష్టకరములగు అపరాధపుశిస్తులు అధిక పన్నుల విషయతీర్మానములలో నశ్రద్ధవహించి సంఘానర్థకరములగు వివాహ గర్భాధాన వయోనిర్ణయాది దుష్టశాసనములలోను హిందూ దేవాలయ కూప సత్రాది ధర్మసంస్థలలో మామూలులేని పంచములను అస్పృశ్యతా నివారణమనుమిషతో విచ్చలవిడిగా ప్రవేశింపజేయు శాసనములలోను పిలువని పేరంటముగా జోక్యము కల్పించుకొని రాజకీయములో భిన్నాభిప్రాయులగు స్వరాజ్యవాద-జస్టీస్ వాద-అతివాద- మితవాదాదులందరేకీభవించి వర్ణసంకరమునకు తోడ్పడుట.)

8. స్వరాజ్యమన తనయొక్క రాజ్యము. ప్రతివానికి జెందును. తనపూర్వు లార్జించియిచ్చిన భూధనములపైవచ్చు ఆదాయముతోని మూలధనము ఆత్మావైపుత్రనామాసి యను న్యాయముమేరకు తన పుత్రాది వారసులకిచ్చుట మన భారతి సాంప్రదాయము. అట్లనే స్వార్జితము మిగిలినచో నివ్వదగును.

అంతేగాని భారతీయులకు డొమినియన్-కలోనియల్-ప్రభుత్వము సమిష్టిస్వాతంత్ర్య మెప్పుడును లేదు. ఔరంగజేబువంటి మహమ్మదీయ చక్రవర్తిగాని, వేనునివంటి హిందూరాజులుగాని, బాధించునపుడు వంగియుండుట, అక్బరు, పృథు చక్రవర్తులవంటివారి సత్పరిపాలనలో సుఖమనుభవించుట కలవాటుపడినవారు భారతీయప్రజలు. ఇదిగాక భారతదేశమెపుడును వర్ణాశ్రమ ధర్మబద్ధమై పాలింపబడుచుండెను. ఇపుడును పూర్వపు బ్రాహ్మణాదులు జాతినియమములు వదలినను విశ్వ(కంసల) బ్రాహ్మణులు, దేవ(జాండ్ర) బ్రాహ్మణులును, కమ్మ క్షత్రియులు, కాపుక్షత్రియులు, గొల్ల(యాదవ) క్షత్రియులు, గౌడ (గమళ్ల) క్షత్రియులు, పల్లె(అగ్నికుల) క్షత్రియులు మొదలగు వారెందరో బయలుదేరి వర్ణాశ్రమములు నిలువబెట్టుచుండిరిగాన వర్ణాశ్రమ ధర్మరహితమై పాశ్చాత్య దేశాచారమగు కలోనియల్ డొమినియన్ ప్రభుత్వమెన్నటికిని మన భారతదేశమునకు లభించనేరదని ముమ్మాటికినమ్ముము. మండ చినవెంకయ్య, ప్రాక్టికల్ వాది

# గురుకులాశ్రమము, బెజవాడ.

శ్లో॥ అనర్థకాధీతివశా దతీవహా నిర్భవే దిత్యుదితం వదంత్యా।
సమస్తవిద్యాస్వపి సార్థశిక్షా దాతుం ప్రవృత్తో విజయేశ్వరోత్ర॥

కం॥ అర్థము నెఱుగని చదువు ల
నర్థక మేయనుచుఁ బెద్దలనుటకు విని జల్
సార్థకముగ నేశిక్షలు
పార్థేశ్వరుఁ డిచట దయతోఁ బ్రబలఁగఁ జేసెఁ॥

కృష్ణవేణి తాలూకు స్నానాల ఘట్టముకు చాలాచేరువలో నున్న ఫల్గునక్షేత్ర మనే విజయేశ్వరమం దీయాశ్రమ ముద్ధృతమైనది. అది త్రిలింగశాఖ 20 జిల్లాలకు సంబంధించినదియే. వేదముకుఁగాని శ్రౌతముకుగాని స్మార్తముకుఁగాని ఆగమముకుఁగాని సార్థకశిక్ష జెప్పుటచే దీనికి జన్మవ్రతము. సంస్కృతమందు సంభాషణ మందరికి వ్యాపించుటకై యీకల్పన మతిశ్రమముమందుండు చాతుర్వర్ణ్యాలకు సనాతనధర్మరీతిగ సంస్కృత శిక్షదొరుకును. రైలునెక్కరాదు. కొళాయినీరు త్రాగరాదు అనే యీలాగంటి చండశిక్షల దీక్షగాని లేక జాతిధర్మవివక్ష లేకుండా నందరుకలసి భుజించవచ్చును. అటులనే వివాహము లాడవచ్చును అనే యీలాగంటి ప్రచండకష్టుల యాలంబనగాని యిందేమాత్ర మనరాదు. ఇం తేల? నాస్తిక భావగర్భితముగ సునీతిబాహ్యమైన శిక్షయిచ్చుట యెంతమాత్ర ముండనేరదు.

ప్రస్తుతం జిల్లా 1కి యిద్దరికి మాత్రమే అన్నపానాది సదుపాయములు. అనేక కారణాలచే ప్రవేశపరీక్ష చదువువారికి (3 సంవత్సరములు) పై సదుపాయములు తీసివేయఁబడినవి. స్వస్థలీయులుకాని పరస్థలీయులుకాని యీ యాశ్రమ నిబంధనల ననుసరించియే తీరవలెను సాంఘిక ప్రణాళికగనే యున్నది.

"అవ్యవస్థిత చిత్తానాం ప్రసాదోపి భయంకరః" అనే భారత నీతినిబట్టి ప్రభుత్వమువారి రికగ్నేషన్నుగాని వరి గ్రాంటులాభమును గాని యంతగా లక్ష్యపరుచుకోలేదు.

జబాబు చీటిలకే ప్రత్యుత్తరములు.

ఇట్లు

౧ పండితభూషణం శ, వే, శ్రీరామశాస్త్రీ,

యా జమాన్యందార్

౨ కంట్రాక్టరు చోడవరపు దేవరాజు,

ఖజానాదార్

3 ఇంపీరియల్ బ్యాంక్ మేనేజరు

పా॥ వెం॥ హనుమంతరావు.

నిగరాణీదార్

---

శ్రీయుత డాక్టరు గారు

## శాసన శాసనము.

ఈ విమర్శనము సామ్రాజ్యశాసననిర్మాణ సభాసభ్యులగు డాక్టరు గారుగారు కావించనున్న శాసనములను శాసించుచున్నది. కాన దీనికి "డాక్టరుగారు శాసన శాసన"మను సన్వర్థనామకరణము గావించి యున్నవారము.

గారుగారు తమ శాసనమునకు "హిందూవివాహముల రద్దు చట్ట"మని పేరుపెట్టి యున్నవారు. ఈ పేరునుబట్టిచూడ గారుగారు శాస్త్రలోక విమర్శజ్ఞానవిహీనులై యున్నవారని చాటవచ్చును. అదే మ ? భారతీయులకు హిందువులను నామముకలదని శ్రుతిస్మృతిసూత్ర పురాణేతిహాసాది ప్రమాణ గ్రంథముల దెచ్చటను జెప్పబడి యుం లేదు. లేని నామమును వాడుట శాస్త్రజ్ఞాన విహీనతకాదా? అయినను వాదమునిమిత్తము కొంచెముకాలము భారతీయులకు హిందువులను పేరుకలదని యంగీకరించి చూచినను గారుగారు హిందువులకు వివాహములను రద్దుచేయుటకు శాసనము చేయుటలేదు. చేయుచున్న

నపుంసకోన్మత్త కుష్టరోగివివాహములను రద్దుచేయుటకు శాసనము
కాన దానికి హిందూవివాహములరద్దుచట్ట మను పేరుపెట్టుట వివేకవి
హీన కార్యమని చెప్పక తప్పినదికాదు. ఇంక వివేకసహితకార్య మే
మన? హిందూ నపుంసకోన్మత్త కుష్ఠరోగివివాహవిచ్ఛేదశాసన మని
పేరుపెట్టుట వివేకసహితకార్య మగుచున్నది.

ఇట్లు పేరుసంస్కరించు కౌన్సిలను గౌరుగారిని వివేకవిహీనుల
నియే చెప్పవలసివచ్చును. గాని వివేకసహితులని చెప్పుట కవకాశము
లభించుటలేదు. అదేమన? వీరు పైవారి వివాహములను రద్దుచేయుట
యొక్కటియెకాదు. వారి భార్యలకు ద్వితీయవివాహము చేయుటయను
మరియొక కార్యముకూడ చేయవలసియున్నవారు. కాన నిపు డా
రెండు కార్యములనుదెలుపు నొకపేరు గౌరుగారు తమశాసనమునకుఁ
బెట్టవలసియున్న దని తేలినది. వారట్టి పేరుపెట్టుటకుఁ జేతగాక హిం
దూవివాహములరద్దుచట్ట మను నసార్థకనామకరణము గావించియు
న్నవారు. కాన గౌరుగారు శాస్త్రజ్ఞానవిహీనులు కాలేదా? అయిరి.
కాని వారుతలంచిన రెండు కార్యములనుదెలిపెడి యొకపేరు మీరు
తెలుపవలదా? ఊరకయధిక్షేపించినఁ బ్రయోజనము కలదాయందు
రా? లేదు కానమీరు కోరినట్లు గౌరుగారి రెండు కార్యములనుదెలి
పెడి యొకపేరును మేము పెట్టుచున్నారము. అదేమన? వినుడు.

గౌరుగారి శాసనమును నాధారముచేసికొని నపుంసకోన్మత్త
కుష్టరోగుల సతులు పూర్వము పూర్వవివాహబంధమును విచ్ఛేదము
గావించుకొని యుత్తరమున నుత్తరవివాహమును గావించుకొన
వలసియున్నవారు. అనగా పెండ్లిండ్ల విడుదల కైకోళ్లు చేయవలసియున్న
వారు. కాన నీ వ్యవహారమును దెలుపుటకుఁగాను గౌరుగారు చేయు
చున్న శాసనమునకుఁ దెలుగున "పెండ్లిండ్ల విడుదల కైకోళ్ల చట్ట"
మనియు, లేదా 'మారుమనువుచట్ట' మనియు సంస్కృతమున "యువతీ
(సధవా) వివాహముండన మండనశాసన"మనియు నామకరణములను
గావించుట శాస్త్రవిహితకార్య మగునని సూచించుచున్నారము.
కాన గౌరుగారు తమశాసనమున కిదివరకుఁ బెట్టుకొనియున్న

యసార్థకనామమును తొలగించి మేముపెట్టిన సార్థకమగు పేరుపెట్టుకొ నిబుద్ధిమంతు లయ్యెదరుగాత. ఇఁక మనము చేయనున్న విమర్శనావిధా నమును నించుక విశదపించవలసి యున్నది. అదేమన? ఇంతవరకు మనము గావించిన విమర్శవలన గౌరుగారు గావించనున్న శాసనమునందున్న భాగములు రెండని మనము గ్రహించియున్నవారము. వానింబట్టి మన విమర్శనమును గూడ రెండుభాగములు కావలసివచ్చినది. అదెట్లందురా? చెప్పెదము వినుడు.

లోకమునంగల స్త్రీలనందరిని మనము మూడు తరగతులుగ విభజింపవచ్చును. వారెవ్వరన? (1) అధవలు (2) సధవలు (3) విధ వలు నని తెలియఁదగును. అధవలనఁ బెండ్లికాని కన్నియలనియు, సధ వలన భర్తలు కలవారనియు, విధవలన భర్తలుచనిపోయిన వారనియు నర్థములు. ఇం దధవలకుఁగాని విధవలకుగాఁని గౌరుగారి శాసనముతో బనిలేదు. పనియున్నది సధవలకుమాత్రమే. అందయినను నందరికిని బనిలేదు. పనియున్నది నపుంసకోన్మత్త కుష్ఠరోగుల సతులకు మా త్రమే. అయినను గౌరుగారు చెప్పిన వివాహవిచ్ఛేద కారణములలో నున్మత్త కుష్ఠ రోగ కారణములు పురుషులలో గొందరియందేకాని యందరియందును వర్తించునవికావు. కాని నపుంసకత్వము మాత్ర మ ట్లుగాక సధవలు వారి పతులందరియందును వర్తింపఁజేయుట కవకాశ మిచ్చుటకు సమర్థమైయున్నది. ఎట్లన? సధవలలో గొందరికి స్వపతు లందువిరక్తియు, మరికొందరికిఁ బరపురుషులం దనురక్తియుఁ గలుగ వచ్చును. కాని వారి కిదివరకున్న శాస్త్రాచారములు పెండ్లిండ్లవిడుదల కైకోళ్ల కవకాశ మీయకయుండఁజేసి విధిలేక వారడగి మడగి యున్నవారు.

ఇపుడు గౌరుగారి శాసనము పాసయి యములులోనికివచ్చె నా? తోడనేవారు రెక్కలుజాడించి పెండ్లిండ్లవిడుదల కైకోళ్ళకు దర ఖాస్తులు చేయకమానుదురా? మానరు. కాన మన మీవిషయమై బట్టుచర్చించవలసిన యవసరము కలిగినది. విడుదలచట్టమును విడియా కులచట్టమనియుఁ గైకోలుచట్టమును మారుమనుము చట్టమనియు నీవిమర్శనమున వాడుచుందుము. సధవయనినను యువతియనినను

రెండును సమానార్థక పదములైయున్నవి. అనగ సధవయన్నను యువతియన్నను బురుషునితోఁ గలిసియున్నవనిత యనియేయర్థము కాన మే మిందు సధవను యువతి యని వాడుచుందుము. గౌరుగారు యువతి పూర్వవివాహవిచ్ఛేదము గావించుకొనవచ్చునని చెప్పుచున్నారు. అపు డాకార్యమును వారు యువతీవివాహవిచ్ఛేద మనవలసి యున్నది. మనము వివాహమును విచ్ఛేదము గావించుకొనరాదని ప్రతిజ్ఞాపము గావించుచున్న వారము. కాన మనకార్యమును మనము యువతీవివాహవిచ్ఛేద విచ్ఛేద మని వ్యవహరించవలసి యున్నది.

ఇపుడు మనము చేయనున్న కార్యమేమో తెలిసినదా? మనము యువతీ వివాహవిచ్ఛేదమును విచ్ఛేదము గావించియున్నవారము. అనగ మనముపెట్టిన పేరులోనున్న వివాహవిచ్ఛేద విచ్ఛేదశబ్దములు రెండును బోయినవని తెలియవలెను. రెండును బోయినయెడ యువతి మిగులును. అనఁగ నాభార్యాభర్తలు విడిపోక కలిసియుందురని తెలియునగును. ఇఁక గౌరుగారి రెండవచట్టము కైకోలుచట్టము లేక మారుమనుము చట్టమనవలెనని చెప్పియుంటిమికదా? దీనిని గౌరుగారి భాషలో యువతీవివాహ మని చెప్పవలెను. ఏలయన? మగడుగలది మరల వివాహము చేసికొనుచున్నది. కాన దానిని యువతీ వివాహ మనియే చెప్పవలెను. మనపని యాయువతియొక్క వివాహమును జెడించుటయై యున్నది. అదియైనయెడ యువతిమిగులును. అనఁగ భార్యాభర్తలు విడిపోక కలిసియుందురని తేలెడిని. రెండు విమర్శగములకును గార్యసిద్ధి యొక్కటియె యైయున్నది. అనగ సతీపతులు గలసియుండుటయే కాన మన యీవిమర్శన భాగమునకు యువతీ వివాహ విచ్ఛేదమని వ్యవహరించవలసి వచ్చినది.

మనము మనభారతస్త్రీలందరును బతివ్రతలై యుండవలెనని యభిలషించ వలసినవారము. కాని యందుఁగొందరు కులటలైయుండవలెనని యభిలషించువారము కాము. అది మానవధర్మము కాదు. కాన యువతీ వివాహవిచ్ఛేద విచ్ఛేదమును, యువతీవివాహ విచ్ఛేదమును మనము తప్పక కావింపవలసిన వారమైయున్నారమని మాపాఠకులు

తలంతురుగాత. యువతీ వివాహవిచ్ఛేదమును, యువతీ వివాహమును మన శాస్త్రాచారములకు బరమ విరోధకార్యములై యున్నవి. ఇట్టి యకార్యములను సాధించుటకై కావించు తమ చట్టమునకు నారద వశిష్టస్మృతులు తోడ్పడుచున్న గారుగారు పొడియర్థములు వ్రాసియు న్నారు. కాని వానిమూలశ్లోకముల నిచ్చియుండలేదు. గారుగారికి లభించిన నారద వశిష్ట స్మృతులు వేదశాస్త్రములకు విహితములై యున్నవా? అవి మనకును బ్రమాణములేయగుచున్నవి. లేవా? లేని యపుడు గారుగారు వానియర్థములని వ్రాసినవ్రాతలు మన వేదశా స్త్రములకు విరుద్ధములుగ నున్నది కాన గారుగా రపార్థములపాలై యున్నారని చెప్పకతప్పదు. వారిచ్చిన యర్థము లాశ్లోకములందున్న వేయగునా? ఆనారద వశిష్టస్మృతులు సంఘసంస్కార కల్పితస్మృ తులై యుండవలెఁగాని యథార్థస్మృతు లెంతమాత్రమును గానేరవు. ఇట్లని ముందుఁగావింపఁబడు శాస్త్రచర్చవలన విశదముకాఁగలదు. వినుడు.

యువతీ వివాహవిచ్ఛేద విచ్ఛేదము.

ఇందునుగూర్చి మనము ముచ్చటించుకొనుటకు ముందు గారు గారికి శాసనస్వరూపమును సంక్షేపముగానైనఁ జేసికొని యుండుట మంచిది. కాన నాపనిముగించు చున్నవారము.

“ఈ వివాహవిచ్ఛేద శాసనమునకు వ్యతిరేకముగ నెట్టి చట్ట ముకాని యాచారముకాని యున్నప్పటికిని దానితో నిమిత్తము లేకుండ నొక హిందూభార్య యీక్రింది కారణములలో దేనినిబట్టియైనను దన వివాహమును రద్దుచేయించుకొనుటకు హక్కు గలిగి యుండవలెను. ఆకారణమే తన (ఏ) భర్త నపుంసకుడై యుండుట. (బి) మతి చెడియుం డుట. (సి) కుష్ఠరోగియై యుండుట. ఈ కారణములలో దేనినిబట్టియై నను హిందూయువతి భర్తను విడిచి యావిలేని మరియొక భర్తను బడ యవచ్చును. ఈ శాసనమును బ్రిటీషుగవర్నమెంటువారు పాసుచేసిన యెడ నారదునిచేతను వశిష్ఠునిచేతను రచింపఁబడిన పూర్వకాలపు చట్టములను దిగిగి యమలులోనికి తీసికొనివచ్చుట యే దీని ముఖ్యోద్దే

ముయున్నది నారద వశిష్ట స్మృతులు స్మృతులన్నిటిలోను గౌరవ
నీయములైన ప్రమాణములై యున్నవి. ఇది గౌరువివాహవిచ్ఛేదశా
సనసంక్షేపస్వరూపము. ఈచెప్పిన దానిబట్టి చూడ నమలులో లేని
నారదవశిష్ట స్మృతులను ప్రమాణములనుగా నిడికొని యనుష్ఠానములో
లేని వివాహవిచ్ఛేదధర్మమును నాచరణలోనికిఁదెచ్చి తన్మూల
మున శాస్త్రోక్తమగు మన యాచారమును నశింపఁజేయుటకు సాధన
మగు శాసనమును జేయ గౌరుగారు బిల్లుమూచేసియున్నారని మాపా
ఠకులు గ్రహించి యున్నారుకదా? ఇఁక నీశాసనము మన వేదశాస్త్ర
సమ్మతముగ నున్నదా? విరుద్ధముగ నున్నదా యను విషయమును మన
ము చర్చించి తేల్చుకొనవలసి యున్నది.

వేరుగానున్న వధూవరశరీరములు వేదోక్త వివాహసంస్కా
రమువలన నొక్కటి యగును. అటుపై వారికి జనించెడి పుత్ర పుత్రికలు
కూడ నాశరీరములోఁ జేరినవారగుటచే నవుకును నొక్కశరీర మేమై
యుండును. ఇది మా యభిప్రాయము కాదు శ్రుతి స్మృతు లిట్లుచెప్పి
యున్నవి. "స్వగోత్రాద్భ్రశ్యతేనారీ। వివాహాత్సప్తమేపదే" అను శా
స్త్రము ననుసరించి వివాహములో మొదటిదినమున రాత్రి జరుపఁబడు
సప్తపదియను కర్మతో వధువు పితృగోత్రమునుండి జారి వరునిగోత్రము
లోఁ జేరుచున్నదని పైవచనార్థము. అనఁగ సప్తపదితో వధూవరశరీ
రము లొక్కటియగునని యావిమర్శసారమై యున్నది. కావుననే
వాజసనేయ బ్రాహ్మణ-మీాక్రిందిమంత్రముఖమున భార్యాభర్తలయుఁ
బుత్రులయు శరీరము లొక్కశరీరమైయున్న వని నిర్వచించియున్నది.

(వాజసనేయ బ్రాహ్మణము.)

"అర్థోహవా ఏషఆత్మన స్తస్మాద్య జ్జాయాం నవిందతే. నైతా
వత్ప్రజాయతే. అసర్వో వా తావద్భవతి. అథ యదైవజాయాం విందతె
ప్రజాయతే. తర్హిసర్వోభవతి. తథా చైతద్వేద విదో విప్రావదంతి
యోభర్తా సైవభార్యా స్మృతా"ఇతి

ఈశ్రుతిని మనమునం దుడుకొనియే మనువీక్రింది స్మృతిని
రచించి యున్నవాడు. కానఁ బైశ్రుతి కర్థమగు మనుస్మృతివచనమును

నిందుక్రింద ముందుఁ బొందుపరచి యటుపై దాని భాష్యమును విని పించి యనంతరమున దెలుగర్థమును జెప్పెదము. వినుడు.

(మనుస్మృతి అ 9 శ్లో 45)

శ్లో॥ ఏతావానేవ పురుషో। యజ్జాయాత్మా ప్రజేతిహ।
విప్రాః ప్రాహుస్తథాచైత। ద్యోభర్తా సా స్మృతాంగనా॥

ఈ శ్లోకమునకు భాష్యము గావించునపుడు పైశ్రుతివచనము నుదాహరించి కుల్లూకభట్టాచార్యుడిట్లర్థము వినిపించియున్నవాడు.

"నైకః పురుషోభవతి. అపితు, భార్యాస్వదేహ మపత్యానీత్యే తత్పరిమాణ ఏవపురుషః తథాచ వాజసనేయబ్రాహ్మణమ్. "అర్ధో వాహ......సైవభార్యా స్మృతా" ఇతి. ఏవంచ తస్యా ముత్పాదితం కర్తురేవాపత్యంభవతి. యతశ్చ దంపత్యోరైక్యమతః"

పురుషుడొక్కడే దేహమైయుండలేదు. భార్యయు తానును సంతానమును చేరియే పురుషుడగుచున్నవాడు. భార్యతోఁ గలియక ముందు భర్త సంతానముకనుట కసమర్థుడై యున్నవాడు ఏలయన భార్యలేమిం జేసి యర్ధశరీరిమాత్రమేయై యున్నవాడుకదా? కాన నతడు సంతానము కనలేడయ్యెను. ఇట్లే భార్యయు భర్తతోఁజేరని యపుడర్ధశరీరిణియై యున్నది. కాన నామెయు సంతానవతి కాఁజాల దయ్యెను. ఆ యిరువురును జేరి సమగ్రశరీరులైన నెనుక సంతానము కలుగుచున్నది. ఆదేహాత్మల వికారములే పుత్రులైయుండుటచేతనే "అంగా దంగాత్సంభవసి...ఆత్మా వైపుత్రనామాసి" అను శ్రుతి పితృ పుత్రులొక్కరైయని నిర్వచించియున్నది. కాన భార్యాభర్తలేక రూపులని యీవిమర్శనవలన స్పష్టమైనదికదా? పురుషుని దేహములో వామభాగము భార్య. కావుననే యామె వామాంగియని చెప్పఁబడు చున్నది. ఇట్లు వరునిదేహములో నర్ధాంగియైయున్న వధువును విడదీ యుటకిపుడు గారుగారు శాసనముచేయఁ జూచుచున్నారు. ఇది మానవధర్మమా? కాదు. అయినప్పటికి భార్య భర్తనుండిపోదు. ఇట్లనిమేము చెప్పుటలేదు మను వీక్రింది శ్లోకముఖమున నిరూపించి యున్నవాడు, ఇటువినుడు.

శ్లో॥ ననిష్క్రయ విసర్గాభ్యాం। భర్తుర్భార్యా విముచ్యతే।
ఏవంధర్మం విజానీమః। ప్రాక్ప్రజాపతి నిర్మితం॥

ఈ శ్లోకమునకుఁ గుల్లూక భట్టాచార్యులవారిట్లు వ్యాఖ్యానము గావించి యున్నారు.

"నిష్క్రయో విక్రయః, విసర్గస్త్యాగః, నతాభ్యాం స్త్రీభర్తుః భార్యాత్వాద పైత్యేవం ప్రజాపతినాస్మృతం నిత్యం ధర్మంమన్యామహే. ఏవంచ క్రయాదినాపి పరస్త్రియ మాత్మసాత్కృత్వా తదుత్పాదితాపత్యం క్షేత్రిణ ఏవభవతి. నబీజినః."

నిష్క్రయమున విక్రయము. విసర్గమన విడిచిపెట్టుట. ఈ రెంటను భర్తనుండి భార్యాత్వమును స్త్రీ పోగొట్టుకొనఁజాలదు. ఇది తొల్లి బ్రహ్మచేఁ జెప్పబడిన నిత్యధర్మమును గదలించుచున్నాడను. ధర్మమిట్లుండ నెవరేని ధనాధికముచేఁ బరస్త్రీని వశపరుచుకొని యామెయందు సంతానమును గనినను నాసంతానము దానిభర్తకుఁ జెందునుగాని శ్రమపడిన వానికిఁ జేర నేరదని పైశ్లోకార్థము. ఈయర్థమునుబట్టి భార్యాభర్త లొకరినుండి యొకరు విడిపోవుటకు వీలు లేదని స్పష్టమైనదికదా? అయినది. కావుననే సృష్ట్యాదినుండి యిప్పటివరకు భారతసంఘమున భార్యాభర్తలు విడియాకులందుకొనెడియాచారము లేదు. ఒకప్పుడు భార్యాభర్తలకు వైషమ్యము సంభవించినను భార్య విడిపోయి పుట్టింటనో బంధువులయింటనో తన మనుగడ గడుపుకొనుచున్నది. అంతియెకాని విడియాకులందుకొని గారుగారు చెప్పినట్లు పునర్వివాహము చేసికొనెడి యాచారము లేదు.

పురుషుడు దేవతలచే నీయఁబడిన భార్యను బొందుచున్నాడు గాని తనయిష్టముచే భార్యను బొందుటలేదు. కాన నాసాధ్వమణితోఁ గూడి దేవతలకు బ్రీతికరములగు క్రతువులను జేయుచుఁ నామె కన్నవస్త్రములనిచ్చుచు భరించవలెను. ఒకవేళ దనపైనామెకు ద్వేషము జనించినను నామెను విసర్జించరాదని మనువీక్రింది శ్లోకముఖమునఁ జెప్పియున్నాడు.

శ్లో॥ దేవదత్తాం పతిర్భార్యాం। విందతేనేచ్ఛ యాత్మనః।
తాం సాధ్వీం బిభృయా న్నిత్యం। దేవానాం ప్రియమాచరన్.9
ఈ శ్లోకమునకుఁ గుల్లూక భట్టాచార్యులిట్లు వ్యాఖ్యానము గావించి యున్నవాడు.

"భగోఅర్యమా సవితాపురంధి ర్మహ్యంత్వా దుర్గార్హపత్యాయదేవాః" ఇత్యాది మంత్రలింగాత్, యాదేవైరంత్తా భార్యా తాం పతిర్లభతే నతుస్వేచ్ఛయా, తాంసతీం దేవానాం ప్రియంకుర్వన్ గ్రాసనాచ్ఛాదనాదినా సదా ద్వేషాద్యుత్పన్నామపి పోషయేత్"

ఇట్లు దేవదత్తయగు భార్య యొకవేళ ద్వేషురాలైనను దానిని విసర్జించరాదు. పోషించవలసినదని మనువు ముందు చెప్పి యిట్లెంత కాలము పోషించవలెనను ప్రశ్నరాఁగా దానికి సమాధానమును గ్రింది శ్లోకముఖమునఁ జెప్పుచున్నాఁడు. అదేమన?

శ్లో॥ అన్యోన్యస్యావ్యభిచారో। భవే దామరణాంతికః।
ఏష ధర్మ స్సమాసేన। జ్ఞేయ స్త్రీపుంసయోః పరః॥ 101

భార్యాభర్తలామరణాంతము నొకరి నొకరువిడవక యన్యోన్యముగా నుండవలయును. ఇది స్త్రీ పురుషులకు సనాతనధర్మముగాఁ దెలియఁదగినదని పైశ్లోకార్థము. ఈ యర్థమునుబట్టి భార్యాభర్తలామరణాంతము మాత్రమే యొకరినొకరు విడిచివుంచరాదని తెలియ వచ్చినదికదా? ఇంతియేకాదు భర్త చచ్చిపోయినను గూడ నాతని సంబంధమును సాధ్వీమణి విసర్జించరాదని యీక్రింది శ్లోకముఖమున మనువు విధించియున్నవాడు. వినుడు.

శ్లో॥ యస్మైదద్యాత్పితా త్వేనాం। భ్రాతావానుమతె పితుః।
తం శుశ్రూషేత జీవంతం। సంస్థితం చ నలంఘయేత్ ।9_151

తండ్రి లేక తండ్రియనుమతిని భ్రాత తెన నెవ్వని కిత్తురో వాడు జీవించి యుండినను మరణించినను నతనిని భార్యవిడిచి పోరాదని పైశ్లోకార్థము. ఇంతవరకుఁ గన్నరచిన ప్రమాణములనుబట్టి స్త్రీలు భర్తలను నెప్పుడును విసర్జించరాదని తేలినదికదా? తేలినది. అటులేని గారుగారి [illegible] కులచట్టముచు మానవు లామోదింతురా? ఆమోదింపరు.

ఇట్లనిన భార్యాభర్త లందరును వివాహవిచ్ఛేద మొనర్చుకొని పునర్వివాహము చేసికొనవలసిన దని మేము మాత్రము శాసనము చేయుచున్నామా? లేదు. ఇం కేమన? భర్త నపుంసకుడైనపుడును, పిచ్చివాడైనపుడును, కుష్ఠురోగ పీడితుడైనపుడును మాత్రమే వానిని విడిచి భార్య మరియొకరిని జేసికొనవచ్చు ననియేకదా శాసనము చేయుచున్నాము? కాన మీరు కన్పరచిన మను వచనములు మా శాసనమునకు ప్రతిబంధములు కానేరవని గారుగారు మరల ప్రతిఘటింతురేమో! అనుమలకు సమాధానము వినుడు.

(మనువు అ 5 శ్లో 154)

శ్లో॥ విశీలః కామవృత్తోవా। గుణైర్వా పరివర్జితః।
ఉపచర్య స్త్రియా సాధ్వ్యా। సతతం దేవ తత్పతిః॥

భర్త సదాచారశూన్యుడును, నన్యస్త్రీలోలుడును, విద్యాది గుణవిహీనుడును నైయుండినను నతనిని పతివ్రతయగు స్త్రీ దేవునివలె నెల్లప్పుడు నుపచరించవలసిన దని పైశ్లోకార్థము. ఈయర్థమును బట్టిచూచిన యెడ భర్తయం దేవేనిదోషము లుండినను భార్యవానిని విసర్జించరా దని తేలినదికదా? ఇంక విడియాకు లందుకొని భార్యాభర్తలు మారుమనువు చేసికొనవచ్చు నను గారుగారి మారుమనువు శాసనము ను మానవోత్తములగు భారతీయు లెట్లామోదింతురు? ఆమోదించరు. ఇట్లనిన మీరిపుడు కన్పరచిన మనువచనమైనను భర్త యందుండు నితర దోషములనుజెప్పి యతనిని భార్య విడువరాదని శాసించినది కాని మేముచెప్పిన నపుంసకత్వాది గుణములను దెలిపి వానిని విసర్జించవల దని చెప్పియుండలేదు. కాన నీవచనముగూడ మా శాసనమునకుం బ్రతిబంధము కానేరదని మన గారుగారుమరల వాకొందురేమో! ఆముచ్చటలుకూడం దీర్చుకొందమురండు.

(మనువు. అ 9 శ్లో 79)

శ్లో॥ ఉన్మత్తం పతితం క్లీబ। మబీజం పాపరోగిణం।
నత్యాగోస్తి ద్విషంత్యాశ్చ। నచ దాయాపవర్తనం॥

ఈ శ్లోకమునకుఁ గుల్లూక భట్టాచార్యుల వారిట్లు వ్యాఖ్యా
ముగావించి యున్నారు.

"వాతాది దోషా ద్రప్రకృతిస్థం, పతిత మేకాదశా ధ్యాయె వక్ష్య
మాణం, నపుంసకం, అబీజః బాధ్య రేత స్త్యాదినా బీజరహితం కుష్ఠా
ద్వ్యాపేతంచ పతి మపరిచరం త్యాజ్యా స్త్యాగో నకరణీయః. నచధనగ్రహణం
కరణీయం''

పిచ్చివాడు కులభ్రష్టుడు నపుంసకుడు బీజరహితుడు పాపరోగి
యగుభర్తను ద్వేషించుభార్యను బరిత్యజించరాదు. దాని ధనము
గ్రహించరా దని పైశ్లోకార్థము. ఈయర్థమును బట్టిచూడ నపుంస
త్వాది దోషములుగల భర్తనైనను భార్య ద్వేషించి విడువరా దనియు
నొకవేళ నది ద్వేషించినను నంతమాత్రమున దానిని ద్వేషింపక భర్త
భరించవలసినదే కాని విసర్జించుటకాని దాని ధనముచు గ్రహించుట
కాని కావి పరాదనియు విశదముగఁ దెలియ వచ్చియున్న దికదా?
తెలియవచ్చినది. అటులేని నింకుతో వివాహవిచ్ఛేద శాసనము
(విడియాకుల చట్టము)విచ్ఛేదమయినదని చెప్పవచ్చును కదా?అటులే
స్త్రీలు నపుంసకులు లోనగుభర్తల వివాహవిచ్ఛేదము గావించుకొ
యన్యులను వివాహ మాడవచ్చునని విధించిన నారద వశిష్ఠ స్మృ
వచనములను గన్పరచి యుంటిమిగదా వానికి గతియేమందురా?
చెప్పెదము వినుడు.

నారద వశిష్ఠ స్మృతివచనము లున్నవని గౌరుగారు చెప్పి వాని
సంఖ్యలను మాత్రము జూపి యర్థములు వినిపించియున్నారు. కాని
వచనముల నిచ్చియుండలేదు. ఇచ్చియుండినయెడ వానికి వారు చెప్పిన
యర్థములు సరిగనున్నది లేనిది చెప్పుట కవకాశ ముండెడిది. అదిలేదు.
లేకపోయినను గౌరుగారి నారద వశిష్ఠ స్మృతివచనములు భారతసంఘ
మున నింతవర కనుష్ఠానము (అమలు)లో నున్న శాస్త్రాచారములకు
బరమువిరుద్ధమగు దుర్గతిలో బడియున్నవని యిదివరకే స్థాపించి
యున్నారముకదా? ఇఁక గౌరుగారి శాసనములో యువతీ వివాహ
మును విచ్ఛేదముగావించవలసి యున్నది. ఇదివినుడు.

# యువతీ వివాహ విచ్ఛేదము.

శాస్త్రయుక్తి లోకానుభవమునుబట్టి పరిశీలించినయెడ యువతీ వివాహము పశుధర్మమైయున్న దని ప్రాజ్ఞులొప్పుకొనక తప్పదు. అది మానవధర్మ మెతవమాత్రమును గానేరదు. భార్యలు జీవించియున్నపు ను మరణించిన మీదనుగూడను మరియొక వనితను బురుషులు వివాహమాడెడి యాచారముకలదు. ఈయాచార మాచణీయమేయని శాస్త్రములుకూడ చాటియున్నవి. స్త్రీలట్లు పురుషులు జీవించియుండ గాగాని మరణించినమీదఁగాని వివాహము గావించుకొనుటకు శాస్త్రా చారము లంగీకరింపవు. కావున నే స్త్రీలు పునర్వివాహము గావించు కొనుటలేదు. ఇందులకుఁ గారణము స్త్రీపునర్వివాహమును బశుధర్మ శాస్త్రములు నిందించుటయే. ఇట్లు శాస్త్రాచార దూరమైయున్న పున ర్వివాహమును మానవోత్తములగు భారతీయులు తమ యువతులకు గావించి వారిని బశువులనుజేసి యాపశువులతో దాము దాంపత్యము నడిపి పశువులు కాఁజాలక దానిని బ్రాహ్మణక్షత్రియవైశ్యశూద్రులు పూర్తిగఁ బరిత్యజించి యున్నవారు. ఆపరిత్యక్తమైన పునర్వివాహమునే మనగౌరుగారిపుడు శాసనసహాయమున భారతసంఘమున బలవంత ముగఁ జొప్పిరిచుటకు యత్నించుచున్నవారు. కాన నీవిషయమై మన వేదశాస్త్రము లేమిచెప్పియున్నవో యిఁక విచారించుకొందము రండు.

కృష్ణ యజుర్వేదము.

“యదేకస్మిన్ యూపే ద్వే రశనే పరివ్యయతి. తస్మాదేకో ద్వే జాయే విందతే. యన్నైకాగ్ం రశనాం ద్వయోర్యూపయోః పరివ్య యతి తస్మాన్నైకా ద్వౌపతీవిందతే”

ఒక యూపస్తంభమునకు రెండు పశురశనలను గట్టుట కెట్లవ కాశముకలదో యట్లె యొకపురుషు డిరువురు భార్యలను బరిణయము గావించుకొనుట కవకాశముకలదు. ఒక పశురశనను రెండు యూప స్తంభములకుఁ గట్టుట కెట్లవకాశములేదో యట్లె యొక స్త్రీ యిరు

పురు భర్తలను బరిగ్రహించుట కవకాశము లేదని పై మంత్రార్థము
ఈ మంత్రార్థమును బట్టిచూడఁ బురుషు లనేక స్త్రీలను నేకకా
మందుఁగాని భిన్నకాలమందుఁగాని పరిణయమై సుఖ మనుభవించుటకు
శాస్త్రాచారములు సమ్మతించినవి కాని స్త్రీల ట్లనేకపురుషులను నే
కాలమందుఁగాని భిన్నకాలమందుఁగాని పరిణయమై సుఖించుటకు
శాస్త్రాచారములు సమ్మతించియుండ లేదని తేలినది. శ్రుతియిట్లు చెప్పి
యుండుటచేత నే మనుస్మృతికూడఁ గ్రిందివిధమున నియోగవిధిని విధవా
వివాహవిధిని విధివిహితములు కావని చెప్పుటయే కాక పశుధర్మము
లని కూడ నిందించియున్నది. ఇటువినుడు.

శ్లో॥ నోద్వాహికేషు మంత్రేషు। నియోగః కీర్త్యతేక్వచిత్
నవివాహ విధావుక్తం। విధవా వేదనంపునః॥

ఇందులకుఁ గుల్లూక భట్టాచార్యు డిట్లువ్యాఖ్యానము గావించి
యున్నాడు.

"ఆర్య మణంనుదేవమ్" ఇత్యేవమాదిషు మంత్రేషు క్వచిదపి
శాఖాయాం ననియోగః కథ్యతే. నచవివాహ విధాయక శాస్త్రే స్త్రియాః
పురుషేణ న పునర్వివాహ ఉక్తః"

ఏశాఖామంత్రములందైనను నొకదానిఁ యందుఁగూడ నియో
గము చెప్పఁబడియుండ లేదు. వివాహవిధాయక శాస్త్రములం దెచ్చటను
విధవకన్య పురుషునితో వివాహము చెప్పఁబడియుండ లేదని పైశ్లోకా
ర్థము. ఈయథను మునుబట్టి స్త్రీలకు నియోగముకాని యందు విధవ
లకుఁ బునర్వివాహముకాని శాస్త్రసమ్మతముకాదని స్పష్టమయినది
కదా? విధవలకే పునర్వివాహము లేదని శాస్త్రము చెప్పినపుడు సధవ
లకు బునర్వివాహ మున్నదా? లేదా యని విచారించుటకంటె వివేక
విహీనకార్యము మరియొకటి యుండునా? ఉండదు. కావుననే స్త్రీ
పునర్వివాహమును నావెంటనే పశుధర్మమని మను వీక్రింది శ్లోకము
మున నిందించి యున్నవాడు. ఇటువినుడు.

శ్లో॥ అయంద్విజైర్హి విద్వద్భిః। పశుధర్మో విగర్హితః।
మనుష్యాణామపి ప్రోక్తో। వేనేరాజ్యం ప్రశాసతి॥

నియోగము స్త్రీ పునర్వివాహము ననునవి పండితులగు ద్విజులచే బహుధర్మములుగా నిందింపఁబడి యున్నవని పైశ్లోకార్థము. ఇట్లు శాస్త్రముచే బహుధర్మమని నిందింపఁబడిన స్త్రీ పునర్వివాహమునే మన గౌరుగారు శాసనద్వారా బలవంతముగ భారతసంఘమున జొప్పింపఁ బాటుపడుచున్నవారు మానవులు పడవలసిన పాటులాయివి? కావు. వానికేమి? కాని మీరు కన్పరచిన శ్రుతియు పై మను వచనములును సర్వథా స్త్రీలకుఁ బునర్వివాహమునుగాని నియోగము గాని చేయరాదని నిషేధించియున్నవి సరే. అటులేని వేదశాస్త్ర సిద్ధమగు నియోగవిధి ననుసరించి వ్యాసభట్టారకుడు విచిత్రవీర్యుని విధవలందెట్లు ధృతరాష్ట్ర పాండుపులను గనెను? వారినప్పటి పండితులు ప్రభువులు నెట్లు పేక్షించిరి? అని గౌరుగారును మాపాఠకులును మమ్ము ప్రశ్నింపవచ్చును! సమాధానము చెప్పెదము వినుడు.

స్త్రీలు పునర్వివాహము గావించుకొనుటకాని నియోగ విధిననుసరించి యన్యులవలనఁ బుత్రులను గనుటకాని యాది శ్రుతి స్మృతులు చెప్పినటులు నింద్యకార్యములే. సంశయములేదు. అయినను మనువు నియోగవిధి ననుసరించి సంతానము కనవచ్చునని యాపద్ధర్మముగ నవకాశ మిచ్చియుండుటచే నా విధిననుసరించియే వ్యాసభట్టారకుడు విచిత్రవీర్య క్షేత్రములందు ధృతరాష్ట్ర పాండవులను బుట్టించి యున్నాడు. ఆపుట్టిన సంతానము శాస్త్రవిహిత సంతానమగుటచేతనే యప్పటి పండితులు, భీష్మాచార్యాది రాజసత్తములు, సర్వులు వారి నామోదించియున్నారు. ఇట్లైన శ్రుత్యుక్తధర్మములను స్మరించుటయే కదా మన్వాది ధర్మజ్ఞుల కార్యము? అగుచు. అటులేని నియోగము వేదశాఖలలో నేదానియందును జెప్పఁబడలేదని తెగవేసి చెప్పిన మనువే తననోటితోనే తనకరమునవే యెట్లు చెప్పెను? ఎట్లు వ్రాసెను? అని మా పాఠకులు మరల ప్రశ్నింపకకోరు! సమాధానము వినుడు.

వేదమునందుఁ జెప్పఁబడని ధర్మములను స్మరించి వానిని మానవులచే ననుష్ఠింపఁ జేయుటకొక్క మను ప్రజాపతికి మాత్రమే యధికారముకలదు. ఇతర ధర్మజ్ఞులకులేదు. ఆయధికారము మనువునకుఁ గలద

"యద్వైకించ మనురవదత్తద్భేషజమ్" అను మంత్రముఖమున వేదమే చెప్పియున్నది. కావుననే వేదమందు నియోగము చెప్పఁబడి యుండలేదని చెప్పినమనువు.

శ్లో॥ విధవాయాంని యుక్తస్తు। ఘృతాక్తో వాగ్యతోనిశి।
ఏకముత్పాదయేత్పుత్రం। నద్వితీయం కథంచన॥

అను శ్లోకముఖమున నియోగవిధి నుపదేశించి దాని నాచరణలోఁ బెట్టియున్నవాఁడు. కాని యది పై మూఁడు యుగములందు మాత్రమే యాచరణయోగ్యమై యున్నది. కలియుగమున నది యాచరణీయముకాదు. కావుననే వ్యాసభట్టారకుఁడు "ఊఢాయాః పునరుద్వాహం। జ్యేష్ఠాంశం గోవధం తథా। కలౌ పంచ నకుర్వీత భ్రాతృజాయాం కమండలుం" అను నాదిత్యపురాణ వచనముఖమున స్త్రీ పునర్వివాహము, నియోగవిధి కలివర్జ్యములని చెప్పియున్నారు. అందుచేతనే యీ కలియుగమున మనపూర్వులు వాని నాచరణలోనుండి తొలఁగించియున్నారు. ఆ కలివర్జ్యమగు స్త్రీ పునర్వివాహమునే నేడు కొందఱు నూతనశాసనము నూతగాఁగొని యాచరణలోనికిఁ దెచ్చుటకు యత్నించుచున్నవారు. ఇంతకంటె నింద్యకార్యము మఱియొకటి యున్నదా? లేదు. ఇంతవరకు మనము కావించిన శ్రుతిస్మృతి పరామర్శవలన స్త్రీ పునర్వివాహము పరమనింద్యమగు కార్యమని తేలినది. ఇంతియేకాదు. ఇంకనీవిషయమై మనువిట్లు చెప్పియున్నాఁడు.

శ్లో॥ పాణిగ్రాహస్య సాధ్వీస్త్రీ। జీవతో వామృతస్యవా।
పతిలోక మభీప్సంతీ। నాచరేత్కించి దప్రియం॥

పాణిగ్రహణము గావించిన భర్త జీవించియుండినను, మరణించినను బతివ్రతయగు వనిత పతియున్నలోకమునే కోరుచున్నదై భర్తకప్రియమైన వ్యభిచారమును బిండదానాది త్యాగమును గావింపరాదని పైశ్లోకార్థము. ఈయర్థమును బట్టిచూడఁ బతి జీవించియుండినను మరణించియుండినను నతని సంబంధమును సతి విడుచుకొనరాదని శాస్త్రము చెప్పుచుండఁగ మనకొందఱు భర్త బ్రతికియుండఁగానే విడియాకు

లందుకొనవచ్చునని శాసనముచేయఁ జూచుచున్నారు. ఇది మాన
ధర్మమా? ఇంతియెకాదు. ఇంకనీవిషయమై మను విట్లు చెప్పియున్నాడ

శ్లో॥ కామంతుక్షపయే ద్దేహం। పుష్పమూల ఫలై శ్శుభైః।
నతునామాపి గృహ్ణీయాత్। పత్యౌప్రేతే పరస్యతు॥

ఈశ్లోకమునకుఁ గుల్లూక భట్టాచార్యు డిట్లు వ్యాఖ్యానము
గావించియున్నాడు.

"వృత్తిసంభవేపి పుష్పమూల ఫలైః పవిత్రైశ్చ దేహం క్షపయే
దల్పాహారేణ క్షీణంకుర్యాత్. నచభర్తరి మృతే వ్యభిచారధియా
పరపురుషస్యనా మాప్యుచ్చారయేత్"

భర్త మృతిపొందినయెడఁ బతివ్రతయగు వనిత జీవనోపాధి
యుండినను దాని ననుభవింపక పవిత్రములయిన పుష్పమూల ఫలము
లతో (అల్పాహారముతో) దేహమును క్షీణింపఁ జేయవలయును.
అంతియెకాని వ్యభిచారబుద్ధితోఁ బరపురుషుని పేరుకూడ వాడరాదని
పైశ్లోకార్థము. ఈయర్థమును బట్టిచూడఁ విధవయే పరపురుషుని పేరు
చ్చరించరాదని తేలుచుండఁగా గారుగారు సధవ ధవుడుండఁగనే వానిని
విడిచి మరియొకనిని మరగవచ్చునని శాసనము చేయుచున్నారు. ఇది
మనుజులకుఁ దగునా? ఇట్లు చెప్పదలంచినయెడ వేలకువేలు ప్రమాణ
వచనములను గుప్పించవచ్చును. గ్రంథవిస్తరభీతిచే వానినిట నుదాహ
రింపమాని యిఁక యుక్తివాదము నించుక వినిపించఁ బోవుచున్నారము.
కాన సావధానముగ వినుడు.

యుక్తివాదము.

గారుగారు గౌరవార్హులే కావచ్చును. కాని వారిశాసనము
మాత్రము వారిగౌరవమును నాశనము చేయుచున్నది. ఎట్లన? గారు
గారును వారి బంధువులును మానవులేకాని దేవతలుకారు. కానఁ
గుష్ఠురోగము, ఉన్మత్తత, నపుంసకత్వము, లోనగు లోపములు వారికిని
సంభవించవచ్చును. ఇతరులకే సంభవించునను రాజశాసనము కానిదై
వశాసనము కానిలేదుకదా? లేదు. అటులేని దమ శాసనమువలనఁ బరుల
కెట్టి బాధలు సంభవించనున్నవో మన గారుగారించుక చెవియొగ్గి

విందురుగాత. యజ్ఞదత్తుడను కుష్ఠరోగియొకడును విష్ణుదత్తుడను నున్మత్తుడొకడును గలరు. వారికీ వ్యాధులు సంభవించకముందు పరిణయములయినవి. భార్యాభర్తలు సుఖముగఁ గాపురము చేయుచున్నవారు. ఇట్లుండ దరువాత మీఁదఁ దెలిపిన విధమున రోగపీడితులైరి. అపుడు వారిభార్యలీశాసనము నాధారముచేసికొని వారివివాహ సంబంధమును వదలుకొని యన్యులను వివాహమాడి సుఖించుచుండిరనుకొనుఁడు. నాడారోగుల కన్నపానాదు లిచ్చి పోషించువారెవరు? ఎవరును లేరుకదా? లేరు. వారిదుఃఖములకు మూలము గౌరుగారి శాసనమే కాదా? ఇది మనగౌరుగారు విచారించియే శాసనము చేసినారా? లేక విచారించక చేసినారా? విచారించకయే చేసినామందురా? గౌరుగారిని వివేకవిహీనులని మనము చాటవచ్చును. విచారించియే చేసినామందురా? పరులకు దుఃఖము లున్నవని తెలిసియే బాధించుశాసనముసృజించు వీరిని గ్రూరరాక్షసులనుటకు సంశయించువారెవరు? ఎవరును లేరు.

అటు లేని గౌరుగారి నిట్లుప్రశ్నింతము. అయ్యా వాదము నిమిత్తము మీకుఁ గుష్ఠరోగమును మీకొమరున కున్మత్తతయు సంభవించిన దనుకొనుఁడు. ఆనాడు మీశాసనము నాధారముచేసికొని మహారోగపీడితులైయున్న మిమ్ము మీభార్యయు మీకుమారుని మీకోడలును విడిచి పరులను బరిగ్రహించి సుఖించుచున్నా రనుకొనుఁడు. అపుడు మీ కన్నపానీయాదు లొసంగి కాపాడువారు లేక మీరు దుఃఖపడరా? మీ రిట్లు దుఃఖపడుచు మీపత్నులు సుఖించుట కని సంతసించెదరా? లేదా? సంతసించినచో మిమ్ములోకము శ్లాఘములనుగా భావించక మానదు. సంతసించనిచో వెంటనే మీశాసనమునకు మీరు తిలోదకము నేలవిడువ గనియడిగిన గౌరుగారికి వాగ్బంధము కాకతప్పదు కదా? ఇంతియె కాదు. ఇంకొక ప్రశ్నయడిగి యిది విడిచి భారతగ్రంథము చేయబోయెదము. అదేమన?

నపుంసకుని భార్య పునర్వివాహము చేసికొనవచ్చునని కదా గౌరుగారి శాసనము చెప్పియున్నది? నపుంసకత్వము కుష్ఠుపిచ్చిరో

ములపలెఁ బ్రత్యక్షమగునదికాదు. అదియున్నది లేనిది యా భార్యా భర్తలకు మాత్రమే తెలియఁదగినది. అన్యులకిది తెలిసికొనవీలులేదు. తెలిసినదని చెప్పినను లోకము విశ్వసింపఁజాలదు. భర్తలయెడఁ గొందఱుస్త్రీలకు విరక్తియు, మఱికొందరు స్త్రీలకుఁ బరపురుషులయెడనను రక్తియుఁగలుగుట మనము చూచుచున్నాము. అపుడు వారివారి కోరికలు తీర్చుకొనుటకు దమభర్తలు నపుంసకులని చెప్పి పరపురుషులను బరిగ్రహించుటకు యత్నించవచ్చునుగదా? గారుగారు పాసుచేయించు శాసనమువలన లోకమున కెన్ని యిక్కట్లు రానున్నవో యవియన్నియు వారిహృదయమున కొక్కపరి యెక్కించవలెనని యొక్కప్రశ్న యడిగి దానికివారు చెప్పఁదగిన సమాధానమును మనము లోకమునకు విని పింతమురండు. అదేమన?

పుంస్త్వము స్థిరపదార్థము కాదుకదా? కొందరది లేకయే జన్మింతురు. మఱికొందరి కది తొలుతయుండి మధ్యకాలమునఁ బోవచ్చును. అపు డదిలేనివారిని మధ్యకాలమున బోయినవారినిగూడ నపుంసకులని చెప్పవలసినదేకదా? వాదమునిమిత్త మానపుంసకత్వము మన గారు గారికిని వారిబంధువులకును మధ్యకాలమున బ్రాప్తించినదనుకొందము. నాడు గారుగారిశాసనము సాధారమచేసికొని భస్మాసురునివలె వారి భార్య వారి యుఁదోబుట్టువులు వారి భావమరదులయు వారి కుమారికలల్లుండ్రయుఁ గోడండ్రు కొడుకులయు వివాహబంధములను ద్రెంచుకొని వీరందరుమిడిగ్రుడ్లు పెట్టుకొని చూచుచుండఁగనే వారు పరపురుషులను వరించిమారుమనువుచేసికొనిసుఖించ యత్నించినారనుకొందము. అపుడు మనగారు ప్రభృతులు గ్రుడ్లనీళ్లు గ్రక్కుకొనుచు స్వశాసనమహిమను దలపోయుచు మిన్నకుండెదరా? కూడదనెదరా? ఊరకుండెదరా? ఏదు పసువులకంటెను జంతువులకంటెను హీనులు కాకతప్పదు. అదేమన? ఋషభములు మహిషములు మున్నగు పసువులును శునకములు గార్దభములు లోనగు జంతువులును తాత్కాలిక భార్యలకడనున్నపు డితర పసువులుకాని జంతువులుకాని తమ భార్యలతోఁ గలియవచ్చినయెడ ఋషభములు మహిషములు పొడిచియు, శునకములు కరచియు గార్దభములు తన్నియుఁ దరిమివేయుచుగాన సహించనేరవు.

ఆమాత్రపు పౌరుషముకూడ లేక మన గారుప్రభృతులు పడి యుండెదరా? లేక కూడదని తమభార్యలను నిరోధింతురా? నిరోధింతు రేని మీశాసనమును మీరే యమలులోఁబెట్టరా యని యడిగినవోల్ల మూతపడక తప్పదుకదా? ఇట్లడిగిన నాశాసనము పరస్త్రీల కనువర్తించునేకాని మాస్త్రీల కనువర్తించదని గారుగారు సమాధానము చెప్పవలెను అపుడు పరసంతాపకారకమగు శాసనమునుగూర్చి యుపన్యసించిన గారుగారి నాలుకను వేయిచీలికలఁగను శాసనమును లిఖించిన హస్తమును వేయిముక్కలుగను ఛేదించవలెనని పకులు తీర్మానించినయెడ దోషము ప్రాప్తించదని ప్రకటించవచ్చునుగదా? గారుగారికి శాస్త్రలోక విమర్శజ్ఞానము లేమాత్రమున్నను నిట్టి క్రూర శాసనము చేయఁజూతురా? నపుంసకులయుఁ గష్టరోగులయుఁ నున్న త్తులయు భార్యలువచ్చి మన గారుగారిని సాగలించుకొని మాకు విశి యాకులచట్టను మారుమనుముచట్టము చేయుడని వేఁడ్చినారా? పని లేనిమంగలి పిల్లితలగొరిగినట్లు కుడిచికూర్చుండలేక కూతుపిర్రలు చెక్కిన వానివలె నీశాసన నిర్మాణమెందుకు? ముసుకువేసికొని మూలఁగూర్చుండి కాలక్షేపము చేయరాదా? ఇంక భారతీయుల నించుక ప్రబోధించి యీ విమర్శనమును ముగించెదము.

# భారత ప్రబోధము.

---

భారత సోదరులారా! మనలోఁ గొందరు పురుష మర్యాలు పగులనుసాధించి పరమసౌఖ్యములను మీకుఁజేకూర్తుమని చెప్పి యోట్లుగైకొని చట్టనిర్మాణ సభాసభ్యులై యటఁజని ప్రభుత్వముతో బ్రతిఘటించి సదుపాయములను సంపాదించుటకసమర్థులై యట వినియోగపడక తమకోపముయొక్క తాపమునకుఁ దాళజాలక పరులపైవచ్చిన కోపమును భార్యలపై వినియోగించు పడుచుమన్లుహాంద్రవలె మనల బాధించుశాసనములు చేయుటకు మొదలిడియున్నారు. వారియద్భుత

చరిత్రలను మీకు వినిపింపఁబూని యిదివరకు శారద ముత్తులచ్చమ్మ గార్లు మూచేసియున్న వివాహగర్భాధాన వయోనిర్ణయ శాసనముల వలన వచ్చెడి యరిష్టములను మా సంజీవనీముఖమున మీకు వినిపించి యున్నవారము. మీరును వినియున్నవారుకదా?

"అతనికంటె ఘనుఁడే యాచాట మల్లన్న" యన్నలోకోక్తికి గురియగు గౌరుగారి యుపశీవివాహముండన మండనశాసనము మరి యొకటి బయలువెడలి యున్నది. ఇది భార్యాభర్తలకు విడియాకులం దిచ్చు శాసనము. భారతసంఘము పతివ్రతలకు జన్మభూమి యనినస్వ ల్పాపోక్తియగునుగాని యతిశయోక్తి యొంతమాత్రమును గానేరదు. కొందరుపురుషధౌరేయులు భార్యలను దిట్టుట కలదు. కొట్టుటయున్నది. కాల్చుట పేల్చుట వినుచున్నారము. లోపలి చెరసాలలలోఁ ద్రైచి రెండు దినములకో మూడుదినములకో కూడు పైచెడి వారుకూడ నున్నారు. ఇట్లెన్ని యో విధముల భర్తలు బాధించినను (నాసాధ్వీమణుల పాద పద్మముల కెరగినఁ బాపము నశించుటకు సంశయముండునా?) ఆసాధ్వీ మతల్లులు తమనిట్లు భర్తలు బాధించిరని చెప్పకొనరు. పతుల యడు గులకు మడుగు లొత్తుచు నడిచి దయసంపాదించుకొని మనుచుందురు. కొందఱట్లు బాధలు సహించలేక కొన్నిదినములు మాతులు బిగించు కొనియున్నను నాకోపము చల్లారినత్రోడనే మెల్లగఁ బతులకడఁజేరి తొల్లింటివలె సంతోషముతో గాలక్షేపము గావించుచుందురు.

మరికొందరు భర్తల కెదురాడుటయుఁ గలదు. ఇంక గొందరు మగని నెత్తిపై మొత్తి మొరబెట్టెడిమగనాండ్రును మనసంఘము నలంకరిం చియుండకపోరు. పతులచేఁ బ్రతిదినమును బాదపూజలు చేయించుకొను పతమపతివ్రతలు పలువురు భారతసంఘమున లేరనఁగలమా? అనఁజా లము కాని భర్తలెన్ని కష్టములు పెట్టినను సహించియున్నవారుకాని పతులకు విడియాకులందిచ్చి పరపురుషుల వివాహమాడి కులము పవి త్రముగావించిన కులాంగనలు మాత్రము లేరు. ఇట్లు మన కులాంగనలు ప్రవర్తించుటకుఁ గారణములు పాతివ్రత్యము, లోకాపవాదభీతియే కావు. ఇకేమన? బాధించినాడను కారణమున భర్తను బరిత్యజించి

తిమా? మనకు భర్తృసౌఖ్య మబ్బదు. అది మన మనుభవించవలెన్న మరియొకడు వివాహమాడడు. శాస్త్రమంగీకరింపదు. సంఘ మనుమతించదు. కాన నెన్నితిట్టినను గొట్టినను గోసినను బతితోడదే లోకమని లోబడియున్నవారు.

ఇపు డీ గారుగారి యువతీవివాహముండన మండనశాసనము పాసమ్యోనా? నూటి కేపదిమంది యోతక్క తక్కిన వనిత లందరును నపుంసకులను నెపమిడి పతులను విడియాకులందిచ్చి మరియొకరిని, మరియొకరిని విడుదలఁబెట్టి యింకొకరిని వరించుచు బతి పరంపరలతోఁ దినపరంపరలనుగడుప మొదలిడెదరు. తప్పదు నాభర్త నపుంసకుడు కాన నీతనికిని నాకునుగల వివాహబంధమును విచ్ఛేదముగావించు తీర్పు దయచేయుడని కోర్టులో నభియోగము తెచ్చెదరు. వ్యాజ్యకారణము నపుంసకత్వమొక్కటియే. అపుడు పుంస్త్వమున్నదని పురుషుడు ప్రతివాదము చేయకతప్పదు కదా? ఇందులకు సాక్షులు లభించరు. అదేమన? అదికన్నులకు గనుపడదు. వీనులకు వినరాదు. నాలుకకందదు. నాసికకుఁ జిక్కదు. చర్మమున కంటదు. భార్యాభర్తల కనుభవైకవేద్యము. కాన సాక్షులులభించుట దుర్లభము కాదా? ఇఁకఁ బురుషులకు దిక్కేవరు? వారి మనుగడ యెట్లు నడువవలయు?

ఇట్లనిన నింతవిచార మేల? పురుషులకు మోతుబరుసాక్షులు డాక్టరులున్నవారు. వారు దినదినాభివృద్ధినందుచున్నవారు. వారిలో నింగ్లీషు డాక్టరు లనియు నేటీవు డాక్టరులనియు యూనాని డాక్టరులనియు మూడు తెగలుగలవు. ఇందు మగడాక్టరులని ఆడడాక్టరులని మరి రెండు తెగ లిప్పుడు బయలువెడలుచున్నవి. వానిలో మగడాక్టరులనాశ్రయించి సర్టిఫికెట్టులు తేవలయునా? ఆడడాక్టరులనా? ఇం దెవ్వరినాశ్రయించినను ముందు వారికి ముడుపులుచెల్లించక తప్పదుకదా? చెల్లించెదరనుకొందము. పుంస్త్వమున్నది లేనిది తెలిసికొనుట కాడడాక్టర్లకవకాశముకలదు. కాని వారు స్వజాత్యభిమానము వదలుకొని పురుషులకుఁ బుంస్త్వమున్నదని సర్టిఫికెట్టుల నిత్తురని మేము విశ్వసింపఁజాలము. ఒకవేళ నం దెవరేని నిష్పక్షపాతబుద్ధిగల పుణ్యవతులుండి

పుంస్త్వమున్నదని దయదలచియిచ్చినను వాదులు మా మగల పుంస్త్వము వారికగపడినదేమో! తెలియదు. అగపడినయెడ వారేవారిని బెట్టుకొని మనవచ్చును. మా కగపడలేదనిన సమాధానమేమి చెప్పవలెను? సోమాదుగులయ్య గతిపట్టునుగదా?

ఇంక మన డాక్టరులు పురుషుల పుంస్త్వము తెలిసికొనుటకే పరీక్ష చేయవలెను? ముష్టిపరీక్ష యేనా? మరేమైననుండునా? ఉండిన ప్రయోజనమేమి? వారు తమపురుషులకు పుంస్త్వమున్నదని సాక్ష్యమిచ్చుటకు వత్తురని తెలిసెనా? వెంటనే వెళ్లి వారికి షేకుహేండునిత్తురు? స్త్రీలను జూడగనే షేకయ్యెడివారికి షేకుహేండిచ్చినయెడ వారు షేకుగా కెట్లు నిలిచెదరు? నిలచెదరా? ఒక్క గాఢాలింగనము గావించెదరు. దానితోఁ జల్లఁగజారకపోరు. జారరా? పైకార్యము పనులన్నియుఁ జక్కబెట్టును. వీరే కాదు. న్యాయవాదులు, న్యాయాధిపతులు, వేయేల గుమాస్తాలు మున్నగు వారిందరిని నొక్కగంటలో వనితలు వశ్యము చేసికొనగలరు? విడియాకు తీర్పులందుకొని విజయముతోఁ బోయి పరపురుషులకడఁ గయికోలు దంఖాస్తులు దాఖలు చేయుదురు. వారు మంజూరు చేయకమానరు. రానున్న యరిష్టములను వినిపించితిమి.

ఈయరిష్టములు రాకుండ జేసికొనుటకు వెరవులు వెదకుడు. మాకుదోచిన యొక్క వెరవు కలదు. అది వినిపించెదము వినుడు. ఆపదల నెదిరించుటకు నిగ్రహశక్తి కావలెను. అది దైవాధీనమైయుండును. దైవము మంత్రాధీనమైయుండువాడు. మంత్రము బ్రాహ్మణాధీనమైయుండునుగదా? కాన బ్రాహ్మణులు మంత్రానుష్ఠానముగావించి జగత్పతి యనుగ్రహము గడించవలెను. అదిమనకు నిగ్రహానుగ్రహశక్తిని బ్రసాదించును. శక్తిసంపన్నులు సంపాదించలేని కార్యము లుండునా? ఆపదలఁ బాపుకొందురు. లోకమును గాపాడఁగలరు. సంపదల సంపాదించనేర్తురు. సర్వకార్య సంసిద్ధిగాంతురు. ఆమంత్ర మేమందురా? సైర్మణకమీషన మంత్రము. ఇదియే యీకాలమున నభీష్టప్రదాన సమర్థమగు మంత్రరాజము. ఇద్దాని షట్ప్రయోగ విధులతోఁగూడ

రానుష్ఠ మాసంజీవనీ సంచికాముఖమున నుపదేశించఁ దలంచియున్న వారము.

"యతో ధర్మ స్తతో జయః, సత్యమేవజయతే, నానృతమ్."

— పత్రికాధిపతి.

కాశీనాథ నాగేశ్వరావపజయాత్మక

## విజయవాడ విప్రవిజయము.

శ్రీయుత కాశీనాథుని నాగేశ్వరరావుగారు ధనబలమున గులభేదములను గూల్పనెంచి గృహప్రవేశము, నవరాత్రి సంతర్పణములు లోనగు కార్యములందు వారి యధర్మపరతను గుర్తెఱుంగని విప్రవర్యులను రావించి సన్మానము గావించు నెపమున నధర్మవిముఖులగు ధర్మరతులను నధర్మమున కున్ముఖులనుజేయ వేలకొలది ధనవ్యయముగావించుచువచ్చిరి. అట్లే తమకూతురి వివాహమహోత్సవ సందర్భమున గూడ వేలకొలదిధనమును వ్యయముగావించి కులభేదములను నిర్మూలించుటకు దీక్షితులై సదాచారరతులగు శాస్త్రపండితులను, వేదాధ్యయన సంపన్నులను, చయనులను, సోమయాజులను, హవిర్యాజులను నాహ్వానించిరి. ఇట్లే విధవావివాహములను గావించుకొనినవారిని, జన్నిదములు త్రెంచివేసి కులభ్రష్టులైయున్నవారిని, నస్పృశ్యతతీసివేసి చండాలాదులతో జేరి యాహారవిహారాదులు గావించుచున్న వారిని, వేయేల సకలదురాచారవంతులను నాహ్వానించి వారిని వీరిని జేర్చి హయములను, గార్దభములనునొకరథమునకు గట్టినట్లు లోకవ్యక్తినిగూర్చుండబెట్టి యన్నమిడి సత్కరింప యత్నించిరి. కాని యీ కలిధర్మకుని విచిత్రచర్యలను గ్రహింపలేని పరగ్రామస్థులు కొందరు ధనాశాపరవశులై వచ్చి వీరి కులభ్రష్టాన్న సత్కారములను గ్రహించి కులభ్రష్టులయినను రావుగారి దురాచారపరత్వమును బూర్తిగ నెఱింగియున్న మా విజయవాడ విప్రవర్యులు మాత్రము వారిసంభావన సంతర్పణములను నిరాకరించి యాచంద్రతారార్కముగ రావుగారి యపజయమును తమ విజయమును నిలుచునటుల నిలిచియున్న వారని మాపాఠకులకు

వినిపించు మహాభాగ్యము మాకు లభించినందుల కానందించుచున్న వారము

ఇంతట్లో నాగేశ్వరరావుగారు కులభేదనిర్మూలనకర్మయందు విశ్రాంతిగైకొని యున్నవారని మా విజయవాడ విప్రవర్యులు తలంపవలదు. వారు తమకోర్కె కొనసాగించుకొనుటకై యింక ననేకప్రయత్నములు గావించుచునేయున్నవారు. అవి వినవచ్చినపుడెల్ల వానిని మా విప్రసోదరులకు వినిపించుచుందుము. ప్రకృతము వారుతెలంచిన కులనాశక ప్రయత్నములలో నాలుగు ప్రయత్నములు మాత్రము మాకిపుడు వినవచ్చియున్నవి. అవేమన?

(1) సంస్కృతసాహిత్య పరిషత్తునొనర్చి పండితులను రావించి వారికాతిథ్య సత్కారములనిడి భ్రష్టులగావించుట.

(2) నవరాత్రములందు వచ్చెడి వేదాధ్యయన సంపన్నులకు సంతర్పణ సత్కారములను గావించి కులభ్రష్టుల నొనర్చుట.

(3) సప్తాహముగావించి యాదులకు పంక్తిసామానుల నందరను రావించి యన్నదాన సంభావనదానములతో కులచ్యుతుల నొనర్చుట.

(4) రావుగారు తనపేర నాగేశ్వరపుర మను నొక పురమును నిర్మింపించి యందు పదుగురు బ్రాహ్మణులకు వసతిగృహముల నొసంగి యొక్కొక్క బ్రాహ్మణునికి బదియకరముల భూదానముగావించి నిర్మూలమున వారిని కులభ్రష్టులను జేయుట.

ఇాదులకై యొక లక్షరూప్యములను వెచ్చపెట్టుటకు రావుగారు దీక్షితులైయున్నవారని వినవచ్చియున్నది. ఈ రావుగా రొనర్చిన వివాహ సత్కార్యముల నిదివరకు నిరాకరించియున్న మా విజయవాడ విప్రవర్యులు ముందు వారు గావింపనున్న కులనాశక కార్యములందు గావించెడి సత్కారములనుగూడ నిరాకరించి తమయశశ్చంద్రచంద్రికలను దశదిశల వ్యాపింపజేయుదురని మేము విశ్వసించుటకు సంశయమేమి?

—పత్రికాధిపతి.

# రజస్వలా వివాహమాలిక.

విజయవాడ వాస్తవ్యులగు మ॥ రా॥ చల్లపల్లి నరసింహము పంతులుగారను వకీలుగారు కడచిన వైశాఖమాసమునందుఁ దమ కుమారునకుఁ బదియారు వర్షములు దాటిన ప్రాయముగల కన్యను వివాహము గావించుకొనివచ్చి గృహప్రవేశ సందర్భమున నూరేగింపుచేసి యున్నవారు. శ్రీయుత కాశీనాథుని నాగేశ్వరరావుగారి కూతురిముఖము ముదురుబారి యున్నదని చెప్పుకొనుటలోఁ దనివినందక ముడతలు సారి యున్నదనికూడఁ జెప్పుకొనియున్నవారు. దానికేమి? కాని రావుగారివలె పంతులుగారు వేలకొలదిధనము వెదఁజల్లి కులభేదములను గూర్చుటకు మాత్రము యత్నించియుండలేదు. ఇంతియెకాదు. రావుగారు తమ కుమారిక రజస్వలయైనది లేనిది యడిగినవారికిఁ జెప్పినవారు కారను కీర్తిని గడించియుండిరి. పంతులవారట్లుగాక యడిగినవారికిఁ బదియారువర్షములు గడిచిన రజస్వలయయిన కన్యయని చెప్పియున్న వారని వినియున్నవారము. —పత్రికాధిపతి.

# భవిష్యద్రజస్వలా వివాహము.

పై నరసింహము పంతులవారు రజస్వలయైన కన్యను తమ కుమారునకు వివాహము చేయుటయేకాదు. ఇదివరకిరువురు కుమారికలకుగూడ రజస్వలలైనపిదప నైదారువర్షములు కడచినమీదనే వివాహము చేసియున్నారట! కాని దైవమన్యథాచూచుటచే వారు కాలధర్మమంది యున్నవారని వినియున్నవారము. దైవోపహతికెవ్వరు పాత్రులుకారు? దానికేమి కాని యిపుడు మూడవ కూతురుకూడ రజస్వలయై రెండువత్సరములు కావచ్చినదని పెద్దవదంతి యొకటికలదు. కాని పంతులుగారు రావుగారివలె రజస్వలావివాహముల నముల లోనికిఁ దేవలెనని కూతుండ్రకు వివాహముచేయక నిలిపియుంచిన వారుకారంట! ఇఁకేమన? యుక్తసంబంధముకొరకు విచారించుచుండ వారిపుత్రికలు రజస్వలలగుట తటస్థించినదని బుద్ధిమంతులు చెప్పెదరు. ఎట్లైననేమి వివాహము కాకముందుమాత్రము రజోవతులై యున్న వారు. కాన పంతులవారు ముందొకరజస్వలావివాహము చేయనున్నారని మనమిపుడు చెప్పుకొనుట తప్పుకానుకదా? కాదు.

—పత్రికాధిపతి.

శ్రీ

# శ్రుతిధర్మసంజీవని

## అను నీమాసపత్రిక

శ్రు తిస్మృతిశిష్టాచార ప్రమాణముల ననుసరించును.

తి తీర్థులకు సంతరణోపాయములను దెలుపును.

ధ ర్మాధర్మవిధర్మములను వివేకించును.

శ్రీ ర్మ మభూయాత్తనువారలకు శ్రీలనొసంగును.

సం ఘసంస్కర్తల దుర్వాదములనిరసించును.

జీ వన్ముక్తి పదసోపానములనుజూపును.

వ ర్ణాశ్రమ ధర్మతత్పరుల నాశ్రయించును.

ని త్య సత్య హితమితవాదముల వినిపించును.

## చందావివరము

| | | |
|---|---|---|
| రాజపోషకులకు | సం॥నకి | రు 10-0-0 |
| ప్రధానపోషకులకు | ,, | రు 4-0-0 |
| అనుపోషకులకు | ,, | 3-0-0 |
| చందాదారులకు | ,, | 2-0-0 |
| ,, | ఆరుమాసములకు | 1-4-0 |
| | విడిపత్రిక | 0-3-0 |

Regd. No. M. 1480 చందా సం॥రు. 2.

శ్రీ

శ్రీ బాలాత్రిపురసుందర్యైనమః.

"యతోధర్మస్తతోజయః। సత్యమేవజయతేనానృతమ్".

# శ్రుతిధర్మసంజీవని

వర్ణాశ్రమ ధర్మపక్షమున వాదించు మాసపత్రిక.

"ధర్మఏవహతో హంతి ధర్మోరక్షతి రక్షితః."

శివపురపు వీరభద్రపాకయాజి పత్రికాధిపతి.


| సంపుటము. | విభవ అధిక శ్రావణ శు ౭ మంగళవారము. | సంచిక. |
|---|---|---|
| ౧ | జూలై-1928. | ౭ |


## విషయసూచిక


1 స్వాగతము — శ్రీగోపరాజు వైకుంఠరావుగారు

2 వివాహ గర్భాధాన వయోనిర్ణయ శాసన విమర్శనము — ,,

3 బాలికా వివాహ మండనము — పత్రికాధిపతి

4 కరీము జానకీ పరిణయము — ,,

5 అపాయంటు మెంటార్డరు — కలివక్రవర్తి

6 వనితా విశ్వ విద్యాలయం — ,,

7 పారితోషికము — ,,



బెజవాడ:

శ్రుతిధర్మసంజీవనీ ముద్రాక్షరశాలయందు

ముద్రింపఁబడి ప్రకటింపఁబడియె.

1928.

శ్రీ

శ్రీ బాలాత్రిపురసుందర్యైనమః.

"యతో ధర్మస్తతో జయః। సత్యమేవజయతే నానృతమ్".

# శ్రుతిధర్మసంజీవని

వర్ణాశ్రమ ధర్మపక్షమున వాదించు మాసపత్రిక.

"ధర్మఏవహతో హంతి ధర్మోరక్షతి రక్షితః."

శివపురపు వీరభద్రపాకయాజి: పత్రికాధిపతి



| సంపుటము. | విభవ అధికశ్రావణ శు ౭ మంగళవారము. | సంచిక. |
|---|---|---|
| ౧ | జూలై-1928. | ౭ |



## స్వాగతము.

---

క. శ్రీ పరమేశ్వరు కృపచే
తాన్మైమరల శ్రుతిధర్మ ♦ సంజీవని తాఁ
బాపెద్దువాదము లడఁచుచు
వ్యాపకమును గాంచి మిగుల ♦ వర్ధిలుత వెసన్। ౧

సీ. శివపురాన్వయ సింధు ♦ శీతభానుండన
నెలయుచు నుండెడి ♦ వీరభద్రి
పాకయాజికిఁ గూర్మి ♦ పట్టివై జనియించి
ప్రతిపక్షి హృదయముల్ ♦ వగులుభంగి
వేదశాస్త్ర విరుద్ధవాదముల్ ♦ మాపుచు
దైవయోగము దాఁటఁ ♦ దగనిదగుట
భ్రాతృవియోగ దు ♦ ర్భర దుఃఖవారిధి
మునిఁగియు దరిఁ జేరఁ ♦ గని ముదమున

తే. గీ॥ మరలఁ దొల్లిటియట్లధ♦ర్మముల నడఁప
మఱియుఁ దొల్లిటి యట్ల ధ ♦ ర్మముల నడుప

నేస్ఫ్ర శ్రుతిధర్మసంజీవని యన వెలయు
పత్రికా పుత్రికా! నీకు స్వాగతంబు॥ ౨

చ. అరయఁ బ్రపంచమంతయు యథార్థముగా బహుదుఃఖయుక్తమై
వరలుటెగాదె దానికి స్వభావము! కావున నందుచే భువిన్
బరగు సమస్తప్రాణులకుఁ బాయఁగరానిది దుఃఖ; మందుకై
వరశ్రుతిధర్మముల్ విడువవచ్చునె శ్రేయము గోరువారికిన్॥ 3

మత్తకోకిల॥ శానఁ దొల్లిఁటిభంగి దుర్మతఖండనంబును వేదశా
స్త్రానుసార సధర్మబోధయు నంచితంబుగఁ జేయఁగాఁ
బూని వెల్వడుటల్ దలంపగ భూరిమోదముఁ గూర్చెడిన్
గాననయ్యది శ్లాఘనీయముగాదె సాధుల కారయన్॥౪

---

ఇట్లు,
స్వాగత సమర్పకుడు,
గోపరాజు వైకుంఠరావు.

తిరువల్లిక్కేణి
18—6—28.

# వివాహగర్భాధానవయోనిర్ణయ

## శాసనవిమర్శనము.

(గోపరాజు వైకుంఠరావు—తిరువలిక్కేణి,
మదారాసు)

—* ఇష్టదేవతాస్తుతి *—

ఉ. శ్రీరమణీ మనోహరుఁ డశేషకృపాకలితాంతరంగుఁ "డీ
ధారుణి ధర్మహానియు నధర్మవివృద్ధియు నెప్పు డెప్పు డౌ,
నారయ నప్డు నేఁ బొడమి యంచితధర్మముఁ బ్రోతు" నన్న య
వ్వారిజనాభుఁ డిప్పుడు కృపామతిధర్మము నిల్పుగావుతన్॥ 1

క. ఈధరణి ధర్మమునకగు
బాధల మాన్పుదుగుగాత పటుకృప గీర్వా

మాధవుఁడును మాధవుఁడు ను
మాధవుఁడును ధర్మలోల ♦ మతులి వ్వేళన్॥ 2

క. అని యిష్టదేవతాస్తుతి
యొనరించి ధర్మమున ♦ కొదవనుఁడినహానిన్
వినిపింతు నొక్కడానిన్
విని యందలి కీడు, మేలు ♦ వివరింపఁ దగున్॥ 3

సీ. వసుధపై జనులు వివాహ ♦ గర్భాధాన
సంస్కారములు ప్రీతిఁ ♦ జరపుకొనుట
యఖిల మానవజాతు ♦ లందును గనఁబడుఁ
బాశ్చాత్యులాదియౌ ♦ ప్రజలయొక్క
దృష్టిలో వీనియు ♦ ద్దేశ్యముల్ దంపతుల్
రతిసౌఖ్యములగు సం ♦ తతిఁ బడయుట
తలఁప నియ్యదియె ప్ర ♦ ధాన ప్రయోజనం
బుగ వారలెంతురె ♦ ప్పుడునుగూడ

తే. నట్టి యుద్దేశ్యములకు న ♦ భ్యంతరంబు
గలుగకుండినఁ జాలు ♦ వారలకు ; వారి
యిచ్ఛవచ్చిన విధమున ♦ నెట్టులైన
జరపుకొనుచుందు రట్టి సం ♦ స్కారములను॥ 4

తే. వారల వివాహములరీతి ♦ వాని మరల
రద్దుపఱచు కొనెడునట్టి ♦ క్రమును ; మఱియు
స్త్రీల స్వేచ్ఛకొఱకు వారు ♦ చేయునట్టి
చర్యలే సాక్షి పై మావ ♦ చనములకును॥ 5

సీ. భరతవర్షంబునఁ ♦ బరగెడు బ్రాహ్మణ
క్షత్రియ వైశ్యాది ♦ జనులుగూడఁ
అరయ వివాహ గ ♦ ర్భాధానములు చేసి
కొని పై సుఖంబుల ♦ ననుభవింతు
రైనఁ బైకార్యంబు ♦ లాచరించుట యందు
వారిచే గమనింపఁ ♦ బడు నియమము

లాచార మంత్ర తం ౹ త్రాదిసంస్కారముల్
పరికించి చూడఁగా ౹ బైసుఖంబు
తే. లనుభవించుట కంటె ముఖ్యప్రయోజ
నంబు వేఱొండుగలదు సత్యంబటంచుఁ
దోఁచు రూఢిగ బుద్ధిమంతులగు వారి
కట్లు తోఁపగ హేతువే ౹ మనిన? వినుఁడు॥ 6

సీ. రతిసౌఖ్యసంతతు ౹ ల్మాత్రమే వలసిన,
స్వకులంబునను పెండ్లి ౹ జరుప నేల?
రతిసౌఖ్యసంతతు ౹ ల్మాత్రమే వలసిన,
నిజగోత్ర పరగోత్ర ౹ నియతి యేల?
రతిసౌఖ్యసంతతు ౹ ల్మాత్రమే వలసిన,
మంత్ర తంత్రోక్త హో ౹ మంబులేల?
రతిసౌఖ్యసంతతు ౹ ల్మాత్రమే వలసిన,
శాస్త్రోక్తముగఁ బెండ్లి ౹ జరుప నేల?
రతిసౌఖ్యసంతతు ౹ ల్మాత్రమే వలసిన,
నిజదార పరదార ౹ నియమమేల?
రతిసౌఖ్యసంతతు ౹ ల్మాత్రమే వలసిన,
విధినిషేధములేల ? ౹ —వేయునేల?
రతిసౌఖ్యసంతతు ౹ ల్మాత్రమే వలసిన,
బరికిపఁ బెండ్లి య ౹ న్బంధమేల?
ఆ. పైవిధంబులైన ౹ బంధంబు లించుక
గాని యెఱుఁగనట్టి ౹ మానవులును
బసువులును మృగములుఁ ౹ బక్షులు నవనిలో
రతిసుఖంబుఁ జెంది ౹ ప్రజల గనవె॥ 7

క. కావునను భారతీయులు
పైవిధుల నిషేధములను ౹ బాటించుటలో
భావింప ముఖ్య మనఁదగు
భావం బేమనినఁ దెలియఁ ౹ బలుకుదు మింకన్. 8

ఉ. భారత భూమిపై వరలు । బ్రాహ్మణు లాదిగఁ గల్గువారి సం
సారమునుండి బాపి స్థిర । సౌఖ్యము గల్గి సుఖించునట్లుగాఁ
గూరిమితోడ మోక్ష మొస । గూర్చుటె వారి మతంబు చేయఁగాఁ
గోను మహోపకార మది । కూర్చెడునట్టి విధం బిఁకెట్లనన్? 9

సీ. మోక్షంబు విజ్ఞాన । మూలంబనియు నట్టి
జ్ఞానంబు జనులకు । శ్రవణమనన
ముల మూలమునగాని । గలుగఁ బోదనియును
శ్రవణాదు లొనరింప । జనులు వారి
చిత్తశుద్ధిని బట్టి । యుత్తమ మధ్య మా
ధములని మూఁడు వి । ధంబులైన
యధికారులై యుందు । రనియు లోకమునందుఁ
గనుపించు సామాన్య । జనములెల్ల
తే. నరయ నధమాధికారులే । యనియు వారు
శాస్త్రకర్మల విధ్యుక్త । సరణి జరుప
కన్యథా నెన్నటికిఁ నుత్త । మాధికార
మందరనియును శాస్త్రంబు । లందుఁ దెలియు॥ 10

ఆ. శాస్త్ర విహితకర్మ । సక్రమంబుగఁ జేయఁ
జిత్తశుద్ధిగలిగి । యుత్తమాధి
కారమొదవు దాప । వారి కనాయాస
ముగను జ్ఞానసిద్ధి । యగుట నిజము॥ 11

ఉ. కావున శాస్త్రయుక్తమగు । కర్మల యన్నిఁటి యూహ యేమనన్
జీవు లనేకజన్మములఁ । జేసిన కర్మలచేత వారికిన్
భావములందు బీజముల । భావమునొందిన కర్మవాసనల్
పోవనడంచి జ్ఞానమును । బొందుగ మోక్షము నిచ్చుటేసుఁడీ॥ 12

ఆ. అట్టికర్మ శాస్త్ర । మానతిచ్చిన రీతి
మాని వేఱురీతి । మానవుండు
చేసెనేని జ్ఞాన । సిద్ధికి మారుగ
ఘోరనరకమునను । గూలువాఁడు॥ 13

క. ఈకరణిని మా చెప్పుట
యేకా దీక్రిందిరీతి । నీయర్థము నే
శ్లోకంబుల గీతలలో । శ్రీకృష్ణుం
డర్జునునకుఁ జెప్పుట వినవె॥ 14

శ్లో॥ "యశ్శాస్త్రవిధి ముత్సృజ్య వర్తతే కామకారతః
నససిద్ధి మవాప్నోతి నసుఖం నపరాంగతిమ్"॥ (భగవద్గీత)

శ్లో॥ "తస్మా చ్ఛాస్త్రం ప్రమాణం తే కార్యాకార్య వ్యవస్థితౌ
జ్ఞాత్వా శాస్త్రవిధానోక్తం కర్మకర్తుమిహార్హసి॥"(భగవద్గీత)

శా. దీనింబట్టి తలంపఁ బై ప్రజలలో । ధీమంతులౌ మానవుల్
జ్ఞానంబొంది సుఖింపఁ గోరినయెడన్ । శాస్త్రంబు మున్నెట్టి చం
దానం గర్మవిధించెనో యటులనే । తామాచరింపన్ వలెన్
దానం జేసియెగాదె పైనియమముల్ । తామట్లు పాటించుటల్॥15

మ. అరయ గన్యలకున్ వివాహములు గ । ర్భాధానముల్ సేయఁగా
సరసంబైన వయస్సులన్ దొలుత పై । శాస్త్రంబె తా నిర్ణయిం
చె రహిన్ దద్విధిఁ జేయకుండిన యెడం । జేకూరు దోషంబులన్
వరుసం దా వినిపించె మానవులకున్ । వారా ప్రకారంబుగన్॥16

తే. శాస్త్రమానతి యిచ్చిన । చందమున నె
జరపుచుండిరి యిందలి । సత్యమిదియె
దీని నెఱుఁగక కొందఱీ । దేశజనులు
శాస్త్రవిధిమీరి స్వేచ్ఛగాఁ । జనఁగడఁగిరి॥ 17

సీ. తామట్లు చనుటలోఁ । దనివినొందక వారు
తక్కిన మనుజు లం । దఱును గూడ
తాము చేసెడి యవ్వి । ధంబున నే చేయఁ
గాఁ గోరి ప్రభువుల । కడను జేరి
శాస్త్రోక్తవయసున । జనులు పై కార్యముల్
సేయుచో వారి శి । క్షించునట్టి
తీవ్రశాసనము లు । ద్దేశించి నిర్మింప
దొరతనంబును వేఁడఁ । దొడఁగిరిపుడు

వారిలో ముఖ్యు లెవ్వరన
ఢిల్లీలోని సామ్రాజ్యశాసన సభ్యులౌకరు
మఱియును వేఱొక్క మగువ యీమద్రాసు
రాష్ట్రశాసనసభ్యు రాలు వారు

తే. హరవిలాస శారదయను నట్టివారుఁ
జెలఁగి డాక్టరు ముత్తులక్ష్మి యనునాపె
వీరికోర్కె నామోదించు వారుగలరు
సభ్యులింకను గొందఱా సభలలోన॥ 18

శా. పైశాస్త్రంబున వీరలందఱకు విశ్వాసంబు లేకున్నఁ దా
మా శాస్త్రోక్తవిధంబు మాననగుఁ గాకం దెంతొ శ్రద్ధాళులౌ
దేశంబందలి యన్యమానవుల బాధింపంగ నూహించుటల్
లేశంబైనను న్యాయమౌనె? ప్రభువుల్ దీనిన్ విచారింపరే!! 19

సీ. తా మొనరింపంగఁ దలఁచు సంస్కరణంబు
లాభకరముగాఁ దలంతు రేని
యందుచే జనులకు నబ్బెడి లాభముల్
కానిచోఁ గల్గెడి కష్టములును
దెలియునట్లుగను బోధించి వారలను మె
ప్పించి యొప్పించి చేయించుటొప్పుఁ
గానిచోఁ దామెల్ల దాని ననుష్ఠించి
యందుచేఁ దమకుఁ బ్రత్యక్షమైన

తే. ఫలములను లోకమునకు గన్పఱచి యటుల
జనులనొప్పించి చేయింపఁ జనును మఱియు
నపుడు వీరెల్లనలదని యనినఁగూడ
నందఱును వీరిమార్గమే యనుసరింత్రు॥ 20

తే. అదియుఁగాక యీవిషయంబు నందుఁ బ్రభుల
నాశ్రయించుటలోఁ గల్గు నవసరంబు

బోధచేగాని ప్రత్యక్ష◆ముగనుగాని
జనుల మెప్పింపలేమిని ◆ జాఁట దొక్కొ॥ 21

చ. అది యొనరింపఁగాఁ దగిన ◆ యట్టి విధంబగు నే జనంబులం
బెదరిచి యొంచి "వారలకు ◆ మేలొనరించితి" మంచు నెంచిన
హృదయములందు దోషమె వ◆హింతురు వారు ప్రభుత్వమందుఁ బై
చదివిన సభ్యులందు మఱి◆సఖ్యముఁ బ్రీతియు నొందఁజూతురే॥ 22

తే. దీనివలనను మనయొక్క ◆ దేశమందు
నైకమత్యంబు మొదలంట ◆ నడఁగిపోవె
ప్రభుల యెడనున్న ప్రజల వి◆శ్వాసమెల్ల
మఱియుఁ దా రూఢిగను ◆ రూపు మాసిపోదె॥ 23

క. ఇందలి సత్యాసత్యము
లందగఁ జింతింపఁగోరి ◆ ప్రభువుల, మఱిపై
నం దెలిపినట్టి సభ్యుల
బృందముఁ బ్రార్థించి ◆ దీనివిరమింతు మిఁకన్॥ 24



ట్రిప్లికేన్, మదారాసు.
25—6—28.

ఇట్లు,
గోపరాజు వైకుంఠరావు.

## ఒక కలికలికి పలుకు.

తే. గీ॥ కూతు కూతును బెండ్లాడి ◆ కొడుకుకుట్ల!
మరుని కేళిని నన్నుఁ దేల్చి ◆ మగఁడవైతి
విధురుఁడవు నీవు నేనును ◆ విధవనైతిఁ
గొడుకు కలడైన నాకు లోఁ◆బడినవాఁడు॥

— నారదశర్మ.

శ్రీ

రజస్వలా వివాహ ఖండనాత్మక

# బాలికా వివాహ మండనము.

(ప్రథమభాగము.)

రజస్వలలగుటకుఁ బూర్వము కన్యలకుఁ బరిణయము చేయుట శాస్త్రాచార విహితమగు ధర్మముకాదు. సంశయములేదు. కాన రజస్వలావివాహమే శాస్త్రీయమై యాచరణీయమై యున్నధర్మమనుచు గురులనుగూడఁ దృణీకరించి యాచరణలోనున్న బాలికా వివాహము అను ద్రోసిరాజని శాస్త్ర విరుద్ధములైన రజస్వలావివాహములను నాచరణలోనికిఁ దెచ్చుటకుఁ బరమ సాధనములైయున్న హరవిలాస శారదముత్తులక్ష్ముల వివాహగర్భాధాన వయోనిర్ణయ శాసనములను నామోదించవలసినదని లోకమున కాంధ్రపత్రికాముఖమున బోధించు పండిత ప్రకాండులు బలువురు బయలువెడలి యున్నవారు. వారి వాదములను ఖండించి యీవిమర్శనము బాలికా వివాహములను మండనము కావించుచున్నది. కాన దీనికి "రజస్వలా వివాహ ఖండనాత్మక, బాలికావివాహ మండనమను నన్వర్థనామకరణము గావించి యున్నవారము.

ఇట్లనిన బై గురుశిష్యులెవ్వరని మా పాఠకులు ప్రశ్నింతు రేమో! ప్రత్యుత్తరము వినుడు. గురులు విజయనగర వాస్తవ్యులగు శ్రీమహా మహోపాధ్యాయ తాతా సుబ్బారాయ శాస్త్రిగారును. శిష్యులు వాసా సూర్యనారాయణశాస్త్రి బంకుపల్లి మల్లయ్యశాస్త్రి గార్లును నై యున్నవారు. వీరికిఁ జక్రరక్షకులుగా నపాలసోమయాజుల మహాదేవ శాస్త్రియను పుత్రనామమున శ్రీకావ్యకంఠ గణపతి శాస్త్రిగారును నాగ్యసోమయాజుల సోమయాజులుగారును నిలిచి యున్నవారు. వీరికి వెనుక హంగుచేయు పండిత ప్రవరులును మరికొం

దరు బహువులు వెడలి యున్నవారు. వీరు వ్రాసెడి వ్యాసములు చూచిన వారికిఁ జిత్తశాంతి జ్ఞప్తికి వచ్చుననుటకు సంశయింపఁబనిలేదు. గురులగు శ్రీ సుబ్బరాయ శాస్త్రిగారు శిష్యుల కిట్లుపదేశించిరనివింటిమి. అదేమన? మీరుచేయుచున్న వాదములు శాస్త్రాచార విరుద్ధములును సంఘారిష్ట దాయకములును నై యున్నవి. కాన వానిని వదులుకొండని హితోపదేశము కావించితిమి? కాని వానిని మా ఛాత్రులు పెడచెవినిడి పని చేయుచున్నవారని శాస్త్రిగారు సెలవిచ్చినటులవింటిమి. ఈచెప్పిన దానింబట్టి గురులు బాలికా వివాహముల నామోదించి రజస్వలావివాహములను నిషేధింపఁ బాటుపడుచున్నవారనియు శిష్యులట్లుగాక బాలికా వివాహములను మాత్రమే భారతసంఘమున నాచరణలోఁబెట్టుటకు యత్నించుచున్నవారనియు మాపాఠకులు గ్రహింపఁ గలిగి యున్నవారుకదా?

ఇట్లడిగినఁ బండితులగు వాసా సూర్యనారాయణశాస్త్రి ప్రభృతులట్లు శాస్త్రాచార దూరములును సంఘ హానికరములును నగు రజస్వలావివాహములను భారతసంఘమున బలవంతముగాఁ జొప్పింపగోరి దుష్ట శాసనములను నామోదించుటకుఁ గారణ మేమైయుండునని మాపాఠకులు ప్రశ్నింతురేమో! ప్రత్యుత్తరము చెప్పెదమువినుడు. పై సూర్యనారాయణశాస్త్రి మల్లయ్యశాస్త్రిగార్లు ప్రకృతస్థితికి వచ్చుటకుంగల కారణమును వారి గురులగు శ్రీ తాతారాయశాస్త్రి గారే యిట్లు సెలవిచ్చినటులవింటిమి. అదేమన? మా ఛాత్రులు పర్లాకిమిడి సంస్థానమునందాస్థాన పండితులైయున్నవారని సెలవిచ్చియున్నవారు. పర్లాకిమిడి సంస్థానాధీశులు సాంఘసంస్కార ప్రియులును బ్రాహ్మణద్వేషులు నై యున్నవారు. కాని వారు రజస్వలావివాహములను బలవంతముగానైన బ్రాహ్మణసంఘమునఁ జొప్పించి కులభ్రష్టులను జేసి వారి కులాధిక్యతను గూల్పవలెననియత్నించువారగుటచే శాస్త్రవాదము తాము చేయఁజాలమిని దమయాస్థాన విద్వాంసులను రజస్వలావివాహముల సాధింపఁ బురికొలిపి యున్నవారు. కాంచితిరా తృణీకృత బ్రహ్మపురాదస్థలై ప్రవర్తించెడి బ్రాహ్మణ పండితులునేను

కూటికై కులాచారములను గూల్చెడి కువాదములను గావించు దుర్గతిలోఁ గూలియున్న వారు

ఇఁకఁ జక్రరతుకుల మాట యించుక వినిపించెదము వినుడు. మహాదేవ శాస్త్రిగారు కావ్యకంఠ బిరుదాంకితులగు అయల సోమయాజుల గణపతిశాస్త్రిగారి పుత్రులై యున్నవారు. కాన మహాదేవ శాస్త్రిగారు పండిత పుత్రులను ప్రసిద్ధికిఁ బాత్రులై యున్నవారే సంశయములేదు. కానఁ గావ్యకంఠుల వారే పుత్రునిపేరుతో బత్రికలలోఁ బ్రభాసించు చున్నవారని మాపాఠకులు గ్రహింతురుగాత. వీరిదివర కస్పృశ్యత తీసివేసి చండాలురను నంటుకొండని బోధించిన ఘన పండితులను నది జగద్విదితమగు విషయమేకదా? ఇఁక వారు రజస్వాలా వివాహములను సాధింపఁ బూనినపుడు మనము విచారపడనేల? మతి చెడిన వారుచేయు వాదములకు విధినిషేధములతోఁ బనియుండునా? పండితులేయిట్టి దుస్థితికి వచ్చినపుడు పండితంమన్యులగు నార్య సోమయాజుల సోమయాజుల వారి వాదములనుగూర్చి మనము వింతపడవలసిన యవసరము కానేరాదు. ఇంతవరకుఁ జెప్పినదానింబట్టి గురుశిష్యులుభయులును రజస్వలావివాహముల విషయమై భేదించిరని తెలియవచ్చినది. వానిని సాధించుపట్ల శిష్యులు భిన్నమార్గగాములై యున్నవారు ఇంతియెగాక శిష్యులవలె మహామహోపాధ్యాయులవారు హరవిలాస శారద ముత్తులక్ష్మిగార్ల వివాహగర్భాధాన శాసనముల నామోదింపక వానిని నిరాకరించి యున్నవారమని చెప్పియుండుటంబట్టి శిష్యుల వాదములను విమర్శించుట ముఖ్యమనితోఁచి యీపని కుపక్రమించు చున్నవారము.

(ఉపక్రమము.)

పండిత చక్రవర్తులగు సూర్యనారాయణశాస్త్రి మల్లయ్య శాస్త్రిగార్లు కావించుచున్న శాస్త్రవాదమును గాంచితిరా? ఇటుకనుడు. వివాహ ప్రకరణములోని "సోమః ప్రథమో వివిదే, సోమోదదద్గంధర్వాయు" అను రెండుమంత్రములను మనమున నిడుకొని వానికర్థముగా సంవర్తమహర్షి "రోమకాలేతు సంప్రాప్తే సోమోభుఙ్క్తే థక

కన్యకా” యను శ్లోకమును స్మరించియున్నవాడు. పై శ్రుతి స్మృతులను రెంటినిజేర్చి యన్వయించినయెడ వివాహమునకు ముందు రోమములు రజస్సూచకములు వచ్చియున్న కన్యలను మాత్రమే వరులు వరించవలె నను నర్థము సులభుగ స్ఫురించుచున్నది. కాన రజస్వలావివాహములే వేదశాస్త్ర ప్రతిపాదితములై యున్నవి. కాని బాలికా వివాహములు వేదశాస్త్ర ప్రతిపాదితములు కావని పండితచక్రవర్తులు వాదించియున్న వారు. కనుక నీవిషయమై మనమును బిట్టుచర్చించి సత్యార్థమును వెల్ల డించవలసి యున్నవారము.

శ్రుతిస్మృతులు వివాహమునకు ముందును వివాహమైన పిదప గర్భాధానమ్మునకు ముందును గన్యలకు సోమగంధర్వాగ్నులు భర్తలై యుందురని తెలిపియున్నవి కాని మనపండిత చక్రవర్తులు చెప్పినటుల వివాహమునకు ముందుమాత్రమే భర్తలయ్యెదరని తెలిపియుండలేదు. కాన నీవాదభేద రహస్యము తెలియక మనపండిత చక్రవర్తులు ప్రమా దముపాలై దుర్వాదమునకు దొరకొని యున్నవారు. అదేమన? చెప్పె దము వినుము. ప్రతివాదులిచ్చిన మంత్రములను ముందు వినిపించి పిదప స్మృతిపరామర్శ గావింతుము.

(1) “సోమః ప్రథమో వివిదే. గంధర్వో వివిద ఉత్తరః, తృతీయో అగ్నిష్టేపతిః, తురీయస్తే మనుష్యజాః (2) సోమోదద ద్గంధర్వాయ,గంధర్వోదద దగ్నయే, రయించపుత్రాగ్ శ్చాదాదగ్నిర్మహ్యా మథో ఇమాం”

కన్యలకు సోముడు మొదటిమగడు, రెండవమగడు గంధర్వుడు, మూడవమగ డగ్నిహోత్రుడు, తరువాత మనుష్యుడ నగునేను నాలవమగడ నగుచున్నాడనని మొదటి మంత్రముఖమునం జెప్పినవ రుడే సోముడు గంధర్వునకును, గంధర్వు డగ్నికిని గన్యనీయంగా నగ్ని ధనమును బుత్రులను గన్యను దనకిచ్చియున్నాడని రెండవ మంత్రముఖ మునం జెప్పియున్నాడు. ఈ మంత్రార్థములను మనమునందిడుకొనియే మహర్షులు మేము చెప్పినటుల వివాహమునకు ముందును దరువాత గర్భాధానమునకు ముందును సోమ గంధర్వాగ్నులు భర్తలై పాలించి యున్నారని స్మృతివచనములు రచించియున్నారు. ఇటుల వినుము.

యాజ్ఞవల్క్య మహర్షి

శ్లో॥ సోమశ్శౌచం దదౌస్త్రీణాం। గంధర్వశ్చ శుభాంగిరం।
పావకస్సర్వ మేధ్యత్వం। మేధ్యావైయోషితో హ్యతః॥

అని చెప్పియున్నాడు. ఈశ్లోకమునకు విజ్ఞానేశ్వరుడిట్లు వ్యాఖ్య రచించియున్నవాడు. అదేమన?

"పరిణయ నాత్పూర్వం సోమగంధర్వ వహ్నయః స్త్రియో భుక్త్వా యథాక్రమం తాసాం శౌచమధురవచన సర్వమేధ్యత్వాదీని దత్తవంతః తస్మాత్ స్త్రియః సర్వత్ర స్పర్శనాలింగనాదిషు మేధ్యాః"

అని వివరించియున్నాడు. ఈశ్లోకము నేయత్రి మహాముని కూడ నుడివియున్నాడు. కాన వివాహమునకు ముందు సోమగంధర్వాగ్నులు స్త్రీలననుభవించి యథాక్రమముగ వారికి శౌచము మధురవాక్కు సర్వమేధ్యత్వము (అనుభవార్హత) ప్రసాదించి యున్నవారు. ఇందు చేతనే స్త్రీ లెప్పుడును స్పర్శనాలింగనాదులం దనుభవింపదగిన శుద్ధ లైయున్నారని పైశ్రుతి స్మృతిభాష్యముల కర్థము. ఇట్లనిన మీరు చెప్పిన కన్యాలక్షణములు వివాహమునకు ముందేర్పడునని పైవచనములు చెప్పియున్నవి. అంతియెకాని యవి యెనిమిదేండ్లకు లోపల సోమగంధర్వాగ్నులు శౌచశుభ వాఙ్మేధ్యత్వముల నిచ్చెదరని చెప్పి యుండలేదుకదా? అవి మావాదమునకుఁ బ్రతిబంధకము లెట్లగును? వివాహమునకు ముందు శౌచశుభ వాఙ్మేధ్యత్వములనే గాక మేము కన్పరచిన సంవర్త వచనానుసారముగఁ గన్యలకు రోమరజః కుచోత్పత్తులనుగూడ సోమగంధర్వాగ్ను లొసంగెదరని చెప్పిన తప్పేమి? యని మరల మన ప్రతివాదులు ప్రశ్నింతురేమో! ఇందులకు సమాధానమును ధర్మసింధు విట్లు చెప్పుచున్నది. అదేమనః? వినుము.

"జన్మతో గర్భాధానాద్వా పంచమవర్ష ప్రభృత్యష్టమవర్ష పర్యంతం కన్యావివాహే ఉచితః కాలః, షడ్వర్షోత్తరం వర్షద్వయం ప్రశస్తతరః నవమదశమయోర్మధ్యమః ఏకాదశవర్షేఽధమః ద్వాదశాద్రా యశ్చిత్తావహః"

అని ధర్మసింధు చెప్పియున్నది. జన్మను బట్టికాని గర్భాధానమును బట్టికాని మైదవ సంవత్సరము మొదలుకొని యెనిమిదవ వత్సరమువరకుఁ గన్యా వివాహవిషయమై యోగ్యకాలము, అందేడెనిమిది వత్సరములు రెండును ప్రశస్తతరములై యున్నవి. తొమ్మిది పది వర్షములు మధ్యస్థములు. ద్వాదశ వత్సరాదియందుఁ గావింపఁబడు వివాహకాలము ప్రాయశ్చిత్తావహము. అని పైధర్మసింధు వాక్యముల కర్థము. ఈయర్థమును మీఁదఁ దెలిపిన విజ్ఞానేశ్వర వచనార్థముతోఁ జేర్చి యన్వయించిన యెడ సోమగంధర్వాగ్నులు కన్యలకైదారేడు వత్సరముల ప్రాయములందుఁ గ్రమముగ శౌచశుభవాఙ్మధుర్యాదుల నిత్తురనియు నటుపై మానవులు వివాహమాడవలయుననియు స్పష్టమగుచున్నది ఇపుడు సంవర్త మహర్షి చెప్పిన రోమరజఃకుచోత్పత్తిరూప కన్యాలక్షణముల నేడెనిమిది యేండ్ల ప్రాయములో వివాహమయ్యెడి బాలికల కెట్లు సమన్వయింప వచ్చును? సమన్వయింపరాదు. కాన సంవర్తుఁడు "సోమః ప్రథమో వివిదే, సోమోదదద్గంధర్వాయ" అను మంత్రార్థములను మనమున నిడుకొని వివాహానంతరము గర్భాధానాత్పూర్వము సోమగంధర్వాగ్నులు క్రమముగా రోమరజఃకుచోత్పత్తి సంపత్తులను గన్యలకిచ్చెదరని మేము చెప్పిన యర్థమునే పై వచనముఖమున చెప్పియుండవలెను. మఱియొకవిధముగాఁ జెప్పరాదు.

ఇంతియె కాదు. ఎనిమిదేండ్లకు లోబడిన వయసులోనున్న కన్యలకుఁగూడ వివాహము చేయవచ్చునని మను వీక్రింది శ్లోకముఖమునఁ జెప్పియున్నాడు. అదేమన?

శ్లో॥ ఉత్కృష్టాయాభిరూపాయ। వరాయ సదృశాయచ।
అప్రాప్తామపి తాంతస్మై। కన్యాం దద్యాద్యథావిధి॥

ఈ శ్లోకమునకుఁ గుల్లూకభట్టాచార్యుడిట్లు వ్యాఖ్యానము చేసియున్నాడు.

"కులాచారాదిభిరుత్కృష్టాయ సురూపాయ సమానజాతీయాయ వరాయ ప్రాప్తకాలామపి "వివాహేచైవ దష్టవర్షామేవ

ధర్మోనహీయతే ఇతిదక్షస్మరణాత్ తస్మాదపికాలా ప్రాగపికన్యాం బ్రాహ్మవివాహ విధినాదద్యాత్"

కులాచారములచే నుత్కృష్టుడును సుశూపుడును సమానజాతీయుడును నగు వరుడు లభించెనేని నతనికి నెనిమిదేండ్ల కన్యకు వివాహముచేయవలసినదను దక్షస్మృత్యనుసార మా యెనిమిదేండ్లప్రాయము లేమకన్యకు రాకపోయినను దానిని బ్రాహ్మవివాహ విధిననుసరించి వివాహము చేయవచ్చునని పై మనువచనార్థము. ఈయర్థము మీది యాజ్ఞవల్క్య విజ్ఞానేశ్వర ధర్మసింధు వచనార్థములను బలపరచుచున్నది. ఈ చెప్పిన దానింబట్టి సంవర్తుడు చెప్పిన రోమకాలేతు సంప్రాప్తేయను శ్లోకార్థమును వివాహమునకు ముందని చెప్పరాదు. చెప్పిన యెడ మా ప్రతివాదులకు వచ్చెడి యనర్థములను జెప్పుచున్నారము. ఇటువినుడు.

పై మంత్రార్థములను మనమునం దిడుకొని స్మృతిరచించుట కుపక్రమించిన సంవర్తమహర్షి సోమగంధర్వాగ్నులు కన్యలకు రోమరజః కుచోత్పత్తులను సేత్తురను పై మంత్రములలో లేనియర్థమును "రోమకాలేతు సంప్రాప్తే సోమోభుఙ్క్తే థకన్యకాం। రజోదృష్ట్వాతు గంధర్వః। కుచాదృష్ట్వాతు పావకః" అను శ్లోకముఖమున వినిపించి "రయించ పుత్రాగ్। శ్చాదాదగ్ని ర్మహ్యమథో ఇమాం" అను మంత్రములో ధనమును బుత్రులను గన్యను నాకగ్ని యిచ్చినాడని చెప్పిన విషయములను జెప్పియుండలేదు. కాన వివాహము నాటి కాకన్యలు సోమగంధర్వాగ్ను లొసంగిన రోమరజః కుచముల సహాయమున ధనమును బుత్రులను సంపాదించుకొని యున్నారని మాప్రతిపక్షులొప్పక తప్పదుకదా? ఇది కేమి చెప్పెదరని యడిగితిమా? ప్రతివాదులు మౌనమునైనా యాశ్రయించవలెను. లేదాధనమునుపుత్రులను వివాహానంతరము కన్యలు కందురని యంగీకరింపక తప్పదు. ఇందేపని కావించినను బ్రతివాదుల వాదము నిర్మూలమగును. ఇపుడు పై సంవర్తమహర్షి వచనార్థము వివాహానంతరమున గర్భాధానమునకు ముందు విని యోగమగునని మేముచేసిన సమన్వయము శాస్త్రవిహితమైనదని

స్థాపింపఁబడినది. ఈయర్థమునే క్రింది యత్రిమహాముని వచనము కూడ బలపరచుచున్నది.

శ్లో॥ పూర్వం స్త్రియస్సురైర్భుక్తాః। సోమగంధర్వ వహ్నిభిః।
భుజ్యంతే మానవైః పశ్చాత్। నైతాదుష్యంతి కర్హిచిత్।

ఈశ్లోక మత్రిసంహిత యందుగూడఁగలదు. సోమగంధర్వాగ్నులచే స్త్రీలు ముందనుభవింపఁబడుదురనియుఁ దరువాత పురుషులచు భవింతురనియు నంతమాత్రమున వారు దూషణార్హలు కారనియుఁ బై వచనార్థము. ఈయర్థమును కూడ మేమిదివరకుఁ జెప్పినపగిది వివాహమునకు ముందునుఁ దరువాత గర్భాధానమునకు లోపలను నన్వయింపనగును. మా పాఠకులు గ్రహింతురుగాత. ఇంతవరకు మన ముగావించిన శ్రుతి స్మృతి పరామర్శవలన సోమ గంధర్వాగ్నులు ౫ ౬ ౭ సంవత్సరముల ప్రాయములోనున్న కన్యలను గ్రమముగఁ బాలించి వారికి శౌచ మధురవాఙ్మేధ్యత్వాదులనిచ్చి విడిపోయినపిదప ౮ ౯ ౧౦ ౧౧ ౧౨ సంవత్సరముల ప్రాయములో నుండి రజస్వలలు కాకయున్న కన్యలను బురుషులు వివాహమాడవలయుననియు, నటుపై సోమ గంధర్వాగ్నులు తిరిగివచ్చి యా కన్యలకు రోమరజః కుచోత్పత్తి సంపత్తుల నొసఁగుదురనియు నిచ్చినమీఁద గర్భాధానము గావించవలెననియు విశదమైనదికదా? ఈ బాలికావివాహమునే సకల స్మృతులును ననువదించుచున్నవి. కాన నిక స్మృతి పరామర్శను గడంగుదము. రండు.

### స్మృతి పరామర్శ

స్మృతులను బరామర్శించుటకు ముందు నార్య సోమయాజుల సోమయాజులుగారు క్రింది వృద్ధపరాశర వచనమును గైకొని స్థాపించిన విపరీత వాదమును పనిలోఁబనిగ నించుక విమర్శించ వలసియున్నది. అదేమన?

శ్లో॥ రజసో దర్శనాత్పూర్వం। కన్యాదాన నిషేధకం।
కలౌయుగే నకుర్వీతే। త్యేవంవై బ్రహ్మశాసనం।

అనుసది. వ్యాఖ్యాతపేరు కానరాదు. కాని యెవ్వడో పై శ్లోకమునకు నీవ్యాఖ్యయొకటి కావించియున్నాడు. అదేమన?

"రజసోదర్శ నాత్పూర్వం కన్యాదాన నిషేధః యుగాంతర విషయః" అను వాక్యమైయున్నది. పైవాక్యము నందు మూలమున లేని యుగాంతరవిషయ మను మాట యొకటికలదు. కాని దానిని గైకొనక తెలుగర్థము వ్రాసిన పండితుఁడు మాత్రము కలియుగమున రజోదర్శనమునకు ముందుఁ గావింపఁబడు కన్యాదానమును నిషేధింపరాదను బ్రహ్మశాసనము కలదు. నిశ్చయము. అని తెలిపియున్నాడు. ఈ తెలుగర్థము మూలమున నున్నదాని నున్నట్లు తెలిపియున్నది. ఇట్లుండ సోమయాజులుగారు మూలవిరుద్ధ వ్యాఖ్యను "నమ్మి పూర్వయుగములందు రజోవతులగుటకుఁ బూర్వము కన్యాదానములను జేసెడి యాచారమును నిషేధించెడివా" రని వృద్ధపరాశరుఁడు చెప్పియున్నాఁడు. దానింబట్టి యైదువేలేండ్లకుఁ బూర్వము రజస్వలావివాహము కాని బాలికా వివాహములులేవు. ఇవి పిల్లపరాశరుఁడు తెచ్చిపెట్టియున్నాడు. మనకు వృద్ధపరాశర వాక్యము ప్రమాణమగును కాని పిల్లపరాశరుని వాక్యము ప్రమాణ మగునా? కాదు. కాన దాని నీడ్చి పేసి రజస్వలావివాహముల నాచరించవలసిన దని సాహసించి వ్రాసియున్నవారు. పరాశరుడు పిల్లపరాశరుడా? ఇది బ్రాహ్మణుడు మాట్లాడదగిన మాటయా? వృద్ధపరాశరుడుకూడ ఋతిమతి యగుటకుఁ బూర్వము జరిగెడి కన్యాదానమును నిషేధింపరాదని యేకదా చెప్పినాడు? అవిమైనను దనశాసన మని చెప్పలేదే. బ్రహ్మశాసనమనికదా చెప్పినాడు? బ్రహ్మ మన వేదమేకదా? ఆవేదశాసనమునేకదా పరాశరుఁ డనువదించినది? దానిని సోమయాజులు గ్రోసివేయఁ దగునా? తగదనిచాటిచెప్పవచ్చును. దీనికేమి కాని యుగాంతరములందునుగూడ పిల్లపరాశరునివలెనే రజోవతులు కాకముందే కన్యలను దానముచేయవలసినదనియుఁ జేయకున్నఁ బ్రత్యవాయములపాలయి శూద్రులయి మరణానంతరమున నరకముల ననుభవించి నశింతురని యుగాంతర ధర్మశాస్త్రకర్తలగు మను గౌతమ శంఖలిఖితులేగాక వసిష్ఠాది మహా

ర్షులెల్లరు నేకగ్రీవముగ స్మృతిసూత్ర ముఖముల వినిపించియున్నారు. ఇంతియెకాదు. రజస్వలావివాహము లనఁదగిన గాంధర్వ రాక్షస వివాహములను క్షత్రియుల కాపద్ధర్మములనుగా నంగీకరించినను బ్రాహ్మణుల కవి యెంతమాత్రము నాచరణీయములు కావనికూడ విధించియున్నవారు. ఇట్లనిన వృద్ధపరాశర వచనమువలన మనము గ్రహింపఁదగిన విశేష మేమందురా? అం దొక విశేషముమాత్రము కలదు. వినుడు వినిపించెదము.

వృద్ధపరాశరుఁడు కనుక నామహర్షి దూరదృష్టిని బరికించి కలియుగమున మన యార్య సోమయాజుల సోమయాజులవారివంటి పండితంమన్యులు పలువురు బయలు వెడలి రజోపతులగుటకుఁ బూర్వము కన్యాదానములు గావింపరాదను నిషేధవాదములను గావింతురని గ్రహించి యవి కావింపరాదను బ్రహ్మశాసనము కలదని తెలిపియున్నవాఁడనువిశేషమును మాపాఠకులు గ్రహింతురుగాత ఇంతకుమించి యావచనమునందు విశేష మేమియులేదు ఇట్లని యీక్రింది స్మృతిపరామర్శ స్థిరీకరించుచున్నది. ఇటువినుడు.

( మనుస్మృతి )

శ్లో॥ కాలేదాతా పితావాచ్యః। వాచ్యశ్చానుపయన్ పతిః॥

కాలమందుఁ గన్యాదానము కావింపని తండ్రియు, భార్యను గలియని భర్తయు నింద్యు లని పై మను వచనార్థము. కాలమందుఁ గన్యనుదానము చేయునితండ్రి నింద్యుఁ డనగాఁ గన్య ఋతుమతి యగుటకుఁ బూర్వము దానము చేయునితండ్రి నింద్యుడని యర్థమా? లేక పరమందు దానము చేయునితండ్రి నింద్యుడని యర్థమా? అని ప్రశ్నించుకొని స్మృతిసూత్ర పురాణేతిహాసాది ప్రమాణ గ్రంథములను బరిశీలింప నందు గన్య ఋతుమతి యగుటకుఁబూర్వము దానిని దానము చేయని తండ్రియే నింద్యుడగునను వచనములుమాత్రమే కనుపడినవి. కాని పరమందు దానము చేయునితండ్రి నింద్యుడగు ననువచన మొక్కటియైనను గనుపడియుండలేదు. ఈ విషయమై మను విట్లు చెప్పియున్నాడు. అదేమనః?

శ్లో॥ త్రింశద్వర్షో ద్వహేత్కన్యాం। హృద్యాం ద్వాదశవార్షికీం।
త్ర్యష్ట వర్షోష్ట వర్షా వా। ధర్మేసీదతి సత్వరః॥

ఈ శ్లోకమునకుఁ గుల్లూక భట్టాచార్యు డిట్లు వ్యాఖ్యానము గావించియున్నాడు.

"త్రింశద్వర్షః పుమాన్ ద్వాదశ వర్షవయస్కాం మనోహారిణీం కన్యాముద్వహేత్. చతుర్వింశతి వర్షోష్ట వర్షాంవా గార్హస్థ్య ధర్మేవ సాదం గచ్ఛతిత్వరావాన్ ఏతశ్చ యోగ్యకాలప్రదర్శన పరం నతుని యమార్థం ప్రాయేణైతావతా కాలేన గృహీతవేదోభవతి. త్రిభాగ వయస్కాచకన్యా, వోఢుర్యోనో యోగ్యతే, గృహీత వేదశ్చోప కుర్వాణకో గృహస్థాశ్రమం ప్రతినవిలంబే సత్వరఇత్యస్యార్థః"

ముప్పది వత్సరములవాడు పండ్రెండేండ్ల కన్యను నిరువదినాలు గేండ్లవా డెనిమిదేండ్ల కన్యను వివాహము చేసికొనవలెను. వాడు గృహస్థధర్మమందు బ్రవేశించినవా డగును. ఇది వివాహమునకు యోగ్యకాలమున గన్పరచుటకే కాని నియమార్థముకాదు. తరుచుగఁ బైనఁజెప్పిన కాలములో వేదాధ్యయనముచేసిన వాడుకాగలడు. పురుషుని వయసులో గన్య మూడవవంతు వయస్సు కలిగియుండిన యెడఁ బెండ్లికొమనకుఁ దగిన దగును. వేదాధ్యయనము ముగించిన బ్రహ్మచారి కుపకుర్వాణకు డనిపేరు. అతడు గృహస్థాశ్రమమును దీసి కొనుటకుఁ ద్వరపడవలెను. ఆలస్యము చేయరా దని పై భాష్యార్థము. పైమను శ్లోకార్థమును జేర్చిచూచిన ఋతుమతియగుటకుఁ బూర్వము కన్యను దానము చేయనితండ్రి నింద్యు డని మనువు నిర్ణయించినట్లు స్పష్టమయ్యెడిని.

గౌతమ ధర్మసూత్రము.

"ప్రదానం ప్రాగృతోః, అప్రయచ్ఛన్ దోషీ"

ఋతుమతి యగుటకుఁ బూర్వము కన్యాదానము చేయవల యును. చేయనివాడు దోషియగుచున్నాడని పై సూత్రములయర్థము. ఈ యర్థము పైమను శ్లోకార్థమును స్థిరీకరించుచుండలేదా? స్థి రించుచున్నది. కావుననే కుల్లూకభట్టుపై "కాలేదాతా" అను మను

శ్లోక వ్యాఖ్యయందు మీఁది గౌతమధర్మసూత్రము నుదాహరించి "ఋతోః ప్రాక్ ప్రదానకాలః" ఋతుమతి యగుటకుఁ బూర్వమే ప్రదానకాల మని నిర్ణయించియున్నాఁడు. ఇంతియె కాదు.

సంవర్తమహర్షి.

శ్లో॥ రోమకాలేతు సంప్రాప్తే। సోమోభుఙ్క్తేఽథకన్యకాం।
రజోదృష్ట్వాతు గంధర్వాః। కుచౌ దృష్ట్వాతు పావకః॥

అని చెప్పిన వచనమును మాత్రము గైకొని పండితచక్రవర్తులు సంవర్తుఁడు రజస్వలావివాహమును జెప్పినాఁడని చంకలుఁగొట్టియున్నారు. కాని మన పండితరాట్టులా శ్లోకము తరువాత సంవర్తుఁడేమిచెప్పి యున్నాఁడో చూచినపాపమునఁ బోయినవారుమాత్రము కారు. సంవర్తమహర్షి పైశ్లోకమునఁ రజస్వలావివాహములనే చెప్పియున్న యెడ దానిక్రిందనేయిట్లు బాలికావివాహ ముత్తమమైనది. కానదానిని జేయుము. రజస్వలావివాహము నరకావహము కాన దానిని జేయవల దని చెప్పునా? చెప్పఁడు. ఇటువినుఁడు.

శ్లో॥ అష్టవర్షా భవేద్గౌరీ। నవవర్షా తురోహిణీ।
దశవర్షా భవేత్కన్యా। అతఊర్ధ్వం రజస్వలా।
మాతాచైవ పితాచైవ। జ్యేష్ఠభ్రాతా తథైవచ।
త్రయస్తే నరకంయాంతి। దృష్ట్వాకన్యాం రజస్వలాం।
తస్మాదుద్వాహయేత్కన్యాం। యావన్నర్తుమతీభవేత్।
వివాహో హ్యష్టవర్షాయాః। కన్యాయాస్తు ప్రశస్యతే॥

ఎనిమిదేండ్ల కన్యగౌరి, తొమ్మిదేండ్లపడుచు రోహిణి, పది యేండ్ల పడతి కన్య, అటుమీఁద రజస్వల. తల్లి దండ్రి యన్న మున్నగు వారు మువ్వురును రజస్వలమైయున్న తమ యవివాహిత కన్యను జూచిన నరకమును బొందుచున్నారు. కాన ఋతుమతి యగుటకుఁ బూర్వమే కన్యకు వివాహము చేయవలెను. ఎనిమిదవయేట గన్యనుదానము చేయుటయే ప్రశస్తమైనది అని పైశ్లోకముల కర్థము. ఈ యర్థమునుబట్టి చూచినను ఋతుమతి యగుటకుఁ బూర్వము కన్యను దానము చేయనితండ్రి నింద్యుఁడు కాక తప్పదని తెలినదికదా?

యాజ్ఞవల్క్యస్మృతి.

శ్లో॥ పితా పితామహో భ్రాతా। సకుల్యో జననీతథా।
కన్యాప్రదః పూర్వనాశే। ప్రకృతిస్థః పరఃపరః॥
అప్రయచ్ఛన్ సమాప్నోతి।భ్రూణహత్యా మృతావృతౌ॥

తండ్రి తాత భ్రాత కులమువాడు తల్లి లోనగువారు కన్యను దానముచేయుట కధికారులు. వారిలో నెవ రున్మత్తాది రోగపీడితు లయ్యెదరో వారితరువాతి వారు కన్యాదానమొనర్చుట కధికారులగుచున్నారు. ఇట్లధికారియైనవాడు కన్యను దానముచేయనియెడ వాడు ప్రతి ఋతువునందును భ్రూణహత్యా దోషమును బొందుచున్నాడని పై శ్లోకార్థము. ఈ యర్థమునుకూడ ఋతుమతి యగుటకుం బూర్వము కన్యాదానము చేయనితండ్రి నింద్యుడగుచున్నా డని ధృవపరచి యున్నదికదా?

లఘుశాతాతపస్మృతి.

శ్లో॥ పితృవేశ్మనియా కన్యా। రజః పశ్యత్యసంస్కృతా।
భ్రూణహత్యా పితుస్తస్యాః। సాకన్యా వృషలీస్మృతా॥

ఏకన్య యవివాహితగానుండి తండ్రియింట రజోవతియగునో యది శూద్రకన్య యనిపించుకొనును. దానితండ్రికి భ్రూణహత్యా దోషము వచ్చునని పై శ్లోకార్థము. ఇదియుం బై యర్థమునే స్థిరపరచుచున్నదికదా? అగును.

లఘ్వాశ్వలాయనస్మృతి.

శ్లో॥ రజస్వలాచయా కన్యా। యదిస్యాదవివాహితా।
వృషలీవార్షలేయస్స్యా। జ్జాతస్తస్యాం నచైవహి॥

ఏకన్య యవివాహితగానుండి రజస్వలయైనట్లైన నది వృషలి యగును. దానియందుం బుట్టినవాడు వార్షలేయుండగుచున్నా డని పై శ్లోకార్థము. ఇదివరకు వివాహమునకు ముందు రజోవతులైన కన్యలను వారి తలిదండ్రులును వరులును వృషలు లయ్యెదరని వినియుంటిమి. ఇపుడు పై శ్లోకమువలన వారికిబుట్టిన పుత్రులుకూడ వృషలు లయ్యెద రని తెలిసికొంటిమి.

( వసిష్ఠస్మృతి. )

శ్లో॥ పితుః ప్రమాదాత్తు యదీహకన్యా। వయః ప్రమాణం సమతీత్య దీయతే। సాహంతి దాతార ముదీక్ష్యమాణా। కాలాతిరిక్తా గురు దక్షిణేవ॥

శ్లో॥ యావచ్చకన్యా మృతవస్స్పృశంతి। తుల్యైస్సకామా మభియాచ్యమానాం। భ్రూణానితావంతి హతానితాభ్యాం। మాతా పితృభ్యామితి ధర్మవాదః॥

తండ్రియొక్క ప్రమాదమునఁ గన్య వయసుమీరి దానము చేయబడినదైన నాకన్య తనను దానముచేసిన తండ్రిని గాలాతిరిక్తమగు గురుదక్షిణవలెనే నశింపఁజేయును. అటుపై నాకన్య యెన్ని ఋతువులను బొందునో యన్ని భ్రూణహత్యలను మాతాపితలు పొందుచున్నా రని పై శ్లోకార్థము. ఈ యర్థముగూడ ఋతుమతి యగుటకుఁ బూర్వము కన్యాదానము చేయనితండ్రి నింద్యుఁడగుచున్నాడని చెప్పిన మనువచనమును బలపరచియున్నది. ఇదియొకాదు.

వేదవ్యాసస్మృతి.

శ్లో॥ యదిసాదాతృ వైకల్యా। ద్రజః పశ్యేత్కుమారికా।
భ్రూణహత్యా శ్చతావత్యః। పతితస్స్యా త్తదప్రదః॥

దాతయొక్క ప్రమాదమువలనఁ గుమారిక వివాహమునకు ముందు రజోవతియైనయెడ నెన్ని ఋతువులు గడచునో యన్ని భ్రూణహత్యలను దాత యనుభవించి కులభ్రష్టుఁడగు నని పై శ్లోకార్థము. ఈ యర్థముకూడ ఋతుమతి యగుటకుఁ బూర్వము కన్యను దానము చేయనితండ్రి నింద్యుఁడగుచున్నాఁడని చెప్పిన మనువచనమును బలపరచి యున్నదికదా? ఇంతవరకు ఋతుమతి యగుటకుఁ ముందు గన్యను దానము చేయనితండ్రి నింద్యుఁడగు నను ప్రమాణములను మాత్రమే కన్పరచియుంటిమి. ఇపుడది యేఁగాక యట్టి కన్యను వివాహమాడిన బ్రాహ్మణుడు కులభ్రష్టుఁడగు నను వచనములనుగూడ వినిపించుచున్నారము వినుడు.

## అంగిరస స్మృతి

శ్లో॥ పితుర్వేశ్మని యా కన్యా। రజస్తు సముపస్పృశేత్।
భ్రూణహత్యా పితుస్తస్యాః। సాకన్యా వృషలీస్మృతా॥

శ్లో॥ మాతాచైవ పితాచైవ। జ్యేష్ఠభ్రాతా తథైవచ।
త్రయస్తే నరకంయాంతి। దృష్ట్వాకన్యాం రజస్వలాం॥

శ్లో॥ ఉద్వహేద్యస్తు తాం కన్యాం। బ్రాహ్మణోమదమోహితః।
అసంభాష్యో హ్యపాఙ్క్తేయః। సవిప్రో వృషలీపతిః॥

తండ్రియింటనే కన్య వివాహమునకు ముందు రజోవతియగునో దాని తండ్రికి భ్రూణహత్య సంభవించును. ఆకన్య వృషలి యగును. తల్లి తండ్రి యన్న రజస్వలమైయున్న తమ కన్యను జూచి నరకమును బొందుచున్నారు. ఆకన్యను నే బ్రాహ్మణుడు మదమోహితుడై వివాహము చేసికొనునో వాడు వృషలీపతియై యసంభాష్యుడును నపాఙ్క్తేయుడును నగుచున్నాడని పై శ్లోకార్థము. ఈ యర్థమునుబట్టి రజస్వలా దాన ప్రతిగ్రహములు రెండును బరమనిషిద్ధ కార్యము లని మనము గ్రహించియున్నాముకదా? ఇంతియెకాదు. ఇంక నీవిషయమై బృహద్యమ స్మృతి యిట్లు చెప్పియున్నది.

## బృహద్యమస్మృతి.

శ్లో॥ పితుర్గేహేతుయా కన్యా। పశ్యత్యసంస్కృతా రజః।
భ్రూణహత్యా పితుస్తస్యాః। కన్యా సా వృషలీ స్మృతా॥

శ్లో॥ యస్తాంవివాహయేత్కన్యా। బ్రాహ్మణోమదమోహితః।
అసంభాష్యో హ్యపాఙ్క్తేయః। సవిప్రో వృషలీపతిః॥

శ్లో॥ ప్రాప్తే ద్వాదశేవర్షే। కన్యాం యో న ప్రయచ్ఛతి
మాసిమాసి రజస్తస్యాః। పిబంతి పితరోనిశం॥

శ్లో॥ అష్టవర్షా భవేద్గౌరీ। నవవర్షాతు రోహిణీ।
దశవర్షా భవేత్కన్యా। అతఊర్ధ్వం రజస్వలా॥

శ్లో॥ మాతాచైవ పితాచైవ। జ్యేష్ఠభ్రాతా తథైవచ
త్రయస్తే నరకంయాంతి। దృష్ట్వాకన్యాం రజస్వలాం॥

అవివాహితయగు నేకన్య తండ్రియింట రజస్వలయగునో దాని తండ్రికి భ్రూణహత్య సంభవించును. ఆకన్య వృషలియగుచున్నది. దాని నేబ్రాహ్మణుడు మదమోహితుడై వివాహ మాడునో వాడు వృషలీపతియై యసంభాష్యుడును నపాఙ్క్తేయుడును నగుచున్నాడు. ౮-౯-౧౦ సంవత్సరముల ప్రాయములలోనున్న కన్నెలు క్రమముగా గౌరి, రోహిణి, కన్య లని చెప్పఁబడుదురు. అటుపై రజస్వల యగును. తల్లి తండ్రి యన్న మున్నగువారు వివాహము కాకముందు రజస్వలయై యున్న తమ కన్నెనుజూచిన నరకము బొందుచున్నా రని పై శ్లోకముల కర్థము. ఈయర్థమును బ్రాహ్మణు డెన్నటికిని రజస్వలావివాహము చేసికొనరా దనియే స్థిరపరచియున్నది. ఇంతియెకాదు ఈ విషయమై కలియుగధర్మ శాస్త్రకర్త యగు పరాశరమహర్షి యిట్లు చెప్పి యున్నవాడు.

పరాశరస్మృతి.

శ్లో॥ అష్టవర్షా భవేద్గౌరీ। నవవర్షాతు రోహిణీ।
దశవర్షా భవేత్కన్యా। అతఊర్ధ్వం రజస్వలా॥

ఈ స్మృతికి మాధవాచార్యులవారి వ్యాఖ్యానము కలదు. అది యిట్లు చెప్పియున్నది.

"గౌర్యాదయస్త్రిస ఉద్వాహేఽనుశుద్ధాః తద్దాతుః ఫలవిశేష స్మరణాత్. రజస్వలా త్వశుద్ధా. తద్దానస్య నిందితత్వాత్."

గౌరి, రోహిణి, కన్య యీ మూవురును వివాహమునకు శుద్ధలు. ఏలయన? వారిని దానముచేసిన తండ్రులకు ఫలమధికముగా శాస్త్రము చెప్పియున్నదికాన. రజస్వల యశుద్ధురాలు. ఏల యన? దాని దానము నిందింపఁబడియున్నదికాన. అని చెప్పి యీతమ యభిప్రాయ మును బలపరచుటకు మాధవాచార్యులవారు క్రింది బృహస్పతి వచ నమును బ్రమాణీకరించి యున్నారు.

బృహస్పతిస్మృతి.

శ్లో॥ గౌరీందదన్నాకపృష్ఠం। వైకుంఠం రోహిణీందదన్।
కన్యాందదన్ బ్రహ్మలోకం। రౌరవంతు రజస్వలాం॥

ఈ యర్థమును దెలిపెడి మరియొక శ్లోకమును మరీచి మహర్షి చెప్పియున్నాడని మాధవాచార్యులవారు పరాశరస్మృతి వ్యాఖ్య యందు గ్రిందిశ్లోకము నుదాహరించి యున్నారు.

శ్లో॥ గౌరీం దదన్నాకపృష్ఠం। వైకుంఠం రోహిణీందదత్।
కన్యాందదత్ బ్రహ్మలోకం। రౌరవంతు రజస్వలాం॥

గౌరీ దానము చేసినవాడు పరబ్రహ్మ పదమును, రోహిణిని దాన మొసగ్చినవాడు వైకుంఠమును, కన్యను దానము కావించిన వాడు బ్రహ్మలోకమును రజస్వలను దాన మిచ్చినవాడు రౌరవాది నరకమును బొందుచున్నారని పైశ్లోకముల కర్థము. అటుపై పరాశరుం డిట్లు చెప్పియున్నాడు.

శ్లో॥ ప్రాప్తేతు ద్వాదశేవర్షె। యఃకన్యాం నప్రయచ్ఛతి।
మాసిమాసి రజస్తస్యాః। పిబంతి పితరోనిశం।

"ఋతుదర్శన ముపలక్షయితుం ద్వాదశే వర్ష ఇత్యుక్తం అత ఏవ గౌతమేన ప్రదానం ప్రాగృతుదర్శనా దిత్యుక్తం యమోప్యేత దేవాహ "తస్మాదుద్వాహ యేత్కన్యాం యావన్నర్తుమతీభవేత్." అతశ్చ ఋతుదర్శనా త్ప్రాగ్యోనప్రయచ్ఛతి తస్యపితరః ప్రతిమాసం తద్రజః పిబంతి. అసత్యృతుదర్శనే ద్వాదశేపివర్షే కన్యాదానప్రతి గ్రహౌ ననిషిద్ధౌ. అతఏవమనుః శ్లో॥ త్రింశద్వర్షోద్వహేత్కన్యాం। హృద్యాం ద్వాదశవార్షికీం। త్ర్యష్టవర్షోష్టవర్షాంవా। ధర్మేసీదతి సత్వరః ఇతి"

ఋతుదర్శనము నుపలక్షించుకొఱకుం బన్నెండవ సంవత్సర మని చెప్పియున్నాడు. కావుననే గౌతమునిచే ఋతుమతి యగుటకు ముందే కన్యను దానము చేయదగిన దని చెప్పంబడినది. యముడుకూడ నిట్లే చెప్పియున్నాడు. కాన ఋతుమతి యగుటకు ముం దెవడు తన కన్యను దానముచేయడో వానిపితలు ప్రతిమాసమునందును దాని రజస్సును పానము చేయుచుందురు. ఋతుమతి కానియెడం బన్నెం డవ సంవత్సరముననుగూడ గావింపంబడు కన్యాదాన ప్రతిగ్రహములు నిషిద్ధములు కానేరవు. కావుననే మనువు ముప్పది యేండ్లవాడు పం

డ్రెండేండ్ల కన్యను నిరువది నాలుగేండ్ల వా డెనిమిదేండ్ల కన్యను బెం డ్లాడనగు నని చెప్పియున్నాడని మాధవాచార్యులవారు తీర్పుచేసి యున్నారు. ఈ తీర్పునుబట్టి యెనిమిదేండ్లు మొదలుకొని పన్నెండేం డ్లకు లోపలనే రజస్వలలు కాకముందుఁ గన్యలను దానము గావింప వలె నని స్పష్ట మగుచున్నది.

శ్లో॥ మాతాచైవ పితాచైవ। జ్యేష్ఠభ్రాతా తథైవచ।
త్రయ స్తే నరకంయాంతి। దృష్ట్వాకన్యాం రజస్వలాం॥

తల్లి తండ్రి యన్న మున్నగు మూవురును వివాహమునకు ముందుఁ రజస్వలలైయున్న కన్నెలను గని నరక మనుభవించుచున్నా రనియర్థము.

శ్లో॥ యస్తాంసముద్వహేత్కన్యాం। బ్రాహ్మణో మద మోహితః।
అసంభాష్యో హ్యపాఙ్క్తేయః। సవిప్రో వృషలీపతిః॥

రజస్వలయైన యాకన్య నేబ్రాహ్మణుఁడు మదమోహితుడై వివాహమాడునో వాఁ డసంభాష్యుఁడు నపాఙ్క్తేయుఁడు నగుచున్నాఁడని పై శ్లోకార్థము. ఈ యర్థమును బట్టి చూచినను బ్రాహ్మణుడు రజ స్వలావివాహము చేసికొనరా దని విస్పష్టమగుచున్నది. ఇట్లయిన రజ స్వలావివాహములు బ్రాహ్మణుల కాచరణీయములే కానిచో మనువు "కామమా మరణాత్" "త్రీణి వర్షాణి" అను శ్లోకములతో రజస్వలా వివాహముల నామోదించుటకుఁ గారణ మేమని పండిత చక్రవర్తులును జక్రరక్షకులును మరల బ్రతిఘటింప జూతురేమో? సమాధానమువినుఁ డు. సకల జాతీయులకును బాలికావివాహములే యాచరణీయములు. అందు బ్రాహ్మణులకు మాత్రము కేవల బాలికావివాహము లనుష్ఠే యములై యున్నవి. బ్రాహ్మణుల కేవి యనుష్ఠేయములో యవి వైశ్యుల కును క్షత్రియుల కేవి యనుష్ఠేయములో యవి శూద్రులకును ననుష్ఠేయములైయున్నవి. ఆచారము నిట్లేయున్నది. క్షత్రియులకు విశేష ధర్మములుగ గాంధర్వ-రాక్షస వివాహములను మను వంగీకరించియు న్నాఁడు. అవి రజస్వలావివాహములే కాని వేరుకావు. వానిని క్షత్రియు

లాచరించుట కవకాశముండుటచేతనే మనువు మీరు చెప్పిన శ్లోకము లతో రజస్వలా వివాహముల నంగీకరించియున్నాడు. అవేవన?

శ్లో॥ కామమా మరణాత్తిష్ఠే। ద్గృహే కన్యర్తుమత్యపి।
నచైవైనాం ప్రయచ్ఛేత్తు। గుణహీనాయ కర్హిచిత్॥

కన్య ఋతుమతియై చచ్చువరకు నీయింటఁ బడియుండుటకై నినిష్టపడనగునుగాని గుణహీనుని కెప్పుడును నిచ్చుట కిష్టపడవల దని పై శ్లోకార్థము ఈ యర్థము ననుసరించి క్షత్రియుడు గుణవంతుడైన వరునికొరకు వెదకుచుండఁగా రజస్వలయైన క్షత్రియకన్య యెంత కాలము నిరీక్షించవలె నను ప్రశ్న రాగా మనువు క్రింది శ్లోకముతో సమాధానము చెప్పియున్నాడు.

శ్లో॥ త్రీణివర్షాణ్యుదీక్షేత। కుమార్యృతుమతీసతీ।
ఊర్ధ్వంతు కాలాదేతస్మా। ద్విందేత సదృశంపతిం॥

ఋతుమతియైన చిన్నది తనను దన తలితండ్రు లెవరికైన నిత్తు రేమోయని మూడువత్సరములు నిరీక్షించి యటుపైఁ దనకు కులశీల వయోరూపాదులం దనుకూలుడయిన వరుని వరించనగునని పై శ్లోక ముతో మనువు వచుమతిచ్చి యున్నాడు ఇవి క్షత్రియకన్యా పరములు కాని బ్రాహ్మణకన్యా పరములుకావు. ఇట్లనిన "షడానుపూర్వ్యా విప్రస్య। క్షత్రస్య చతురోవరాన్।" అను శ్లోకముఖమున; మనువు బ్రాహ్మణులకుఁగూడ నారవది యగు గాంధర్వ వివాహము గావించు కొనుట కభ్యనుజ్ఞ యిచ్చి యున్నాడుకదా? అది రజస్వలావివాహ మని మీరును నిదివరకుఁ దెలిపియున్నారు. మరల నూరవి బ్రాహ్మణుల కాచరణీయములు కావనుట ధర్మ మెట్లగు నాదురా? సమాధానము వినుడు. పూర్వయుగములందు బ్రాహ్మణు డన్యజాతి కన్యలను గూడ వివాహమాడుటకు శాస్త్రాచారము లామోదించియుండుటచే గాంధర్వ విధి ననుసరించి క్షత్రియ శూద్ర కన్యలను బ్రాహ్మణులు బరిణయ మగుచుండిరి. కలియుగమునం దన్యజాతి కన్యావివాహము నిషేధింపఁబడియున్నది. కాననది బ్రాహ్మణకన్యావిషయమున సమన్వ

యింపరాదు. కావుననే పరాశర ప్రభృతులు పలువురు మహర్షులు బ్రాహ్మణులు రజస్వలావివాహములు కావించుకొనరా దని మీాది విధమున శాసించియున్నారు.

ఇట్లనిన మీారు చెప్పినట్లు రజస్వలావివాహములు బ్రాహ్మణుల కాచరణీయములు కావేని జైమిని గోభిల గృహ్య సూత్రాదులు "ఊర్ధ్వం త్రిరాత్రాత్సంభవః" అను సూత్రముఖమున వివాహములో నాలవనాటిరాత్రి సంభోగమున కనుమతి యిచ్చుచున్నవికదా? ౮-౯-౧౦ సంవత్సరముల బాలికలతో సంభోగము చేయవలసిన దని యవి విధించినవనుటకు మీారు సాహసింతురా యని యిఁక మా ప్రతివా దులు మము ప్రశ్నించవలయును. ఈ ప్రశ్నకు సమాధానము చెప్పు టకు ముందుఁ బై సూత్రములు వివాహమునకు నగ్నికయగు కన్య యుత్తమ మని చెప్పియున్నవి. కాన నగ్నికయన నెన్నియేండ్లకన్నియ యగునో యిపుడు విచారించవలసి యున్నది.

## రజస్వలా వివాహ మాలిక.

---

(కరీము జానకీ సంగమము.)

అబ్దులు కరీముగారను మహమ్మదీయులకును జానకీ దేవియను దాక్షిణాత్య బ్రాహ్మణ కన్యకకును జరిగిన సంగమమును దెలుపునది కాన నీ సమాచారమునకుఁ "కరీము జానకీ సంగమము"ను నన్వర్థ నామకరణము గావించియున్నారము. కరీముగారు గుంటూరు మండ లమున నారువందల రూప్యముల వేతనముగల ఫారెస్టాఫీసరుగారై యున్నారని వినియున్నవారము. మహమ్మదీయులని వారి పేరే చెప్పు చున్నదికదా? జానకీదేవిగారు విజయవాడ వాస్తవ్యులగు రాజగోపా లయ్యంగారి తృతీయ పుత్రికగారని తెలియవచ్చెడిని. అయ్యంగారైదు వందల వేతనమువచ్చెడి సబుడివిషనల్ ఆఫీసరుగారని వినియున్నవా రము. జానకమ్మగారికి వివాహమునాటి కిరువదిరెండేండ్ల ప్రాయమని

తండ్రిగారే సెలవిచ్చినారట! చిన్నదానిని గాశీపట్టణమునను ఢిల్లీనగరమునను జెన్నపురియందునను జదివించియుంటి మని యయ్యంగారు సెలవిచ్చియున్నారు. చదువునపు డాయమ్మ యాయాదేశములలోని మహమ్మదీయులు పలువురితో మైత్రి నెరపియున్న దనికూడ నయ్యంగారే చెప్పియున్నారట! దానికేమి? దైవ మయ్యలకును మియ్యలకును నేడు వియ్యమును సంఘటించియున్నవాడు. అయ్యంగారు జాతివర్ణకులభేదములను బాటించని థియాసఫీస్టుల మని సెలవిచ్చినారట!

వరనిర్ణయముగోరి కడచిన (26-6-28) తేదీని కూతును నిత్యానందమను మిత్రుని వెంటఁగొని యయ్యంగా రడవిపాలెములాకుకడ మకాము కావించియున్న యబ్దులు కరీముగారికడ కేగి వివాహ నిశ్చయము గావించి యా యిరువురుని గలిపి యింటికి వచ్చినపిదప వా రిరువురుచేరి పెండ్లి ఖాయమేయని యయ్యంగారికిజాబు వ్రాసినట్లు సెలవిచ్చి రని యాంధ్రవిలేఖకుడు తెలిపియున్నాడు. తరువాత నా వధూవరులకు వివాహము జరిగినటుల, బత్రికలు బ్రకటించియున్నవి. దానికేమి? యీ వివాహవార్త విన్న బ్రతిభారతీయుని హృదయమును జలించి విస్మయ విషాదముల పాలయి పలువురు పలువిధముల భాషించియున్నవారు. ఆంధ్రపత్రికా పతులు మాత్రము రాజగోపాలయ్యంగారి కడకుఁబోయి స్వకీయవిలేఖరి ముఖమున భర్తృసంబంధము మీయమ్మాయి కుదుర్చుకొనినదా? లేక మీ రేగి కుదిర్చినారా? అని యడుగ సత్యధర్మరతులయిన యయ్యంగారు తామే కుదిర్చితి మని శాంతిముతో వారిచరిత్ర నాతెను దమకు వినిపించియున్నవారని యాంధ్రపత్రికాధిపతులే (12-7-28) తేది యాంధ్రదిన పత్రికాముఖమునఁ జాటియున్నవారు.

ఈ యాంధ్రపత్రికా పతుల యనుంగుకూతురు వివాహమునకు ముందు రజస్వలమైయున్నదని పెద్దపదంతి యొకటి బయలుదేర నందొత సత్యముకలదో తెలుపు డని మేము రిజస్టర్డుత్తరముఖమున నడిగిన బ్రత్యుత్తర మిచ్చినవారుకారు. బ్రత్యుత్తర మీయలేదని కరపత్రిక బ్రకటించిన కూడనైనను సత్యమును వెల్లడింపరైరి. వీరుమాత్రము

పరుల బిడ్డలనుగూర్చి ప్రశ్నింపవచ్చును గాని వీరిని బరులు ప్రశ్నింప రాదు కాబోలు! పోలు! పోలు! అయ్యంగారినిజూచి యిపుడైనను నాంధ్రపత్రికా పతులు లోకక్షేమమును గోరి లోకులుతమను ప్రశ్నించిన ప్రశ్నలకుఁ బ్రత్యుత్తర మిచ్చుట యుచిత మని నేర్చుకొందురుగాత. ఇది యిట్లుండ నిండు. మనము ప్రకృతమునకు వత్తము. అయ్యంగారి కూతురు అబ్దులు కరీముగారిని బరిణయమైరికదా? ఇది వర్ణసంకర పరి ణయ మనుటకు సంశయ ముండునా? ఉండను. శూద్రుడు బ్రాహ్మణ స్త్రీతోఁగలిసి సంతానమును గనినయెడ నా సంతానము మానవాధ ములగు చండాలు రయ్యెదరని శాస్త్రాచారములు చాటుచున్నవి. ఇఁక మహమ్మదీయులు బ్రాహ్మణ స్త్రీలతోఁగలిసి కన్న పుత్రులేజాతివా రయ్యెదరో మేము చెప్పకపోయినను మాపాఠకులే నిర్ణయించుకొందురు గావుత మని యింతట విరమించుచున్నవారము.

## ఆవివ్యద్విజస్వలా వివాహము.

శ్రీయుతులగు మాడి రాజగోపాలయ్యంగారికి నలువురు పుత్రికలును నిరువురు పుత్రులును బుట్టిరంట! అందు మొదటి యిరువురు పుత్రికలను జిన్నతనముననే తమశాఖవారికే యిచ్చి పరిణయము గావించిరంట! వారు సభర్తృకలై సంతానవంతులై జాతివర్ణ కులభేదముకలిగి వర్తించుచున్నవారని యయ్యంగారిసంభాషణవలన బోధపడుచున్నది. తక్కిన తామందరును జాతి వర్ణ కుల భేదములను బాటించువారము కామని యయ్యంగారే సెలవిచ్చియున్నారు. వారెట్లో తృతీయపుత్రికకు వివాహముచేసి నేడు కృతార్థులైయున్నవారు. కాని యింకను జతుర్థపుత్రికకు వివాహము చేయవలసియున్నవారు. కుల భేదములను బాటింపరు కానఁ గంపాలి శాఖీయులగు నిత్యానందముగారను మిత్రులొకరయ్యంగారికిగల రని వారేచెప్పియున్నారు కదా? వారికే బహుశః చతుర్థ పుత్రిక నిచ్చి రజస్వలాపరిణయము గావింతు రని యొక వదంతి కలదు. రజస్వలలగువరకుఁ గన్యలకు వివాహముచేయనిచో నిట్టి పరిణయములే నూటికిఁ దొంబది యగు నని వివేకముకల వా రంగీకరింపక తప్పునా? —పత్రికాధిపతి.

# అపాయంటు మెంటార్డరు.

భరతఖండమున నుండు స్వదేశ సంస్థానములలో నేకొలది సంస్థానములో మాకు లోఁబడి సామంతసంస్థానములుగా నుండుట కంగీకరించినవి కాని మము నెదిరించిన సంస్థానములే యధికముగా నున్నవి. వానిలో నుండి యిపుడు పర్లాకిమిడిసంస్థానముమాత్రము మాకుసామంతసంస్థానముగా నుండి మా యేలుబడిని నిరాఘాటముగ సాగించుటకు యత్నించుచున్నందున దానిని మాసామంతసంస్థానముగ నపాయంటు చేసి యున్నారము. పర్లాకిమిడి సంస్థానాధీశులు సంఘసంస్కారప్రియులై యున్నారు. కావుననే వారు వాసా సూర్యనారాయణశాస్త్రి బంకుపల్లి మల్లయ్యశాస్త్రిగార్లను నాస్థానపండితులనుగా నిడుకొని వారిచే వర్ణాశ్రమధర్మనిర్మూలకము లగు రజస్వలావివాహములే యాచరణీయము లని పత్రికావాదము చేయించుటయే కాక వాని వ్యాప్తికై వారిని నాంధ్రదేశమున బ్రచారముగావింపఁ బంపెద రని వినుట కెంతయు సంతస మగుచున్నది. ఆపండితులను మా సంస్థానమునను గూడ నాస్థానపండితులనుగా నపాయంటు చేసియున్నారము.

—కలిచక్రవర్తి.

# వనితా విశ్వవిద్యాలయము.

వనితలు చెడినంగాని వర్ణసంకరము వర్ధిల్లనేరదు. వనితలకు విదేశపద్ధతిని విద్యగఱపినం గాని వారు త్వరగ జెడరు. విద్యాభివృద్ధికి విశ్వవిద్యాలయ మత్యవసర మని బాగుగ గ్రహించిన కార్వేగారించుమించు నలువదిలక్షల మూలధనము గడించి వనితల విశ్వవిద్యాలయమును స్థాపించియున్నవారు. వారు పచ్చిసంఘసంస్కారప్రియు లని వారు స్థాపించిన వితంతుశరణాలయమును గావించుకొనిన వితంతు వివాహమును వేనోళ్లఁ జాటుచున్నవి. కార్వేగారు వితంతు పత్నియందు

బహుమంది సంతానమును గని వారినందరిని గొప్ప పరీక్షలయందు త్తీ ర్ణులనుగావించి నలువురు కోడండ్రను మనుమలను మనుమరాండ్రను గనిదుర్యోధనసంపత్తుతోఁదులఁదూగుచున్న వారనివినియున్నవారము. వీరికి మొన్న విజయవాడ స్త్రీ సమాజమువారును బురపరిపాలక సమాజమువారును స్వాగత పత్రముల సమర్పించినందులకు సంతసించుచు వారికిఁ బ్రోత్సాహముసంగ మా సామంతులను మంత్రులను హెచ్చరించుచున్నారము.

—కలిచక్రవర్తి.

---

## పారితోషికము.

---

మంత్రి సామంతివర్యులు శాంతముతో మా శాసనములను నాలించి కర్తవ్యమునకుఁ గడంగుదురుగాత. అదేమన? మా పగవారు పట్టాభిషేకము గావించుకొనునపుడు వర్ణాశ్రమ ధర్మాభివృద్ధికి వలయుధనమును బారితోషికముగ నొసంగుచుందురు. మనపని యది కాదు. మనము ధర్మనాశనము గావించి యధర్మాభివృద్ధికి యత్నించవలసిన వారము. అధర్మ మభివృద్ధిచెందిన వర్ణసంకరము దినదినాభివృద్ధి గాంచక మానదు. వర్ణసంకరమును ద్వరగవృద్ధికిఁ దేఁదగినవారు వనితలు. వనితలు స్వేచ్ఛానుసారము సంచరించినంగాని వర్ణసంకరము చేయఁజాలరు. స్వేచ్ఛాసంచారమున కవకాశము నిచ్చునవి క్లబ్బులు లైబ్రెరీలు సభలు లోనగునవి. అవి ధనసాధ్యములు. కాన మా సామంత మంత్రి పురోహిత ప్రభృతులు నారీమణులు వలయు సదుపాయములను సమకూర్చుకొనుటకుఁ వారికిఁ బారితోషికముల నొసఁగుట కనుమతి నొసంగుచున్నవారము.

—కలిచక్రవర్తి.

---

శ్రీ

# శ్రుతి ధర్మ సంజీవని

## అను నీ మాస పత్రిక

శ్రు తిస్మృతిశిష్టాచార ప్రమాణముల ననుసరించును.

తి తీర్షులకు సంతరణోపాయములను దెలుపును.

ధ ర్మాధర్మవిధర్మములను వివేకించును.

శ్రీ ర్మ మభూయాత్తనువారలకు శ్రీలనొసంగును.

సం ఘసంస్కర్తల దుర్వాదములనిరసించును.

జీ వన్ముక్తి పదసోపానములనుజూపును.

వ ర్ణాశ్రమ ధర్మతత్పరుల నాశ్రయించును.

ని త్య సత్య హితమితవాదముల వినిపించును.

## చందా వివరము

| | | |
|---|---|---|
| రాజపోషకులకు | సం॥ కి | రు 10-0-0 |
| ప్రధానపోషకులకు | ,, | రు 4-0-0 |
| అనుపోషకులకు | ,, | 3-0-0 |
| చందాదారులకు | ,, | 2-0-0 |
| ,, | ఆరుమాసములకు | 1-4-0 |
| | విడిపత్రిక | 0-3-0 |

Regd. No. M. 1480 చందా సం॥రు. 2.

శ్రీ

శ్రీ బాలాత్రిపురసుందర్యైనమః.

"యతోధర్మస్తతోజయః। సత్యమేవజయతేనానృతమ్".

# శ్రుతిధర్మసంజీవని

వర్ణాశ్రమ ధర్మపక్షమున వాదించు మాసపత్రిక.

"ధర్మఏవహతో హంతి ధర్మోరక్షతి రక్షితః."

శివపురపు వీరభద్రపాకయాజి పత్రికాధిపతి.

| సంపుటము. | విభవ నిజశ్రావణ శు [illegible] బుధవారము. | సంచిక. |
| --- | --- | --- |
| ౧ | 22 ఆగస్టు-1928. | ౮ |

విషయసూచిక

1 డిస్మిసలార్డరు — పత్రికాధిపతి

2 సైమన్ కమీషనునకు స్వాగతము — ,,

3 రజస్వలా వివాహ ఖండనాత్మక బాలికా వివాహ మండనము — ,,



బెజవాడ:

శ్రుతిధర్మసంజీవనీ ముద్రాక్షరశాలయందు

ముద్రింపఁబడి ప్రకటింపఁబడియె.

1928.

శ్రీ

శ్రీ బాలాత్రిపురసుందర్యైనమః.

"యతో ధర్మ స్తతో జయః। సత్య మేవజయతే నానృతమ్".

# శ్రుతిధర్మసంజీవని

వర్ణాశ్రమ ధర్మపక్షమున వాదించు మాసపత్రిక.

"ధర్మ ఏవహతో హంతి ధర్మోరక్షతి రక్షితః."

శివపురపు వీరభద్రపాకయాజి పత్రికాధిపతి.

| సంపుటము. | విభవ నిజశ్రావణ శు ౭ బుధవారము. | సంచిక. |
|---|---|---|
| ౧ | 22 ఆగస్టు-1928. | ౫ |


## డిస్మిసలార్డరు.

దేవతలకుఁ బూర్వదేవతలవలెఁ బూర్వాచార పరాయణులగు బ్రాహ్మణులు మాకుఁ బరమశత్రువులై యున్నవారు. వారిలో నగ్రిగణ్యులు పండితులు. అందుఁ బ్రసిద్ధి కెక్కిన బొమ్మకంటి షట్కమును గూర్చి విశేషించి చెప్పవలసినదేమున్నది? వారిలోఁ జాల వాసిగాంచి యున్నవారు నరసింహశాస్త్రిగారని యాంధ్రలోక మెఱిగియున్న విషయమేకదా? విషయమిట్లుండ లోకజ్ఞాన విహీనులగు కొందరు పత్రికాధిపతులు శ్రీ శాస్త్రిగారస్పృశ్యతతీసివేసి చండాలుర నంటుకొనవచ్చునని చెప్పుటయేగాక యా విషయమును లోకవ్యాప్తి గావించుటకై ప్రచారము గావించుచున్నారనికూడ బ్రకటించియుండిరి. వారి ప్రలాపములు సత్యములని నమ్మి పరమశత్రులగు నరసింహశాస్త్రి గారికి మా స్థానమున నాస్థానపండిత పదవినొసంగి యది శ్రుతిధర్మ

సంజీవనీ ముఖమున లోకవిఖ్యాతి గావించియుంటిమి. అటుపై స్వధర్మ రతులగు శ్రీ శాస్త్రిగారు సంజీవనీ పత్రికాధిపతులతోఁ గలిసినపుడు మేమెన్నడు నెఱుంగని యస్పృశ్యతా నివారణాత్మక మహాపాప ప్రచారమునకు వడిగట్టినామను దుష్ట పత్రికాలాపములను విశ్వసించి మాయెడ మీ రన్యధాభావమును జెంది ప్రశంసించియున్నవారు. వార్ధకావస్థలోనున్న మేమట్టి యకార్య కార్యమున కొడిగట్టుదుమని తమరు తలంపకుడని సెలవిచ్చినటులఁ దెలియవచ్చుటచే శత్రులగు బ్ర॥ నరసింహశాస్త్రిగారిని మా సంస్థానమునం దాస్థానపండిత పదవినుండి డిస్మిసు చేసినామని తిరిగి సంజీవనీ ముఖముననే యాంధ్రలోకమునకుఁ దెలుపుచున్నవారము. కలిచక్రవర్తి,

## సైమన్ కమీషనునకు స్వాగతము.

---

భగవదనుగ్రహ పాత్రులైయున్న శ్రీ శ్రీ శ్రీ బ్రిటీషు చక్రవర్తులును బ్రజలును భారతవర్షమును బరిపాలించు మహాభాగ్యమును బడసియున్నవారు. ప్రజ లెప్పుడును భిన్నజాతి మతములు కలిగియుందురు కాని యభిన్నముగా నుండనేరరు. అందు భారతీయులలో నేకజాతికాని యేక మతముకాని యొకప్పు డుండెననుట కాధారము లేమియుఁగానరావు. సత్యమిట్లుండ మా సంఘమునఁ గులమత నాపకులు కొందరు బయలువెడలి రాజకీయములగు చట్టములుచేసి భారత సంఘమునకు మహోపకారము గావింతుమని మోసగించి యోట్లు సంపాదించుకొని శాసననిర్మాణ సభాసభ్యులై చెప్పినబని చేయుటయందసమర్థులై పై పెచ్చు నీతిశాస్త్రములోని సర్పమువలెఁ దమ కోట్లిచ్చిన ప్రజల జాతిమతముల నిర్మూలించు చట్టములను జేయుటకుఁ దలపడి యున్నవారు. వీరు కావించు శాసనములు ప్రభువులయెడఁ బ్రజలకున్న ప్రభుభక్తిని మునుముట్టఁ దుడిచిపెట్టి మీఁదుమిక్కిలి విద్వేషమును జనింపజేయుటకుఁ బరమ సాధనములై యున్నవనుటకు సంశయముండునా? వారు రాజకీయరంగమున మూచేయు బిల్లులు భారత

ప్రభుత్వమువారి కనిష్టములైనచో వానినిద్రోసి రాజనుట కధికారము కలిగియున్న వారు. అందుచే మా కాలాభములు లభింపవు. కాని కుల మతనాశక శాసనములను బాసుచేసినయెడ నరిష్టములు మాత్రము మాకు లభింపకమానవు. మా కరిష్టదాయకములయిన శాసనములు చేయు మీ ప్రభుత్వమునందు మాకు భక్తిపిలుచునని మీరు తలంచుట కాధారమేమి? ఏమియులేదు. కాన ముందురాఁగల యన్నికలందు సభ్యులుగా నిలుచువారే జాతిమతములకు సంబంధించిన చట్టములను గూడ మూచేయమని ప్రమాణ పత్రికనిచ్చినవారే సభ్యత్వమునుగోరి నిలుచుండవలెనను శాసనముచేసి మీ యాగమనము మా భారత ప్రజల సహజ రాజభక్తిని బోషించుచునది యగునటులఁ గావింపుమని పరమేశ్వరుని బ్రార్థించి యింతట విరమించుచున్నవారము.

పత్రికాధిపతి.

శ్రీ

రజస్వలా వివాహ ఖండనాత్మక

# బాలికా వివాహ మండనము.

( మధ్యమ భాగము. )

## నగ్నికా శబ్దార్థము.

ఈ విషయమై బ్ర॥ క॥ మార్కండేయ శర్మగారు మున్నగు కొందరు పండితులాంధ్రాది పత్రికాముఖములఁ జర్చించి నగ్నికయన ఋతుమతి కాని కన్యయని చక్కనితీర్పు తీర్చియున్నారు. తీర్చియుండి నను సందర్భమునకనుసరించి మేమునుగొంత ముచ్చటించఁ దలంచి యున్నారము. పైపేరుతోఁ బుత్రుడగు నయుల సోమయాజుల మహా దేవ శాస్త్రి వ్రాసినటుల శ్రీ కావ్యకంఠ గణపతిశాస్త్రిగారు కాంచిన విమర్శ యూకదంపు విమర్శగానున్నది నగ్నికయన విగతవస్త్ర యగు కన్యయను నర్థమా బాలగోపాల విదితమయియున్నది. ఇంతి

మొగాక నగ్నికయన ననాగతార్తవయనియమరుడు చెప్పియున్నాడు. దీన రజస్వలలుగాక పంద్రెండు సంవత్సరములకు లోపలి వయసులో నున్న పడుచులు నగ్నికలనిపించుకొందురని తెలియవచ్చినదికదా? వీరి నా సన్నావర్తవలనికూడ వ్యాఖ్యాతలు వ్యవహరించియున్నారు. ఇంతిమొగాక వీరినే యనగ్నికలనికూడ పండితులు వ్యవహరించియున్నారు. అనగ్నిక యన అనగ్నికాయస్మిన్ వయసి స్వయమేవలజ్జయా వాసః పరిదధాతి. తద్వయస్కాం" అనంగ సిగ్గుచే వస్త్రముధరించిన కన్యయని యర్థము. ఇదియు ననాగతార్తవయే యై యున్నది. నగ్నిక యొక్క యవస్థా భేదములను బలువురు మహర్షులు పలువిధముల వర్ణించియున్నారు. అంతమాత్రముచే నవి యొకదానితో నొకటి విరోధించి వ్యర్థములగునా? కావు. కాన వ్యర్థములగునని తలంచి శాస్త్రిగారు వాదించినారు. పండితు లిట్లు సాహసవాదము కావింపం దగునా? తగదు.

## జైమిని సూత్రము.

"విందేతా నగ్నికాం" అనగ్నికను వివాహ మాడవలసినదని జైమిని మహర్షి చెప్పియున్నాడు. అనగ్నిక యన ననాగతార్తవయే కాని ఋతుమతి కాదని వెనుకనే నిర్ణయించియున్నారము. ఋతుమతి యనినచో నీ సూత్రము వెనుక దెలిపిన సకల శాస్త్రములకును విరుద్ధము కావలసివచ్చును. కాన నా యర్థము చేయరాదు. అటులేని "ఊర్ధ్వం త్రిరాత్రాత్సంభవః" అను తరువాతి సూత్రము పై సూత్రముతో విరోధింపదాయుందురా? విరోధింపదు. అది ముందు దెలుపనున్నారము

## హిరణ్యకేశ సూత్రము.

"తాభ్యా మనుజ్ఞాతః భార్యా ముపయచ్ఛేత్ సమతాం నగ్నికాం" అని చెప్పియున్నది. ఇందు నగ్నికనే వివాహమాడవలెనని చెప్పియున్నది.

## గోబిల సూత్రము.

"నగ్నికాతు శ్రేష్ఠా,...॥ ఊర్ధ్వం త్రిరాత్రాత్సంభవ ఇత్యేకే"

జైమిని సూత్రమువలె గాకయిది వివాహమునకు నగ్నిక శ్రేష్ఠ రాలని చెప్పి యటుపై వివాహదీక్ష మూడురాత్రులు కడచినమీద సంభోగము చేయవలసినదని చెప్పియున్నదికాని యిది కొందరాచార్య పురుషులు చెప్పియున్నారని విశేషార్థము వినిపించియున్నది. ఈయర్థమునుబట్టి చూచినను ననాగతార్తవ యగు నగ్నికతో నాలవ నాటిరాత్రి సంభోగము చేయవలెనని తేలుచున్నదికదా? ఇది యెట్లు పొసగుననని ప్రతివాదు లడుగుచున్నారు. సూత్రమునందే కే యని యుండుటచే నది గోభిల సూత్రకర్త యొక్క మతముకాదు. ఇతర మతమైయున్నది. ఏదైనను నాలవనాటిరాత్రి ప్రతివరుడును నగ్నికతో సంభోగము చేయవలసినదని యాసూత్రము విధించలేదు. ఒకానొక నగ్నిక (ఆసన్నార్తవ) యత్యంతపురుష భోగాభిలాషిణిగానున్న యెడ నట్టినగ్నిక ఋతుమతి కాకపోయినను నామె రక్షణకొరకు నిషేకవిధి ననుసరించి సంభోగము చేయవలసినదని పైసూత్రము విధించియున్నది. ఇట్లు మేము చెప్పుచుండుటలేదు. గోభిలసూత్ర వ్యాఖ్యాత యిట్లు చెప్పియున్నాడు. దాని నిందుక్రింద బొందు పరచుచున్నారము.

## గోభిల సూత్రవ్యాఖ్య.

"ప్రకృతాత్త్రి రాత్రాదూర్ధ్వంసంభవత్యనే నేతిసంభవః స భోగః వ్యవాయః కర్తవ్యః ఇత్యేకే ఆచార్యామన్యంతే. అథసూత్రమిదం శక్యమవక్తుం సంభవస్యరా గతఏవప్రాప్తేః, వివాహాత్ప్రభృతిత్రిరాత్రం బ్రహ్మచర్య విధానాచ్చ తదూర్ధ్వం బ్రహ్మచర్యనియమాభావస్యావగతేః ఉచ్యతే. ఉపరిష్టాత్సన్నతక ప్రశేషు సూత్రయిష్యతి. "నాజాతలోమ్న్యా సహోపహాస మిచ్ఛేత్," ఇతి. తదపవాదార్థ మిద ముచ్యతే. కథం నామయద్య జాతలోమ్న్యేవాతీవ పురుషభోగాభిలాషిణీభవతి తర్హి త్రిరాత్రాదూర్ధ్వం తద్రక్షార్థం సంభవితవ్యం అపిచ ఋతుకాలా దన్యత్ర రాగ మాత్రాధీనత్వా త్సంభవస్య స్త్రీగాంతదభిలాషే పిపుంసోరాగా భావాత్. అకరణమపి ప్రాప్నోతి. తదనేన ?రస్యతే. అన్యశాఖలు అభిలాష పరవశాక దాచిదకార్యమపి

కుర్యాత్, తస్మాద్వినాపి ఋతుకాలం స్త్రీణాం రక్షార్థం సంభవితవ్యమితి."

నగ్నికయగు కన్య వివాహమునకు యోగ్యురాలనిమీది సూత్రకర్తలెల్లరు నేకగ్రీవముగఁ జెప్పియున్నవారు. జైమినిసూత్రము మాత్రమ నగ్నిక వివాహ యోగ్యయని చెప్పియున్నది. నగ్నిక యన్నను ననగ్నిక యన్నను ఋతుమతి మాత్రముకాదు. ఋతుమతి కాని కన్యలను వివాహ మాడవలసినదని చెప్పిన సూత్రకర్తలలోఁ గొందరు మాత్రమే త్రిరాత్రదీక్ష గడచినమీద సంభోగము చెప్పియున్నారు. సంభోగము రాగ మాత్రాధీనమైనది. రాగము రజోవతియందుఁగాని కలుగదు. రజోవతియైయుండి తనకుఁ గామమున్నను రోమవతియైనంగాని దాని సంభోగము చేయరాదని శాస్త్రము విధించియున్నది. శాస్త్రమట్లు విధించినను నొకానొక కన్య యనాగతార్తవయు నాజాతరోమ్నియు నైయుండియు నత్యంత పురుషభోగాభిలాషిణిగా నున్నయెడ నాపె రక్షణార్థమై సంభోగము చేయవలసినదని సూత్రకర్త చెప్పియున్నాడని వ్యాఖ్యాత యత్యంతపరస్పర విరుద్ధములైయున్న "నగ్నికాతుశ్రేష్ఠా" ఊర్ధ్వం త్రిరాత్రాత్సంభవ ఇత్యేకే" యను సూత్రములకు విరోధ పరిహారముగావించి సమన్వయించి యున్నవాడు. ఇది తెలియక మన ప్రతివాదులు మూడు రాత్రులు వెళ్లినమీద సంభోగము చేయవలెనని చెప్పిన సూత్రమును దీసికొని యనాగతార్తవార్థముగల నగ్నికా శబ్దమునకుఁ గొందరు ఋతుమతి యను నర్థమును చెప్ప సాహసించియున్నారు. మఱికొందరు వానిని ద్రోసిరాజన సాహసించనున్నారు. ఇది పండితులు కావించదగిన కార్యమా? కాదు. కాదు ముమ్మాటికినిగాదు. ఇట్లని యీక్రింది స్మృతి పరామర్శకూడ ధృవపరచెడిని. ఇటువినుడు.

బృహస్పతి ధర్మశాస్త్రము.

శ్లో॥ త్రింశద్వర్షో దశాబ్దాంతు। భార్యాంవిందేత నగ్నికాం।
ఏకవింశతి వర్షోవా। సప్తవర్షామవాప్నుయాత్ ॥

ముప్పది వత్సరముల వయసుకలవాడు పది వత్సరముల వయసు కల నగ్నికను భార్యనుగాఁ బరిగ్రహించవలెను. ఇరువదియొక వర్షములవాడు సప్తవర్ష నగ్నికను వివాహ మాడవలయునని పై శ్లోకార్థము. ఇందు బృహస్పతి పదియేండ్ల బాలికను నగ్నిక యని చెప్పియున్నాడు. ఇంతియె కాదు. కన్యకుఁ బురుషుని వయస్సులో మూడవవంతు వయస్సుండవలెనని యిందు తేలినది. ఈ విషయమై విష్ణుపురాణముకూడ "వర్షై రేకగుణాం భార్యాముద్వహేత్త్రి గుణాస్స్వయ" మని చెప్పియున్నది. ఇదిపై యర్థమునే స్థిరపరచియున్నది. ఇంతియె కాదు.

భవిష్య పురాణము.

శ్లో॥ సప్తవర్షా భవేద్గౌరీ। దశవర్షాతు నగ్నికా।
ద్వాదశేతు భవేత్కన్యా। అతఊర్థ్వం రజస్వలా॥

సప్తవర్ష గౌరి, దశవర్ష నగ్నిక, ద్వాదశవర్ష కన్య, యటుపై రజస్వలయని పైశ్లోకార్థము. ఇందు దశవర్ష ప్రాయము గల కన్య నగ్నికయని చెప్పఁబడియున్నది. ఇది పై బృహస్పతి వచనార్థమును బలపరచియున్నది. నగ్నికయనఁ బదియేండ్ల పడుచయినపుడద్దానితో నాలవనాఁడు సంభోగముచేయుట యెట్లు తటస్థించును?

సంవర్త స్మృతి.

శ్లో॥ అష్టమేతు భవేద్గౌరీ। నవమే నగ్నికాభవేత్।
దశమే కన్యకాప్రోక్తా। ద్వాదశే వృషలీస్మృతా॥

ఎనిమిదవ వత్సరమున గౌరియగును. తొమ్మిదవ వత్సరమున నగ్నిక యయ్యెడిని. పదియవ సంవత్సరమునఁ గన్యయని చెప్పఁబడును. పండ్రెండవ సంవత్సరమున వృషలి యని స్మరింపఁబడునని పై వచనార్థము. ఈ యర్థమును బట్టిచూడ తొమ్మిదేండ్ల కన్యకు నగ్నిక యను నామముకలదని తెలియవచ్చినదికదా? తొమ్మిదేండ్ల కన్యతో సంభోగము గావించుటెట్లు?

## బోధాయన ధర్మశాస్త్రము.

శ్లో॥ దద్యాద్గుణవతే కన్యాం। నగ్నికాం బ్రహ్మచారిణే।
అపివాగుణ హీనాయ। నోపరుంధ్యా ద్రజస్వలాం॥

గుణవంతుడగు బ్రహ్మచారికి నగ్నికయగు కన్యను దానమీయవలెను. గుణవంతుడు లభింపనిచో గుణహీనునికైనను దానము చేయుము. అంతియెకాని రజస్వలను నిరోధించవద్దని పైశ్లోకార్థము. ఈ చివర వాక్యమునకుఁ గొందరు పండితప్రవరులు రజస్వలకుఁగూడ వివాహము చేయవచ్చునని బోధాయను డంగీకరించినట్లు సమన్వయింపఁ జూచుచున్నారు. కాని యది యుక్తముకాదు. ఏలయన? బోధాయన మహర్షి గుణవంతుడగు బ్రహ్మచారికి నగ్నికయగు కన్య నీయవలసినదని మొదట, జెప్పి యటుపైఁ దన యీమాటనమ్మి యెవడేని గుణవంతుడగు బ్రహ్మచారికొరకు యత్నించుచు రజస్వలయగు వరకుఁ గూతునకు వివాహముచేయక యుంచునేమో యని భయపడి వెంటనే గుణవంతుడు లభించనిచో గుణహీనునికైనను నీ కన్యనిచ్చి వివాహము చేయుమని నుడివి యప్పటికి సంశయము తీరదని రజస్వల యగువరకు వివాహముచేయక నిరోధించవద్దనికూడ చెప్పియున్నాడు. అంతియేకాని రజస్వలయైనను వివాహము చేయవచ్చునుగాన వివాహమువద్దని నిరోధింపకుమని చెప్పియుండలేదు. నోపరుంధ్యా ద్రజస్వలాం అను వాక్యమును రజస్వలకు వివాహము చేయవచ్చునను నర్థమునందే బోధాయనుడు చెప్పియున్న యెడ "అపివాగుణ హీనాయ" (గుణహీనునికైనను నిమ్మను) రెండవ వాక్యమును జెప్పుట నిరర్థకము కాదా? రజోవతియైనను గుణవంతునికే యీయవలెనని చెప్పవలెఁగాని గుణహీనునకీయవలయునని చెప్పరాదు. కాన బోధాయనుడు నగ్నికయగు కన్యను గుణవంతుడగు బ్రహ్మచారికీయవలసినది. అతడు లభింపనిచో గుణహీననికైన నిమ్ము. అంతియెకాని రజస్వలయగు వరకుఁ గన్యకుఁ వివాహము నిరోధించనలదని చెప్పినాడనియే పండితు డన్వయింపవలయును మరియొక విధముగ నన్వయింపరాదు. ఈ సమన్వయమునే క్రిం.ది వసిష్ఠ వచనముకూడ బలపరచుచున్నది.

వసిష్ఠ ధర్మశాస్త్రము.

శ్లో॥ ప్రయచ్ఛే న్నగ్నికాం కన్యా। మృతుకాలభ యాత్పితా।
ఋతుమత్యాం హితిష్ఠంత్యాం। దోషః పితరమృచ్ఛతి॥

తండ్రిలో నగువారు ఋతుకాల భయముచే నగ్నికయగు కన్యనే దానము చేయవలెను. ఋతుమతి యైనకన్య యింటనుండెనా యాదోషము తండ్రిని జెందునని పై వచనార్థము. రజోవతియైనను గన్యకు వివాహముచేయుట కవకాశము కలదేని వసిష్ఠ మహర్షి ఋతుకాల భయముచే నగ్నికయగు కన్యను దానము చేయుము. చేయనిచో దోషమువచ్చునని యేల చెప్పవలెను? భయ ముపదేశింపనేల? రజోవతియైన దోషమువచ్చును. వచ్చినయెడఁ బ్రాయశ్చిత్తము చేసికొని వివాహమాడుమనియు నుపదేశింపలేదు. అది యెందునులేదు. కాన బోధాయనుడు రజస్వలావివాహమును జెప్పినాడను పండితవాద మపండితవాత మనుటకు సంశయించబనిలేదు.

నగ్నికా కన్యావస్థా భేదవర్ణనము.

నగ్నికలలోను గన్యలలోను నవస్థాభేదము లనేకములున్నటులఁ గ్రింది స్మృతి పరామర్శవలనఁ దెలియనగును. అదెక్కడనందురా?

శ్లో॥ యావచ్చేలం నగృహ్ణాతి। యావత్క్రీడతిపాంసుభిః।
తావత్కన్యా ప్రదాతవ్యా। నోచేత్పిత్రో రధోగతిః॥

ఇది బ్రహ్మాండ పురాణవచనము. చిన్నది యెంతవరకు వస్త్రమును ధరింపదో యెంతవరకు దుమ్ముతో నాడుకొనుచుండునో యంతకులోపలనే కన్య దానము చేయఁదగినది. లేనిచోఁ దలిదండ్రుల కధోగతివచ్చునని పై శ్లోకార్థము. ఇట్లనిన సిగ్గుతెలిసి వస్త్రము కట్టుకొనిన వెనుక వివాహము కూడదా యని వాదింపరాదు. వస్త్రము కట్టుకొనుట యెరుంగని యీడులోనున్నప్పటినుండి కన్యలకు వివాహముచేయుట కర్హకాల మారంభమగునని మనము గ్రహించవలసియున్నది. ఇంతియె కాదు.

శ్లో॥ యావచ్చేలం నగృహ్ణాతి। యావత్క్రీడతిపాంసుభిః॥
యావద్దోషం నజానాతి। తావద్భవతి నగ్నికా।

చిన్నది యెంతవరకు సిగ్గుచే వస్త్రమును ధరింపదో యెంతవరకు దుమ్ముతో నాడుకొనుచుండునో యెంతవరకు దోషము తెలిసికొనఁ జాలదో యంతవరకు నగ్నిక యనిపించుకొనునని పై శ్లోకార్థము. ఇది యొక యవస్థ. ఇంతియె కాదు.

శ్లో॥ యావన్న లజ్జయాంగాని। కన్యాపురుష సన్నిధౌ।
జాన్వాదీన్య పగూహేత। తావద్భవతి నగ్నికా॥

కన్య లజ్జచే నెంతవరకుఁ బురుషసన్నిధిని జాన్వాద్యంగములను దాచుకొననేరదో యంతవరకు నగ్నిక యనఁబడుచున్నదని పై శ్లోకార్థము. ఇదియుఁ బై కన్యావస్థనే బలపరుచుచున్నది. ఇంతియె కాదు. ఎంతవరకుఁ గన్య రజస్వల కాకయుండునో యంతవరకు నగ్నిక యనిపించుకొనునని యీ క్రింది శ్లోకము చెప్పుచున్నది

శ్లో॥ నగ్నికాం తువదేత్కన్యాం। యావన్నర్తు మతీభవేత్।
ఋతుమతీత్వ నగ్నికా। తాంప్రయచ్ఛేత్తు నగ్నికాం॥

కన్య యెంతవరకు ఋతుమతి కాకయుండునో యంతవరకు నగ్నికనుగాఁ జెప్పవలయును. ఋతుమతియైన కన్య యనగ్నిక యగును. కాన ఋతుమతికాని నగ్నికనే దానము చేయవలసినదని పై శ్లోకార్థము. ఈ యర్థమునే యమరుడు "నగ్నికా నాగతార్తవా" యను శ్లోకముఖమునఁ జెప్పియున్నాడు. ఇందు ఋతుమతి యనగ్నిక యగునని యొక విశేషము చెప్పియున్నది. దీనింబట్టి యనగ్నికను వివాహము చేసికొనవలసినదని చెప్పిన జైమిని సూత్రమునకు రజస్వలా వివాహ మర్థమగునని మరల మన ప్రతివాదులు ప్రతిఘటింతురేమో! సమాధానము వినుడు. అనగ్నికాశబ్దమునకు "అనగ్నికాయస్మిన్ వయసిస్వాయమేవ లజ్జయావాసః పరిదధాతి తద్వయస్కా" మని వ్యాఖ్యాతలు చెప్పియుండుటచే ననాగతార్తవార్థముకూడఁ గలదు కనుకను నితర సూత్రకర్తలెల్లరు నగ్నికకు వివాహము చేయవలసినదని చెప్పియున్నారు కావునను జైమిని వచించిన యనగ్నికాశబ్దమున కనాగతార్తవార్థమునే చెప్పవలెఁగాని యాగతార్తవార్థము చెప్పరాదు. కావుననే పై శ్లోకములలో ఋతుమతి కనగ్నిక యను

నామముకలదని వ్యవహరించియు ననగ్నికను దానము చేయువలసిన దని చెప్పక యనాగతార్తవయగు నగ్నికనే దానము చేయవలసిన దని చెప్పియున్నాడు. కానఁ జైమిని యనగ్నికాశబ్దముతో రజస్వలా వివాహమును బోధించినాడని కావ్యకంఠులు వాదించఁదగినది కాదని విధిలేక చెప్పుచున్నారము. ఇంతియేకాదు. ఇంకను నగ్నికను గురించి యిట్లు మునులు వర్ణించియున్నారు. అదేమన?

శ్లో॥ అప్రాప్త రజసాగౌరీ। ప్రాప్తే రజరోహిణీ।
అవ్యంజితా భవేత్కన్యా। కుచహీనాచ నగ్నికా॥

ఈ శ్లోకము భవిష్య పురాణమునందును గలదు. రజస్సేర్పడని కన్య గౌరి. రజస్సుపొందిన కన్య రోహిణి, రోమోత్పత్తికాని పడుచు కన్య, కుచములు రానికన్య, నగ్నికయని పై శ్లోకార్థము. ఈ యర్థమును బట్టిచూచినను నగ్నిక యనాగతార్తవనియే స్పష్టమగుచున్నది. కాని యిందు రజస్సుప్రాప్తించిన పడుచు రోహిణి యగునని చెప్పఁబడియున్నది. రోహిణిని వివాహమాడవచ్చునని మీరు నంగీకరించినారు. కాన రజస్వలావివాహము సాధింపఁబడినదని మన ప్రతివాదులు మరలఁ బ్రతివాదము గావింతురేమో? సమాధానము వినుడు. ఇటఁ బ్రాప్తించిన రజస్సుకలది రోహిణి యనికదా చెప్పఁబడియున్నది? రజస్సుప్రాప్తించిన దన నాసన్నార్తవయని తలంచవలెఁ గాని రజోవతియని తలంపఁ బనిలేదు. అదేమన? "నవవర్షాతు రోహిణీ ...దశవర్షా భవేత్కన్యా। అతఊర్ధ్వం రజస్వలా" యని యనేక ధర్మశాస్త్రములు పదియేండ్లు దాటినమీద రజస్వలయని చెప్పియున్నవి కాన సంప్రాప్తరజస్కను రోహిణి యన్నంతమాత్రాన రజస్వలా వివాహమని చెప్పవలసిన యవసరము పండితులకుఁ గలుగదు. స్మృతులిట్లు చెప్పుచుండఁ గావ్యకంఠులవారు "షోడశాబ్దను నగ్నికనుగాఁ జెప్పు నారదస్మృతి యిచ్చట నుదహరింపఁ దగినదేయగును, అనియొక షోడి వచనమును బచరించియున్నవారు. కాని యానారద వచనమును మాత్రము నుదాహరించిన వారుకారు. కారణము తెలియదు. అయిదవ వత్సరము మొదలుకొని పదియవవత్సర ప్రాయమువరకు నున్న

కన్నెలను నగ్నికలని వర్ణించిన స్మృతివచనములను బెక్కింటిని విని పించి యుంటిమికదా? ఇన్నిటికిని విరోధముగ నారద స్మృతి షోడశాబ్దను నగ్నికనుగా జెప్పియుండునా? చెప్పియుండదు. ఒకవేళ నది చెప్పి యుండినను దాని నొక్కదానిని బ్రమాణముగ గైకొని బాలికావివాహమును విధించెడి నగ్నికలను దెలుపు స్మృతివచనములను ద్రోసి రాజనుటకు గావ్యకంఠులవారు సాహసించి యున్నవారే. ఇది పండిత ధర్మమా? ఇట్లనిన మీరుమాత్రము బాలికావివాహమును బోధించు స్మృతివచనములనెల్ల బ్రమాణములనుగా గ్రహించి షోడశాబ్దను నగ్నికనుగాఁదెలుపు నారద స్మృతివచనమును ద్రోసిరాజనుట లేదా యది ధర్మమాయని మన ప్రతిపక్షులు ప్రశ్నింతురేమో? సమాధానమువినుఁడు. మన ప్రతిపక్షులు రజస్వలావివాహములే యాచరణీయములని బండవాదము గావించునట్లు మనము బాలికావివాహములే యాచరణీయములని వాదించు వారము కాము. కదా? ఇ కేమన? రజస్వలావివాహములను బ్రాహ్మణు లాచరించరాదు కాని క్షత్రియులు గావించుకొనవచ్చునని శాస్త్రాచారములు తెలిపియున్నవని చెప్పినారము కాన నారద స్మృతి చెప్పిన షోడశాబ్ద నగ్నికాపరిణయము క్షత్రియపరముగా నన్వయించుకొని యది బ్రాహ్మణ కర్తవ్యము కాదని వాదించుట మంచిదని చాటి చెప్పుచున్న వారము. శాస్త్రము లిట్లు చెప్పి యున్నవి. కావుననే గృహ్యా సంగ్రహకర్త రజస్వల కాకముందుఁ గావింపఁబడు కన్యాదాన ప్రతిగ్రహములే ప్రశస్తములని యీక్రింది శ్లోకముఖములఁ జెప్పియున్నాడు.

> శ్లో॥ వ్యంజనైస్తు సముత్పన్నైః। సోమోభుంక్తే థకన్యకాం।
> పయోధరైస్తు గంధర్వో। రజసాగ్నిః ప్రకీర్తితః॥
> శ్లో॥ తస్మాదవ్యం జనోపేతా। మరజామ పయోధరాం।
> అభుక్తాంచైవ సోమాద్యైః। కన్యకాంతు ప్రశస్యతే॥

ఈ శ్లోకము భవిష్య పురాణమునందును గలదు. రోమోత్పత్తి యైన కన్యను సోముడును బయోధరములు వచ్చిన కన్యను గంధర్వుడును రజస్సేర్పడిన కన్యను నగ్నియు ననుభవింతురు. కాన రోమ

ములు లేని రజస్సేర్పడని పయోధరములు రాని సోమగంధర్వాగ్ను లచే ననుభవింపఁబడని కన్యను వివాహము చేసికొనుట ప్రశస్తమైన దని పై శ్లోకార్థము. ఇంతియేకాదు. రోమములు రజస్సుకుచములు నేర్పడిన కన్యను వివాహమాడిన వచ్చెడి యరిష్టమునుగూడ, క్రింది భవిష్య పురాణవచనము ప్రకటించియున్నది.

శ్లో॥ హినస్త్రివ్యంజనైః పుత్రాన్। కులం హన్యాత్పయోధరైః।
గతిమిష్టాంత థాలోకాన్। హన్యాత్తు రజసాపితుః॥

వ్యంజనములతోఁ గూడినకన్య పుత్రులను బయోధరములతోఁ గూడినకన్య కులమును రజస్సుతోఁ గూడినకన్య యిష్టమగుగతిని నిష్టములగు లోకములను నశింపజేయునని పై శ్లోకము చెప్పియున్నది. కాన రోమములు లేని రజస్సేర్పడని పయోధరములు రాని యన్యునిచేఁ గాని సోమగంధర్వాగ్నులచేఁగాని యనుభవింపబడని దుహితను దండ్రి దానము చేయువలసినదని భవిష్యపురాణము క్రింది శ్లోకముఖ మునఁ జెప్పియున్నది. అదేమన?

శ్లో॥ తస్మాదవ్యంజనోపేతా। మరజామపయోధరాం।
అభుక్తాం చైవసోమాద్యై। ర్దద్యాద్దుహితరంపితా॥

ఇంతవరకు నగ్నికాశబ్దార్థమునుగూర్చి విచారించుకొంటిమి. విచారించి సిగ్గుతెలియని యవస్థలోనున్న కన్య మొదలుకొని పదివత్స రములువచ్చిన కన్యవరకు నగ్నికనుగా శాస్త్రవ్యవహారము కలదని తెలిసినదికదా? ఇఁకఁ గన్యాశబ్దార్థమునుగూర్చి యించుక ముచ్చ టించుకొందము. నగ్నికాశబ్దమువలెనే కన్యాశబ్దముకూడ నవివా హితయొక్క పెక్కువస్థాభేదములనే వర్ణించియున్నది. ఇటు సావధాన ముగఁ దిలకింపుడు. కన్యాశబ్దార్థ విచారణమునకుఁ దొరకొనునపుడు మాధవాచార్యుల వారిట్లువక్కాణిక దింపి యున్నవారు.

"కన్యాశబ్దేన లజ్జాద్యభిజ్ఞాన రహితా వయోయుక్తా వివక్షితా" కన్యాశబ్దముచే సిగ్గుమున్నగు విషయములు తెలియని వయోయుక్త యగు బిడ్డ వివక్షి చేయఁబడియున్నదని మాధవాచార్యులవారు క్రింది పురాణవచనములనుదాహరించియున్నారు.

శ్లో॥ యావన్న లజ్జితాంగాని। కన్యాపురుష సన్నిధౌ।
యోన్యాదీన్యవ గూహేత। తావద్భవతి కన్యకా॥

ఇదివరకీ శ్లోకమును గైకొని వాది ప్రతివాదు లిరువురును నాంధ్ర పత్రికాముఖమున ముచ్చటించియే యున్నారు. కాని యీశ్లోకమే "తావద్భవతి కన్యకా యను చతుర్థపాదమునకు బదులుగా "తావద్భవతి నగ్నికా'' యను నాలవపాదముతో నగ్నికా చర్చలోఁగూడ నున్నది. దాని నిదివరకే యిచ్చియున్నారముకదా? సిగ్గుకలదై కన్య పురుషసన్నిధిని నెంతవరకు యోన్యాద్యంగములను దాచుకొనదో యాతవరకుఁ గన్యయగునని పైశ్లోకార్థము. ఇందు వివాహము చేసికొనుటకుఁదగిన కన్యలలోఁ బ్రథమావస్థ వర్ణింపబడినది. ఇంతియె కాదు. సంగ్రహకారు డీక్రిందిరీతి మరియొక కన్యావస్థనుగూడ వర్ణించి యున్నాడు.

శ్లో॥ యావచ్చేలం నగృహ్ణాతి। యావత్క్రీడతి పాంసుభిః।
యావద్దోషం నజానాతి। తావద్భవతి కన్యకా।

ఈశ్లోకమే నగ్నికా చర్చయందు "తావద్భవతి నగ్నికా'' యను చతుర్థపాదముతోఁ నుదాహరింపఁబడియున్నదని తెలిపియుంటిమికదా? బాల యెంతవరకు వస్త్రము ధరించదో యెంతవరకు దుమ్ముతో నాడుకొనుచుండునో యెంతవరకు దోషము తెలియఁజాలదో యంతవరకుఁ గన్యయగుననీ పైశ్లోకము. ఈచెప్పిన దానింబట్టి నాలుగేండ్లు వెళ్లి యైదేండ్లు ప్రారంభమైన పిల్లలు వివాహమున కర్హురాండ్రని బాలబోధక మగుచున్నదికదా? ఈయర్థమును ధర్మసింధు చెప్పినటుల "జన్మతో గర్భాధానాద్వా పంచమవర్ష ప్రభృత్యష్టమ వర్ష పర్యంతం కన్యావివాహే ఉదితః కాలః'' అను వాక్యార్థముతోఁ జేర్చి యన్వయించినయెడ నైదవయేడు మొదలుకొని కన్యలకు వివాహముచేయుట కారంభించవచ్చునని స్పష్టమగును. ఇదివరకు "దశవర్షా భవేత్కన్యా'' యను పరాశరాదుల వాక్యమును వినిపించి దాన దశవర్షములవఱకుఁ గన్యకయను పేరుకలదని నిర్ణయించి యుంటిమికదా? ఇపుడు మేముకాంచిన స్మృతి పరామర్శవలన నేడవ

యేడు మొదలుకొని పండ్రెండవ సంవత్సరములోపల, రజస్వలలు కాక యున్న కన్నెలకు వివాహము చేయవచ్చునని స్పష్టముగాలేదా?

ఇట్లనిన "ఋతుస్నాతాత్రయాశుద్ధా। సాకన్యేత్యభిధీయ, అనగ ఋతుమతియై యేకన్య స్నానముచేసి శుద్ధురాలైయుండునో యాచిన్నది కన్యయని పిలువబడునని యా వచనార్థము. కాన, గన్యా వివాహమన రజస్వలావివాహ మని యేలచెప్పరాదని ప్రతిపక్షులడుగుచున్నారు. కన్యాశబ్దము వివాహముకాని వృద్ధ స్త్రీకినిగూడ జెల్లునని భారతశల్యపర్వమున, జెప్పియున్నట్లు మాధవాచార్యులవారు పరాశరస్మృతి వ్యాఖ్యయం దుదాహరించియున్నారు. అపుడు ఋతుమతియైనదానికి, గన్యయని పేరుకలదు కాన ఋతుమతీ వివాహ మాచరణీయమని మన ప్రతివాదులు వృద్ధ స్త్రీకిని గన్యయను పేరుగలదు కాన నామెకును వివాహము చేయవచ్చునని మరియొకరు వాదించిన యెడ వారికి మన ప్రతివాదులే సమాధానము చెప్పవలెను? ఇంతియె కాదు. వివాహమునకు ముందు రజస్వలయైయుండి రహస్యముగా, దంటాలుపడి బుడుతనిగన్న చిన్నదానికి, గూడ, గన్యయను నామము కలదు. చూడుడు. మనుస్మృతి (అ 9-శ్లో 172)

శ్లో॥ పితృవేశ్మని కన్యాతు। యంపుత్రం జనయేద్రహః।
తంకానీనం వదేన్నామ్నా। వోఢుః కన్యాసముద్భవం॥

అయ్యలార! రజస్వలావివాహములే యాచరణీయములుకాని బాలికావివాహము లాచరణీయములుకావని పట్టుదలతో, మన ప్రతివాదులు వాదించుచున్నారే! వాదము నిమిత్తము కొంచెముకాలము వారి కోరికయే తీరినదనుకొనుడు. నాడందరుగాకున్న, గొందరయినను గన్యలు కొడుకులను గనక తప్పదుకదా? తరువాత నామెకు వివాహము చేయవలెనంటారా? జన్నికి విడువవలయునంటారా? వివాహము చేయవలెనందురేని సవత్స కన్యాదానమునకు సంకల్పము మార్చవలయునుగదా? మార్చెద మందురా? అనకేమి మొతకైనను వారు తెగించియున్నారు దానికేమి? మన మింతవరకు, గావించిన నగ్నికా కన్యా శబ్దాద్యంతార్థ విచారణవలన, గన్యలకు నైదవయేడు

మొదలుకొని పండ్రెండేండ్లలోపల రజస్వలలు కాకముందే వివాహముము చేయవలెననియు జేసిన సద్గతులు గలుగుననియు నట్లుగాక రజోవతులైన వెనుక వివాహముచేసినయెడఁ గన్యాదాత ప్రతిగ్రహీతలకును దల్లిదండ్రులకునుగూడ నరకముతప్పదని యుద్ధృవపడినది. ఇట్లనిన మా యార్య సోమయాజుల సోమయాజులుగారు మీరు కన్నరచిన శాస్త్రవచనములకు వెరచియే రజోవతులగుటకు ముందుఁ గన్యలను దానముచేసి రజస్వలలైనపిదప వివాహము చేయవలెనని శాస్త్రములు చెప్పినట్లు వ్రాసియున్నారు కదా? ఇందునుగూర్చి మీ సమాధానమేమని మా పాఠకులు ప్రశ్నింతురేమో! వినుడు సమాధానము.

(కన్యాదాన వివాహములు భిన్నకాల కరణీయములుకావు.)

రజోవతి యగుటకుఁ బూర్వము కన్యాదానమును రజోవతియైనపిదప వివాహమును చేయవలెనను వాదము పండితాగ్రేసర చక్రవర్తి శిరోమణి భట్టాచార్యవర్యులవారు కావించఁదగినది కాన పండితులు కావించదగిన వాద మెన్నటికినిగాదు. ఇది యార్య సోమయాజుల సోమయాజులవారి శాస్త్రలోక విమర్శజ్ఞానవిహీనతను జాటుటకుఁ జాలఁజాలియున్నదని చెప్పుటకావంతయు సందియము లేదు. వీరి వ్యాసములకును హిందూపుర వాస్తవ్యులయిన శ్రేష్ఠార్య నారాయణమూర్తిగారి వ్యాసములకును నంతగానంతరము గాన్పింపదు. కాన నా యార్య నారాయణమూర్తిగారే యిపుడు పిశాచమైవచ్చి మన యార్య సోమయాజుల సోమయాజులవారి యందావేశించి యీ వ్యాసములు వ్రాయింపించు చున్నారాయను సంశయము పొడము చున్నది. లేకున్నఁ గన్యాదానము ఋతుమతి యగుటకుఁ బూర్వము నను వివాహము ఋతుమతియైనమీదను గావించవలెనని సాహసించి వ్రాయుదురా? అట్టి యాచారమే దేశమెందైనఁ గలదా? శాస్త్రములం దెచ్చటనైనఁ జెప్పఁబడియున్నదా? లేదే! లేనిదీ దుర్వాదమెందులకు!

ఇందుఁ బండిత చక్రవర్తులకును జక్రరక్షకులకును విరోధము ప్రాప్తించియున్నది. అదేమన? వాసా బంకుపల్లి పండితులు సంకల్పముతో నారంభమైన వివాహకర్మ నాలవనాటి రాత్రి తెల్లవారుగట్ల

గావింపఁబడు సమావేశనముతోఁగాని పూర్తికాదని వాదించుచున్న వారు. మన యపండిత సోమయాజుల వారన్ననో రజోవతియగుటకు ముందు దానమును రజోవతియైన పిదప వివాహమును జేయవలెననుచున్నారు. ఇదియెట్లు పొసగును? ఈ వాదమునందు సోమయాజులవారే కాకులైయున్నవారని తెలియవచ్చినదికదా? వారెట్లైన మనకేమి? వారి వాదము శాస్త్రవిరుద్ధమని రుజువుచేయుట మనపని. మనపని మనము ముగించుకొందము రండు.

సోమయాజులుగారు ఋతుమతి కాకముందే కన్యాదానము చేయవలెనని చెప్పినారు. ఈ సోమయాజులవారే లజ్జవిడిచి మరల బాలికావివాహము కూడదు. రజస్వలావివాహమే చేయవలెనని వాదించుచున్నారు. ఇదియెట్లు పొసగును? ఇట్లనిన బాలికను దానము చేయవలె నంట్రిమికాని వివాహము చేయవలెనని చెప్పలేదుకదా యందురా? అందురేని దానముతోఁ బితృసంబంధము తొలగి భర్తృసంబంధము కలుగదు. అదిసప్తపదితోఁ బ్రాప్తించును. ఈ విషయమై మనువిట్లు చెప్పియున్నాడు.

శ్లో॥ పాణిగ్రాహణి కామంత్రా। నియతం దార లక్షణం।
తేషాం నిష్ఠాతువిజ్ఞేయా। విద్వద్భిస్సప్తమేపదే॥

"సఖాసప్త పదీభవ" మొదలగు వివాహ మంత్రములతో నడిపింపఁబడు సప్తమ పదమందు వధువు భార్యాత్వమునుబొంది యది మొదలుకొని పితృగోత్రమునువదలి భర్తృగోత్రమును జెందునను విషయము పండితులచేఁ దెలిసికొనదగినదని పైశ్లోకార్థము. కావుననే యపండితులగు సోమయాజుల కిది తెలియలేదు. ఇంతియె కాదు. ఆపస్తంబ గృహ్య సూత్రమిట్లు చెప్పియున్నది.

"ఏతదవార్విజా నీయాద్వ దహార్భార్యా మావహంతే"

ఇందులకు సుదర్శనాచార్యులవారిట్లు వ్యాఖ్యానము గావించియున్నారు.

"యస్మిన్నహని గృహప్రవేశనాది స్థాలీపాకాంతం కర్మకరోతి తదేతదహరవధి త్వేనవిజానీయాత్ తతఆరభ్యత్రి రాత్రము భయో రథశ్శయ్యే త్యాదికిర్తుం"

ఏదినమందు గృహప్రవేశనాది స్థాలీపాకాంతమగు కర్మజరుపఁబడునో యాదినము మొదలుకొని త్రిరాత్రదీక్ష ప్రారంభించి వధూవరు లుభయులును వధశ్శయ్య బ్రహ్మచర్యము క్షారలవణవర్జనము సమావేశనమువున్నగుకర్మలు జరుపవలసియున్నదని పై సూత్రార్థము. ఈ యర్థమును బట్టిచూడఁ గన్యాదానము రజోదర్శనమునకు లోపలను దరువాత వివాహమును జేయువలెనను సోమయాజులవారి వాదము నిరాధారమైనదని మా పాఠకలోకము గ్రహింపవచ్చునని తలంచెదము. అయినను బైయర్థమును ధృవపరచెడి యాశ్వలాయన స్మృతి వాక్యములనుగూడ గొన్నిటి నిందుక్రిందఁ బొందుపరచుచున్నవారము. వినుఁడు.

లఘ్వాశ్వలాయన స్మృతి.

శ్లో॥ రాత్రావహని వాదానం। కన్యాయాస్స్వీకృతంయదా।
తదానీమేవ హోమస్స్యా। ద్వివాహస్యచ సిద్ధయే॥

శ్లో॥ యావత్సప్త పదీమధ్యే। వివాహోనైవసిధ్యతి।
సద్యోత్రో హోమమిచ్ఛంతి। సంతస్సాయ ముపాసనం॥

శ్లో॥ దంపతీ నియమేనైవ। బ్రహ్మచర్య వ్రతేఁతు।
వైవాహిక గృహేతౌచ। నివసేతాం చతుర్దినం॥

కన్యాదానము కన్యాప్రతిగ్రహము రాత్రియందుఁగాని పగటియందుఁగాని యెప్పుడుజరుగునో యారాత్రి లేక పగటియందే వివాహసిద్ధికొరకు హోమము చేయువలయునని మొదటి శ్లోకార్థము.

సప్తపదికి లోపల వివాహమెంతవరకు సిద్ధింపదో యాకారణమువలన నెట్టనె సత్పురుషులు హోమమును సాయముపాసనమును గోరుచున్నారని రెండవ శ్లోకార్థము.

దంపతులు నియమముతోను బ్రహ్మచర్య వ్రతముతోను వివాహమైన గృహమునందే నాలుగు దినములు నివసించవలెనని మూడవ శ్లోకార్థము. ఇంతియె కాదు.

శ్లో॥ భోజనం శయనం స్నానం। తథైక త్రోపవేశనం।
గృహప్రవేశ పర్యంతం। దంపత్యోర్మునయోవిదుః॥

వివాహ ప్రారంభము మొదలు గృహప్రవేశపర్యంతము దంపతులకు భోజనము శయనము స్నానము ఏకత్రోపవేశనము (ఒకచో నుండుట) మున్నగు నవి జరుగవలెనని మునులు తెలిసికొనియున్నారని పైశ్లోకము చెప్పియున్నది. ఇంతియె కాదు.

శ్లో॥ వధ్వాసహ వరోగచ్ఛే। త్స్వగృహం పంచ మేదినే।
గృహ్యోక్త వి, నాచైవ। దేశధర్మేణ వాపునః॥

వరుడు వధువుతోఁగూడ నైదవ దినమున స్వగృహమునకు వెళ్లవలయును. గృహ్య సూత్రోక్తవిధిచేఁగాని దేశధర్మానుసారముగ గాని గృహప్రవేశము కావించవలెనని పైశ్లోకము చెప్పియున్నది. పాఠక మహాశయులార! కన్యాదాన ప్రతిగ్రహములే పగటియందు లేక యేరాత్రియందుఁ జరుగునో యపుడు హోమముచేసి సప్తపది కావించినంగాని వివాహ సిద్ధికాదు. అది మొదలుకొని నాలుగు దినములును వివాహము జరిగినయింటనే దీక్షతో బ్రహ్మచర్యాదులు జరుపుకొని యైదవనాఁడి టికివచ్చి గృహప్రవేశము గావించవలసినదని యింత విస్పష్టముగా శాస్త్రము విధించియుండ మన సోమయాజులవారు రజోవతి యగుటకు ముందుఁ గన్యాదానమును దరువాత వివాహమును చేయవలెనని చెప్పసాహసించినారే యీరార్య సోమయాజులవారెట్లైరి?

అనార్య సోమయాజుల సోమయాజులవారు శాస్త్రవిరుద్ధ వాదము చేయవలెఁగాని యార్య సోమయాజులవారు చేయఁదగువా? చేయరాదు. కాన మన సోమయాజులవా రనార్య (శూద్ర) సోమయాజులవారే కాని బ్రాహ్మణ సోమయాజుల వారుకారు. రజస్వలావివాహములే యాచరణీయములు కాని బాలికావివాహము లాచరణీయ

ములు కావని యింత పట్టుదలతో వాదించు సోమయాజులుగారు రజస్వలావివాహము లిదివరకే చేసియుందురని తలంచెదము. లేదా యిపుడు చేయకతీరదు. చేయకున్న వీరిని లోకము నిందించకమానదు. చేసినయెడ వీరు శాస్త్రములు చెప్పినట్లు పాతిత్య త్వా సంభాష్యత్వములుగల వృషలులు (కర్మచండాలురు) కాకతప్పదు. తప్పదు ముమ్మాటికిని దప్పదు. వీరేకాదు. ఈవాదము గావించువారిలో గతించిన వారుతప్ప జీవించిన వారెల్లరును రజస్వలావివాహములు చేయకతప్పదు. చేసి వృషలులు కాకతప్పదు. తరువాత వారికిరానున్న వన్నియు రాకతప్పవు. తప్పవని మా ప్రతివాదులు నిశ్చయించుకొందురుగాత. ఇంక సమావేశమునుగూర్చి ముచ్చటించుకొందము రండు.

---

## "శేషగ్ంం సమావేశనే జపేత్"



అను నాపస్తంబ గృహ్య సూత్రవచనము వివాహదీక్షలో నాలవనాటి యపరరాత్రియందు గావింపబడు శేషహోమానంతరమున వరుడు వధువుతో సంభోగము గావించవలసినదని విధించియున్నది. కాన వధువు వివాహమునాటికి రజస్వలయై యుండవలయును. ఉండనిచో పై సూత్రము నాలవనాటిరాత్రి సంభోగ మెట్లువిధించినదని మన ప్రతిపక్షులు ప్రశ్నించియున్నారు. ఈప్రశ్నను బట్టిచూడ మన ప్రతివాదుల కణుమాత్రమేని విమర్శజ్ఞానము లేదని చెప్పిన యదార్థము చెప్పిన వారమగుదుము. కాని యసత్యము జెప్పినవారమెన్నటికిని గానేరము. అదేమన? ఆపస్తంబ గృహ్యసూత్రము రజస్వలావివాహమును విధించినదా? లేక నిషేధించినదా? యని ప్రశ్నించుకొని విమర్శజ్ఞానముగల పండితుడు విచారించవలెగాని "శేషగ్ంం సమావేశనే జపేత్త"ను సూత్రము వివాహదీక్షలో నాలవనాటిరాత్రి సంభోగము చేయవలసినదని విధించినది కాన నందుల కనువుగ వధువు వివాహమునకు ముందే రజస్వలయయి యుండవలెనను ననుమాన ప్రమాణము

తో సాధించరారాదు సాధించవచ్చుట సాహసకార్యమని చెప్పక తప్పకున్నది. అదేమన?

ఆపస్తంబ గృహ్యాసూత్రము మన ప్రతివాదులు తలంచియున్నటుల రజస్వలనే వివాహము చేసికొనవలెనని విధించియుండలేదు. విధించకపోయినను రజస్వలనుగూడ వివాహము చేసికొనవచ్చునని విధించియున్నను చాలును. దాన మన ప్రతివాదుల వాదము జయించును. దానవారు కృతార్థులయ్యెదరు. అపుడు సూత్రము నాలవ నాటి రాత్రి సంభోగము చేయవలసినదని చెప్పినను వలదని చెప్పినను గూడ మన ప్రతివాదులు నాలవనాటి రాత్రియే 'యాగోహారు' మొదలుపెట్టియే తీరవచ్చును. వీరి తొందరను బట్టిచూడ రజస్వలమై యున్న కన్ననే పెండ్లిచేసికొనుట తటస్థించినయెడ నట్టే వీరా? మూడురాత్రులు దీక్షయా? అదెక్కడిమాట మొదటినాటి రాత్రియే గోవిందకొట్టక విడుతురా? రజస్వలమైయున్న పెండ్లికూతురు ప్రక్క లో పడుకొన్న మీద నడుమని బ్రహ్మచర్యమా? బ్రహ్మకైనబుట్టు రిమ్మ తెగులను లోకోక్తి వినమా? ఆపస్తంబ గృహ్యసూత్రము రజస్వలను వివాహమాడ గూడదని విధించియున్నదా? అపుడు మన ప్రతివాదుల నాదమూడునుకదా? ఊను. అటులేని నిటు వినుడా స్తంబ గృహ్యాసూత్రమును.

"దత్తాం గుప్తాం ద్యోతామృషభాం శరభాం వినతాం వికటాం ముండాం మండూషికాం సాంగారికాం రాతాం పాలీం మిత్రాం స్వను జాం వర్ష కారీంచ వర్జయే"త్"ని యాపస్తంబ మహర్షియే చెప్పి యున్నాడు.

ఇందు వివాహమునకు వర్జింపదగిన కన్యలు చెప్పబడియున్నా రు. వారిలో గుప్తయనునది యొకతె. "గుప్తయన" అదర్శనార్థంకం చుకాదిభిరావృతా। ప్రయత్న సంరక్ష్యమాణావా దౌశ్శీల్యాది శంక యా" అని సుదర్శనాచార్యు డర్థము చెప్పియున్నాడు. దానికి గోప్యా వయవములు లోకమునకు గనుపడకుండ రెవిక మున్నగువానితో దేహమును గప్పుకొని నదియని కాని లేక తన దుశ్శీలాములు బయట

పడుసను శంకచే నవయవములను ప్రయత్నముతో రక్షించుకొనునది యనిగాని యర్థము. యీ చెప్పినదానింబట్టి సిగ్గుతెలియని పిల్లనే వివాహము చేసికొనవలయునని తేలినది. ఇంతియెకాదు. వారిలో రాత యనునది మరియొకతె కలదు. రాతయన సుదర్శనాచార్యుడు "రమణశీలాకందుకాది క్రీడాప్రియేత్యర్థః। ఋతుస్నాతా వా?" అని యర్థము వ్రాసియున్నాడు. అనగా రాతయన ఋతుమతి యని యర్థముచెప్పి యటువంటి దానిని వర్జించవలసినదని యాపస్తంబ మహర్షియే గృహ్యసూత్రముఖమున జెప్పినాడో యీ గృహ్యసూత్రమునే ప్రమాణముగా దీసికొని మన ప్రతిపక్షులు సాహసించి శేషహోమ సమావేశ జపేత్తను సూత్రముఖమున నాపస్తంబుడు నాలవనాటిరాత్రిని సంభోగము విధించినాడని వాదించుట కుపక్రమించియున్నవారు. వీరు వీరి బోధవినువారి తలలలో మెదడులేదని తలంచిరికాబోలు! లేకున్న నాపస్తంబమహర్షినే వీరు స్వవచన వ్యాఘాతముల పాలుచేయ యత్నింతురా? రజస్వలను వివాహము చేసికొనవలదని నివారించిన యాపస్తంబుడే నాల్గవనాడు ఋతుమతికాని చిన్నకన్నెతో సంభోగము సాగించవలసినదని మన ఘనపండితుల కెట్లుపదేశించును? సమావేశనకాలమందైదు మంత్రములనేకదా జపించవలసినదని యాపస్తంబుడా సూత్రమున జెప్పినాడు? సంభోగము చేయవలసినదని విధించలేదుకదా? ఈవిపరీత వాదమేల? ఇట్లుడిగిన సుదర్శనాచార్యుడు "త్రిరాత్రముభయో రధశ్శయ్యా" యను సూత్రవ్యాఖ్యానమందు "అతఏవాత్ర సూత్రేశయ్యైక్యాద్దుర్వారమపిమైథునమతిప్రయత్నేన వర్జనీయ మిత్యేవమర్థః" అని చెప్పియుండలేదా?

అంతగ నీ సూత్రమునందు వధూవరులకు శయ్యయొక్కటియే యాపస్తంబుడుపదేశించియున్నవాడు. ఒక ప్రక్కమీద బడుకొన్న వధూవరులు మైథునము వర్జించుటకష్టము. కాని గష్టమైనను నతి ప్రయత్నముతో మైథునము వర్జించదగినదని యాపస్తంబుడు చెప్పినటుల సుదర్శను డర్థము చేసియున్నాడు. అపుడు వధువు రజస్వలయై యున్నది గాక చిన్నకన్నెగానే యున్నయెడల నతి ప్రయత్నముతో

మైధునము వర్జించవలసినదని యాప స్తంబుడు చెప్పెనా? చెప్పడు. కావున రజస్వలనే వివాహము చేసికొనవలెనను వాదము కావించి తిమని మన ప్రతిపక్షులిఁక ప్రతివాదము కావించవలయును. సమాధానము వినుడు. సుదర్శను డతి ప్రయత్నముతో మైధునమును మానుమన్నాడుకాని సంభోగము మానుమని చెప్పలేదుకదా? లేదు. అపుడు మన ప్రతిపక్షులు నాలవనాటిరాత్రి నాప స్తంబుడు సంభోగము విధించినాడను చేయుదుర్వాదము పోయినదికదా? యని ప్రశ్నింతము. ప్రశ్నించిన సంభోగము పోయినఁబోవుగాక మైధునము చెప్పలేదా యని మరలఁ బ్రశ్నింపకపోరు. ప్రత్యుత్తరము వినుడు. మైధునము (స్మరణము, కీర్తనము, కేళి, ప్రేక్షణము, గుహ్యాభాషణము, సంకల్పము, అధ్యవసాయము, క్రియానిర్వృత్తి,, యను నెనిమిది యంగములు కలిగియున్నది. మైధున మన మిధున (దంపతుల) కర్మ మైధునమగును.

అందుఁగ్రియానిర్వృత్తి యను చివరకర్మ సంభోగమగును. కాని తక్కినవికావు. కావునఁ దక్కిన యేడువిధములయిన మైధునములున్నవను వు రజస్వలమైయున్నను గాకున్నను జరుపఁదగినవే యయియున్నవి కాన దీక్షలో వధూవరులేక శయ్యాగతులై యుండి స్మరణకీర్తన కేళి ప్రేక్షణ గుహ్య భాషణాదికములను గావింతురేమోయని శంకించి యవి జరుగకుండఁ జూడవలసినదని సుదర్శనుడు చెప్పినటులఁ బండితు లర్థముచేయవలెను. కాన నట్లర్థము చేసికొనియే మన పూర్వపండితులు నిప్పటి పండితులునుగూడ సమావేశనకాలమందు సంభోగముతక్క తక్కిన మిధునకర్మలలో "కీర్తనము, ప్రేక్షణము, గుహ్యాభాషణము, కందుకకేళి లోనగు మైధునకర్మలను బాన్పుపై వధూవరులచే బాంధువులు పురోహితులు చెప్పి చేయించుచున్నారు. అపుడు సంభోగమునే చేయవలెనేని వారివశలికి వచ్చికదా? తక్కిన కార్యము కానిండని పు: యెక్కించవలెను? అయిదేండ్లు మొదలుకొని పంద్రెండేండ్లకు లోపలి ప్రాయములోనున్న రజస్వలలుకాని చిన్న కన్నెలకు వివాహము చేయవలసినదని మొదటవిధించి యావిధి నతిక్రమించి యెవరేని రజస్వలా పరిణయములను గావించినయెడ నాదా

తలు ప్రతిగ్రహీతలు వారి పితలతో బంధులతోఁగూడ నధోగతిని గూలుదురని మహర్షులు వినిపించిన వచనములను లెక్కింటిని వినిపింప వినియున్న వారుకదా? ఆమహర్షులేమరల నాలవనాటిరాత్రి సమావేశన కాలమున సంభోగము విధింతురా? విధింతురని పండితులు తలంచుట యెతప్పు. పై పెచ్చువాదింప రావచ్చునా? వాదింపరారాదు.

ఇట్లనిన సమావేశన జపము సంభోగముకాదేని నపుడు జపించ వలసినదని సూత్రకారులు విధించిన మంత్రములు "ఆరోహోరు" మొదలగు నైదు మంత్రములేకదా? అవిస్పష్టముగా (ఊరువుల నధిష్ఠించుము. బాహువులను జాచుము. భార్యను కౌగలించుకొనుము మొదలగు సంభోగ పూర్వకర్మలను బోధించుచున్నవి. ఆమంత్రములు వచించినటు లపుడాపను లాచరించ వలసినదనియేకదా వాని యభిప్రాయమై యుండవలెను? అట్లుకాక యూరక కన్నులుమూసికొని జపించుట వాని యభిప్రాయమై యుండునా? ఉండదు. అని మరల మన ప్రతిపక్షులు ప్రశ్నింపవచ్చును. సమాధానములను వినుడు. ఆమంత్రములందు వారుచెప్పిన యర్థములు కలవుకాని వాని యర్థములననుసరించి యా సమావేశనకాలమందు సంభోగము మాత్రము చేయరాదు. మహర్షులు చెప్పినటుల జపముమాత్రమే చేయవలయును. అట్లుగాక సమావేశనకాలమందు సంభోగమునే చేయవలెనని పట్టు పట్టెదరా? ఇంత పట్టుదలతో సంభోగముచేయఁ దలపెట్టిన ప్రతిపక్షులకు మా యడ్డుకట్ట లడ్డుపెట్టునని తలంచి చెప్పుట కుపక్రమించుట లేదు. కాని మాపని మేము తీర్చుకొనుచున్నారము. అదేమన?

"శేషగ్ం సమావేశనే జపేత్" "అన్యోన్యైనా మభిమంత్రయేత" ఈసూత్రములందున్న జపేత్తనుక్రియాపదము చెప్పినటుల ననువాక శేషమగు (ఆరోహోరు మున్నగు) మంత్రపంచకమును వరుడూరక జపించవలయును మంత్రములను గన్య పఠించుట కధికారములేదు కాన దరువాతి మంత్రములతో వరుడుకాని వానికవి రానిచో మరియొకడుకాని వధువు నభిమంత్రించవలసినదని యాపస్తంబుడు తరువాతి "అన్యోన్యైనా మభిమంత్రయేత" యను సూత్రముఖమునఁ జెప్పి

యున్నాడు. అన్యుడైనను నీకన్య నభిమంత్రించవచ్చునని యీ సూత్రార్థము. సమావేశన కాలమునందు జరుపవలసినది జపముకాని సంభోగముకాదని మా వాదము. యీ వాదమే సరియైనదికాదు. సంభోగమే యని పట్టుపట్టి మా ప్రతివాదులు నాశించుచున్నవారు. వలదనిన విని పించుకొనక యున్నవారు. కాన విధిలేక యొకప్రశ్న వారినడుగవలసి వచ్చినది. అదేమన?

సమావేశన కాలమందు జరుగబడు "ఆరోహోరు" లోనగు మంత్రములు చెప్పినటుల సంభోగ మపుడే జరుపవలయునేని పై సూత్రము చెప్పినటుల గన్యల యూరువులను బరులధిష్టించి చేతులనుజాచి చిన్నదానిని గౌగలించుకొనవలయునుగదా? పరు డీపనులు కావించవచ్చునని తామంగీకరించెదరా? అంగీకరించెదమందురా? అందురేని మీరు ముందు మార్గదర్శకులయ్యెదరాయని మనము ప్రశ్నించిన మన ప్రతిపక్షు లేమిచెప్పెదరు? అంతరిక్షము నిరీక్షించవలెను. అంతకుమించి వారు చేయునదిలేదు. వారిగతి యిట్లున్నది. ఈ ఘనపండితులతో సమావేశన జపము వివాహాంగ కర్మకాదని యితరులు వాదించినపుడు వీరు సమావేశన జపము వివాహాంగ కర్మయే కాని యన్యముకాదని వాదించియున్నారు. ఇంతియెకాదు. సమావేశన జపముతోనే వివాహపరి సమాప్తియగును. లేకున్న కాదనికూడ వాదించియున్నవారు. అపుడు సమావేశన జపముతో నగా మన ప్రతిపక్షులు సంభోగము గావించుటతో వివాహము పూర్తియగు ననునది వారి వాదమని తెలిసినదికదా? ఆసమావేశన జపముతో దీక్షపరి సమాప్తమగునేని నపుడు దీక్షామధ్యమున (సమావేశనము నకుముందు) వధూవరులు బ్రహ్మచర్యములోనే యుండవలెనని తేలినదికదా? తేలినది. అటులేని వారి వాదములో నెంతదోషమున్నదో యిక గన్పరచెదము కనుడు.

ఆపస్తంబ మహర్షి వివాహములో శేషహోమ కర్మనుజెప్పిన పిదప క్రమముగా నైదు జపములను విధించియున్నాడు. వానిని వరు

సగా వినిపించెదము వినుడు. (1) ఉత్తరాస్తి ప్రోజపిత్వా, (2) శేషగ్ం సమావేశనే జపేత్, (3) అన్యోవైనా మభిమంత్రయేత, (4) రజసః ప్రాదుర్భావాత్స్నాతా మృతుసమావేశనముత్తరాభి రభిమంత్రయతే, (5) చతుర్థీ ప్రభృత్యా షోడశీ ముత్తరాముత్తరాం యుగ్మాం ప్రజానిశ్శ్రేయస మృతుగమన ఇత్యుపదిశంతి" అనునవి. ఇందైదవది యగు ఋతుగమన జపముయినపిదప ఋత్రకాముడగువాడు నాలవ దినము మొదలుకొని సరిదినములలోని రాత్రులందు మాత్రమే సంభోగము గావించవలెను. అంతియెకాని యంతకులోపలనున్న నాలుగు జపములందును సంభోగము గావించరాదు. కాని యప్పుడు జపించెడి మంత్రములందలి యర్థము మాత్రము సంభోగమును, సంభోగ పూర్వాంగ కర్మలను, మాత్రమె చెప్పియున్నవి. చెప్పియున్నవికదా యని సంభోగ పూర్వకర్మలుచేయ నగుఁగాని సంభోగము మాత్రము చేయరాదు. ఊరక జపముమాత్రమే చేయువలయును. అట్లు చేయనిచో మన ప్రతిపక్షులే "శేషగ్ం సమావేశనే జపేత్త"ను సూత్రమునుగైకొని దానితోఁగాని వివాహ పరిసమాప్తికాదని వాదించినారో యా సూత్రమునకు లోపలనున్న "ఉత్తరాస్తి ప్రోజపిత్వా" యను సూత్రములోనున్న మూడు మంత్రములలో మూడవదియగు మంత్రము సంభోగమును చెప్పియున్నది. దాని భాష్యమును వినిపించి తెలుగర్థమును విన్నవింతుము. వినుడు.

## ఏకాగ్నికాండమంత్ర భాష్యము.

"తాం పూషఞ్ఛివ తమామేరయస్వ యస్యాంబీజం మనుష్యావపంతి, యానఊరూ ఉశతీ విశ్రయాతై యస్యాముశంతః ప్రహరేమ శేషమ్"

ఇందులకు హరదత్తాచార్యులవారిట్లు వ్యాఖ్యానము గావించియున్నారు.

"హేపూషః యస్యాం మనుష్యాః బీజంవపంతి శుక్లము త్సృజంతి. తాంమేశివ తమామనుకూల తమాంకృత్వా ఏరయస్వ

ప్రేరయస్వ భార్యాం మే ప్రోత్సాహయేత్యర్థః భార్యాయాం హిబీజంవ పంతి. అన్యత్ర నిషేధాత్, సా విశిష్యతే యానః...మహ్యం ఊరూఉశతి కామయమానా విస్రయాతై...విశ్రయేత. విశ్లిష్టౌకుర్యాత్ ఇత, దా యోనిర్వివృతాభవతి. యస్యాం చైవం భూతాయాం ఉశంతః కామ యమానా భూత్వా శేఫం శిశ్నం ప్రహరేమ పతీ పేమ"

మా ప్రతిపక్షులు సమావేశన మంత్రార్థములనాధార ముగాఁ గైకొని రజస్వలావివాహములను సాధించుటకు యత్నించి యుండుటచే వారి వాదములోని లోపములను మా పాఠకులకు జూపు టకై యీ మంత్రార్థములు వినుట కించుక సెగటుగాఁ గన్పడునవి యని తెలిసియుండియు విశిపింపక తప్పమిని విశిపించుచున్నవారము కాన మా పాఠకులు మాయెడ నన్యథాభావమును జెందక సావధాన ముగ నాలించి మా ప్రతివాదుల వాదబలహీనతను మాత్రము గ్రహింతురుగాత.

ఓపూషుడా! మనుష్యులే భార్యయందు బీజమును (శుక్ల మును) విత్తు (విడుచు) చున్నారో యటువంటి భార్యను నాకనుకూ లతము రాలినిగాఁ జేసి ప్రేరేపింపుము. అనఁగా నాకొరకు నాభ ర్యను ప్రోత్సహించుము. ఏలయన? భార్యయందే బీజమునుంచు చున్నారు. కాన నాభార్యను నాకొరకు ప్రోత్సహించవలెనని చెప్పి తిని. భార్యయందే బీజము నుంచనేలయందువా? అన్యస్త్రీయందు బీజమునుంచరాదని నిషేధశాస్త్రము చెప్పుచున్నది. కాన భార్యయందే బీజము నుంచవలెను. ఏ నాభార్య నాకొఱకు కూరువులను గోరుచు న్నదో యది వానిని విప్పుగాత. అపుడు యోని విడిపోయినదగుచు. ఏయోని యిట్లగునో యా యోనిని గోరుచున్నవాడనై శిశ్నము నందు పెట్టెదనని పై భాష్యార్థము. ఈ మంత్రార్థము ననుసరించిచూడ మన ప్రతిపక్షులు సమావేశనమునకు ముందే సంభోగము చేయవలె నని తేలినది. అది చేసినమొక సమావేశన జపముతో వివాహ పరి సమాప్తియగునను మన ప్రతిపక్షులవాదము సాధ్యమగును. వివా

హ-దీక్ష చేదును పండిత చక్రవర్తులారా! దీక్షామధ్యమున బైమంత్ర ము చెప్పిన పనిమీరుచేసి చేయవలసినదని లోకమునకు బోధించెదరా? యా పనిచేయక చేయకూడదని బోధించెదరా? చేయవలసినదని చెప్పు దురేని వివాహదీక్ష చెడునుగదా? వలదని చెప్పెదరా? మంత్రార్థ ముల ననుసరించవలెనను మీ వాదము మంటఁగలియును. ఇపుడేమి చేయుదురు?

మంత్రార్థముల ననుసరించవలె మంత్రార్థముల ననుసరిం చవలెనని యెక్క మొగి పలవరించితిరి. ఆపునకు లేగపుట్టినదన్న సంతోషములోమునిగి గుడ్డపైకిఁ బీకుకొనిపోయిన సంగతి చూచు కొనక దుడ్డెనెత్తుకొని వీధవెంబడి పరుగిడు గొల్లపడుచువలె మాకు మాత్రమే మంత్రార్థము తెలిసినదని యెడలుతెలియని శివము తెచ్చుకొని యాంధ్ర దినపత్రికలో దినమొక వెడగు వ్యాసమును వెడలించి యున్నవారు. ఫలమేమనుభవించితిరి? బ్రాహ్మణుల జత్యు త్కృష్టతనుజూచి యసహనముచెంది దాని నాశనమునకై తప మాచ రించుచున్న యకారణ బ్రాహ్మణ విద్వేషులగు వారికడఁజేరి పరాధీన జీవనులరై శాస్త్రముల కపార్థములు కల్పించియుచటనే యాచంద్ర తారార్కముగ నుండుటకు మేడలను మిద్దెలను నిర్మించుకొని భూప తులు కాదలంచితిరా? మనమనుగడలు శాశ్వతములా? క్షణభంగు రములని పరమేశ్వరుడు నిదర్శనములనుజూపలేదా? ఎందుల కీధర్మ నాశన ప్రయత్నము? ఇంతటనైనఁ బశ్చాత్తాపమునుబొంది "యతో ధర్మస్తతో జయః" అను శ్రీ మహాభారత వచనమును, "సత్యమేవ జయతే. నానృతమ్" అను నుపనిషద్వాక్యమును జెప్పినపుల ధర్మ పక్షము జయించినందులకు సంతసించి రజస్వలావివాహము లే యాచరణీయములను దుర్వాదమునుండి తాము విముక్తులరగుడు. ధర్మపక్షమవలంబించి యధర్మపక్షమును విసర్జించితిమని తిరిగి యాంధ్రదిన పత్రికాముఖముననే మీ పశ్చాత్తాపమును భారతలోక మునకు వినిపింపుడు. ఐహికాముష్మిక సుఖములను జూరఁగొనుడు. లోకము సంతసించును.

Regd. No. M 1480

శ్రీ

# శ్రుతిధర్మసంజీవని

## అనునీమాసపత్రిక

శ్రు తిస్మృతిశిష్టాచార ప్రమాణముల ననుసరించును.

తి తీర్థులకు సంతరణోపాయములను దెలుపును.

ధ ర్మాధర్మవిధర్మములను వివేకించును.

శ్రీ ర్మ మభూయిష్ఠా త్తనువారలకు శ్రీలనొసంగును.

సం ఘసంస్కర్తల దుర్వాదములనిరసించును.

జీ వన్ముక్తిపదసోపానములనుజూపును.

వ ర్ణాశ్రమ ధర్మతత్పరుల ఆశ్రయించును.

ని త్య సత్య హితమితవాదముల వినిపించును.

## చందావివరము

| | | | |
|---|---|---|---|
| రాజపోషకులకు | సం॥ కి | రు | 10-0-0 |
| ప్రధానపోషకులకు | ,, | రు | 4-0-0 |
| అనుపోషకులకు | ,, | | 3-0-0 |
| చందాదారులకు | ,, | | 2-0-0 |
| ,, | ఆరుమాసములకు | | 1-4-0 |
| | విడిపత్రిక | | 0-3-0 |

